# ఉద్భటారాధ్య చరిత్రము



తెనాలి రామలింగ (కృష్ణ)
కవి విరచితము

విద్యారత్న, కళాప్రపూర్ణ
నిడుదవోలు వెంకటరావు, యం. ఏ.,
రచించిన విపుల పీఠికా సహితము





ప్రకాశకులు :
ది లోటస్ పబ్లిషర్సు, మెయిన్‌రోడ్ తెనాలి



# ఉద్భటారాధ్య చరిత్రము

## తెనాలి రామలింగ (కృష్ణ) కవి విరచితము

విద్యారత్న, కళాప్రపూర్ణ

నిడదవోలు వెంకటరావు, యం. ఎ.

రచించిన విపుల పీఠికా సహితము



ప్రకాశకులు :

ది లోటస్ పబ్లిషర్సు, మెయిన్‌రోడ్, తెనాలి



వెల రు. 20-00

# పాఠక మహాశయులకు

## విజ్ఞప్తి

ఉద్భటారాధ్యచరిత్ర మిప్పటికి నలుబది తొమ్మిది యేండ్ల క్రిందట క్రీ. శ. 1926లో ముద్రితమైనది- ఇది తెనాలి రామలింగ (కృష్ణ) కవి రచితమే యైనను, గ్రంథము లభ్యముకాని కారణమున- రామకృష్ణుని గూర్చిన సాహిత్య విమర్శలన్నిటి యందును- నీకావ్యము విడిచిపెట్టబడియున్నది. పరిశోధకులకు తెలిసినను, పాఠకలోకమునకు పరిచితము కాక పోవుటచేతను- ఈ గ్రంథము, రామలింగ (కృష్ణ) కవి రచనా విశిష్టత వెలుగ దలచిన వారికి, వాఙ్మయ చరిత్రకారులకు అత్యంతావశ్యక మగుటచేతను దీనిని పునర్ముద్రణము చేసి, విపుల పీఠికతో వెలయించినాము.

ప్రాచీనకావ్యాసక్తిగల పాఠకులు-సంస్కారులైన చదువరులు సహృదయులైన-విద్వాంసులు-మాశ్రమముగుర్తించి, ఈ గ్రంథము నాదరింప గోరుచున్నాము.

ఇట్లు

ప్రకాశకులు

# ఉద్భటారాధ్య చరిత్ర

# పీఠిక

## ప్రథమ ఖండము

## 1. పరిచయము

### 1. మతమీమాంస

తెనాలి రామలింగకవి ఉద్భటారాధ్య చరిత్రము అను నీ ప్రబంధమును మొదట సాహిత్య లోకమున కెలుకపఱచిన శ్రీ కీర్తిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారిది. వారీగ్రంథ మా కాలమున అనగా క్రీ. శ. 1925 లో ముక్త్యాలలో వెలువడుచుండిన సరస్వతి పత్రికలో పీఠికతో గూడ ప్రకటింపఁజేసిరి[1].

వేటూరి వారు దీనిని 1925 లో వెలువరించినను దీనిని గూర్చి అంతకేడేండ్లకు ముందే వారికి తెలియును. 1918 లో వారు ప్రకటించిన-"ప్రబంధరత్నావళి" పీఠిక 24 పుటలో నిట్లు వ్రాసినారు.

---

1 మాహిష్మతీ ముద్రాక్షరశాల-ముక్త్యాల - 1925.
సరస్వతి-అను నీ పత్రికాధిపతులు శ్రీ రాజా వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాదు బహద్దరు-జయంతిపురం రాజావారు. ఇది 1923 - 1928 మధ్యనడచినది. ఇందే దగ్గుబల్లి దుగ్గన నాసికేతూపాఖ్యానము. అప్పన చారుచర్య మొదలగు ప్రాచీన కావ్యములు ప్రథమముగా ప్రకటితమైనవి. శ్రీ వేటూరివారి, తెలుగు దేశపు సంస్కృత కవులు అన్న వ్యాసములిందే ప్రకటితములైనవి. అవి తరువాత పునర్ముద్రితము కాలేదు.

See diterary Journalism by N. Venkatarao, V. R. Narla Shashtyabda purti Commemoration Volume History of Telugu Journalism (1968)

"రామలింగయ్య-తెనాలి-రామకృష్ణుడు వేఱు, రామలింగడు వేఱుగా మా. రా. కవిగారు వ్రాసినారు. (ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక) సత్యము కావచ్చును." అని తెలిపి ఉద్భటారాధ్య చరిత్రమునుండి-

1. ఉ. గ్రాంథిక సన్నుత ప్రతిభగాంచిన....

2. సీ. మహితమూల స్థాన మల్లికార్జున...

3. మ. పరగన్ వారిధి వేష్టితాఖిల — అను పద్యములను ఆశ్వాసాంత గద్యము నుదాహరించినారు. ఆపై నిట్లు వ్రాసినారు. మన్మిత్రులు చల్లా సూర్యనారాయణరావు పంతులుగారు దీనిని బంపినారు. పాండురంగ మాహాత్మ్యకర్తయు, నేతత్కృతి కర్తయు నొక్కరేయనిగాని వేఱనిగాని నిర్ధారింప దేలకున్నది. ఆతడు నీతడును రామయ పుత్రులే "శైవ వైష్ణవ పురాణావళీ నానార్థ రచనా వటిమైకరమ్యమతివి" కావున నాతఁడు గూడ నీ శైవ కథ రచియించి యుండఁదగును. అక్కడ రామకృష్ణుఁడని యిక్కడ రామలింగఁడని యున్నది. ఇక్కడఁదెనాలి ప్రశంస కానరాలేదు. ఈ యుద్భటారాధ్య చరిత్రము గూడ బయల్పడినఁగాని యథార్థము తేలదు. ఇందుదాహరింపఁబడిన పద్యమందు, నాదిండ్ల గోప మంత్రి పేర్కొఁబడినాఁడు. ఈ రామలింగనికిఁ గుమార భారతి యని బిరుదు".

ప్రభాకరశాస్త్రిగారిట్లు 1918 లో వ్రాసినను 1925 నాటికి గ్రంథము సమగ్రముగా పరిశీలించి, ఉద్భటారాధ్య చరిత్ర కృతికర్త రామలింగడు, పాండురంగ మాహాత్మ్య కృతికర్త రామకృష్ణుడును నొక్కరేయని నిర్వివాదముగా నిరూపించిరి. వారి ప్రథమ ముద్రణ పీఠిక యనుబంధముగా తిరిగి ముద్రితమైనది. ద్వితీయ ముద్రణమున గ్రంథపూరణ వివరములు ననుబంధము లో చూపబడినవి.

# 2. తెనాలి రామలింగ (కృష్ణ) కవి

## 2. వంశోత్కర్ష - వివరములు

ఈ గ్రంథమునకు రామలింగకవి కర్తయైనట్లుగా, ఆశ్వాసాంత గద్య వలన తెలియుచున్నది.

"ఇది శ్రీమదేలేశ్వర గురువరేణ్యా చరణారవింద షట్చరణ సకల కళాభరణ, రామనార్య సుపుత్ర-సుకవిజనమిత్ర-కుమారభారతీ బిరుదాభిరామ రామలింగయ ప్రణీతంబైన శ్రీ మదుద్భటారాధ్య చరిత్రంబను మహాప్రబంధంబునందు.... ఆశ్వాసము."

గద్యయందు "తెనాలి" అని యింటి పేరు లేకపోయినను, తాను "రామేశ్వరస్వామి రమణీ కరుణా విశేషపోషిత విలసిత సమగ్రుడను" అని (1-24) చెప్పుకొనుటచేత, రామేశ్వరస్వామి ఆలయము తెనాలి యందుండుటచేతను, నీత డుద్భటారాధ్య చరిత్ర రచనా కాలమున తెనాలి వాస్తవ్యుడుగా నుండెనని తలపవచ్చును.

ఈతని కృత్యంతరమగు పాండురంగ మాహాత్మ్యమున-గద్యలో "రామకృష్ణ కవి" యనియే కలదు. అందు "తెనాలి" పేరు లేదు. అయినను ఆ కృతియందే-

"శ్రీ తెనాల్యగ్రహార నిర్ణేత" అని యుండుట వలన, సంకలన గ్రంథకర్తలు లక్షణ గ్రంథకర్త[1]లు-తెనాలిరామలింగ, రామకృష్ణ నామములతో పేర్కొనుటచేత, తెనాలియే యింటిపేరై తరువాత ఆ వంశము వారి పేరు కూడ నైనది.

రామలింగకవి తలిదండ్రులు-రామయ లక్కమాంబలని పాండురంగ మాహాత్మ్యమున నీ లక్కమాంబ లక్ష్మమగా పేర్కొనబడినది. "లక్ష్మమావరతనయా" (1-24). ఈతని గోత్రము కౌండిన్య గోత్రము.

## 3. అగ్రబ్రాహ్మణ శాఖ

ఉద్భటారాధ్య చరిత్రమున రామలింగకవి శైవ సంప్రదాయము నవలంబించినట్లు తెలియుచున్నది. శైవులలో స్మార్తుల వలె శాఖాభేదము లుండవు. ఈ కృతియందు చెప్పకపోయినను పాండురంగ మాహాత్మ్యమున, తాను

అగ్రశాఖా కోకిలమవు (1-23)

---

1 పెదపాటి జగ్గన- "తెనాలి రామలింగయ్య" అప్పకవి తెనాలి రామలింగము.

అని కృతిపతిచే తన శాఖను చెప్పించినాడు, 'అగ్రశాఖ' యనగా ప్రథమశాఖ, ఈ శాఖీయులనే యాజ్ఞవల్క్య శాఖవారని, ఆది శాఖవారని కాణ్వశాఖీయులనీకూడా చెప్పుదురు. యాజ్ఞవల్క్య శాఖ వారందఱును శుక్లయజుర్వేదులు. తక్కిన బ్రాహ్మణశాఖల వారందఱును కృష్ణయజుర్వేదులు. యజుర్వేదమున-శుక్లయజుర్వేదము, కృష్ణయజుర్వేదము అను రెండు శాఖలు గలవు. వానిలో శుక్లయజుర్వేదము-ప్రథమము-అగ్రము నగుటచేత నీ శాఖవారికి అగ్రశాఖీయులు, ఆదిశాఖీయులు, ప్రథమ శాఖీయులు అని పేరు వచ్చినది.[1]

ఈ కావ్యమున శైవమత సంప్రదాయము ననుసరించి, తన బ్రాహ్మణశాఖను తెలుపక పోయినను పాండురంగమాహాత్మ్యమున స్పష్టపఱచుటకు హేతువున్నది. రామలింగము జన్మతః ఆరాధ్యుడు కాడు. అట్లయిన యెడల అతడు తన కృత్యంతరములో నీ రీతి వేఱుగా తన శాఖనుగూర్చి చెప్పవలసిన యవసరము లేదు. తాను మొదట స్మార్తుడైన అగ్రశాఖ వాడననియు, వనగా యాజ్ఞవల్క్య-

---

1 నేడు రాష్ట్రపతిగానున్న వి. వి. గిరి (వరాహగిరి వేంకట గిరి) గారి అగ్రశాఖీయులే. అగ్రపీఠము నధిష్ఠించుట విశేషము.

"యాజ్ఞవల్క్యుడు సూర్యుని వలన పొందిన శుక్లయజుర్వేదమును ప్రథమమున తన శిష్యుడైన కణ్వునకు నుపదేశ మొసగెను. ప్రథమ శిష్యుడగు కణ్వుని శాఖకు జెందిన వారగుటచే నీ శాఖీయులకు కాణ్వశాఖీయులని పేరు వచ్చినది. (అఖండం సీతారామశాస్త్రి - యాజ్ఞవల్క్యుడు-శుక్లయజుస్సు భారతి-నవంబరు 1948, పుటలు 405-408)

ఈ యాజ్ఞవల్క్య శాఖీయులైన కవులనుగూర్చి వివరముగా ఘట్టుప్రభు ప్రణీతమైన యాజ్ఞవల్క్య చరిత్రమునకు నేనువ్రాసిన పీఠిక చూడదగును. (1955) ఆది లింగమగుంట సుబ్బయ్యగారిచే ప్రకటితము.

నవియు, నా వెనుక శైవ సంప్రదాయమును స్వీకరించి ఆరాధ్యులైతి ననియు తెలుపుటకే యని గ్రహింపవలెను.

ఈ ప్రథమ శాఖవారందఱు నియోగులే - గురజాడవారికని నియోగి బ్రాహ్మణుడనియే వ్రాసి యున్నారు, ఈ విషయము రామలింగకవి మత సంప్రదాయ పరిణామమునకు చాలా ముఖ్యమైనది,

స్మార్తులైన - ఆంధ్ర బ్రాహ్మణశాఖలలో, ఒక్క- నియోగులు మాత్రమే, శైవమతముగాని, వైష్ణవ మతముగాని స్వీకరింతురు, గాని, ఇతరులైన, వెలనాటి వైదికులు- తెలుగాణ్యులు, కాసలనాటివారు, ద్రావిడులు- మొదలగు శాఖలవా రెన్నడును తమ మతమును మార్చుకొనరు, ఆరాధ్య సంప్రదాయము పండితారాధ్యుడు ప్రవర్తింపజేసిన తరువాత ఆ సంప్రదాయమును ఆరాధ్యులు గురువులుగా స్వీకరించి, లింగధారణ దీక్షనందినది నియోగిశాఖ యొక్కటే. అందువలననే నేటికిని ఆరాధ్యులకును నియోగులకును సంబంధ బాంధవ్యములు జరుగుచునే యున్నవి.[1]

పాండురంగ మాహాత్మ్య కృతికర్తయైన విరూరి వేదాద్రి మంత్రి అచ్చముగా వైష్ణవుడుకాడు. ఆతడు ఆర్వేల నియోగి.

"సరసగుణరతీశా! షట్సహస్రాన్వయేశా"

అన్న సంబోధన-పంచమాశ్వాసాంతమున నున్నది. షట్సహస్రాన్వయేశుడనగా ఆరువేల నియోగి-జన్మతః శైవుడుగాని రామలింగకవి శైవకృతిని రచించి, జన్మతః వైష్ణవుడుగాని వేదాద్రి మంత్రికి వైష్ణవ కృతి నిచ్చుట సాహిత్యమున నొక విచిత్ర సన్నివేశము.

---

1 నాపితామహుడు నిడుదవోలు వెంకటరామయ్య-ఆర్వేలనియోగి, కాని నా పితామహి-పార్వతమ్మ-మల్లంపల్లి భద్రారాధ్యులవారి పుత్రిక. కీ, శే, మల్లంపల్లి సోమశేఖరశర్మగారి తాతగారు సోమశేఖరారాధ్యుడును, భద్రారాధ్యులవారు ఏకోదర సోదరులు (చూ, మల్లంపల్లి వంశీయుల చరిత్ర-త్రిలింగ పత్రిక-1951)

# రామలింగకవి

## 4. శైవమత స్వీకరణ

రామలింగకవి తొలుత స్మార్తుడైన-ఆదిశాఖీయుడని తెలిసికొంటిమి. అతనికి బాల్యమునుండియు శివభక్తి ప్రపత్తులు విశేషముగా నుండుటచేత, తాను స్మార్తుడైనను శైవుడయ్యెను. ఈతడు గ్రహించిన శైవమునకు ఆరాధ్యశైవము లేక వీరశైవము అని పేరు. ఇది రెండు విధములు.

1. బసవన ప్రతిపాదించిన జంగమ వీరశైవ సంప్రదాయము. కేవలము భక్తి ప్రధానము. ఇది అవైదికము - అనగా వేదముతో సంబంధము లేనిది. ఇది కన్నడ దేశమునసే అధికముగా ప్రచారము గాంచినది. తెలుగు దేశమున ప్రచార మతి స్వల్పముగా గలది.

2. మల్లికార్జున పండితారాధ్యుడు ప్రవర్తిల్లజేసిన - ఆరాధ్య వీరశైవ సంప్రదాయము-ఇది సవైదికము-బసవన భక్తిమార్గమును, వైదిక సంప్రదాయమును రెండింటిని సమ్మేళనము చేసి "భక్తిమీది వలపు బ్రహ్మంబుతో పొత్తు" గలసినది. ఇదియే తెలుగు దేశమున విశేషవ్యాప్తి గాంచినది.

రామలింగ మీ ఆరాధ్యశైవ సంప్రదాయమునే స్వీకరించెను, ఈ ఆరాధ్యశైవు లందఱును, యజుర్వేదము ననుసరించువారే, అయినను రామలింగము యజుర్వేద శాఖలలో ముందు చెప్పినట్లు - శుక్ల యజుర్వేది. ఆరాధ్యులందఱును-కృష్ణయజుర్వేదులు-కాబట్టి రామలింగ మీ ఆరాధ్యశైవమును స్వీకరించునప్పుడు, ప్రత్యేకముగా, కృష్ణయజుర్వేదము నభ్యసించెను. ఈ విషయమే అతడు

"యజుర్వేద వేది"

అని స్పష్టపఱచినాడు. తాను కృష్ణయజుర్వేదాను సారియైన 'యజుర్వేది' అని చెప్పుకొన్న చాలును. అట్లుగాక అతడు "యజుర్వేద వేది" అని చెప్పుకొనుట మొదట తాను శుక్లయజుర్వేదము నభ్యసించెనని తెలుపుటకే యని తెలియవలెను.

"ఆరాధ్యశైవము-వీరశైవము-వీరమాహేశ్వరము" అనునవి ఒక దాని కొకటి పర్యాయ పదములు. వీనిలో మొదటి రెండును విశేష వ్యాప్తిగలవి.

జంగమ, ఆరాధ్య సంప్రదాయములను ప్రచారము చేసిన పాల్కురికి సోమనాథుడే పండితారాధ్య చరిత్రమున "వీరమాహేశ్వరాచార మార్గమున" అని "వీర శైవాచార విధిప్రవర్తిల్ల" అని వ్యవహరించినాడు. శ్రీనాథ మహాకవి తన కృతులలో[1] శైవ, వీరమాహేశ్వర, వీరశైవ పదములను సమానార్థకములుగా వాడినాడు.

రామలింగకవి ఉద్భటారాధ్య చరిత్రమునందే యీ శైవమత పారిభాషిక పదములు పర్యాయపదములని యిట్లు స్పష్టపఱచినాడు,

శా. మాయంశంబున నుద్భవించి చతురామ్నాయాగ మార్గాంతర
స్థాయి ప్రస్ఫుట వీరశైవవిధి సిద్ధాంతంబు నల్దిక్కులన్
న్యాయం బొప్పఁగఁజేసి మానవ హృదానందంబుగా శిష్యులు
ప్చాయం బొందఁ గటాక్ష దీక్షలను సంరక్షించు భద్రాత్మకా

(3-306)

శా. నీ వంశం బభివృద్ధి నొందు జగతిన్నిరేఖ సంతాన స
ద్భావం బొప్ప ననేకు లార్యులతుల ప్రఖ్యాత కీర్తుల్మహా
శైవ స్థాపిత వేదశాస్త్ర విదులై శాసింతు రారాధ్యతన్
శివిన్ లోకమునందు నాదు కృప రెట్టింపంగ వారందఱున్.

(3-307)

---

1 ఇంతవఱకు సాహిత్య ప్రపంచమున, శ్రీనాథుడు, శివభక్తినే తన కృతులలో ప్రపంచించెననియు, నాతని రచనలు శైవ సంబంధములే యనియు ప్రకటించిన విమర్శకులు శ్రీనాథుని శైవ సంప్రదాయమేదో, ఇంతవఱకు వివరింపనేలేదు. శృంగార నైషధమునకు సర్వంకష వ్యాఖ్య యున్నను నందు శైవమత సంప్రదాయిక విశేషములు లేనేలేవు.

వీరశైవ మనగానే, కేవలము బసవన ప్రతిపాదించిన వీర శైవమే తప్ప వేఱొకటి లేదను నభిప్రాయము వలన నిట్టి యవ్యవస్థ యేర్పడినది. తెలుగు సాహిత్యమున వీర శైవము-అనగా, జంగమ ఆరాధ్య శైవ సంప్రదాయములు రెండును ననిగ్రహింపవలెను. ఉద్భటారాధ్య చరిత్ర కేవలము ఆరాధ్య వీర శైవ సంప్రదాయమును ప్రపంచించు కృతి.

## 4. లింగధారణ దీక్ష = గురువు

ఆరాధ్య శైవమునకు ప్రధానమైనది లింగధారణ దీక్ష - లింగధారణదీక్ష యనగా, వేదోక్తముగా, గురుముఖమున, గురువునుండి లింగమును గ్రహించి ధరించుట-గురువే తప్ప యీదీక్ష నిచ్చుట కితరు లధికారులు కారు. ఈ దీక్ష కంతకు నేకైకముగా గురువే ప్రధానుడు గావున నీ శైవమత సంప్రదాయమున గురువున కత్యంత ప్రాముఖ్యము గలదు. గురువు హస్తమస్తక సంయోగముచే నీ దీక్ష పొందిన వెంటనే, శిష్యునకు పునర్జన్మగలుగును. అందువలననే శైవులు గురుహస్త సంజాతులమని చెప్పుకొనుటయేగాక కొందరు గురునామముతో వ్యవహరింతురు[1]-ప్రస్తుతము రామలింగకవి గురువు:

### పాలగుమ్మి ఏలేశ్వరారాధ్యులు

"సీ. పాలగుమ్మేలేశ పద పయోజద్వయీ
ధ్యానధారణ సముదాత్తచిత్తు"

1 మలుగు, పావయారాధ్యుల గురువుపేరు వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యుడు. ఆయన గురువు పేరుతోనే - అహల్యాసంక్రందనము రచించినాడు. వీరేశలింగకవి చరిత్రమున 3 వ భాగములో నీ పేరే (76) చరిత్రమున గలదు, కాని పావయారాధ్యుని దేవీ భాగవతము, సరస హృదయానురంజనము వలన పై అహల్యా సంక్రందన కృతి పావయారాధ్యునిదని తెలియుగలదు.

అనుపాదమును గద్యయందు "ఇది శ్రీమదేలేశ్వర గురువరేణ్య చరణారవింద షట్పరణ" అను ప్రారంభము నీ గురుత్వము నిశ్చితము చేయుచున్నది. శైవుడగు పోతనయు వీరభద్ర విజయమున నిట్లే ఆశ్వాసాంత గద్య గురువుతోనే ప్రారంభించినాడు. ఇది శ్రీ మన్మహా మహేశ్వర యిపటూరి సోమనారాధ్య దివ్య శ్రీ పాద పద్మారాధక- "పోతన నామధేయ ప్రణీతంబు"

పోతనకు పూర్వుడైన ఎఱ్ఱన తన కృతులలో తన గురువైన శ్రీ శంకరస్వామిని స్తుతించుటయేగాక, గద్యలలో శ్రీ శంకరస్వామి సంయమీశ్వర ధ్యానానంద" అని వ్రాసికొన్నాడు - ఎఱ్ఱనకు ముందు నన్నెచోడమహాకవి "శివ జంగమ మల్లికార్జున దేవదివ్య శ్రీపాద పంకజ భ్రమరాయమాణ",

అని గురు ప్రశంసచేయుటయేగాక గురువునకే తన కుమార సంభవ కావ్యము కృతినిచ్చియున్నాడు. కావున నిది శైవసంప్రదాయికమే యని గ్రహింపవలెను.

## ౫. పాలగుమ్మి గురువులు

ఈ పాలగుమ్మి గురు పరంపరలో, ఏలేశ్వరారాధ్యులకు ముందు పాలగుమ్మి శ్రీకంఠ గురుడొకడు శ్రీనాథుని కాలమున నున్నట్లుగా నొక శాసనము వలన దెలియుచున్నది.

"పాల్గుమి శ్రీకంఠగురో పంచాక్షరమంత్ర పౌరు త్రస్య"

ఈతడు క్రీ. శ. 1414-నాటివాడు,

రామలింగకవి గురువు-ఏలేశ్వరుడు-క్రీ. శ 1520 ప్రాంతము వాడు. ఏలేశ్వరుని తరువాత, తెనాలి వారికి పాలగుమ్మివారే గురువులైనట్లు తెలియుచున్నది. రామలింగకవి సోదరుడగు అన్నయ తన సుదక్షిణాపరిణయమున-

"పాలగుమి భీమగురుని సద్భక్తిఁగొలుతు"

అని గురుప్రశంస చేసినాడు.

పాలగుమ్మి భీమగురువు క్రీ. శ. 1560 ప్రాంతము వాడు గావున, ఏలేశ్వరగురుని కుమారుడై యుండవచ్చును. కాని శ్రీకంఠ గురునినుండి ఏలేశ్వరునికి మూడు తరములైనను గడచి యుండ వచ్చును. (శృంగార శ్రీనాథము అనుబంధము, పెదకోమటి మాచా రెడ్డి శాసనము)

# ఉద్భటారాధ్య చరిత్ర కృతిపతి

## ఊరదేచమంత్రి చరిత్ర

నియోగివంశము; కౌండిన్య గోత్రము

పెదన్నమంత్రి (కొమ్మాంబ)




## మంత్రిత్వము

ఉద్భటారాధ్య చరిత్ర కృతినందు నాటికి దేచమంత్రి-కృష్ణదేవరాయని మహామంత్రి తిమ్మరుసు మేనల్లుడగు నాదిండ్ల గోపమంత్రికి మంత్రి-గోపమంత్రి యాకాలమున కొండవీటి దుర్గాధ్యక్షుడై యుండెడివాడు-ఈ గోపన్న ప్రాభవమును గూర్చి రామలింగకవి యీ కృత్యావతారికలో నైదు పద్యములతో (15-20) వర్ణించినాడు. అందుండి మూడు పద్యముల నుదాహరించుచున్నాను.

ఒక సీసపద్యమున-కొండవీటి వర్ణన చేసి-రామలింగ డిట్లు చెప్పి నాడు.

మ. వరగన్ వారిధి వేష్టితాఖిల మహీభాగంబునన్ రెడ్డి భూ
వరసింహాసనమై శుభాయతనమై వర్థిల్లు తత్పట్టణం
బుదు బాహాబల సంపదన్ మనుచు భద్రోద్యోగి నాదెండ్ల[1]గో
పరసాధీశుఁ డశేష బంధు కుముదప్రాలేయ ధామాకృతిన్. (1-15)

సీ. అరివీర జయలక్ష్మి హారునిబోలెనె కాని
తగులఁడు విషధరత్వమ్ము నింత
సంపూర్ణతర కాంతిఁ జంద్రుబోలెనె కాని
దోషాకరోన్నతి దొరలదెందు
నిజ భుజాబలరేఖ విజయుఁ బోలెనె కాని
భీమోన్నత స్ఫూర్తిఁ బెరుగనీడు
గాంభీర్యమునఁ బాలకడలిఁ బోలెనె కాని
భంగసాంగత్యంబు బట్టఁడర్థి

గీ. సఖిల దుర్మంత్ర వదనముద్రావతారఁ
డాత్మవంశజ వీథీ విహార శౌరి
కీర్తి గంగా పవిత్రిత తటితలుండు
గుణమరున్మంత్రి నాదెండ్ల గోపమంత్రి. (1-19)

సీ. దరహాస చంద్రికాధావళ ధళ్యంబులు
సురగేంద్ర కాంతా కపోలములకు
తారహారచ్ఛటా ధాగధగ్యంబులు
చారణ కామినీ స్తనములకును
సంఫుల్ల మల్లికా చాకచక్యంబులు
గంధర్వ మదవతీ కబరికలకు
నవ చందనాలేప నైగనిగ్యంబులు
దివిషన్నితంబినీ దేహములకు

---

1 గోపరసాధీశుఁడు - అనుచో గోపరసు+అధీశుఁడు అను నర్థము చెప్పవలెను. తన మేనమామయగు 'తిమ్మరసు'వలె గోపన గోపరసు అను పేరు ధరించినాడు.

గీ. ధవళధాము సుధాకారదాంటీర
ధర సుధావారినిధి సుధాంధః కరీంద్ర
సాంద్రతర కాంతి విభ్రమ సంగతములు
తిమ్మవిభు గోపమంత్రి సత్కీర్తి రుచులు, (17 ప)

## మంత్రిత్వము

దేచమంత్రి, గోపమంత్రికి, "రాజ కార్య నిర్వాహకుడ" నియు గోపమంత్రి భూభరణ సౌధమునకు స్తంభమువంటి వాడనియు వర్ణించుటచేత నితడు రాజ తంత్ర ప్రవీణుడని విశదమగు చున్నది. ఈతడు మంత్రియే మహా పరాక్రమశాలి, 1) నిఖిల భుజా బలవిడంబిత కుమారుడు 2) దోఃఖడ్గలతా నిష్పీడిత విమతనృపుడు. 3) ప్రతాపానలుడు అన్న విశేషము లీయంశమును ధ్రువపఱచు చున్నవి.

ఇట్టి సచివుడు తనకు గలుగుటచేతనే-గోపమంత్రి సర్వరాజ్య రక్షణ భారము దేచమంత్రి కప్పజెప్పినాడు. గోపమంత్రి ఆ కాలమున తెలుగు దేశమున దుర్గాధిపతులలో గొప్పవాడేకాక సంస్కృత భాషలో గొప్ప విద్వత్తుగలవాడు కృష్ణ మిశ్ర విరచిత ప్రబోధ చంద్రోదయమునకు చంద్రికా వ్యాఖ్యానము వ్రాసిన మనీషి. తెలుగు భాషలో ఆతడు కవి, కృష్ణార్జున సంవాదము అను ద్విపద కావ్యమును రచించి, ప్రప్రథమముగా బహుజనాదరణ పాత్రమైన గయోపాఖ్యాన కథను సాహిత్యమున ప్రవేశపెట్టినాడు అట్టి గోపమంత్రికి రాజకీయ సాహిత్య వైదుష్యము గలిగిన దేచమంత్రివంటి మంత్రి దొరకుట యాతని యదృష్టము.

## వైదుష్యము

దేచమంత్రి శివపూజాపరాయణుడగుటయేగాక, శివస్తోత్ర సాహిత్యమును నాకళించుకొన్నవాడు. శివస్తోత్రముల నాతడు నిత్యము పఠించువాడని రామలింగకవి యిట్లు చెప్పినాడు.

భవానీశ స్తవోచ్చారణ ప్రావీణ్య క్షమభావ (1-205)

శంభుస్తుతి పఠన ధురీణ (3-1)

అను సంబోధనలతో నీ విషయము సూచితము

శైవులకు శివపూజా సమయమున శివస్తోత్రములు పారాయణము చేయుట నియతము. మల్లికార్జున పండితారాధ్యుడు శివపూజా సమయమున ననేక శివ స్తవములు పఠించినట్లు పండితారాధ్య చరిత్రము తెలుపుచున్నది వానిలో ప్రసిద్ధము లైనవి-

## శివ పంచ స్తవములు[1]

మహిమ్నము, మల్హణము, బిల్హణము, అనామయము హలాయుధము అను నీ యైదును శివపంచ స్తవములని వాడుక. పాల్కురికి సోమనాథుడు శివపంచ స్తవములని ప్రత్యేకముగా పేర్కొన లేదు- కాని- అందు బిల్హణము లేదు,

"ద్వి హరలీలఁ దేలుచు హరలీలఁదనర,
హరలీల యను కృతిహరలీలఁబొగడు
మహిఁజెప్పఁబడు మహిమ్న స్తవంబునను
మహిమాకరుని మహామహిమఁ గీర్తించు
మలహరణంబగు మలహణంబునను
మలహణ ప్రియునిఁద్రిమలహరుఁబొగడు

1 ఈ శివ పంచ స్తవములను గూర్చి తొలుత నేను క్రీ. శ. 1943 లో అయ్యంకి వేంకటరమణయ్య సన్మాన సంచికలో "వాఙ్మయ విశేషములు" అను, నా వ్యాసమున తెలిపితిని తరువాత కీ. శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు-శివ స్తవములనుగూర్చి ఆంగ్ల భాషలో నొక వ్యాసము వ్రాసినారు.

M. Somasekhara Sarma
Journal of Oriental Research
Madras Vol. No.

శ్రీమయం బైన యనామయంబుకనీ
రామయుఁడగుఁ గరుణామయుఁబొగడు
నాంచుత త్ప్రీతి హాలాయుధంబున హా
లాయుధ ప్రియుఁద్రిశూలాయుధుఁబొగడు."

పండితారాధ్య చరిత్ర దీక్షాప్రకరణము పుట 70

దీనిని బట్టి క్రీ. శ. 12వ శతాబ్దిలో శివపంచ స్తవము లనగా 1) హరలీల 2) మహిమ్నము 3) మల్హణము 4) అనామయము 5) హాలాయుధము-అని తెలియుచున్నది. కాని క్రీ. శ. 1520 ప్రాంతము ల శివపంచ స్తవములనునవి భిన్నముగా నున్నట్లు దేచ మంత్రి వ్రాసిన శివపంచ స్తవి వ్యాఖ్య బట్టి తెలియుచున్నది ఆ విషయము వివరింతును.

## దేచమంత్రి

### శివపంచ స్తవి వ్యాఖ్య

దేచమంత్రి నిత్య శివ స్తవ పఠకుడేగాక, వానిలో ముఖ్యమైన శివ పంచ స్తవములకు వ్యాఖ్యకూడ వ్రాసియున్నాడు. ఆ వ్యాఖ్యా వివరము లింతవఱకు పరిచితములు కాకపోవుటచే వానిని తెలుపు చున్నాము.

దేచమంత్రి మహా విద్వాంసుడగు లొల్ల లక్ష్మీధరుని శిష్యుడై యీ వ్యాఖ్య రచించినాడు. శివ పంచస్తుతికి "శివ మహిమ స్తుతి పంచిక" అని పేరు పెట్టినాడు.

"లక్ష్మీధర కటాక్షేణ దేచయామాత్యశేఖరః
అకరోదాకరోవాచాం మహిమ్నస్తుతి పంచికామ్.

—మహిమ్నము

అకరోదా కరోవాచా మల్హణ స్తుతిపంచికామ్
లక్ష్మీధర కటాక్షేణ దేచయామాత్యశేఖరః —మల్హణము

నీలకంఠస్తుతేష్టికాం యూరదేచయ మంత్రిరాట్
లక్ష్మీధర కటాక్షేణ కురుతే గురుతేజసా —నీలకంఠ స్తవము

అనామయి కృతేష్టికామకరోదా కరోగిరాం
లక్ష్మీధర కటాక్షేణ యూరదేచయ మంత్రిరాట్
—అనామయము

హాలాయుధ కృతేష్టికాం యూరదేచయ మంత్రిరాట్
లక్ష్మీధర కటాక్షేణ కురుతే గురుతేజసా —హాలాయుధము

వీనినిబట్టి దేచమంత్రి కాలమున 1) మహిమ్నము 2) మల్హాణము 3) నీలకంఠ స్తవము 4) అనామయము 5) హాలాయుధము అనునవి శివపంచ స్తవములు-పాఠకులకు విశదముగా నుండుట కై స్తవములు, వాని కర్తల పేర్లు ఉదాహరించుచున్నాను.

1) మహిమ్నము- పుష్పదంతకృతము-శివ స్తవము అన్నింటిలో మహామహిమగలది.

2) మల్హాణము- మల్హాణ కవి విరచితము.

3) నీలకంఠ స్తవము- పౌరాణికము-శివపురాణోక్తము.

4) అనామయము- దండికవి రచితము

5) హాలాయుధము- హాలాయుధోక్తము.

పై స్తవములకు వ్యాఖ్య వ్రాయుటయన్న సామాన్యముగాదు. దేచమంత్రి శ్రుతిస్మృతి పురాణేతిహాస కావ్యసాహిత్యమును మధించి యీ వ్యాఖ్య రచించి యున్నాడు.[1] యందువలన యాతని యపార వైదుష్యము వ్యక్తమగుచున్నది.

---

1 దేచమంత్రి శివపంచ స్తవి వ్యాఖ్యల నైదింటిని సంపూర్ణముగా నాగరలిపిలో, మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము వారు ముద్రించియున్నారు. Bulletin of the Government Oriental Manuscript Library-Madras-Vol. III (1952) కాని వారు ప్రత్యేక గ్రంథముగా ప్రకటింపలేదు. ఈ గ్రంథమును తెలుగు లిపిలో ముద్రించి ప్రచారము చేయుట యావశ్యకము.

## శివ పంచస్తవి వ్యాఖ్య

ఈ సందర్భమున కాశీక్షేత్రమున-జంగమవాడి విశ్వారాధ్య మఠాధ్యక్షులు వీరశైవ మతీయ మహావిద్వాంసులు నగు కీ. శే. చిదిరె మఠము వీరభద్రశర్మగారు ప్రకటించిన శివపంచస్తవి వ్యాఖ్యను గూర్చి యుట్టంకింపవలసియున్నది ఇందు 1) మహిమ్నము 2) మల్హణము 3) మలయరాజీయము 4) అనామయము 5) హలాయుధము-తెలుగు పద్యములలో విశేషవిలసిత, సంపూర్ణ టీకా తాత్పర్యములతో నున్నది. సంస్కృత శివస్తోత్రములను గూర్చి పరిశోధన చేయువారికే గాక, తక్కిన సంస్కారులును పఠింపదగిన గ్రంథము పై వివరములను బట్టి శివపంచస్తవములను గూర్చి పరిశోధన జరుగవలెనని తెలియగలదు వీని ప్రభావము తెలుగు సాహిత్యముపై గలదు.

## దేచమంత్రి శైవాచార సంపన్నత

దేచమంత్రి—ఉద్భటారాధ్య వంశీయుడగు చంద్రశేఖర గురు శిష్యుడు-ఆతని శివపూజాధురంధరత్వమును రామలింగకవి యిట్లు వర్ణించినాడు.

మ. ప్రణుతప్రాభవుఁ దూరదేచ విభుఁ డభ్యర్చించు హస్తాగ్రకం
కణ ఝుంకారము లంకురింప విరులంగంధంబునన్ బత్తిరిన్
మణిహారంబునఁ గాంచనాక్షతల శుంభద్వర్ణ పంచాక్షరిన్
బ్రణవాత్మున్ బరమ ప్రకాశు గిరిజాప్రాణేశు నశ్రాంతమున్.
(1-48)

ఆతని శివధ్యాన పరాయణత్వము నిట్లు సూచితమైనది.

"త్రిపుర మథన పాదాధిష్ఠిత ధ్యాన" (1-207)

శ్రీనగజాధిప చరణ ధ్యాన సుధానుభవలోల (2-1)

శంభుపద సేవా సావధానాత్మకా (3-339)

# ఉద్భటారాధ్య చరిత్ర

## రచనా కాలము

అష్టదిగ్గజ కవీశ్వరుడుగా రామలింగము రాయల సభలో నున్నట్లందఱూ నేకగ్రీవముగా నంగీకరించిన విషయమే. రామలింగని కా రాయల యాస్థానమున ప్రవేశము గలుగుట - ఉద్భటారాధ్య చరిత్ర రచనము వలననేయని మనము నిర్ణయింపవచ్చును. ఇది యెట్లు సంఘటిల్లినదియు వివరింతును.

ఉద్భటారాధ్యచరిత్ర-కొండవీటి దుర్గాధ్యక్షుడైన నాదిండ్ల గోపమంత్రికి మంత్రియగు ఊరదేచ మంత్రికి కృతి-యని తెలిపితిని. రామలింగమీా కృత్యవతరణికలో-కొండవీటి పట్టణము నిట్లు వర్ణించినాడు.

సీ. మహిత మూలసాన మల్లికార్జున శిరః
స్థల చంద్ర చంద్రికా ధవళిమంబు
చెదలు వాటీపుర శ్రీరఘూద్వహ భుజా
స్తంభరక్షణ విధాసంభృతంబు
వేదండ ముఖ తదాగోదిత పద్మ సౌ
గంధిక గంధ పాణింధమంబు
రాజ బింబాననా రాజిత గాంధర్వ
మాధురీ సాధురీతీ ధరంబు

గీ. కరటి కట నిర్గళద్దాన నిరవధిక స
మగ్న నూతన వృష్టి జంబాలి శాఖి
లావనీ పాలమందిర ప్రాంగణంబు
గురు సమృద్ధుల నయిదోడు కొండవీడు. (1-14)

శ్రీనాథుని తరువాత-అతని కొండవీటి వర్ణన సీసపద్యము ననుసరించుచు నా దుర్గవర్ణన చేసినది రామలింగకవియే.

కొండవీటిదుర్గము రెడ్డిరాజుల యనంతరము గజపతుల వశమైనది - ఇది తెలుగుదేశమున మిక్కిలి బలిష్ఠమైన దుర్గము - కృష్ణరాయలీ దుర్గమును, తిమ్మరుసు సైన్యాధిపత్యము వహింపగా, శే 23-6-1515 లో వశపఱచుకొనెను. రాయలీ దుర్గమును పరిపాలించుటకు మంత్రి తిమ్మరుసునకే యొసగెను. అతడు తన మేనల్లుడు అల్లుడునైన - నాదిండ్ల అప్పమంత్రిని కొండవీటి దుర్గాధ్యక్షుడుగా నియమించెను - మఱి ఆఱు నెలలైన తరువాత అనగా క్రీ. శ. 1516 ప్రారంభమున - నప్పటికి గుత్తిదుర్గ పాలకుడుగానున్న తన మేనల్లుని గోపమంత్రిని - కొండవీటికి నియమించి, అప్పమంత్రిని వినుకొండ దుర్గమునకు మార్చెను[1] - ఇందువలన గోపమంత్రి కొండవీటి దుర్గమును పాలింప మొదలుపెట్టినది క్రీ. శ. 1516 నుండియేనని మనము గ్రహింపవచ్చును.

గోపమంత్రి దుర్గాధ్యక్షుడు కాగానే, ఊరదేచమంత్రిని తన మంత్రిగా నియమించెనని మనమూహించిన - అది క్రీ. శ. 1516 ప్రాంతమగును - ఆ వెనుక రామలింగకవి దేచమంత్రి కెప్పుడు కృతియిచ్చెనో నిర్ధారణచేయుటకు తగిన యాధారములు లభింపవు: ఉద్భటారాధ్యచరిత్ర రచన క్రీ. శ. 1516 తరువాతనని - మాత్రమే మనము చెప్పగలము.

ఈ సందర్భమున ఉద్భటారాధ్య చరిత్ర రచనాకాలమునుగూర్చి కీ. శే, వేటూరి ప్రభాకరశాస్త్రిగారేమి వ్రాసిరో తెలుసుకొనుట యావశ్యకము.[2]

"రాయల మంత్రియగు తిమ్మరసు కొండవీటి పరిపాలనము తనల్లుడగు నాదిండ్ల గోపమంత్రి కప్పగించెను. నాదిండ్ల గోపమంత్రి సుప్రఖ్యాతుడు. గోపమంత్రి క్రీ. శ. 1517 న దేచమంత్రి కొక యగ్రహారము నిచ్చెను.

... ... ... ...

... ... ... ...

1. T. T. Devastanam Epigraphical Report, Page 132.

2. ప్రథమ ముద్రణ పీఠిక పుట, 11.

దేచమంత్రి గోవమంత్రిచే నగ్రహారాది సన్మానముల బడసి ప్రఖ్యాతుడయిన పిదపనే యుద్భటచరిత్రము కృతినంది యుండును — అకాల మించు మించుగా క్రీ. శ, 1525. అనితలపవచ్చును - "దీనిచే తెనాలి రామలింగకవి కృష్ణదేవరాయలి సభలోనున్నాఁడన్న ప్రతీతి నదాధారమై సంరక్షితమగుచున్నది."

ఇప్పటికి నలుబదెనిమిదేండ్ల క్రిందట వేటూరివారట్లు వ్రాసినను-నేడు చారిత్రక నరిశోధన జరిగిన వెనుక, వారి వాక్యములట్లనే గ్రహించుటకు వీలుకాదు.

"గోపమంత్రి క్రీ శ. 1517 న దేచమంత్రి కొక యగ్రహారము నిచ్చెను" అన్న వాక్యము[1] మనమంగీకరింపఁలేము దేచమంత్రి కగ్రహారము నిచ్చినది — గోపమంత్రి సోదరుఁడు అప్పమంత్రిగాని-గోపమంత్రి కాదు. ఆ శాసన శ్లోకమిది,

శ్లో॥ శాకాబ్దేఽధి రామవర్గధరణీ గణ్యేశ్వరే వత్సరే
కార్తిక్యాం వినుకొండసీమ్ని సుకృతీ నాదిండ్ల యప్పప్రభుః
ప్రాదాదీన్న వరాభిదంచ సకలం గ్రామం స్వనామాంకితమ్
కౌండిన్యాన్వయ యూరదేచ విదుషే పైశ్వర్యభోగాన్వితం
(59 శ్లో.)

ఈ దానకాలము — క్రీ. శ. 1517. పై దానినిబట్టి నాదింఢ్ల అప్పమంత్రి దేచమంత్రికి — అన్నవరము గ్రామము దానముచేసినాడు.

---

1. పై వేటూరివారి వాక్యము పురస్కరించుకొని పాండురంగ మాహాత్మ్య పీఠిక (అకాడమీ ముద్రణము) 19 వ పుటలో గోప మంత్రి దేచమంత్రి క్రీ. శ. 1517 లో నొక యగ్రహారము నిచ్చెను." అని కలదు. అందే "తిమ్మరసు అల్లుడు మేనల్లుడునైన గోప మంత్రి" అని కలదు — ఇది యెంతమాత్రము సరికాదు — గోప మంత్రి తమ్ముడు అప్పమంత్రి తిమ్మరసు అల్లుడుగాని గోపమంత్రి కాదు, సాళ్వ తిమ్మాఖ్యు జామాత" అని అప్పమంత్రి కంకితమైన రాజశేఖర చరిత్ర.

ఈ శాసనమున - ఊరదేచమంత్రి కౌండిన్యగోత్ర[illegible] బడుటచేత నీత డుద్భటారాధ్యచరిత్ర కృతి[illegible] యగుట [illegible] వాదము[1].

ఇక ఉద్భటారాధ్యచరిత్ర రచనాకాలము క్రీ.శ. [illegible] ననుట విచారింతము- రామలింగకవి కృష్ణరాయల సభలో నున్నవాడని యంగీకరించినవుడు, అత డుద్భటారాధ్యచరిత్ర రచనము క్రీ.శ. 1515 లో చేసిన తరువాత రాయల ఆస్థానమున ప్రవేశించెనన్న అత డా యాస్థానమున నాల్గేండ్లు మాత్రమే యుండెనని చెప్పవలెను - ఏలనగా రాయలు క్రీ.శ. 1529 అక్టోబరు మాసాంతమున మరణించెను.[2]

ఈ నాల్గేండ్లును రాయల చరమదశయని చరిత్రకారులు తెలిపినారు[3]. అతడు చరమదశలో, రాజకీయముగా, మానసిక వ్యధల ననుభవించుచున్నపుడు - సాహిత్యగోష్ఠులు సలిపెననుట విశ్వాసార్హము కాదు - రాయలసభలో రామలింగని గూర్చినకథ లాతడు నాల్గేండ్ల స్వల్పకాలముగాక, ఒక దశాబ్దముపైన నుండినట్లు కన్పట్టుచున్నది - కాబట్టి ఉద్భటారాధ్య కృతి రచనాకాలము క్రీ.శ. 1525 కి తప్పక ముందై యుండవలెను.

ఇప్పుడు మన మీ కృతిరచన - క్రీ.శ. 1516 - 1525 మధ్య యని యొక నిర్ణయమునకు వచ్చితిమి, రామలింగకవి రాయల యాస్థానములో నేడెనిమిదేండ్ల కాలమున్నట్లుగా నాతని కథలలో ప్రసక్తమైన తాతాచార్యుల కథ సాక్ష్యమిచ్చుచున్నది. కాబట్టి ఉద్భటారాధ్యచరిత్ర రచన క్రీ.శ. 1516 ప్రాంతము కాదగును.

---

1 ఈ శాసనము 60 శ్లోకముల పెద్ద శాసనము. ఇం దప్పమంత్రి చేసిన 20 అగ్రహారదానములు గలవు. దీనిని నేను మదరాసు విశ్వవిద్యాలయ పక్షమున ప్రకటించితిని. Selected Inscriptions (Telugu) Edited by N. Venkataramanayya No. 23 Mangalagiri Inscription of Krishnadevaraya.

2 ఆముక్తమాల్యద - ద్వితీయ ముద్రణ - ప్రకాశక విజ్ఞప్తి పుట. 32

3 రాయల నిధనకాలము - లక్ష్మణరాయ వ్యాసావళి.

క్రీ. శ. 1516 ప్రాంతమనుట కింకొక యుపపత్తి చూపుచున్నాను. దీనిని పరిశీలించుకొనుటకే ఇందు తెలుపుచున్నాను.

(1) ఒకటి—

క్రీ. శ. 1517 లో అప్పమంత్రి ఊరదేచమంత్రి కిచ్చిన అగ్రహార ప్రశంస, ఉద్భటారాధ్య చరిత్రలో లేదు - రామలింగకవి తన కృతిపతికి పతియైన గోవమంత్రి సోదరుడు అగ్రహారమిచ్చి సంభావించిన, నది దేచమంత్రి కుత్కర్షదాయకమగు విషయముగాన రామలింగకవి తప్పక దానిని సూచించియే యుండును. ప్రస్తుత కృతిలోని విషయము సూచితము కాలేదు గాన - నీకృతి క్రీ. శ. 1517 కి పూర్వము క్రీ. శ. 1516 లో రచితమై యుండుననుట పొసగును.

కృతిపతి వంశీయులలో నిట్టి అగ్రహారాది సమ్మానములు పొందిన నావిషయము కృతి వంశావళిలో వర్ణించుటకు నొక యుదాహరణము చూపుచున్నాను.

శ్రీనాథమహాకవి భీమఖండమున - అన్నమంత్రి వంశమును వర్ణించుచు, అందు డన్నయమంత్రికూటస్థు డన్నయమంత్రి 'ఆరేడు' అను నగ్రహారమును గ్రహించెనని యిట్లు తెలిపినాడు.

చ. కొలను 'ప్రతాపరుద్ర నృపకుంజరుచేత' 'నరేడు' సారణీ
సలిలవివర్ధమాన బహుసస్య సమాకుల మగ్రహారమై
వెలయ విభాకరగ్రహణవేళ దగలగ బరిగ్రహించె బం
ధుల భరియించె నన్నవిభుతోసరి యెట్లు ప్రధానులెవ్వరున్.
(1-50)

ఇచట కొలను ప్రతాపరుద్రుడనగా కాకతీయ చక్రవర్తి ప్రతాపరుద్రుడుగాదు. అతడు కొలనిరుద్రమంత్రి ఇందులూరి అన్నయ పూర్వుడు.

నాకు తోచిన ఉపపత్తిని తెలిపినాను, విమర్శకులు నిర్ణయింప వచ్చును.

(౨) రెండవది—

రామలింగకవి ఉద్భటారాధ్య చరిత్రమును క్రీ. శ. 1516 లోనే రచించి దేచమంత్రికి కృతి నిచ్చియుండవలెను - అట్లుకాక, గోప మంత్రి దుర్గాధ్యక్షుడై చాలకాలము గడచిన వెనుక యూరదేచమంత్రి కీ కృతినిచ్చిన - కొండవీడును గోపనమంత్రిని నింతగా స్తుతింపవలసిన యావశ్యకతలేదు - కొండవీటి దుర్గాధ్యక్షుడైన గోపనమంత్రికి సచివు డూరదేచమంత్రియని ముక్తసరిగా చెప్పి ఊరదేచమంత్రినే హెచ్చుగా ప్రశంసించెడివాడు - ఈ ఉద్భటారాధ్య చరిత్రమూలముననే - రామ లింగకవికి రాయల ఆస్థానమున ప్రవేశము గలిగినది.

## కవులు - రాజసభా ప్రవేశము

(౩) మూడవది—

ఆకాలమున నెంతటి ప్రతిభావంతులైన కవులకు రాజదర్శనము లభించుట దుర్లభముగా నుండెడిది. మహోద్దండ కవియైన శ్రీనాథు నికి ప్రౌఢ దేవరాయల ఆస్థానమున వెంటనే ప్రవేశము గలుగలేదు, ఆ రాజదర్శన మాలస్యమైన కారణమున, నాతడెట్టి కష్టాలనుభవము నకు లోనయ్యెనో "కుల్లాయెట్టితి కోకసుట్టితి" అన్న చాటుపద్యము వలన తెలియనగును.

సంకుసాల నృసింహకవికి - అల్లసాని పెద్దన మూలమున - రాయల దర్శనము కలుగకుండ భంగమైన సంగతి - సాహిత్యలోక మునకు చిరపరిచితమే - ఎరపాటి ఎఱ్ఱన యను కవి, కృష్ణరాయలను సందర్శించి కృతి నీయదలచి, అట్టి అవకాశము లభింపలేమి, తన మల్హణ చరిత్రలో - "కృష్ణరాయ జనకాంతున కీయదలచిన కృతికన్య నీ కిచ్చుచున్నా"నని కృతిపతితో విన్నవించినాడు.

ఆ కాలమున నేమి - అద్యతన కాలమునను నిట్టి పరిస్థితులే గలవు- గద్వాల సంస్థానమున తిరుపతి వేంకటకవులు - నెలలతరబడి ఉండవలసి వచ్చినది. "వటనేర్పించె గద్వాలరాజు" అని వారే చెప్పుకొన్నారు- ఇంత యెందులకు ఆధునికయుగమున-ఆంధ్రభోజుడైన-శ్రీపిఠాపురము మహారాజావారి యాస్థానమున నీనాటి ప్రసిద్ధకవుల కెందరికి ప్రవేశము కలిగినది? లేదనియే చెప్పవచ్చును[1].

నవీనకాలమున నొక సంస్థానాధిపతివద్ద నే నిట్టివి ప్రవర్తిల్లినపుడు రాయల కాలమున, అందును, సామ్రాజ్య చక్రవర్తియైన - రాయల కాలమున వానిదృష్టి నాకర్షించి, ఆస్థానమున ప్రవేశించుట దుర్ఘట మనియే చెప్పవచ్చును, ఆస్థానకవు లెప్పుడును మత్సరగ్రస్తులు గాన వారిమూలమున కవులకు రాజదర్శనము గలుగదు - ఇక, ఇతర రాజ కీయాధికారుల మూలమునగాని, రాజుగారి కత్యంతాప్తులైన అను చరుల మూలమునగాని యిది జరుగవలసినదే - కందుకూరి రుద్రకవి రాయల రాచమంగలియగు మంగలి కొండోజీ మూలమున విజయనగ రాస్థానిలో ప్రవేశించెనని తెలియుచున్నది[2].

రామలింగకవి విషయ మట్లుకాలేదు - అతని యదృష్టవశమున ఉద్భటాచార్యచరిత్ర కృతినందుకొనగానే - దేచమంత్రి, రామలింగని కవితా ప్రౌఢమకు, పాండిత్యమునకు - చాలా సంతోషించి, తన కధిపతియగు గోపమంత్రికి విన్నవింపగా, గోపమంత్రి రామలింగకవిని

---

1 ఇది నా యనుభవసిద్ధమైన విషయము - నేను శ్రీ పిఠాపురాధిపతులతో క్రీ. శ. 1935 నుండి 1952 వఱకు నాంతరంగికముగా సంబంధించి యున్నవాడను.

2 అష్టదిగ్గజములు - అను గ్రంథము. ఆ గ్రంథమున అష్టదిగ్గజములు అను వ్యాసము పుట 18. డాక్టరు నేలటూరి వేంకట రమణయ్య,

పిల్పించి గ్రంథము విని ఆతడు[1]కూడ స్వయముగ తెలుగున కవియే గనుక, రామలింగకవి కవిత్వ వైదుష్యమునకు కడు సంతసించి, తన మేనమామయు, మహామంత్రి శిఖామణియగు తిమ్మరసునకు సిఫారసు చేసియుండవలెను - తిమ్మరసు మంత్రిమూలమున రామలింగకవి రాయల ఆస్థానమున - అష్టదిగ్గజకవులలో నొకడై తన కవితా మహాత్మ్యముచే యశేషకీర్తి నార్జించెను.

# ఉద్భటారాధ్య చరిత్ర

## కావ్యకథావస్తు విమర్శన

ఉద్భటారాధ్య చరిత్ర యనగా ఉద్భటారాధ్యు డనెడు ఒక శైవాచార్యుని మహిమలను దెలుపు కావ్యము. ఈ పేరు, పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రము ననుసరించి పెట్టబడినది. పండితారాధ్య చరిత్ర వెనుక - చరిత్ర పేరుతో నుద్భటారాధ్య చరిత్ర వఱకు నీక్రింది పద్యకావ్యములు గలవు.

---

1 నాదిండ్ల గోపమంత్రి సంస్కృతమున, ప్రబోధ చంద్రోదయ నాటకమునకు చంద్రికావ్యాఖ్య వ్రాయుటయేగాక - తెలుగున కృష్ణార్జున సంవాదమను ద్విపదకృతి రచించెను. ఇందు గయోపాఖ్యాన కథ గలదు. దీనిని తొలుత తెల్పినవాడు గోపమంత్రియే. ఇది క్రీ. శ. 1934 లో కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగా రచ్చువేసిరి, అది అసమగ్రము, అందుచే-1953 లో సమగ్ర పరిష్కృత ప్రతి, విపుల పీఠికాదులతో వెలయించినాను. (1953)వావిళ్ళ ముద్రణము.

1. కేతనదశకుమార చరిత్ర - 2. మంచెన కేయూరబాహు చరిత్ర - 3. జక్కన విక్రమార్క చరిత్ర - 4. అన్నయషోడశకుమార చరిత - 5. శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర[1].

పండితారాధ్య చరిత ఉద్భటారాధ్య చరితలు - శైవమత సంబంధమైనవి : ఆధ్యాత్మికములు.

ఉద్భటారాధ్య చరిత్రమున కథానాయకుడు ఉద్భటారాధ్యుడే. ఆతడు - రామలింగకవి ప్రబంధరచనమునకు మూడు శతాబ్దులకు పూర్వము శివకవుంచేత ప్రస్తుతుడైనవాడు. కాబట్టి ప్రథమమున నాతడు శైవవాఙ్మయమునం దెట్లు వర్ణితుడో తెలిసికొనుటయావశ్యకము.

## ఉద్భటుడు = ఆతని చరిత్ర

తెలుగు సాహిత్యమున ప్రప్రథమముగా 'ఉద్భటుని' మనకు క్రీ. శ. 1908 లో నన్నెచోడని కుమారసంభవ పీఠికలో కీర్తిశేషులు కూనవల్లి రామకృష్ణకవిగారు పరిచయము చేసినారు. అం దుద్భటుడు కుమారసంభవము అను సంస్కృత కావ్యము రచించినట్లు తెలుపబడినది. (కు, సం, 1-21). ఆ వెనుక క్రీ. శ. 1922 లో మల్లికార్జున పండితుని శివతత్త్వసారమున - 'హరలీలాస్తవ రచయితయైన ఉద్భటుడు, దేహముతో కైలాసము జేరినట్లు చెప్పబడినది. (శివతత్వ. 410) ఆపైని క్రీ, శ. 1926 లో పాల్కురికి సోమనాథుని బసవపురాణమున - ఉద్భటుని కథయందు - ఆతడొక మట్టివృతము

1 'చరిత్ర' అను పేరుగల కావ్యములన్నియు కథా వస్తుస్వభావమున గూడ నొకరీతిగా నున్నవని తలంపరాదు. పై 'చరిత' పేరు గలిగిన కావ్యములలో - కేతన దశకుమార చరిత్ర, మంచెన కేయూరబాహు చరిత్ర - జక్కన విక్రమార్క చరిత - అన్నయ షోడశకుమార చరిత కేవలము కథాకావ్యములు - ఆధ్యాత్మిక దృష్టిలేనివి. పల్నాటి వీరచరిత చారిత్రకము.

నాశ్రయించిన, ఏడువందల భూతములకు పిశాచత్వము తప్పించి, తన శిష్యుడైన భోజరాజును, ఆతని పరివారమును, తనతో కైలాసమునకు తీసికొనిపోయెనని చెప్పబడియున్నది (బస. 120, 129 పుటలు) సోమనాథుని పండితారాధ్య చరిత్రమున నీ వృత్తాంతము సంగ్రహముగా రెండుపంక్తులలో చెప్పబడినది, హారలీల ప్రశంస ఆకథతోపాటు అందున్నది.

పై విషయములనుబట్టి - సంస్కృత వాఙ్మయమున నొక ఉద్భటుడును తెలుగు శైవ వాఙ్మయమున మఱియొక ఉద్భటుడును మనకు గానవచ్చుచున్నారు. వీ రిరువురునుగాక, కన్నడ శైవ సాహిత్యమున ఉద్భటయ్య అను శైవకవి మఱియొకడు మనకు కన్పట్టుచున్నాడు - కాగా, ఉద్భటులు - మూగ్గురు మనకు తెలిరి.

1. సంస్కృత వాఙ్మయమున ఉద్భటుడు.
2. తెలుగు శైవ ,, ఉద్భటుడు
3. కన్నడ శైవ ,, ఉద్భటుడు.

వీరు ముగ్గురు వేర్వేరా? లేక యొక్కరేనా అని మనము నిర్ణయింపవలెను - పై ముగ్గురిలో, కన్నడశైవ సాహిత్యమున నుద్భటుడు కన్నడకవి చరిత్రమున బ్రశంసింపబడుటచేతను, ఆకడు 'హారలీల' అను కృతిని కన్నడమున రచించుటచేతను ఆతడు సంస్కృత కవి యగు నుద్భటుడు కాడని స్పష్టమైనది.

## సంస్కృత వాఙ్మయము - ఉద్భటుడు

సంస్కృతమున నలంకార శాస్త్రములు రచించినవారిలో ఉద్భటుడు సుప్రసిద్ధుడు. ఈతడు కాశ్మీరదేశమును క్రీ. శ. 778-813 ప్రాంతమున నా దేశము నేలిన జయాపీడుని ఆస్థానసభ నలంకరించిన మహావిద్వాంసుడు. ఈతనికి దినమునకు లక్ష దీనారములు వేతనము[1], ఈతడు రచించిన గ్రంథములలో ఒక్క 'కావ్యాలంకారసార సంగ్రహము' అను నలంకారశాస్త్రగ్రంథ మొక్కటియే లభ్యమగుచున్నది.

---

1 విద్వాన్ దీనారలక్షేణ ప్రత్యహంకృత వేతనః

భట్టోఽభూదుద్భట స్తస్య (జయాపీడస్య) భూమిభర్తుః సభాధిపతిః,
కల్హణుని రాజతరంగిణి 4–445

కావ్యాలంకారసార సంగ్రహమున నలంకారముల లక్షణము లతోపాటు ఉద్భట విరచిత కుమారసంభవమునుండి లక్ష్యశ్లోకము లుదాహరింపబడినవి, పై యలంకార గ్రంథము ప్రతీహారేందురాజు వ్యాఖ్యానముతో ప్రచారము గాంచినది. సంస్కృతాలంకార శాస్త్ర చరిత్ర కెక్కినది,

కావ్యాలంకారసారసంగ్రహ ప్రకాశకులు – దినమునకు లక్ష దీనారముల వేతన మొక కవికిచ్చుట అతిశయోక్తి యనియు, ఉద్భ టుడు సంవత్సరమునకో రెండేండ్లకో ఒకమారు రాజదర్శనమునకు వచ్చినపు డట్టి వేతనము నిచ్చెడివారనియు వ్రాసియున్నారు. కాని యిది సరికాదు. ఇచట 'దీనార' నాణెమున కర్థమువేఱు[1],

మఱియు, నా ప్రకాశకులే – ఉద్భటుడు "కుమారసంభవము" అను కావ్యమును పై శాస్త్రగ్రంథముతోపాటు రచించెనని వ్రాసి యున్నారు[2].

పై విషయములనుబట్టి ఉద్భటుడు సంస్కృతాలంకార శాస్త్ర మునకు జన్మభూమియగు కాశ్మీరదేశీయుడని, ఆతడు, కావ్యాలంకార సార సంగ్రహ, కుమారసంభవములు రచించెనని – ఆ వాఙ్మయ చరిత్రలో నిర్ణీతమైనది. కాని తెలుగుననున్న హరలీల విషయము సంస్కృత వాఙ్మయచరిత్రలో లేదు.

---

1 దీనార మనగా, మనకు వాడుకలోనున్నట్లు – (దీనారటంకాల తీర్థమాడించితి దక్షిణాధీశు ముత్యాలశాల) బంగారు నాణెము కాదు – కాశ్మీరదేశమున నాకాలమున – 'దీనారము' అను చాల తక్కువ విలువగల రాగినాణెము (ఒక పైసా) ఉండెడిది – దీనిని బట్టి, ఆ లక్ష దీనారములు కొన్నివందల రూపాయలగును. (See Kalhana's Rajatarangini - S. B. Pundit's English Edition - Page 265.

2 Introduction to Kavyalankara Sangraha of Udbhata· Oriental Institute Baroda.

నన్నెచోడని కుమారసంభవము[1]ను గూర్చి ప్రప్రథమముగా విపుల విమర్శన వెలయించిన కీర్తిశేషులు శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు పై యుద్భటత్రయమును గూర్చి - తమ గ్రంథమగు కుమారసంభవ విమర్శనమున తృతీయ ప్రకరణమున 34 పుటల (88-122) లో కూలంకషముగా చర్చించినారు - వారి విమర్శసారాంశము లివి.

(1) నన్నెచోడుడు ప్రశంసించిన యాతడు కాశ్మీరదేశ నివాసి యగు నాలంకారిక మహాకవి అతడు వీరశైవుడు కాజాలడు.

(2) బొందితో కైలాసమును బొందు ప్రభావ మీతనికున్నట్లు ప్రమాణములు లేవు. కావున నీతడు మల్లికార్జున పండితుడు స్మరించినవాడును గాదు.

(3) పాలుకురికి సోమనాథుడు ప్రసంగించినవాడు కాడు.

(4) కన్నడదేశమున 'ఉద్భటయ్య' అను కవి హారలీలాస్తవము - కన్నడమున చెప్పెనని సూచన యున్నది - కాని గ్రంథము లభ్యముకాలేదు - కన్నడమున - ఉద్భటకావ్యము ఉద్భటదేవర కావ్యము అని యున్నను - అవి కుమారపాల ఘూర్జరు డను శివభక్తుని చరిత్రయే ఉద్భటచరిత్రగా చెప్పుచున్నందున - ఆ కన్నడ ఉద్భటునితో తెలుగు శివకవులు పేర్కొన్న ఉద్భటునికి సంబంధము లేదు.

కీ. శే. లక్ష్మీపతిశాస్త్రిగారు సంస్కృతమునగల ఉద్భటుని కావ్యాలంకారసార సంగ్రహమున - నేకదేశికముగా, అలంకారమునకు లక్ష్యలక్షణములుగా నున్న పటురూపధారణలీలను, నలంకార లక్షణలక్ష్యసహితముగ విశదముగా తెలుగువచనమున ప్రశస్తరీతిని వివరించియున్నారు. నన్నెచోడకవి. ఉద్భటునినుండి ఏ యే భావములను గ్రహించెనో వానిని విశదీకరించిరి! మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారము.

---

1 కుమారసంభవ విమర్శనము - మద్రాసు విశ్వవిద్యాలయ తెలుగు శాఖా ప్రచురణలు సంఖ్య 6. (1937)

నన్నెచోడకవి కుమారసంభవము, పాల్కురికి సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రలు - శివకవుల కృతులనియు, వారు ముప్వురును "శివకవు"లనియు, నీ విమర్శనకాలమునాటికే (క్రీ.శ. 1937) వాఙ్మయ చరిత్రలో నిర్ణీతమైన విషయము. శివకవులు ముప్వురును - వీరశైవ మతవ్యాప్తికొఱకు తెలుగున, ప్రత్యేక కవితా, సాహిత్య భాషాచ్ఛందోవిశేషములతో స్వతంత్రమైన శైవసాహిత్య శాఖను సృష్టిచేయుటచేతను, ఈ ముప్వురికి, రచనలయం దనుస్యూతముగ నవినాభావ సంబంధముండుటచేతను, సాంప్రదాయముగా వచ్చుచున్న నన్నయభట్ట భారత రచనాపద్ధతికి విరుద్ధముగా నుండుటచేతను, ఈ ముప్వురు విలసిల్లిన కాలమునకు వాఙ్మయ చరిత్రమున "శివకవియుగము" అని వాఙ్మయ చరిత్రకారులు వ్యవహరించిరి - నేటికిని వాఙ్మయచరిత్రలో - శివకవియుగమనియే పేరు.

ఈ శివకవికృతగ్రంథముల నామూలాగ్రముగా పరిశీలించినవారికి - ఈ ముప్వురిలో నొకరు చెప్పిన విషయములు, మఱియొకరి గ్రంథములు అనూదితము లగుచుండునని తెలియగలరు - ఇంకొక విశేషమేమనగా, ఒకరు చెప్పిన విషయము, శైవమత సంబంధము గానిచో, రెండవవారు దాని నెంతమాత్రమూ పరిగ్రహింపనే పరిగ్రహింపరు - ముప్వురి కృతులలోను శివభక్తితత్త్వము, శివభక్తి మాహాత్మ్యము - శైవమత ధర్మములే శరీరమున రక్తమువలె వ్యాపించి ప్రవహించుచున్నవి. ఇట్టి యాంతరంగిక దృష్టితో ప్రస్తుతము ఉద్భటుని గూర్చిన విషయములు పరిశీలించిన - నన్నెచోడకవి పేర్కొన్న కాశ్మీరదేశవాసియై, కావ్యాలంకారసార సంగ్రహము - కుమారసంభవము రచించిన ఉద్భటుడు, మల్లికార్జున పండితారాధ్య పాల్కురికి సోమనాథులు ప్రశంసించిన ఉద్భటుడు - కుమారసంభవ విమర్శనమున నిరూపితులైనట్లు వేర్వేఱుకాక ఒక్కరే యని నిర్ణయము కాగలదు

మొదట పాల్కురికి సోమనాథుడు చెప్పిన ఉద్భటుని కథతో ప్రారంభము - బసవన, బిజ్జలునకు, కొందఱు శివభక్తుల మహాత్మ్యము వినిపించు సందర్భమున నిద్ది గలదు.

# సోమన చెప్పిన ఉద్భటుని కథ

బల్లకీపురమునకు రాజైన భోజునకు శివదీక్ష[1]నిచ్చిన ఉద్భటుడు బ్రాహ్మణుడైనను, కులహీనులతో కలిసియుండుట సహించజాలక యితర బ్రాహ్మణులు రాజుతో చెప్పగా ఆత దూరకుండెను - అంత శివుడే, ఉద్భటుని మహాత్మ్యమును లోకమునకు వెల్లడింపదలచి ఆతని తనలో చేర్చుకొనెను - ఉద్భటుని ఐక్యస్థితిలోని దేహమునకు దహనక్రియలు జరుగుచుండగా. ఆ దహనధూమము, అక్కడనున్న యొక మఱ్ఱిచెట్టును తాకినది. దానితో ఆ చెట్టుపై నున్న భూతములు ఒకటి తక్కువగా ఏడువందలు కైలాసమునకు పోయినవి- ఒక్క భూతము, తిండికొఱకు పోవుటచే మిగిలినది - అది యేడ్చుచుండగా భోజుడువచ్చి ఏడ్పునకు కారణమడిగెను. "పంద్రెండు వేలేండ్లనుండి, ఉద్భటుని చితి పొగకై వేచియున్న భూతములలో నేనొకడను - నా దురదృష్టవశమున సమయము తప్పినది. ఇప్పుడైనను కట్టెలు నాపై వేయించుము. నేను ఈ మఱ్ఱితోకూడ కైలాసము చేరెదను" - అని జవాబిచ్చెను. వెంటనే భోజుడు కట్టెలు తెప్పించి, అగ్నిదరికొల్పెను. శివుడు, ఆ భూతముతో భోజరాజును ఆతని పరివారమును కైలాసమునకు గొనిపోయెను.

(బసవపురాణము - 7 వ ఆశ్వాసము - 88 ద్విపదలు)

సోమనాథుడు చెప్పిన పై యుద్భటుని కథకు పూర్వమే - మల్లికార్జున పండితుడు, తన శివతత్త్వసారమున నిట్లుచెప్పియున్నాడు.

"హరలీలాస్తవ రచనా
స్థిర నిరుపమకీర్తి తనదు దేహముతోడన్
సురుచిర విమానమున నీ
పురమున కుద్భటుఁడు ప్రీతిఁ బోవడె రుద్రా!"

శివతత్త్వసారము - 410 ప.

---

1 ఇతరులకు శివదీక్షను ప్రసాదించు నధికారము - ఒక ఆరాధ్యులకే తప్ప తక్కినవారికి లేదు.

శివతత్త్వసారము మూలమున - ఉద్భటుని శివభక్తియేగాక ఆతడు, 'హరలీల' యను శివస్తవము రచించినట్లు మనకు స్పష్టమగుచున్నది. బసవపురాణ కథలో, భోజునకు శివదీక్ష నిచ్చినది - ఉద్భటుడే యని మనకు తెలియుచుండుటచేత, ఆతడు భోజునకు దీక్షాగురువనియు - నాతడే ఉద్భటారాధ్యుడనియు మనము నిర్ణయింపవచ్చును. ఇంతేకాక బొందితో కైలాసమున కేగిన ఉద్భటుడే హరలీల అను కృతిని రచించినవాడని నిర్వివాదముగా నిర్ధారింపబడుచున్నది,

## హరలీల

ఉద్భటుడు, 'హరలీల[1]' అను రచనను కావించెనని నన్నెచోడ మహాకవి, తన కుమారసంభవమున నిట్లు చెప్పియున్నాడు.

"క్రమమున నుద్భటుఁడు కవి
త్వము మెఱయఁ గుమారసంభవము సాలంకా
రము గూఢవస్తుమయ కా
వ్యముగా హరలీలఁ జెప్పి హరు మెచ్చించెన్ (1-21)

నన్నెచోడకవి పై పద్యమున సంస్కృతకవులను స్తుతించు సందర్భమున, వాల్మీకి, వ్యాస, కాళిదాస, భారవులను స్మరించిన వెనుక ఉద్భటుని స్తుతించినాడు - ఆ పద్య తాత్పర్యమిది.

"ఉద్భటుడు తన కవిత్వము ప్రకాశించునట్లు కుమారసంభవము, సాలంకారము, గూఢవస్తుమయ కావ్యముగా హరలీల (శివుని లీలలో నొక లీల) ను రచించెను - ఈ రచనవలన శివుని మెప్పించెను."

విమర్శకులు నన్నెచోడకవి పద్యమున తెలిపినవి ఉద్భటుని కృతులు మూడని యిట్లు చెప్పిరి,

కుమారసంభవము — కావ్యము,

---

1 నన్నెచోడ కుమారసంభవ విమర్శనము - కీ. శే. శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి - మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణము - పుట 40, (1987)

సాలంకారము — కావ్యాలంకార సంగ్రహము-అలంకార శాస్త్రము.

హరలీల — హరలీల యను కృతి - ఇది గూఢమైన కథావస్తువు గలది.

వీరిట్లు మూడు కృతులని చెప్పినను. నన్నెచోడని కవితను నవగాహనము చేసికొన్నవారికి పై మూడును వేర్వేరు కృతులుగ క. ఒక్కటే కృతి యని తెలియగలదు. ఈ ప్రతిపాదన వివరణ.

## కుమారసంభవము

ఉద్భటుని కుమారసంభవ రచనకు ముందే కవికులగురుడగు కాళిదాసు మహాకవి కుమారసంభవ కావ్యమును రచించియున్నాడు - అది జగద్వ్యాప్తమైనది. అట్టియెడ ఉద్భటుడు - ఆ పేరుతోనే ఒక కావ్యమును రచించిన - అది కాళిదాస కావ్యము ముందు నిలువ జాలదు - అలంకార శాస్త్రజ్ఞుడగు ఉద్భటుడు అట్టి రచనకు పూను కొనడు - ఆ కారణముచేత నాతడు - కాళిదాస కుమారసంభవైక దేశమగు - శివుని వటురూపధారణ కథను మాత్రమే గ్రహించి, దానిని ఒక ప్రత్యేక కావ్యశాఖండముగను, శైవమత సంప్రదాయిక ముగను దిద్ది తీర్చి తన కావ్యమునకు "కుమారసంభవము[1]" అనియే పేరు పెట్టినాడు - కాళిదాస కథాక్రమమును ననుసరించినను శివుని వటురూపధారణము - కుమారస్వామిసంభవ హేతువైన, పార్వతీ పరమేశ్వర వివాహమునకు 'నాంది' కాబట్టియే - ఉద్భటు డీ కథా భాగము మాత్రమే గ్రహించియున్నాడు

ఒకవిధముగా నీ వటురూపధారణ ఘట్టము; కుమారసంభవ కథ యంతటికి ముఖ్యఘట్టము - పార్వతి, పరమేశ్వర స్వరూపము మానసికముగా మాత్రమే యెఱుగును - ఆమె, శివునికి పరిచర్యజేయునప్పుడైన - ఆమెకు ప్రత్యక్షమైనది. శివుని యోగమూర్తి స్వరూపము మాత్రమే, ఈ ఘట్టముననే, శివుడు, పార్వతి నిశ్చలభక్తికి మెచ్చి, స్వస్వరూపముతో సాక్షాత్కరించినాడు - పార్వతీ పరమేశ్వర సమాగమమునకు మూలమైన - ప్రసంగమము - పర్యవసితమైనది - పార్వతీ పరమేశ్వర ప్రణయమున కంకురార్పణమైనది - ప్రత్యేకముగ

నీ కథాభాగమును మాత్రమే ఉద్భటుడు స్వీకరించుట కిది ప్రధాన కారణమైనది. ఈ క్రింది విషయము దీనిని సమర్థించును.

ఉద్భటుడు కుమారసంభవము పూర్తిగా రచింపలేదు -
అతడు రచించినది కుమారసంభవైకదేశమగు వటురూపధారణ
మాత్రమే. అది కుమారసంభవమే

పార్వతీ పరమేశ్వరులు కుమారుని జననము నిమిత్తము - కలియుటయే కుమారసంభవమే అను పదమున కర్థము - సంభవము అనగా సంయోగము (సమావేశము) అని పూర్వసంప్రదాయసిద్ధార్థము- గర్భాదానాది సంస్కార ప్రణాళికను విధించు గృహ్యసూత్రములలో దంపతులు సంయోజనము చేయవలెననుదాని తెలుపుటలో సంయోగ శబ్దమునకు పర్యాయపదము సంభవము అను పదము గలదు -

ఖాదిరగృహ్య సూత్రము :- 1-4-18. "సంభవేద్గర్భం దేహీతి" దానికి రుద్రస్కందవృత్తి "సమ్యగాలోచ్యముహూర్తాది మిథునీభవేత్" అని కలదు,

గోభిలీయగృహ్యసూత్రము :- 2-వ ప్రకరణము 5-50-9 "సమార్ప్యరో సంభవత్ :- సమావ్య సంభవత ఏవనేతరత్ కుర్యాత్- అని వ్యాఖ్య.

పై ఉదాహృతవలన-దంపతులు సమాగమమునకు-లేక సంభోగమునకు ముందుచేయు సమావేశమునకే సంభవము" అని వైదికార్థము - సంభవమనగా పుట్టుట అని లౌకికార్థము[1]

ఉద్భటు డీ వైదికార్థమును గ్రహించియే - కుమారసంభవమునకు - శివవ(టు) - పార్వతీ సమావేశమునకు - కుమారసంభవము అని పేరుపెట్టినాడు.

## (2) సాలంకారము

ఉద్భటుడు హరుని వటురూపధారణ లీలమాత్రమే గ్రహించి, తాను ప్రతిపాదింపదలచిన - అలంకారములకు యీ కథాభావమును

---

1 నన్నెచోడ కుమారసంభవ విమర్శనము కీ. శే. శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రి-మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణము-(1932) పుట 40,

మాత్రమే లక్ష్యముగా గైకొన్నాడు - అనగా, ఒక్కొక్క యలంకారమునకు లక్షణము నిచ్చి, లక్ష్యములలో వటురూపధారణ లీలవచ్చునట్లు క్రమముగా రచించినాడు - ఇందువలన, "ఏకక్రియాద్వ్యర్థకరి" అనునట్లుగా, నిది యిటు - అలంకారశాస్త్రము నైనది, అటు శైవ సంబంధకృతియైనది - ఇట్టిది యితర సంస్కృతాలంకారశాస్త్ర గ్రంథములలో నలంకారము విషయమై గానవచ్చుటలేదు. పరిశోధింపదగిన విషయము-ఇందలంకారముల సమన్వయ ముండుట చేత నే-నన్నెచోడ కవి సాలంకారము అని స్పష్టపఱచినాడు.

చూ. పూర్వోక్తము-కుమారసంభవ విమర్శనము.
(103-112 పుటలు)

## (3) గూఢవస్తుమయము

ఉద్భటకావ్యమున-ఇతివృత్తము-శివునివటురూపధారణకథయే యైనను, అది కథాక్రమము ననుసరించియుండక, ఒక్కొక్క యలంకారమునకు లక్ష్యమగుటచేత, కథావస్తువు గూఢమై యున్నదిగాని కాళిదాస కృతియందువలె, ప్రత్యక్షముగా, మనము వెంటనే గ్రహించుటకు ననువుపడదు-అలంకారిక గ్రంథములలో, లక్షణములకు సాధారణముగా లక్ష్యము లితర కావ్యములనుండి గ్రహింపబడును-అవ్వి డవిముక్తకములవంటివి కావున-మనము లక్ష్యార్థములను గ్రహించుట సులభము-కాని ఉద్భటకావ్యమునందట్లు కాదు-లక్ష్యములన్ని ఉద్భటుని రచనలే-అవి యన్నియు ననుస్యూతముగా నొకే కథాభాగమునకు సంబంధించినవి-ఈఆలంకారిక సమన్వయము మూలముగా కథ వ్యక్తమగుచుండుటచేత-నన్నెచోడకవి దీనిని 'గూఢవస్తుమయ' మని చెప్పియున్నాడు.

## (4) హరలీల

ఇందు వర్ణితమైనది ఒక హరలీల, లీల యనగా, భక్తానుగ్రహాది నిమిత్తము పరమేశ్వరుడుచేయు మానుషచర్య-ఇచట పరమేశ్వరుడు, పార్వతి భక్తిని పరీక్షించి, ఆమె నను గ్రహించుటకు ప్రచ్ఛన్నరూపము

దాల్చుటచే వది యొక లీలగా పరిణమించినది-అట్టి శివుని లీలలు ముప్పదియాఱు[1].

కాళిదాస కుమారసంభవమును మనము శైవమత సంప్రదాయిక దృష్టితో పరిశీలించిన-నందు శివునిలీలలైదున్నవి.

(1) మన్మథ దహనము (2) వటురూపధారణము
(3) పార్వతీ వివాహము (4) కుమార జననము
(5) తారకాసుర సంహారము

కుమారసంభవైకదేశికమగు నీ వటురూపధారణ కథాఘట్టమునే, ఉద్భటుడు గ్రహించి, ఆ కథాభాగమునకు 'హారలీల' అను నామకరణము గావించెను.

కావ్యాలంకార సంగ్రహము పై విషయములనుబట్టి ఉద్భటుడు కొందఱు విమర్శకులూ-భావించినట్లు కుమారసంభవము, హారలీల అను మూడు కావ్యములు రచింపలేదనియు అవియన్నియు మూడు లక్షణములుగల ఒకే కావ్యమనియు గ్రహింపవలెను.

పైని వివరించిన మల్లికార్జున పండితుని 'హారలీల' ప్రశంసకూడ యీ విషయమును నిర్ధారణ చేయుచున్నది. శివతత్త్వసారమున 'స్తుతి' గా హారలీల పరిగణితమైనది.

శివతత్త్వసారమున నిట్లు చెప్పుటయేగాక-పండితు డీ హారలీల స్తుతితో, శివుని స్తుతించెనని పండితారాధ్య చరిత్రమున నిట్లు గలదు.

"హారలీలఁ దేలుచు హారలీలఁ దనర
హారలీల యను కృతి హారలీలఁ బొగడు"

దీక్షా పుట 181.

ఆ కాలమున ప్రజాసామాన్యములో నీ స్తుతి ప్రచారములో నుండెను-శ్రీశైలమున, శివరాత్రి మహోత్సవములలో దీనిని పఠించెడివారు

1 ఈ ముప్పదియాఱు శివలీలలను, నిశ్శంక కొమ్మన తన శివలీలా విలాసమున వర్ణించి యున్నాడు ఈ ముప్పదియాఱు లీలలును-శైవమతతత్త్వములు ముప్పదియాఱింటికి సంబంధించినవి. ఈ తత్త్వ వివరణమునకు మల్లికార్జున పండితుని శివతత్త్వసారము (నూతన ముద్రణము) చూడవలెను.

*హరలీలరుద్ర సహస్రనామాదు
లర దొండఁ జదువుచు సంకించువారు"

పర్వ. పుట 483

ఇదియొక కావ్యమని చెప్పబడినదిగదా. స్తుతి కావ్యమెట్లయిన దని సందేహపడనక్కఱలేదు-ఇందు 41 అలంకారములకు-డెబ్బదియైదు లక్షణములును ఆ డెబ్బదియైదుకు పైన మఱి యిరువది లక్ష్య శ్లోకములతోను అనగా 92 లక్ష్యలక్షణ శ్లోకములతో హారలీల యున్నది. కావుననే స్తుతికావ్యమని పండితుడు దీనిని నిర్వచించి యున్నాడు.

పండితునివంటి శైవమత ప్రవర్తకాచార్యునికి పారాయణ గ్రంథము కాదగిన మహత్తు కలుగుటచేతనే నన్నెచోడకవి. తన కుమారసంభవమున దీని ననుసరించియున్నాడు-ఈ విషయ మిప్పుడు ప్రస్తుతము కాదు.

బసవపురాణమున నేకాక పండితారాధ్య చరిత్రమున నుద్భట మహిమ ప్రశంసగలదు.

'పటముతో నేణ్ణూరు వరభూతములను
నిటలాక్షుపురికి నుద్భటుఁడు గొంపోడె"

పురా, పుట 411

పై వివరములవలన-సంస్కృతాలంకార శాస్త్రమున ప్రశంసితుడై కావ్యాలంకార సంగ్రహము రచించిన యుద్భటుడే, ఆంధ్ర శైవ సాహిత్యమున, పండిత మల్లికార్జున, నన్నెచోడ, పాల్కురికి సోమనాథులచే ప్రపంచితుడైన యుద్భటుడని వారిరువురు వేఱు వేఱు వ్యక్తులుగాక, ఒక్కరే యని సిద్ధాంతిత మగుచున్నది,

ముందు నేను వివరించిన-కుమారసంభవ విమర్శనమునందే 118వ పుటలో లక్ష్మీపతిశాస్త్రిగారిట్లు, సందేహము లేకుండ వ్రాసినారు.

"బసవపురాణోద్భట కథయే కొన్ని మార్పులతోఁ దెనాలి రామలింగకవిచేఁ బ్రబంధముగా రచింపఁబడినది."

శ్రీ శేషులు ప్రభాకరశాస్త్రిగారు దీనిని బలపఱచిరి. "ఉద్భటుడు-ఉద్భటారాధ్య చరిత్రమని తెనాలి రామలింగకవి ఈతని చరిత్రమునే పద్యకావ్యముగా రచియించెను."

బసవపురాణపీఠిక ప్రథమ ముద్రణము 1926 పుట 68.

# ఉద్భటారాధ్య చరిత్ర

## మూలము

ఉద్భటునిగూర్చిన పై వివరణమువలన-పాల్కురికి సోమనాథుని బసవపురాణ కథయే-ఉద్భటారాధ్య చరిత్రకు మూలమని నిశ్చితమైనది కాని రామలింగకవి తన కృతిలో నీ విషయమేమియు తెలుపలేదు-మూలకథయే కాక, అందందు నా కృతిలో ప్రసక్తములైన శివభక్తుల భక్తిమహిమ, దానిని ప్రదర్శించిన భక్తులు-ఇవి యన్నియు బసవ పురాణమునుండి గ్రహించినవియే-అయినను సోమనాథుని ప్రశంస, యిందు లేదు తనకు ముందున్న శ్రీనాథమహాకవి యడుగుజాడలను బట్టి వచించినది-శ్రీనాథమహాకవి హరవిలాసమున బసవపురాణమున సిరియాలునికథ గ్రహించినాడు సోమనాథు పండితారాధ్య చరిత్ర ద్విపదను పద్యకావ్యముగా చేసినాడు-ఈ విషయము కంఠోక్తిగా, తన కృతులలో చెప్పినాడు-అయినను కవిస్తుతిలోగాని, వేఱుగా గాని పాల్కురికి సోమనాథుని స్తుతింపలేదు.

ఇందుకు కారణము తెల్లము. శ్రీనాథుని కాలమువఱకు పాల్కురికి సోమనాథుని కృతులు కేవలము మతసంబంధములైనవి. వానియందు సాహిత్య విశిష్టత యున్నను. అవి సాహిత్య కావ్యములుగా పరిగణితములు కాలేదు. శ్రీనాథుడే తొలుత, కవిత్రయ సాహిత్యమును, శివకవిత్రయ సాహిత్యమును సమ్మేళనముచేసిన మహాకవి[1]. అతడు కావ్యరచనాదృష్టితో నిట్లు చేసినను, అసల గ్రంథములు కేవలము మత ప్రాధాన్యము లగుటచే, పాల్కురికి సోమనాథుడు, మతప్రచార మహాకవి యగుటచే సోమనాథుని స్తుతించలేదు-అనగా, ఆకాలమున వానికి సాహిత్య ప్రాధాన్యము లేదనుట-నేడు మనకు మతమక్కఱలేక,

---

1 చూడుడు. సమగ్ర ఆంధ్రసాహిత్యం-4, 5, 6 సంపుటాలు విమర్శన-భారతి-1965. అక్టోబరు పుట 76 కీ. శే. బండారు తమ్మయ్యగారి శ్రీనాథమహాకవి పీఠిక-ఈ సమ్మేళనశక్తి మూలముననే హరవిలాసము కేవలము శైవమత సంబంధమైన కృతియైనను దానిని సాహిత్య కావ్యముగా నేడు పరిగణించుట జరిగినది

సాహిత్యమే ప్రధానము గాన-సాహిత్యమున శివకవులను, ప్రధానముగా గ్రహించుచున్నాము. ఇంతే భేదము.

శ్రీనాథుని వెనుక రాయల యుగమున-సోమనాథుని కృతులు మతగ్రంథములే-కావుననే-శైవకథాపస్తుతే స్వీకరించి, పాల్కురికి సోమనాథుని కన్నప్ప కథను గ్రహించిన ధూర్జటి తన శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యమున-పాల్కురికి సోమనాథుని పేరెత్తలేదు.

ధూర్జటికి, సమకాలికుడగు ఎడపాటి ఎఱ్ఱన-మల్హణ చరిత్ర యను తన ప్రబంధమున కథనంతయు, పాల్కురికి సోమనాథునినుండి గ్రహించినను, అతని పేరెచ్చటను తడవలేదు. ఇందువలన రామలింగ కవియు. పాల్కురికి సోమనాథు ప్రశంస యీ శైవకృతిలో చేయలేదు.

ఇక ఉద్భటారాధ్యచరిత్ర పద్యకృతికి మూలమైన సోమనాథుని ద్విపదకథ నుదాహరించుచున్నాను.

## ఉద్భటుని కథ

బసవపురాణమున పాల్కురికి సోమనాథుడు చెప్పిన ఉద్భటుని కథ మొదట నిచ్చుచున్నాను.

అదిగాక "బల్లకి" యను పురంబునను
నుదుబటుడన నొప్పు నొక్క భక్తుండు
వర 'భోజరాజ'ను నరనాయకునకు
గురువయి శివదీక్షఁ గరుణించి మఱియు
వేదశాస్త్రార్థ సంపాదితయుక్తి
నాదేశమున నన్యవాదంబులుడిచి
క్షోణీశునకుఁ బాదు బొమ్మవ్వనాఁగఁ
బ్రాణేశు సద్భక్తిపరురాలు గాన
నతివయుఁ దాను సమంచిత భక్తి
గతి నిరంతర సుఖస్థితిఁ దేలుచుండ
మనుజు లత్యద్భుత మావసుఁగుచుఁ
బనుపుచు నిట్టి సద్బ్రాహ్మణోత్తముడు
కులహీనులు దాను గూడియున్నాడు
తలపంగఁ బెద్దలు తారయుబ్బువినీ

ననుచు వబోృజరాజున కెటిగింప
వినియుఁ దొల్లిటియట్ల కొనియాడుచుండఁ
బరమేశ్వరుండు మద్వటయ్యగారి
వరభక్తిమహిమ యిన్వ సుమతితోన
నతుడుగా మెఱయింతునని యప్పురహోత్మఁ
గరమర్థితోఁ దన్నకాఁ గూర్చుకొనుడు
దహనక్రియలు చేయఁ తత్సమీపమున
మహినెదురేచూచు మట్టిభూతములు
ఎగిది యొక్కటసాల కేణ్ణారు నచటి
పొగదాఁకి కైలాసమున కవ్వపోవ
నందొక్కభూత మాహోరాత్రమేగి
వందుచు మఱుపూటవచ్చి భూతముఱఁ
గానక యేడ్చుచుఁ గటకటా యనుచు
మానక వాచర్వ మహియెల్ల నదువ
కూయిడ నిదియే మొకోయంచు జనని
కాయంబు భోజుండు గక్కున వచ్చి
యెవ్వరేడ్చిన వారలేమి కారణము
నెవ్విధమునగాని యేడ్చుడుగ వన
"వినవయ్య! పంద్రెండు వేలేండ్లనుండి
మనుజేశ! యుద్భటు మరణంబుగోరి
యేడునూటిమట్టి నెలమి భూతములు
నేడకుఁ నేగక నెదురుసూచుచును
నుండె నేనేఁగితి నుదరాగ్నిఁజేసి
యుండంగఁజాల కొక్కొండ చిక్కతిని
వెనుపొంవగాఁ గూటిపేద దోడప్పె
నని యాడుమాట నాయండ సంధిల్లె
నెలమి నొక్కటిసాల కేడ్చూరు భూత
ములు నుద్భటునిగాల్చు పొగదాకఁ దడవ
కైలాసమునకేఁగ గతిచెడి కాన

భూలోకమున జిక్కి పొగిలెద తండ్రి

* * * *

భూతంబులై బొగ వాలయంగఁ దడవ
ఖ్యాతిగా మఱ్ఱివృక్షముఁ గూడఁ జెఱికి
కొనుచు నక్కైలాసమున కేఁగె భోజ
జననాథ జనయూథసహితంబుగాగ.

బసవపురాణము-సప్తమాశ్వాసము

పుటలు 219-220

## ఉద్భటారాధ్య చరిత్ర

### కథాసంగ్రహము

రామలింగని ఉద్భటారాధ్యచరిత్రయందలి కథాసంగ్రహమిది.

ప్రథమాశ్వాసము : సూతుడు శౌనకాది ఋషులకు చెప్పును. కైలాసపర్వతమున నుద్యానవనమున పార్వతీపరమేశ్వరులు విహారార్థము వచ్చిరి. ఆ సమయమున-గంధర్వులు కొందఱు దంపతీ యుక్తముగా, నంది వారించుచున్నను, ఆ యుద్యానమున దిగి, హాలగిరిజ విహారమునకు భంగము కావించిరి-శివుడు వారిని పిశాచరూపులు గండని శపించెను. వారు తక్షణమే పిశాచరూపములు దాల్చిరి. తమ యకృత్యము నెఱిగి వారు శివుని వేడగా, శంకరుడు భూలోకమున ఉద్భటుడను- శైవగురు వుద్భవించును-ఆతడు వల్లకియందుండును, అతని శవధూమము మీకు తగిలినంతనే మీరు గంధర్వరూపులగుదురు, మీరట్లు నాఱుద్దివ్యసమ మనుభవింపవలెను-అని శాపమోక్షము దెలిపెను. వారును వల్లకిని జేరి అచట నొక మఱ్ఱిచెట్టు నివాసముగా నుండిరి.

వల్లకీపురమును ప్రమథేశ్వరుడను రాజు పాలించుచుండెను- ఆతడు గొప్ప శివభక్తుడు. తన రాజ్యమంతటా శైవమతము విస్తరింపజేసెను-ఆ సమయమున కైలాసమున నీశ్వరుడికి తన తలపులో-గంధర్వుల శాపము నిలిచెను. వెంటనే, ఆతని తలపునుండి ఉజ్జ్వల దేహముతో ఉద్భటుడు సముద్భవించెను, శివు డాతనిజూచి, నీవు మానుషరూపముతో

వ్లోకికిబోయి అచట ప్రమథేశ్వరునికి గురువుగా నుండుము. నీ శవధూమముచే నచ్చటనున్న పిశాచములకు శాపమోక్షము గలుగును. అని యాజ్ఞాపించెను.

ద్వితీయాశ్వాసము : ప్రమథేశ్వరుడు తనకు సంతానము లేక పోగా తన భార్యయగు ప్రభావతితో కౌండిన్య మహాముని యాశ్రమమునకు వెడలి, ఆ మునీశ్వరునితో తనకోరిక తెలిపెను. కౌండిన్యుడు. "నీవు కాశికి వెడలి శ్రీనాథుని తపస్సుచే-నలరజేయుము. నీకోర్కె నెఱవేఱును."అని యానతిచ్చెను.

కాశీక్షేత్రమహిమ చెప్పునపుడు కౌండిన్యుడు మహాలసు డను నొక విప్రుడు, పతితుడయ్యును-కాశీక్షేత్రమున మరణము చెందిన కతన, శివగణములలో చేరెనన్న కథను తెలిపెను.

తృతీయాశ్వాసము : కౌండిన్యుని యాదేశము ననుసరించి. ప్రమథేశ్వరుడు కాశికేగి, తపస్సుచేసి. శివుని మెప్పించి, పుత్రుని బడసెను-ఆతనికి ముంజభోజుడను పేరుపెట్టెను. ముంజభోజునికి-యౌవనము రాగానే-ఆతనికి పట్టాభిషేకము గట్టి ప్రమథేశ్వరుడు తానును భార్యయు కాశీక్షేత్రమునకు వెడలిపోయిరి.

ముంజభోజుడును తండ్రివలె, శివభక్తిపరాయణుడై గురువు కొఱకు-వెదకుచుండగా, ఉద్భటు డతనికి మొదట కలలోగనబడి మఱునాడు ప్రత్యక్షమయ్యెను-ఉద్భటునివలన లింగధారణ విధానము నెఱింగి, ముంజభోజు డాతనిచే శివదీక్షపొందెను ఇంతటిలో పిశాచముల శాపావధియగుటచే, నాతడు యోగముచే, ప్రాణము త్యజించెను. వెంటనే రాజు చితిపేర్చించి అగ్ని నెలకొల్పి, ఆ వటవృక్షముపై-యాశవధూమము వ్యాపింపజేసెను.పిశాచము లన్నియు,గంధర్వులైరి. కాని ఒక్కడుమాత్ర మాహారార్థమై, వెడలి ఆ సమయమున నచ్చట లేకుండుటచే నాతడు తిరిగివచ్చి-వారికి శాపమోక్షమైన సంగతి తెలిసికొని, ముంజభోజునివద్దకు వచ్చి, తన దీనస్థితి చెప్పగా ఆతడు, వీరవ్రతము బూని, శంకరునే రప్పించి, ఆ పిశాచమునకు గంధర్వత్వము నిప్పించెను. కొంతకాలము రాజ్యము చేసెను కైలాసమున కాతడేగెను.

ఉద్భటుని వంశమువారు, కాశియందు నివసించిరి. అక్కడనుండి వారివంశ మభివృద్ధి యయ్యెను. వారు కాశీనుండి తెలుగుదేశమున ముదిగొండకు వచ్చి-అచ్చట స్థిరపడిరి, ఆ వంశీయుడే-ఉద్భటారాధ్య చరిత్ర కృతిపతి దేచమంత్రి గురువు చంద్రశేఖరుడు-అతని వంశ చరిత్రతో కావ్యము ముగియును.

## ఉద్భటారాధ్యుల కథ

### పాల్కురికి సోమన-రామలింగకవి-రచనాభేదములు.

పాల్కురికి సోమనాథుని బసవపురాణమునుండి కొన్ని ద్విపదలు ఉదహరించితిని. రామలింగకవి కృతికి బీజము-మూలకథలో అనగా, ఏడునూఱు భూతములు, ఉద్భటుని చితిపొగదాకి కైలాసమునకు వెడలుట-అను ముఖ్యవిషయములో భేదములేదు. తక్కినవానిలో కొన్ని భేదములున్నవి. వానిని వివరించుచున్నాను.

| బసవపురాణము | ఉద్భటారాధ్య చరిత్ర |
|---|---|
| ఖిల్లకి | వల్లకి |
| భోజరాజు | ముంజభోజుడు |
| ఉద్భటుడు గురువై శివదీక్ష నొసగుట. | ఇందును గలదు. |
| ఉద్భటునికి బొమ్మవ్వ అను భార్య-ఆమె హీనకులజురాలు. | ఇది లేదు. 1-122 |
| పండ్రెండు వేలేండ్లు ఉద్భటుని మరణముగోరి భూతములు నిరీక్షించుట. | నూఱు దివ్యసమలు అని కలదు. దివ్యసమ లనగా దేవ సంవత్సరములు దేవమానము ననుసరించి - మానవులకు ఒక సంవత్సరము దేవతలకొకరోజు కాబట్టి నూఱు దివ్యసమలు-అనగా 36500 మానవ సంవత్సరములు తృతీయాశ్వాసము 260 లో విడివడిచిన భూత |

ము"తో చితినుగ్రశావభరమున్ శత దివ్యసమంబులు" అని చెప్పెను.

అన్నిభూతములు శాపమోక్షమంది ఒక్కభూతము మిగిలి రాజు వద్దకువచ్చి వేడుకొనగా రాజు చితియందగ్ని నెలకొల్పును.

ఇచట రాజు విడివడిన భూతమును బ్రోవుమని, కంఠమున కత్తికేలించును. ఈశ్వరుడు ప్రత్యక్షమై - ఆ భూతమునకు శాపమోక్ష మొసంగును.

ఇందు "ఉమబటుఁడు" అను తద్భవరూపము వాడబడినది.

ఇందు లేదు.

ఇచట నొక విషయము మనము గ్రహింపవలెను. ఉద్భటారాధ్యుడు పాల్కురికి సోమనాథునకు, అయిదువందలయేండ్లు ముందున్నాడు-ఇక బసవపురాణ రచనమునుగూర్చి సోమనాథుడే - "కథాసూత్రము వెలివెలిగింపు"డని శ్రీశైలమున భక్తుల వేడుకొన్న ట్లవతారికలో చెప్పినాడు-కావున-అతడు-భక్తులమూలమున విన్న ఉద్భటుని కథను-మాత్రమే గ్రంథస్థము చేసినాడు

రామలింగకవి-ఉద్భటారాధ్య చరిత్ర ప్రబంధముగా రచింపబోవుచున్నాడు గాన-యుద్భటుని గూర్చి యంశములను సేకరించినాడు-ముఖ్యముగా-ఉద్భటారాధ్య చరిత్ర కృతిపతి దేచమంత్రి గురువు చంద్రశేఖరుడు ఉద్భటారాధ్య వంశ్యుడే గావున-అతని మూలమున వంశపారంపర్యముగా వచ్చుచున్న యుద్భటుని చరిత్రమును తెలిసికొని రామలింగకవి యీ ప్రబంధము రచించెననుట నిర్వివాదము—

రామలింగకవి ఉద్భటునకు వివాహమైనట్లుగా నిట్లు వర్ణించినాడు.

గీ. తద్బుధులలో సుబుద్ధియన్ ధరణిసురుఁడు
సుగుణమణి సౌభాగ్యసుందరి యను
పేరుగలిగిన కూతురఁ బెండ్లిచేసె
నుద్భటారాధ్యునకు నీశ్వరుండు దెలుప. (౩-౩౧౮)

ఇది సోమన చెప్పినదానికి ప్రత్యక్షర విరుద్ధము-సోమన ఉద్భటుని భార్య బొమ్మవ్వ అనియు, ఆమె హీనకులజయని చెప్పినాడు-ఇవియున్ను

వారు వారు విన్న కథలను మాత్రమే గ్రంథస్థము చేసిరని చెప్ప వచ్చును. ఈ రెండిటిలో రామలింగకవిదే ప్రామాణికమని చెప్ప వచ్చును.

ఏలననగా, ఉద్భటారాధ్యు వంశమున ననేకమంది యుద్భవిల్లిన వెనుక-చంద్రశేఖర గురుని మూలపురుషుడు జన్మించెను-గాన. ఉద్భటునికి సౌభాగ్యసుందరి భార్యయనుట మనము నిశ్చితముగా గ్రహింప దగినదే.

## ఉద్భటుని - ఉత్తర కథ

రామలింగకవి ఉద్భటుని ఉత్తరకథ కొంత చెప్పినాడు. ముంజ భోజునికి ప్రత్యక్షమైన శివుడు తాను కాశీవిశ్వనాథ స్వరూపముతో కాశీయందు నివసింతుననియు, ఉద్భటుడు నక్కడే గురుభావము దాల్చి యుండుననియు, ఉద్భటుని కాశీనివాసమును గూర్చి చెప్పెను.

(3-304-308)

శివుడిట్లు చెప్పిన తరువాత విశ్వనాథుని ఘర్మజలముల ఉద్భటు డుద్భవించెనని-యుండే గలదు.

గీ. అనిన నేగాక యని శిష్యునాజ్ఞ జేసి
నాకు సాహాయ్యుఁడవుకమ్ము నన్ని యెడల
ననిన నట్లని పరమేశు నంత, విశ్వ
నాథు ఘర్మజలంబుల నవతరించె. (3-309)

రామలింగకవి యిట్లు వ్రాసినను నేడు ప్రచారములోనున్న కథ వేఱుగా నున్నది-"ఉద్భటుని ఉపనయనము" అను గ్రంథమున[1] విశ్వే శ్వరలింగమునుండి సువర్ణాంశువుగా నవతరించెనని చెప్పబడియున్నది.

శా. శ్రీవిశ్వేశ్వరలింగ గర్భగత రోచిశ్చక్రసంఘర్షణ
వ్యావృత్తిం బహిరుద్గతమ్మయిన సౌవర్ణాంశుకొండర్భటుం
డై వారాణసి నాడుకోనతని లోకాతీతసౌందర్య వి
ద్యావృద్ధుల్ వలికించె నాకమున గంధర్వావళీ గీతముల్. (1-12)

---

1 ఇది శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారిచే రచితము, సువర్ణధార అన్న గ్రంథమున తొలుత, తక్కిన కృతులతో ముద్రింపబడి, ఆ వెనుక వేఱుగ్రంథముగా ప్రకటితమైనది.

దీని కాకరమేమో తెలియరాలేదు. గ్రంథకర్తలు, ఇష్టాగోష్ఠి అను పేర వ్రాసిన దానిలో—

"నే నుద్భటారాధ్య వంశమువాడను. మా వంశస్థు లందఱును శ్రీ కాశీసువర్ణలింగ గర్భసంజనితోద్భటారాధ్య వంశోద్భవు"లని బిరుదము కలదు. అని తెలిపినారు వారు రామలింగకవి యుద్భటారాధ్య చరిత్రను సూచించి కాని కథాభేదమును తెలుపలేదు.

ఇప్పటికి పదేండ్లక్రిందట నేను శైవాచార్య పరంపర నిట్లు తెల్పితిని[1].

| | |
|---|---|
| ఆచార్యత్రయము— | 1. హరదత్తాచార్య |
| | 2. భట్టభాస్కరాచార్య |
| | 3. నీలకంఠాచార్య – (త్రయము) |
| ఆరాధ్యత్రయము— | 1. ఉద్భటారాధ్య |
| | 2. కోటిపల్యారాధ్య |
| | 3. వేమనారాధ్య (త్రయము) |
| సిద్ధత్రయము — | 1. రేవణసిద్ధ |
| | 2. మరుళసిద్ధ |
| | 3. ఏకోరామసిద్ధ (త్రయము) |
| పండితత్రయము— | 1. శ్రీపతిపండిత |
| | 2. శివలెంకమంచెన పండిత |
| | 3. మల్లిఖార్జున పండిత (త్రయము) |

ఇది వీరశైవాచార ప్రదీపిక యను గ్రంథమునుండి గ్రహించితిని, అంతకన్న విశేషములులేవు.

కీ. శ, ఇవటూరి సానందారాధ్యులు, ద్వాదశారాధ్య చరిత్రమని యొక గ్రంథమున్నదని తెల్పిరి. కాని దానినిగూర్చి కొంతమంది ఆరాధ్యులకు వ్రాయగా, వారేమియు తెలుపలేదు–ఈ విషయము నిశ్చితముగా తెలిసినంతవరకు–రామలింగకవి ఉద్భటారాధ్య చరిత్రకు–మూలము. రామలింగకవి కృతిపతి గురువు మూలమున తెలిసికొనిన విషయములే యని మనము గ్రహింపవలెను.

---

1 భారతి జూన్ 1963

పై ఆచార్యపరంపరలో-సిద్ధత్రయ ప్రశంస పాల్కురికి సోమనాథుని గ్రంథములలో లేదు.

## కథా సంవిధానము

## 1. చంద్రశేఖరగురు ప్రశంస

పై కథాసంగ్రహామునుబట్టి-రామలింగకవి-తన కృతిపతియైన దేచమంత్రి గురువు చంద్రశేఖరుని కీర్తించుటయే ప్రధానముగా, నాతని మూలపురుషుడైన యుద్భటుని చరిత్రమును రచించెనని మనము నిశ్చయింపవచ్చును-శైవసంప్రదాయమున వారునకు గురువునకు నభేదముగాన రామలింగకవి, ఆదినుంచి, అంతమువఱకును వచ్చుటచ్చుట శివునికి బదులుగా, చంద్రశేఖర శబ్దమునే వాడినాడు. మొదటి పద్యముననే-"అధ్యాత్మ విద్యావిశ్రాంతుడు చంద్రశేఖరుడు"

బాలక "చంద్రశేఖర కళాదర్ప స్ఫురద్గర్భుడై" 8-159-3-41

పూనినాడవ సుభాకరమున్ గురు చంద్రశేఖరా!

ఇది ఉద్భటునికి సంబోధన.

గ్రంథాంతమున-చంద్రశేఖర గురురాజ చక్రవర్తి-అని ముగించినాడు.

## 2. కౌండిన్య మునీశ్వర ప్రశంస

ఇందు ప్రమథీశ్వరుడు కౌండన్యమహామునిని దర్శించినట్లు వ్రాసియున్నాడు. ఈ కథకు కౌండిన్యునకు నేమాత్రము సంబంధము లేదు-కాని, కౌండిన్యుడు, తన గోత్రకర్తయేగాక, ముఖ్యముగా కృతిపతి దేచమంత్రి గోత్రము-కౌండిన్యగోత్రమే కాబట్టి-కృతిపతి వంశోత్కర్షకై కౌండిన్యమహామునిని కథయందు ప్రవేశపెట్టెను[1].

---

1 ఈ కౌండిన్యుడు మలయాదేశమున - కంబోడియాలో హైందవ సంస్కృతి ప్రతిష్ఠాపించినవాడు. (చూ, కోతవరం చరిత్ర) సముద్ర యానముచేసిన మొదటి ఋషి కౌండిన్యుడని భారతీయ చరిత్రకారులు తెలిపిరి.

## 3. మదాలసుని కథ

ఇదియు ప్రత్యేకముగా, కథను పెంపొందించుటయేగాక, శ్రీనాథ మహాకవి రచన ననుకరించి, తానుగూడ యట్టి రచన చేయగలడని సామర్థ్యము వ్యక్తపఱచుకొనుటకై - యీ మదాలసునికథ యిందు చేర్చినాడు. శ్రీనాథమహాకవి కాశీఖండమున నందుడు గుణనిధికథలు శివరాత్రిమహాత్స్యమున సుకుమారునికథ దీనికి ప్రాతిపదికలు. హరి భట్టు ఉత్తరనారసింహ పురాణమున మందేహుని కథయు, రామలింగ కవి చూచి యుండవచ్చును. ఉద్భటారాధ్య చరిత్రయందలి మందేహుని కథ యందలి ప్రాథమిక రచనాశిల్పము-పాండురంగ మహాత్మ్యమున నిగమశర్మకథలో, ప్రౌఢకావ్యకళాశిల్పమున వరిణమించినది.

మూలకథతో సంబంధింపని యీ మందేహుని కథ చేర్చుట కింకొక కారణము గలదు. శృంగార రసాత్మకమగు నిట్టి కథ యున్న గాని కావ్యవర్ణనల కనుకూలముగాదు-అందుచేత ప్రత్యేకముగా దీనిని సంతరించినాడు-రామలింగని యుద్భటకృతి తరువాతనే నీ మందేహుని కోవలోనివాడైన-నిరంకుశుని కథను, నిరంకుశోపాఖ్యానమను పేర కందుకూరి రుద్రకవి కమనీయ కవితతో చెప్పియున్నాడు.

## 4. కాశీక్షేత్రమహిమా వర్ణన

ఇందు కాశీక్షేత్ర వర్ణనము-మూడు పట్టుల-రెలి పద్యములలో గలదు. (1) కౌండిన్యుడు కాశీక్షేత్రమహిమ చెప్పుట (2) మదాల సుడు కాశీక్షేత్రమున మరణమునందు సందర్భమున (3) ప్రమథేశ్వ రుడు విశ్వనాథుని సేవించుట. శ్రీనాథుని తరువాత యింత హెచ్చుగా కాశీవర్ణనచేసిన కవులు లేరు. రామలింగకవి కాశీఖండమున-కాశీ వర్ణన ననుసరించినవాడు గావున-అందలి గుణనిధి వృత్తాంతమును గ్రహించి, అరీతిగా మదాలసుని కథయు రచించెను.

ఇట్లు పాల్కురికి సోమనాథుని కథాబీజముగా తాను సేకరించిన విషయములతో ప్రోదిచేసి శ్రీనాథమహాకవి కవితాకథాంశములను-శాఖలతో నొక ప్రత్యేక ప్రబంధముగా, ననుపమాన వైదుష్యముతో రామలింగకవి, దీనిని నిర్మించినాడు. ఆ యా కథలను తమంతటతా మతుకుకొన్నట్లు సమన్వయించి, ఏకకథాశరీరముగా నేర్పఱుచుట

లావతింగని కావ్యకథాని ర్మాణశక్తి వెల్లడించును. పై నాలుగు విషయములేగాక, ఈ కావ్యమునకు ప్రబంధ సాహిత్యమున ప్రత్యేకత నిచ్చినది. శైవసంప్రదాయ విశిష్టత.

## శైవసంప్రదాయ విశిష్టత

ఉద్భటారాధ్య చరిత్ర–ఆంధ్ర వీరశైవవాఙ్మయమునకు సంబంధించిన కృతి–ఈవీరశైవవాఙ్మయము రెండు విధములు,

1 పండితసంప్రదాయక వాఙ్మయము–పండితారాధ్యుడు ప్రవర్తిల్ల జేసిన, ఆరాధ్యసంప్రదాయము, ఆ భక్తుల కథలకు సంబంధించినది–ఇది సవైదికము.

2. బసవ సంప్రదాయక వాఙ్మయము–బసవన ప్రవర్తిల్ల జేసిన జంగమ సంప్రదాయమునకు, ఆ భక్తులకు సంబంధించినది. ఇది అవైదికము[1]

శ్రీనాథమహాకవి ఈ రెండు సంప్రదాయముల నొక కావ్యమున హరవిలాసమున–నిట్లు నిబంధించినాడు.

## హ ర వి లా స ము

| | | | |
|---|---|---|---|
| 1,2 | ఆశ్వాసములు | సిరియాళునికథ | బసవసంప్రదాయము |
| 3,4 | ,, | గౌరీకల్యాణము | పండితసంప్రదాయము |
| 5 | ,, | దారుకా వనవిహారము | ,, |
| | | లింగాకారముగా శివు డావిర్భవించుట | ,, |
| 6 | ,, | హాలాహల భక్షణము | ,, |
| 7 | ,, | కిరాతార్జునీయము | ,, |

శ్రీనాథుడారాధ్య సంప్రదాయకుడు గావున పండిత సంప్రదాయమునకు హెచ్చు ప్రాముఖ్యము నిచ్చి బసవ సంప్రదాయమునకు సంబంధించినకథ నొక్కటి మాత్రమే గైకొన్నారు–శ్రీనాథుని కృతు

1 చూడుడు, శివతత్త్వసార పీఠిక–పుట. 81

లలో, హరవిలాసము పూర్తిగా, శైవమతసంప్రదాయమునకు జెందిన గ్రంథము గావుననే, నాతడు, తన కృతులలో దీనిని ప్రత్యేకముగా పేర్కొనలేదు, శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యము, భీమఖండ, కాశీ ఖండములవలె[2] శైవులకు స్మార్తులకు నిరువురకు సంబంధించినది.

## శైవసంప్రదాయ విశిష్టత

ఆంధ్ర వీరశైవవాఙ్మయము, బసవ సంప్రదాయము పండిత సంప్రదాయము అని రెండు విధములుగా నున్నది[3] వీనికే జంగమ సంప్రదాయము-ఆరాధ్య సంప్రదాయము అని నామములు.

'రామలింగకవికి ముందు, శ్రీనాథు డీ రెండింటిని-హరవిలాసమునందు వర్ణించినాడు. హరవిలాసమున-మొదటి రెండాశ్వాసముల చిఱుతొండనంబి కథ బసవసంప్రదాయము-సప్తమాశ్వాసమున కిరాతార్జునీయకథ పండిత సంప్రదాయకము.

రామలింగకవి. హరవిలాసమున శ్రీనాథుడు రెండు సంప్రదాయములు సంధానించిన పద్ధతి విడనాడి బసవసంప్రదాయిక కథలను పూర్తిగా పరిత్యజించి. ఉద్భటారాధ్య చరిత్రమునంతయు, పండిత సంప్రదాయకముగా రచించినాడు. భక్తులనుగూర్చి చెప్పినప్పుడు-బసవన పేరుమాత్రము స్మరించినాడు-తన కావ్యమంతయు నారాధ్య సంప్రదాయిక గ్రంథముగా తీర్చిదిద్దినాడు.

శ్రీకృష్ణరాయల కాలమున-శైవుడైన రామలింగకవి ఉద్భటారాధ్య చరిత్రమున-పండిత సంప్రదాయమునే నేకైకముగా వివరించుట చూచియే. ధూర్జటి, తన శ్రీ కాళహస్తీశ్వరమాహాత్మ్యమును నేకైకముగా బసవ జంగమ సంప్రదాయానుసారముగా రచించినాడను-నూహ పొడముచున్నది. ఇందు ప్రధానమైన కన్నప్పకథ బసవ

---

2 హరవిలాసము, శైవసంప్రదాయిక దృష్టితో విపుల వ్యాఖ్యానముతో ప్రకటింపదగినది-కేవలము బసవ సంప్రదాయికమగు శివభక్తుల కథలు-సిరియాళుని కథ తెలుగు సాహిత్యమున నవతరించుటకు హరవిలాసమే కారణము.

3 చూ. నా శివతత్త్వసార పీఠిక-

పురాణమునుండి గ్రహించినదే-తక్కిన కథలయందు-బసవ సంప్రదాయమే కలదు-కాళహస్తీమాహాత్మ్యము రచనాకాలము మనకు తెలియరాదు-అయినను, అది కృష్ణరాయల కాలములో-రామలింగకవి రాయల అష్టదిగ్గజములలో నున్నప్పుడు రచితమైనది, రాయలసభలో ధూర్జటి అతులితమాధురీ మహిమ ప్రశంస-రామలింగడు దానిని వివరించుట-అను విషయము తెలుపుచున్నది-'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేలగల్గె నీ యతులిత మాధురీమహిమ" అన్న సనుస్యను, ఆస్థానమున శైవులైన-నంది తిమ్మన, మాదయ్యగారి మల్లన-కవులుండగా, రామలింగడే దీనిని పూరించుటవలన-వారిరువురకు సంబంధము కలదని-మనమూహింపవచ్చును.

ఇట్టి దృష్టితో రాయల సమకాలికముగా నవతరించిన ప్రబంధములను-విమర్శింపవలయునని చూపుటకే పై విషయము తెలుపబడినది.

## ఆరాధ్యశైవ సంప్రదాయములు



### లింగధారణ దీక్ష

శైవసంప్రదాయమునకు ప్రధానమైన లింగధారణదీక్షా విధానము శివకవుల గ్రంథములలో లేదు-"దీక్ష" అనగా లింగధారణ "దీక్ష" యని యర్థము-ఇప్పటికి శైవులలో మీరు "దీక్ష" పుచ్చుకున్నారా అని వ్యవహారమున్నది-ఈ దీక్ష పొందినగాని, శివపూజ కర్హత లేదు, శివపూజ యనగా లింగమును నరచేతిలో నుంచికొని అభిషేకించి పూజచేయుట[1]-ఈ సంప్రదాయమునే సూచించుచు, పాల్కురికి సోమనాథుడు, పండితారాధ్య చరిత్ర తొలి ప్రకరణమునకు దీక్షాప్రకరణము అని పేరుపెట్టినాడు, అందు ప్రధానముగా పండితారాధ్యుని లింగార్చనలేక శివపూజయే వర్ణితము. సోమనాథుడు పండితారాధ్య చరిత్రకు కావ్యత్వము నాపాదించినవాడు కావున-దీక్షావిధానము నెంత

1 భాగవతమున పోతన, "చేతులారంగ శివుని పూజింపడేని" అన్న పద్యపాదమున కర్థము, శివుని పూవులతో పూజించుట కాదు-చేతిలో లింగము పెట్టుకొని అభిషేకించి పూజించుటయే యని యర్థము,

మాత్రము తెలుపలేదు-రామలింగకవి దానిని యీ కావ్యము వివరముగా తెల్పినాడు- ఈ విధానము తృతీయాశ్వాసము 137-157-191-200 పద్యములలో గలదు[1].

## విభూతిధారణ

విభూతిమహిమ (165-169) నాల్గుపద్యములలో చెప్పబడినది.

(1) విభూతి (2) భస్మము (3) భసితము (4) రక్ష (5) క్షారము అని విభూతి అయిదు విధములు-విభూతి ఉత్పత్తియు నిందు చెప్పబడినది. ఈ విభూతిని శరీరమంతయు నలదుకొనిన, దానిని "భస్మోద్ధూళనము" అని యందురు. భసితోద్ధూళిత దేహకాంతులు 3-124. రామలింగకవి పాండురంగ మహాత్మ్యమునకీ సంప్రదాయమునే తెలిపినాడు. "భస్మోద్ధూళన పాండురాంగము రమాప్రాణేశు పాద ద్వయిన్" 2-54) "భసితోద్ధూళిత నిర్మలావయవుడున్ పంచాక్షరీ సంతతాభ్యసన వ్యాప్తిపరాయణుండు" (7-29)

## రుద్రాక్షధారణ

రుద్రాక్షలు-రుద్రుని అక్షులు-అనగా కన్నులనుండి జనించినవి-ఈ రుద్రాక్షలు శరీరమునందు నాభికిపైగా, ఏ యే చోట్ల నెన్నెన్ని ధరింపవలెనో ఆ నియమము 3-170 పద్యమున చెప్పబడినది-రుద్రాక్ష మాల శైవులకు భూషణము- "పురహరు నేత్రోద్భవ రుద్రాక్షలు భూషణములు మాకు" అని యాగంటివారి వచనములు.

## పంచాక్షరీ మంత్రము

"నమశ్శివాయ" అను పంచాక్షరీ మంత్రము, దీక్షాకాలమున నుపదేశింపబడును. శిరమున రుద్రాక్షలు-ముఖమున పంచాక్షరి-వక్షమున లింగధారణము, మూడును శైవులకు నిత్యలక్షణములు. ఈ పంచాక్షరీ మంత్రముచేతనే లింగార్చన జరుగును.

---

1 ఈ దీక్షావిధానము క్రిందటి తరమువఱకును తూచా తప్పకుండ జరిగెడిది. నేనీ దీక్షావిధానము ననేక పర్యాయములు చూచినాను.

"శుంభద్వర్ణ పంచాక్షరిన్" "మారదేచవిభుడక్ష్యాంచు" (1.46)
ఈ మంత్ర భేదములు పంచాక్షరి | ప్రణవము - ఓంకారముతో గూడుకొన్న దానిని (ఓం నమశ్శివాయ)

1. "షడక్షరి" అని యందురు. దీనినే రామలింగకవి ఆఋదళం బుల మంత్రము సుమమున-నవి రాజము కియలలిఁ గ్రీడించితి" (3-287) అని సూచించినాడు. శివుడీ ప్రణవమంత్రము (ఓంకార మంత్రమున) కాశీక్షేత్రమున-మరణించిన మనుజునికి-చెవిలో నుపదేశము చేయును-చూ, కాశీఖండము. ఓంకారాక్షరమంత్రరాజము చెవిన్ రోజించుఁగ శిష్టలిన్ ఈ కృతి యందు 2-99 లో నిది సూచితము,

2. ప్రాసాద పంచాక్షరి : ఇది బీజాక్షరముతో గూడుకొనినది. హారవిలాసము-పంచబ్రహ్మషడంగ బీజములతో ప్రాసాద పంచాక్షరీ చంచన్మంత్ర పరంపరాపరమ నిష్ఠా తృరక్ష్యంబుకన్ (7.33) ఈ కృతియందు "ప్రాసాదపంచాక్షరి" సూచితమైనది పార్వతీశు బ్రాసాద పంచాక్షరీకుఁ బొగడి. (3-196)

ఉద్భటారాధ్య చరిత్రయంతయు. నారాధ్య సంప్రదాయ ప్రవర్తకమే-ఆ సంప్రదాయమున కతి ముఖ్యమైన లింగధారణ విధి విధానమును-పూర్తిగా వర్ణించునది-తెలుగున నిది యొక్కటియే-ఈ దీక్షావిధానము, శైవాగమశిఖామణి వీరశైవాచార సంగ్రహము మొదలగు వానియందును, వర్ణితమైనది-కాని కేవలము మత నిబంధన గ్రంథములు-వానికి కావ్యప్రశస్తిలేదు-ఉద్భటారాధ్యచరిత్ర సాహిత్యమున-కావ్యస్థానము గడించినది,

లింగధారణ దీక్షావిధానమేకాక. ఇందు షట్కాలశివపూజ-శివుని అష్టమూర్తిత్వము-పంచాక్షరీమంత్ర పఠనము విభూతిమహిమ-రుద్రాక్షధారణ-ప్రాసాద పంచాక్షరి-శోడశోపచారపూజ- మొదలగు నారాధ్యమత సంప్రదాయములు-ప్రమాణముగా. వివరింపబడినవి. ఇట్టి మత నిబంధనలనే-సంతరించిన, నీ కావ్యమీపాటికి మూలబడియే యుండును-ఇందట్లుగాక-కావ్యమంతయు,

శివభక్తి ప్రబోధకముగా

భాసిల్లినది-అంతా "రామమయం ఈ జగమంతా రామమయం" అన్నట్లుగా-

నీ కావ్యమున- "అంతా శైవమయం ఈ జగమంతా శైవమయం" అని శివభక్తి యుద్దీపించుచున్నది- "ఇందుల కుదాహరణముగా నిందలి ప్రతిపద్య ముదాహరింపదగినదే-అయిన నొక్క యుదాహరణ.

వల్లకీపురవర్ణనలో శైవులవర్ణన-పురవర్ణనలో చాతుర్వర్ణ్యముల వర్ణన-యుండును - రామలింగకవి చాతుర్వర్ణ్యములను వర్ణించి- "శైవులు" అని ప్రత్యేకముగా శైవులను వర్ణించుట-యాతని శివభక్తి తత్పరత వెల్లడించుచున్నది.

## షోడశోపచార పూజ

(1) అవాహనము ఆసనము (2) పాద్యము (3) అర్ఘ్యము (4) ఆచమనీయము (5) స్నానము (6) వస్త్రము (7) ఉపవీతము (8) గంధము (9) అక్షతలు (10) పుష్పము (11) ధూపము (12) దీపము (13) నైవేద్యము (14) తాంబూలము (15) ప్రదక్షిణము (16) స్తుతి.

లింగమును నీ షోడశోపచారములచే ప్రతినిత్యము శైవులు పూజింతురు. ఈ పూజావిధానము 3-208 మొదలు 219 పద్యముల వఱకు- 16 కందపద్యములలో వర్ణితమైనది. 219 పద్యమున-"అని షోడశోపచారముల" అని యీ విధానము పేర్కొనబడినది.

## షట్కాల శివపూజ

శైవులకు షట్కాల శివపూజ-అనగా దినమునకు 6 పర్యాయములు శివపూజ చేయవలెనను నియమమున్నది. (1) అరుణోదయము (2) తపనోదయము (3) సంగమకాలము (4) మధ్యాహ్నము (5) సాయంకాలము (6) అర్ధరాత్రము-శ్రీనాథుడు హరవిలాసమున నీ షట్కాల శివపూజను 6 పద్యములలో వర్ణించినాడు. 7-30-36 పద్యములు.

ఈ కృతిలో షట్కాల శివపూజ వేఱ్వేఱు పద్యములలో లేదు. కాని 1-201-202 పద్యములలో నీ ప్రశంసగలదు.

## పూజాపుష్ప వివరణ

ప్రమథీశ్వరుని శివపూజా సందర్భమున నవి వర్ణితములైనవి.

సీ. తిలయుతాక్షతల దూర్వలఁ, దుమ్మిపువ్వులఁ
బిల్వదళంబుల, బిసరుహములఁ
గలువల బొండుమల్లెల నాగకేసరం
బుల దవనంబునఁ దులసి, మాచి
పత్త్రిఁ జేమంతి బంతి నారగ్వధం
బులఁ గాంచనంబులఁ బొన్నవిరుల
మరువంపునసల గన్నెరులఁ బలాశ ప్ర
సముల జాజులఁ జంపకముల

గీ. సాంద్ర ఘనసారమయ గంధసారచర్చ
ధూపముల దీపముల ఫలాపూప పాయ
సాదులనుఁ దుష్టిగావించు నతఁడు మంత్ర
పూతజలధౌతమూర్తికి భూతపతికి. (1-176)

## శివభక్తి ప్రబోధము

ఈ కావ్యమంతయు శివభక్త్యుద్దీపకము—ఆపద్యములన్నియు నిట నుదాహరింపక, వాని మొదళ్ళను మాత్ర మిచ్చుచున్నాను.

### ప్రథమాశ్వాసము

1-54 సీ. అచలసుతాభర్త కర్పించి మటికాని
మృగములుతేఁబూరి మేయవచట.

1-64 ఉ. వాలుకలెన్నవచ్చు; 65 ఉ. అంగద తోగసిద్ధికి— 66 ఉ. ఆకులఁ గందమూలముల. 67 సీ. మ్రొక్కు—నెవ్వాఁ డష్ట మూర్తికి 68 వాసనలేని పూవు 69 గీ. చూడగదే 70 గీ. శైవులగువారు. 71 సీ. శివపదాంభోరుహ 72 క. శివలింగదర్శనంబు— 73 సీ. ఏ వేల్పు పదములు.

## తృతీయాశ్వాసము

3-28 దండకము 3-279 సీ. కారణంబులును నీ కార్యంబులును నీవ 3-280 మ. వదనాంభోజము 3-281 సీ. నీయందె పొడముచు నీయందె పోదలుచు.....

## శివపారమ్యము

ఈ వాఙ్మయమున శివపారమ్యము ప్రతిష్ఠితమైనది. శివుడష్టమూర్తి (1-67) అయష్టమూర్తిత్వము-భూమి, జలము, వాయువు, అగ్ని, ఆకాశము-సూర్యుడు, చంద్రుడు సోమయాజి-అని (3-132) వివరింప బడినవి. అనుపాదష్టమూర్తులు అష్టమూర్తి కృతియంతట శివపారమ్యము వర్ణితము. (3-141)

సీ. కారణంబులు నీవ కార్యజాలము నీవ
భావజ్ఞుడవు నీవ భావమీవ
జనకుండవును నీవ, జన్యవస్తువు నీవ
ప్రాపకుండవు నీవ ప్రాపమీవ
ఆధారమును నీవ యాధేయమును నీవ
భోక్తవ్యమును నీవ భోక్తమీవ
రక్షకుండవు నీవ రక్షణీయము నీవ
హార్యంబు నీవ సంహర్తవీవ
గీ. పూజకుడవీవ పూజ్యంపుబొడవు నీవ
వాచకుండవీవ తలపోయ వాచ్యమీవ
జ్ఞానమును నీవ చూడంగ జ్ఞానివీవ
నిటలలోచన! సకలంబు నీవ నీవ. 3-279

## శివభక్తుల పరిచయము

రామలింగకవి పాల్కురికి సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత్రములను సంపూర్ణముగా నాకళించుకొన్నవాడు కాబట్టి అందలి భక్తులను-మనకు ఉద్భటారాధ్య చరిత్ర ద్వారమున పరిచయము చేసియున్నాడు-అవి యీనాటివారికి పరిచితముకాని కారణమున వాని వివరముల నిచ్చుచున్నాను.

గంధర్వులు పిశాచరూపధారులై శివుని వేడుకొనుట.

సీ. తలఁపవైతివె కాలరాచిపైనుమిసిన
యెలుకమూలినయట్టి యెలుకువాని (1)
ధృతిఁ జిత్తమునమానితివె జాలిఁగొని ఉవ్వ
సాంఖ్యతొండఁడు సేయు సాహసంబు (2)
చింతింపవైతివె చేవవింటను బెట్టు
కొన్న కుంతీదేవికొడుకు గుట్టు
ఊహింపవైతివె యుగ్రధాటీ చల
చ్చేరమ క్షితిపతి చేతగాని

గీ. అకట! నీబంటు బంటులమైన మమ్ము
నొక్కతప్పును సైరింప కుఱక ఘోర
శాపదావానలంబున నగవు చావు
చంపితివి చాలు నిఁకఁ బ్రోవు చంద్రజూట! (1-116)

రామలింగకవి, ఎంతో సందర్భశుద్ధిగా పూర్వ శివభక్తులను ప్రవేశపెట్టినాడు. శివుడు పార్వతి వనవిహారము సలుపునపుడు గంధర్వులు వారున్న వనమున విడిసిన తప్పునకే శివుడు వారిని పిశాచులు కమ్మని శపించినాడు. కాని ఇంతకన్న హెచ్చుగా శివునిగూర్చి తప్పులు చేసిన వారిని-అతడు కరుణించినాడు. దీనిని నిరూపించుట కట్టి భక్తులను రామలింగకవి యేర్చి-ప్రథమముగా చెప్పినాడు.

## కన్నప్ప

మొదటి పాదమున-తన కాలిచెప్పుతో, లింగముపై నిర్మాల్యము ద్రోచి, తన పుక్కిటనీటితో లింగము నభిషేకించిన-కన్నప్పకథ సూచితము-తన భక్తి చూపుటకే కన్నప్పచేసినను, ఇవి లోకదృష్ట్యా తప్పపనులేకాని శివు డాతనిభక్తికి మెచ్చినాడు. ఈ కథ శైవవాఙ్మయమున చాలా ప్రసిద్ధమైనది-ధూర్జటి శ్రీ కాళహస్తి మహాత్మ్యమున ప్రధానకథ కన్నప్పకథయే-బసవపురాణమున తక్కిన భక్తుల కథలకన్న విరివిగా నిది చెప్పబడినది. (4-ఆ. 280 ద్విపదలు-560 పంక్తులు)

## సాంఖ్యతొండడు

రెండవ పాదమున సాంఖ్యతొండడు–మొదట బౌద్ధుడు తరువాత శైవుడైనాడు. ఈతడు ప్రతినిత్యము పువ్వులతో శివుని పూజించెడువాడు. ఒకనాడు పువ్వులు దొరకలేదు–అందుచేత అక్కడ చిన్న చిన్న రాళ్ళను, శివునిపై వానగా కురిపించి పూజించెను–అందుకు శివుడు మెచ్చి ప్రత్యక్షమయ్యెను.

"సాంఖ్యతొండని రాలజడికి నోర్చినవాని" అని త్రిపురాంతకోదాహరణము.

## అర్జునుడు

మూడవ పాదమున–కుంతీమహాదేవి కొడుకుఁ గుఱ్ఱ పాండవమధ్యముడగు అర్జునుడు–కిరాతార్జునీయ ఘట్టమున–నతడు శివునితో యుద్ధము చేయునప్పుడు, బాణములు క్షీణించిపోగా తన గాండీవముతో నాతని మోదనారంభించెను. శివుడు అర్జునునకు ప్రత్యక్షమయ్యెను. ఈ కిరాతార్జునీయకథ నన్నయ భారతమున నున్నది. వీరశైవసంప్రదాయాను సారముగా దానిని శ్రీనాథ మహాకవి హరవిలాసము సప్తమాశ్వాసమున మనోహరముగా రచించినాడు.

## చేరమరాజు

నాల్గవ పాదమున చేరమరాజు శివభక్తుడు. ఈతడు ద్రవిడదేశమున నొక మాండలికరాజు. ఈతనివద్ద సైన్యము లేదని యెఱిగి, ఈతని భక్తి పరీక్షింపగోరి శివుడు ఒక సైన్యము నాతనిపై పంపెను, చేరమరాజు తన రాజ్యమున నక్కల నన్నింటిని గుఱ్ఱములుగా అసంఖ్యాక సైనికులుఁగా మార్చి–శివుని సైన్యముపైకి పంపెను. శివుని సైన్యమాధాటి కాఁగలేకపోయెను–శివుడు నాతని మెచ్చెను. చేరమరాజు గొప్ప భక్తుడు, ఈతడు రాజు కాబట్టి–రామలింగకవి యీ గ్రంథమునందే–మఱియొకచోట. (౪–౩౫)

ముంజభోజుని ప్రశంసలో—

"నీవుం జేరమభూవరాదుల గతిన్నేత్రత్రయోద్యానిలో
కావాసం......ప్రబసన్ను జేసి"

అని చేరమరాజును ప్రవేశ పెట్టినాడు.

ఈతనికే సేనమరాజని నామాంతరము
"తలఁకి సేనమరాజు జాడికోర్చినవాని"
అని త్రిపురాంతకోదాహరణము-

## శ్వే త డు

ఉ. "తొల్లియు శ్వేతుఁగాచితివి తుచ్ఛుఁడు వీడని చూడ కాత్మలోఁ
భిల్ల దయారసంబుగల ప్రేమదగంగని." (2-277)

ఇది బ్రహ్మఘాతకుడైన మదాలసుడు, కాశీక్షేత్రమున మరణించి నపుడు, యముడాతని కొనిపోవుటకు రాగా, కాశీక్షేత్రమున మరణించిన వారు శివసమానులే యని, శివుడు చెప్పినప్పుడు యముడన్న మాట.

శ్వేతుడను దాముకు డొకడు దేవలోకమున రంభనే కోరెను. రంభ ప్రత్యక్షమై నీవద్దకు రానని చెప్పెను. అంత, శ్వేతుడు శివపూజ చేయుటకు బయలుదేరెను. మార్గమధ్యమున నుచ్ఛిష్టప్రదేశమున నొక పుష్పము పడియుండగా, దానిని తీసికొని శివుని పూజించెను. శివుడు దేవేంద్రపదవి నిచ్చెను. అతడు-రంభను రమ్మనెను. కాని-ఆమె శివ దేవాలయములో నీవు శివుని పూజించుచుండుము. నేను వచ్చెదను. అని చెప్పి తప్పించుకొనెను. శ్వేతుడు శివునిగుడిలో పూజచేయుచుండెను. ఇంతలో ఉచ్ఛిష్టప్రదేశమున-బడిన పుష్ప పూజచేసిన పాతకమునకు యముడు-శ్వేతుని తన పాశముచే బంధించెను. శివుడు ప్రత్యక్షమై, యముని శూలముతో పొడిచి పంపివేసెను. ఈ శ్వేతుని కథ పండితారాధ్య చరిత్రమున పురాతన ప్రకరణమున గలదు.

## ఒ డ య న ం బి

ఈతడు సుందరమూర్తి నాయనారు అను మహాప్రసిద్ధ ద్రవిడ శైవభక్తుడు-ఈతని ప్రశంస యీ కృతిలో మూడుపట్టుల గలదు.

(1) గీ. తొడరి యింతంతయనరాని పొడవుపయ్యెఁ
గుదురుకొంటివి నేరీతి కొమ్మచంట
నిట్టి నీసొంపువర్ణింప నెవ్వడోపు
హరిణలాంఛనజూట పశ్యల్లలాట. 1-3-14

(2) దండకము "రామా కుచాభ్యంతరంబెట్లు నీకున్కిపట్టయ్యెనే
3-28

(3) రగడ "ఒడనంబెన్నడుగాఁ దత్కాంత ప
యోధరమున నోహోయనఁ బలికితి." 3-287

ఒడయనంబికి నంబెన్న, నంబి అని నామాంతరములు-ఆతడు పరమనాచి యను వేశ్యను వలచెను. కాని యామె హెచ్చుధనము కోరెను-నంబివద్ద అంత ధనము లేకపోవుటచే శివుని నామెను కూర్చ ప్రార్థించెను. శివుడు కుంటెనకాడై దినమునకు వేయిమాడ లిచ్చుచుండెను-నంబియు పరమనాచియు సౌఖ్యముల దేలుచుండిరి.

"నంబి వనువఁగుంటెనలకు నడచిన నెడకానిచేత" అని శివు రాంతకోదాహరణము-

ఒకనాడు నంబి, పరమనాచి యింట నుండగా నర్ధరాత్ర మయ్యెను-మట్కాలి శివపూజావిధానము ననుసరించి అర్ధరాత్రమున శివపూజ చేయవలెను-కాని లింగములేదు-ఆకాలమునాటి కింకను లింగము శరీరమున ధరించు నాచారములేదు-ఎచ్చటకైనను వెళ్ళి నప్పుడు లింగమును గొనిపోవలసినదే- నంబి, ఆ దినమున లింగమును దెచ్చుట మఱచినాడు-అర్ధరాత్రమైనది-కావున నాతడు పరమనాచిని బిలిచి, "నీపయోధరమునే లింగముగాభావించిపూజించెదను"-అనెను. ఆమెనవ్వి-"స్తనమేమి? శివలింగమేమి?" అని హేళనచేసెను-అట్లు కాదు. చూడుము-నీ స్తనమునందే శివుని పలికించెదను-అని చన్నునకు మిన్నగా పూజచేసిన వెంటనే, శివుడందుండి 'ఓ' యని పలికెను-ఇది శైవవాఙ్మయమున బహు ప్రసిద్ధమైన కథ. దీనిని పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్ర-మహిమలా ప్రకరణమున విపులముగా దెలిపినాడు.

శ్రీనాథమహాకవి నైషధమున (8-102) నీ ఘట్టము మనోహరముగా వర్ణించినాడు.

చ. కుతుకమునన్ గురంగమదకుంకుమ చర్చవహించినీలలో
హితరుచులై, స్వయంభుమెయి యీ హితసౌఖ్యవిధాయులైన య
య్యతివ పయోధరంబులకు నర్ధనిశాసమయంబునందు నం
చితనఖకింశుకార్చణముచేసె మహీపతిభక్తి యేర్పడన్.

తెలుగుదేశమున-ఆచంట రామేశ్వరక్షేత్రమహాత్మ్య కథ ఇదే-ఏ స్థలమున చంటియందు శివుడు పలికెనో, ఆ చంటగల గ్రామమే-

ఆచంట అయినది. ఈ క్షేత్రమాహాత్మ్యము పేరు, ఐదయునంబి విలాసము అజ్జరపు పేరయలింగకవి రచించినది-చాలకాలము క్రిందట ముద్రిత మైనది. ఒక్క వేటూరి వారు మాత్రమే దీనినిగూర్చి తెలిపిరి.[1]

రామలింగకవికి సంబెన్న కథ ప్రచారము తెలియును గావున మూడుమార్లు పేర్కొన్నాడు.

రామలింగ డీ గ్రంథమున మల్లికార్జునుడు లింగధారణ స్వీకరించు విధానము తెల్పు సందర్భమున శివభక్తుల నామములు సందర్భాను సారముగా నొక్క పద్యములో వర్ణించినాడు. ఆపద్యమిది.

సీ. సింధుబల్లహుడురీతి, శ్రీపతి పండితు
మరియాద, ధూపద మాచి దేవు
నట్లు, మహాకాళు ననువున నల్ల
క్కడ బ్రహ్మదేవ కక్కయ విధమున
కూలవ బ్రహ్మయ్య చొప్పున బిబ్బ బా
చనశీల వీరనారాణంతు పోల్కి
కడిరె రెమ్మయగారి కైవడి తెలుగేసు
మసణయ్య చందాన మాచిరాజు
గీ. కరణి మోళిగమారయ్య గతి దెలుంగు
జొమ్మనార్యు నివడుపున సురియ చౌడు
పగిది బసవేశ్వరునిమాడ్కి భక్తియుక్తి
శంభుఁ బూజించి బ్రతుకు రాజన్యచంద్ర. (3-186)

ఈ పద్యమున శివభక్తుల పేళ్ళు మాత్రమే ఒక పట్టికగానున్నను ఇందు విశేషములున్నవి.

పై పద్యమున పేర్కొనబడినవారు.

(1) సింధుబల్లహుడు (2) శ్రీపతి పండితుడు (3) ధూపద మాచయ్య (4) మహాకాళయ్య (5) కల్కడ బ్రహ్మయ్య (6) కక్కయ

---

1 కీర్తిశేషుడు అ రంగసామి సరస్వతి. ఆంధ్రులు-ద్రవిడ వాఙ్మయము అన్న భారతి (1925) వ్యాసమున దీనిని తెలిపియున్నాడు. చూ. శృంగారనైషధము సుపరిష్కృత ముద్రణము భారతి అక్టోబరు 1963.

(7) కూలద బ్రహ్మయ (8) బిబ్బ బాచయ (9) వీర నాచయ్య (10) కదిరె రెమ్మయ్య (11) తెలుగేసు మసణయ్య (12) మాచిరాజు (13) మోళిగ మారయ్య (14) తెలుగు జొమ్మయ్య (15) సురియ చౌడయ్య (16) శ్రీ బసవేశ్వరుడు.

రామలింగకవి యుంతకుముందు షోడశోపచారపూజను ముంజభోజుడు చేసినట్లు చెప్పియున్నాడు. గాన నిక్కడ షోడశభక్తులను (16) మాత్రమే తెలిపినాడు.

పై శివభక్తులకథ లీనాటివారికి పరిచితములు కావు-సంగ్రహముగా వాని వివరము-

(1) సింధుబల్లహుడు. ఇతడే భల్లాణరాజు కథ- అను తెలుగు దేశమున విశేష ప్రచారములోనున్న కథకు నాయకుడు. పాల్కురికి సోముని కృతులలో నీతనికథ లేదు-భల్లాణుని శివభక్తిపరీక్షించుటకు-శివుడు జంగముడై, ఒక వేశ్యను కోరగా, వేశ్య లేకపోవుటచే. తన భార్యయైన చల్లమాంబను పంపెను-చల్లమ్మ శివునిపై బడబోగా, అతడామె చేతిలో నెల్లాళ్ళ శిశువయ్యెను.

"భల్లాణరాయని పణతి రత్నముకు
నెల్లాళ్ళ శిశువైన నిత్యరక్షింపు"

సోమనాథస్తవము "బల్లహాదులరీతి ప్రాభవముఁదాల్చె" అని రెండవమారు నీతని ప్రస్తావన కలదు. (కి-224)

(2) శ్రీపతి పండితుడు-ఆంధ్రదేశమున నారాధ్య శైవమత ప్రవర్తకులైన పండితత్రయములో తొలివాడు-విజయవాడ వాస్తవ్యుడు. ఈతడొక శివభక్తుడైన గొడారివాని యింటికి బోవగా, విజయవాడలో బ్రాహ్మణులు వెలివేసిరి-ఆతడు శివమాహాత్మ్యము చూపింపదలచి, బ్రాహ్మణుల యిండ్లయందలి అగ్నిహోత్రముల తన ఉత్తరీయముకొ, సంగ్రహించి, ఇంద్రకీల పర్వతముపై నొక జమ్మిచెట్టు వద్ద నిక్షేపించెను-బ్రాహ్మణు లీతని మహత్తు నెఱిగి ప్రార్థింపగా దానిని విశిచి పెట్టెను-"చిచ్చొడింగట్టిన యట్లు" అన్న జాతీయమీతని వద్దనుంకి యేర్పడినదే-ఈయన నిప్పులు మూటగట్టి నిక్షేపించిన సంగతి నేటికిని విజయవాడ ఇంద్రకీల శిలాశాసనము సాక్ష్యమిచ్చుచున్నది.

(3) ధూపదమాచిదేవుడు— ధూపమర్పించుటలో ప్రసిద్ధుడైన భక్తుడు బసవని కాలమువాడు.

(4) మహాకాళయ్య— ఇతనికే జంబూర్మహాకాళయ్య అని పేరు. ఈతడు బసవనకు పూర్వుడు ఇతడు తన తలతఱిగి శివునకర్పించి, తిరిగి పడసెను.

(5) కలకద బ్రహ్మయ్య— బసవని కాలమున భక్తుడు-కరహాళ బ్రహ్మయ్య అని నామాంతరము.

(6) కక్కయ— ఇతడు గొప్ప శివభక్తుడు. ఇంద్రజాలము చేసెడివాడు.

(7) శూలద బ్రహ్మయ— ఇతడు శూలము నెపుడు ధరించెడి భక్తుడు.

(8) బిబ్బబాచన— ఇతడు భక్తుల చెప్పుటట్టలను-చెవులను దాల్చి, భక్తులయిండ్ల మిగిలిన పదార్థము తీసుకొని దానిని బండిమీద వేసుకొని జనులకు పంచిపెట్టెడివాడు-అది చూచి అచ్చట విప్రులు ఆ బండినాపుటకు ప్రయత్నించిరి గాని ఆపలేకపోయిరి.

(9) వీరనాచయ - ఇది వీరనాగాంకు' అని యుండవలెను. శివభక్తుడు.

(10) కదిరె రెమ్మయ్య— ఈతడు, ఏడుదినముల క్రింద చచ్చిన మనిషిని బ్రదికించెను.

(11) తెలుగేసు మసణయ్య—ఈతడు మసనము-(శ్మశానమున) నివసించుభక్తుడు.

(12) మాదిరాజు— ఇతడు సకలేశు మాదిరాజయ్య అని ప్రసిద్ధికెక్కినవాడు. ఏడువందలయేండ్లు జీవించెను.

(13) మోళిగ మారయ్య— ఈతడు కట్టెలమ్ముకొను భక్తుడు. బసవ డీతని భక్తికి మెచ్చి ఆతడింటలేనప్పుడు కొన్ని బంగరుమాడలు దిండుక్రింద పెట్టి వెళ్ళిపోయెను. మారయ్య ఇంటికివచ్చి చూచి ఆ మాడలన్నింటి నితర భక్తులకు పంచిపెట్టెను-

(14) తెలుగు జొమ్మయ్య—ఇతడు వేటకాడు. ఈత డొకనాడు వేటకువెళ్ళగా, మృగములు తమంతతాము వచ్చి, జొమ్మయ్యను చంపుమన జొమ్మయ్య దానిని చంపగా, వారు గంధర్వులైరి.

(15) సురియ చౌడయ— ఈ భక్తుడు చేతితో కట్లుచేసి యీయగా శివుడారగించెను.

(16) బసవేశ్వరుడు-దక్షిణదేశమున వీరశైవమును ప్రచారము చేసి ప్రతిష్టించిన మతసంస్కర్త, జంగమ సంప్రదాయమనుపేర వీర శైవము మూలమున, సాంఘిక చైతన్యము గలిగించిన మహావ్యక్తి. ఈతడు నందీశ్వరుని యవతారము, ఈతడు ప్రతిపాదించిన వీరశైవము, ప్రజలను భక్తివీరులుగా రూపొందించినది. ఈతడు కన్నడ దేశీయుడు నేడచ్చటనున్న లింగాయతులంతయు బసవని నారాధింతురు. తెలుగు దేశమున జంగములీ బసవ సంప్రదాయమువారు,

పాల్కురికి సోమనాథు డీ లోకోత్తర పురుషుని చరిత్రను మొదట తెలుగుభాషలో వ్రాయగా, భీమకవి దీనిని కన్నడమున కనువదించినాడు-శంకరారాధ్యుడను కవి దీనిని సంస్కృత పరివర్తనము చేసినాడు-తమిళభాషలో నాగిసెట్టియను నతడు దీనిని వెలయించి నాడు-అన్నింటికి పాల్కురికి సోమనాథుని తెలుగు బసవపురాణమే మూలకారణము కాబట్టి - దక్షిణదేశమున, బసవ వాఙ్మయమునకు తెలుగు బసవపురాణమే ప్రాతిపదిక.

## ఉద్భటారాధ్యుడు-ముదిగొండవారు

నేడాంధ్రదేశమున నారాధ్యులలో ప్రఖ్యాతులైన ముదిగొండ[1] వంశీయులందఱకు ఉద్భటారాధ్యుడే కూటస్థపురుషుడు. తెనాలి రామ లింగకవి యీ గ్రంథమున నీశ్వరుడే, ఉద్భటారాధ్యుని నీలోకమున నవతరించుమనప్పుడు చెప్పెనని యిట్లు వర్ణించినాడు-

"ఉ. గోపతి నెక్కి మంచుమలకూఁతురితో విటయున్కిమాని నే
నేపురిఁ గాపురంబు వసియింపుదు నా "ముదిగొండ పట్టణం"
బో పురుషాగ్రగణ్య ! భవదుత్తమవంశజులుం దపోధన
శ్రీప్రవలునైన ధీరులకుఁ బ్రేమపదంబగు ధామమయ్యెడిన్.

---

1 ముదిగొండ చారిత్రక స్థలము-ఇచ్చట పాలించిన రాజులు చాళుక్యులు. వీరికే ముదిగొండ చాళుక్యులు అనిపేరు.

సీ. నిఖిల శైవాచార్య నేతృత్వగరిమ చేఁ
బరగుచు గురుసార్వభౌము లనఁగ
దుర్మతధ్వంసబంధురులౌచుఁ బ్రతివాది
జనభయంకర యశస్సాంద్రు లనఁగ,
షట్కాలశంభుపూజా పరాయణవృద్ధి
జరుపుచు గురు రాయశంభులనఁగఁ
గొలుచువారికి నిష్టఫలదులై నిజశిష్య
బహుళ దారిద్ర్య విభాళులనఁగ

గీ. నన్ను నర్వంబునందుఁ గానంగఁజాలు
ఘనతచేపట్టి వేదమార్గప్రతిష్ఠఁ
బదిలుబఱ నుండుదురు భవద్భావివంశ
జాతులాచార్య ముఖ్యులు చారుచరిత ! (1-201-202)

ఈ ఉద్భటారాధ్య వంశ్యులు-

సీ ప్రతివాది వేదండ పంచాననంబులు
నిజధర్మపాలన నిపుణమతులు
కలలోననైన నవ్వులకైన భవియగు
మూధుపీఠింపని గాఢయశులు
షట్కాలమున నన్ను శాస్త్రోక్తమార్గంబు
చే సమారాధించు శిష్టమూర్తు
లిది సుఖంబిది దుఃఖమిది న్యాయదిది వాని
దని విభేదంబు నేయని మహాత్ము

గీ, లొరుల ధనదాతలకు నింతయును మనమున
నట్టుతలచని నిత్యపుణ్యాభిరాము
లర్థి ముదిగొండ పురవరాధ్యతులగుచు
వెలయగలరింక మీవారు విమలచరిత. (1-203)

సీ. పా. ఉండెనే యారాధ్యమండలేశ్వరుఁడు భూ
మండనంబగు ముదిగొండయందు (8-128)

పై పద్యములనుబట్టి-పండితత్రయ సంప్రదాయమునకు ముందుగానే-ఉద్భటారాధ్యుడారాధ్య సంప్రదాయమును తెలుగు దేశమున ప్రవర్తిల్లజేసెనని తెలియుచున్నది.

రామలింగకవి ముదిగొండవారి ప్రాభవము వర్ణించుటకే యీ కృతి రచించినాడు. కృతిపతి యూరదేచమంత్రి గురువు చంద్రశేఖరుడు-ఉద్భటారాధ్య వంశీయుడని యీవలనే తెలిపితిని. ఈ కావ్యము చివర, ఆ చంద్రశేఖర గురువువంశ ముద్భటునుండి ప్రారంభమైనది, ఆ వంశవృత్తములు—— ౩-౮౨౨ నుండి ౩-౩౩౮ వఱకుగల గద్యపద్యములలో తెలుపబడినవి. ఆ వంశవృక్షము నిట పొందుపఱచుచున్నాను.

## ఉద్భటారాధ్యుడు - సౌభాగ్య సుందరి

(అనేక తరములు గడచిన వెనుక)

మల్లికార్జునుడు - విశాలాక్షి

| | |
|---|---|
| ప్రోలయ్య-శాంకరి | మన్మయ్య-గంగాంబ |
| స్వయంభువు-భద్రాంబిక | మల్లికార్జునుడు-నాగమ |
| శంకరదేశికుడు-భవాని | చంద్రశేఖరుడు-ఊరదేచమంత్రి గురువు |
| సోమనాథయ్య-గౌరమ | మన్మయ్య, ఆరాధ్యయ్య |
| లింగనారాధ్యుడు-మల్లమ | |

చంద్రశేఖర గురుడు క్రీ. శ. 1520 ప్రాంతమువాడు-మూలపురుషుడగు ఉద్భటారాధ్యుడు క్రీ. శ. 780 ప్రాంతమువాడు-రామలింగకవి-చంద్రశేఖరునికి ముందు 8 తరములను వర్ణించియున్నాడు-తరమునకు 30 సంవత్సరములు లెక్కించినను ఉద్భటుని తరువాత ప్రథముడగు మల్లికార్జునుడు 30 × 8 = 240 సంవత్సరములు.

క్రీ. శ. 1520 లో పోగా నాతడు క్రీ. శ. 1280 ప్రాంతము వాడగును-అప్పటికింకను ఉద్భటుని కాలమున కైను శతాబ్దము లెడముండుటచే-ఇందువలన-చంద్రశేఖరుని పూర్వునికి, ఉద్భటునికి-15 తరములైన గడచియుండవచ్చును.

ముదిగొండవారు నేమను, తెలుగుదేశమున తామరతంపరగా వర్ధిల్లుచుండుటచేత-తెలుగుదేశమున నారాధ్యులతో. ప్రాచీనకాలము నుండి వారు ప్రాథమికులతో [illegible] ని చెప్పుట [illegible] పాము లేదు,

నేడీ ఉద్భటారాధ్య చరిత్రమును ఉద్భటారాధ్యవంశీయులైన-శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు ప్రకటించుటయు, నొక చిత్ర సంఘటనమే-అది శివానుగ్రహము,

అప్పటికింకను-౬ శతాబ్దు లెడముండుటచేత పదియేను-తరము లైన గడచియుండునని మనము గ్రహించియుండవచ్చు.

## ఉద్భటారాధ్య చరిత్ర - సాహిత్య విమర్శ II

### పూర్వకవి అనుసరణలు

కృతిపతి యూరదేచమంత్రి తన్ను బిలిపించిన సందర్భమున రామలింగకవి యిట్లు తెలిపినాడు.

సీ. కౌండిన్యముని రాజమండలేశ్వర వంశ
పాథోధి నవసుధాభానుమూర్తి
బాలచంద్రశేఖర పదపయోజధ్యా
ధ్యానధారణ సముదాత్తవిత్తు
మానితాయాతయామా (నామ) భావిత
విపుల మహాయజుర్వేద వేది
రామేశ్వరస్వామి రమణీయ కరుణా వి
శేషపోషిత నిలసితసమగ్ర
గీ. సహజ సాహిత్యమాధురీ సంయుతాత్ము
లక్కమాంబకు ఘనయశోలక్ష్మి వెలయు
రామధీమణికిని బుత్రు రామలింగ
నాము విఖ్యాతుఁ గావ్యనిర్ణయధురీణు, (1-24)

చ. విలసదయాతయామ బహు వేదవివేక పవిత్రభావ సం
కలితములైన వాక్యములఁ గావ్యముఁ జెప్పఁగనేర్తు వాదికా
వ్యుల కవితానిగుంభన సమున్నతిఁ గాంచినవాఁడవౌదు వీ
వలఘు వచోవిలాస సుగుణాకర రామయలింగ సత్కవీ!
(1-26)

పై పద్యములలో చెప్పకపోయినను, ఆశ్వాసాంత గద్యలో తనకు 'కుమారభారతి' బిరుదమున్నట్లుగా తెలిపినాడు. "ఇది శ్రీమదేలేశ్వర గురువరేణ్య చరణారవింద షట్చరణసత్కళాభరణ రామనార్య పుత్ర సుకవిజనమిత్ర కుమారభారతి బిరుదాభిరామ రామలింగయ ప్రణీతంబైన శ్రీమదుద్భటారాధ్య చరిత్రంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము."

ఉద్భటారాధ్య చరిత్ర రచనాకాలమునాటికి రామలింగకవి, తనకుగల సాహిత్యవిద్యావిశేషములతో తక్కిన పెక్కుమంది కవుల వలెగాక, తనకు వేదవిద్యయందు పాండిత్యముగలదని వ్యక్తపఱచినాడు. వేదవిద్యాపాండిత్యమొక విశిష్టగుణము-ఆయన కావ్యరచనకు, వేదవిద్యకు సంబంధమేమియని విమర్శకులు ప్రశ్నింపవచ్చును. రామలింగకవికి శ్రీనాథమహాకవి యాదర్శము-అతడు "అధ్వర్యువేదశాఖాధీత విద్యాతు" అని చెప్పికొన్నాడు. ఇచట "అధ్వర్యువేదశాఖ" అనగా యజుర్వేదమని గ్రహింపవలెను. అట్లే రామలింగకవియు చెప్పినాడు 'యజుర్వేదవేది' అనుటలో విశేషమేమో ముందు తెలిపియే యున్నాను-ఈ విషయ ముద్భటారాధ్యచరిత్ర రచనా సందర్భమున దెలుపుట యత్యంతావశ్యకము-ఈ కావ్యమున-లింగధారణ దీక్షావిధానము వర్ణితమైనది-ఆ దీక్షావిధానమంతయు, యజుర్వేదమంత్రముల ననుసరించినది-యజుర్వేదము నధ్యయనము చేసిన కవితప్ప, తక్కినవారి కది వివరించు నధికారములేదు-కాబట్టియే గురుముఖమున యజుర్వేదము నభ్యసించిన-రామలింగకవి ప్రత్యేకముగా దీనిని పేర్కొన్నాడు. ఇందుదాహరింపబడిన వేదవాక్యములను వేఱొకచో చూపుచున్నాను.

వేదము, వేదవాక్యములు పవిత్రభావ సంపన్నములు-తాను రచింపబోవు కృతి వేదసమ్మిళితమైనది. అందువలన తనకావ్య మొక

సాహిత్య ప్రక్రియయేదైనను అది పవిత్రభావ సంకలితమైనది-అని రామలింగకవి యభిప్రాయము.

ఇక సాహిత్యవిషయము చూచిన-అప్పటికే రామలింగకవి-రామేశ్వరస్వామి కరుణచే సహజ సాహిత్యవిద్య బడసినాడు. ఆ విద్య యందలి "మాధుర్యము" అనగా సారము గ్రహించినాడు-పోతన "సహజ పాండిత్య" బిరుదాభిరాముడు-కాని 'సహజ సాహిత్య' బిరుదము ధరించిన కవులలో రామలింగము తొలివాఁ డనిపించుచున్నది. ఇది ఇంకను పరిశీలన చేయదగినది :

ఇంతేకాక అతడు-

(1) కావ్యనిర్ణయ ధురీణుడు
(2) ఆదికావ్యుల కవితా నిగుంభన గ్రహణశీలి
(3) అలఘువచోవిలాసుడు-అని తెల్పినాడు

నిర్ణయమనగా సిద్ధాంతము; పూర్వపక్ష ప్రతిపక్షములను విచారించి తీర్పుచెప్పుట-అని యర్థములు గాన రామలింగకవి, కావ్య సిద్ధాంతములను, విమర్శపూర్వకముగా విచారణచేసి, కావ్యరచనమునకు తగిన యధికారము గడించినవాడని మనము గ్రహింపవలెను.

## ఆదికావ్యుల కవితా నిగుంభన

తెలుగున కావ్యరచనచేయు కవికి, పూర్వకవి కావ్యములతో పరిచయముండుట యత్యావసరము-కవి, తాను స్వయముగా ప్రతిభావంతుడే కావచ్చును-కాని-ఆ ప్రతిభ పూర్వకవి కృతులయందు ప్రవేశముగలిగి, వానిని జీర్ణించుకొనిన, అది వికసించుటయేగాక-పూర్వకావ్యములతో సమాన ప్రతిపత్తి గడించును. తొలుత పూర్వకవుల ననుసరించుచు, తాను ప్రత్యేక విశిష్టత ప్రదర్శించుటయే మహాకవి లక్షణము. తిక్కన, ఎఱ్ఱన, పోతనకవులిట్టి ప్రతిభను ప్రదర్శించినవారే-శ్రీనాథమహాకవి, ఢంకామోయించినట్లు, తాను, వేములవాడ భీమన, కవిత్రయము వారి పోకడలను గ్రహించినట్లు ప్రకటించినాడు-వారి యనుసరణము లాతని కవితలో మనకు నడుగడుగునకు ప్రత్యక్షమగుచునే యుండును. అయినను నేవిమర్శకులైన-శ్రీనాథుని కృతులు చదువగానే ఇది శ్రీనాథకవి రచనయని నిర్ణయింతుమేగాని

ఇవి పూర్వకవి యనుసరణములని చెప్పగలమా? అట్లు చెప్పుట యసాధ్యము.

అల్లసాని పెద్దనకట్టి ప్రత్యేక రచనాపాటవము లేకపోవుటవలననే ఆతడు పూర్వకవుల ననుసరించెనే కాని స్వతంత్రత చూపలేదని విమర్శ నకు గురియైనాడు.

తనకు పూర్వులైన, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథుడు, పోతన మొదలగు కవులవలె, రామలింగకవియు, ఆ పూర్వకవుల రచనలన్నిం టిని సొంత కూలంకషముగా వ్యాసంగము చేసి, వానిపోకడల నెట్లు గ్రహించెనో ముందు చూతము.- రామలింగకవి శైవుడగుటవలన శ్రీనా థునివలె, కవిత్రయ కృతులనేగాక, శైవకవిత్రయ కృతులను చక్కగా పరిశీలించి-ఆ రెండు సంప్రదాయములను సమ్మేళనము చేసినాడు. అదియు వీనియందు వ్యక్తమగును. ఇదియును రామలింగ కవి ప్రత్యేకతలో నొకటి.

## శ్రీనాథమహాకవి యనుసరణములు

రామలింగకవి తన ప్రథమ ప్రబంధమగు ఉద్భటారాధ్య చరిత్రను, శ్రీనాథుని నైషధము వరవడిగా పెట్టుకొని రచించినాడు. కవితా విషయముననే కాక, సాహిత్యమున ఆరాధ్యమతసంప్రదాయిక విషయమున, శ్రీనాథుడు రామలింగకవికి మార్గోపదేశకుడైన ఆరా ధ్యుడు ఆ యనుసరణములను చూపుచున్నాను.

శ్రీనాథుడు.

1 సీ. ధనదానమహిమ సంతాన చింతారత్న
జీమూత సురభుల సిగ్గుపఱుపఁ — నై. 1-9.

గీ. బరగు శ్రీవేమమండలేశ్వరుని మంత్రి
యహిత దుర్మంత్రివదన ముద్రావతార
శాసనుఁడు 'రాయ వేశ్యాభుజంగ' బిరుద
మంత్రి పెద్దన సింగనామాత్యవరుఁడు. — నైష. 1-9

సీ. తనధాన్య విభవంబు ధనదానవద్యుఁవి
ప్రాణసత్ప్రక్రియఁ జౌకఱుపఁ — ఉ.చ. 1-21

2 సీ. వీరభద్రోదార ఘోరవీరావేశ
విహతిఁగందనినాఁటి తుహినకరుఁడు. నై. 1-35
సీ. వితతభైరవ కరాహతిఁ దలంకని నాఁటి
పద్మగర్భుని ప్రతిభాభరంబు ఉచ 1-38
3 సీ. అనవద్యహద్య విద్యాబుద్ధి సంసిద్ధి
బిసరుహాసను నుద్దిపెద్ది విభుఁడు
భద్ర గీర్ణిద్రనాఙ్ముద్రాసముద్వృత్తిఁ
గద్రూభవుఁడు వీరభద్రమంత్రి నై, 1-26
భామవీరతిరాజు నాయురాజు
గీ. మామిడీశ్వరసాగరామర కుజంబు
లక్కమాంబికాశుక్తి రత్నాంకురములు
వంశపావనులర్థార్థి వాంఛితార్థ
దానధుర్యులు సౌభ్రాత్ర ధర్మపరులు నైష.1-28
సీ. సర్వసర్వంసహా దుర్వారతర భార
నిర్వాహక భుజుండు పర్వతయ్య
నీలకంధర హిమనాళీక రిపుహార
కైలాసనిభకీర్తి యైలమంత్రి ఉ, చ. 1-40
4 సీ. పా. నిఖిల విద్యానటీ నృత్యరంగస్థలా
యత కాయమాన జిహ్వాంచలుండు నైష. 1-40
"మ. తన జిహ్వాంచలరంగ మధ్యమున విద్యానర్తకీ
రత్నమింపున నర్తింప" ఉ చ. (1-167)
5 "మ. ప్రణతానేక నృపాల మౌళివల భీపర్యంక రత్నావళీ
ఘృణికిర్మీరిత పాదపీఠ జయలక్ష్మీకేళి శాలీకృదర్పణ"
నైష. 7-199
"మ. ప్రణమద్భూపకిరీటకోటి ఘటితప్రాభిష్ణురత్నచ్ఛటా
ఘృణికిర్మీరిత పాదపద్ముఁడు ఉ చ. (3-315)
6 "దయ్యమునెత్తికోట తుదిదాఁయలు నైష. 5-31
దయ్యమునెత్తికోట గనదక్కట ! ఉ. చ. 1 (3-22)
7 సీ.పా గగన కల్లోలినీ కల్లోలమాలికా (2-47) ఉ చ.
హాస్లీసకములతో నవఘళించి. నైష. (1-33)

సీ. పా. వెలయునే నగరంబు విబుధకల్లోలినీ
కల్లోలహల్లీసకముల కలిమి (2-28) ఉ చ

8 సీ. పా. కానకకన్న సంతానంబు శిశువులు
జీవనస్థితి కేన కావలంబ. (2-26) ఉ. చ

సీ. పా. కానకకన్న సంతానంబు గావున
నాఁగాదనగనోడు నంబతనయుఁ (2-127) ఉ చ

నైషధమేకాక కాశీఖండమును రామలింగకవి యనుసరించినాడు-ఇందు ద్వితీయాశ్వాసమున ముంజభోజుడు కాశీవిశ్వనాథుని సేవించు ఘట్టమున-కాశీవర్ణనగలదు-అది చాలగా కాశీఖండము ననుసరించినదే,

9 "కింకుర్వాణపురందరాదిక మహాగీర్వాణకోటీ కిరీ
టాంకస్థాపిత నూత్నరత్న రుచిధారాశ్లేషకిర్మీర ప
త్పంకేజుఁడు హరుండు జంతువులకుం బ్రాణాంత కాలంబునం
దోంకారాక్షర మంత్రరాజము చెవిం యోజించుఁగాశీస్థలిన్.
కాశీఖండము

స్రగ్ధర. (దివిజాధీశకమౌళి) స్థితమణికవికోదీర్ణ సంపూర్ణకీర్ణాం
శువిశేష శ్రీవిలాస స్ఫురితపదసరోజుండు ఖండేందు జూటుం
డవధానంబొప్ప గంగాంబ్వపహృత కలుషప్రాణికిం గాశిలోనన్
జెవినోంకారా (క్షరంబున్ గురుకరణిద) గంజేర్చుఁ
బ్రాణాంతవేళన్
ఉ.చ. (2-99)

ఉద్భటారాధ్య చరిత్రమున-కాశికి పర్యాయపదములుగా-నుపయుక్తములైన-అవిముక్తము (2-71) ఆనందకాననము (2-76) మహాశ్మశానభూమి (2-96) అనునవి కాశీఖండమునుండి గ్రహించినవే- "మహాత్మా-యవిముక్తంబు మోక్షస్థానంబనియు, మణికర్ణికాతీర్థంబు తీర్థరాజంబనియును, ఆ పుణ్యక్షేత్రం బవిముక్తం బానందకాననంబు మహాశ్మశానంబు రుద్రావాసంబు వారణాసి, కాశియను-నామధేయంబులు ధరియించునని యుం జెప్పుదురు." (కాశీఖండము. 5-4)

పాండురంగమాహాత్మ్య ప్రారంభముననే కాశీపట్టణ వర్ణనగలదు. కాని యందు 'కాశి, వారణాసి' అను పదములు తక్క తక్కినవి ప్రయుక్తము కాలేదు.

కొన్ని పదబంధములు కాశీఖండమునుండి గ్రహింపబడినవి. ప్రాణము ప్రాణమువైన నిన్ను-(3-271) ఉద్భ.

ప్రాణము ప్రాణము తల్లియున్నదే- కాశీ. 4-115

భీ మ ఖ ం డ ము

10 శా॥ ఆ మందాకిని యా త్రివేణివలనం బా బా హ్యైకత్యాస్థలం
బామధ్యాంతగళత్కలావిమల దివ్యజ్యోతి రుజ్జృంభణ
శ్రీమద్విశ్వపతీశలింగము మదిం జింతింతుఁ గాశీమహా
గ్రామంబెప్పుడు నా కనుంగవను సాక్షాత్కారముంగై కొనున్.
(భీమ. 2-9)

శా. ఆ గంగాజలసేకమావటుక నాథావాససంవీతఁణం
దాగంధేభముఖప్రసాద విభవంబాయన్న పూర్ణార్చనం
బా గంగాధర పాదపంకజ యుగధ్యానానురాగంబునా
హా! గీర్వాణులకైన ముచ్చటలు సేయంజాలవే భూవరా.
2-74

సీ. పా. తేజోవిశేషంబుతెలిచి రాజనలేల భీమ. 1-69
తేటవెన్నెలమించు తెలచి రాజనిపించు శి.మా. (1-97)

11 రామ. శా॥ ఆ వింధ్యాచలపార్శ్వపట్టణము లత్యంతంబు.
హరవిలాసము (2-283) ఉ. చ.
ఆలుమగలును నొకకుత్తుకై నగాక (2-21)
కొండరాచూలితో నొక కుత్తుకైన (2-61) ఉ చ.

12 శ్రీనా. శా. ఆ వింధ్యాచలదుర్గమేలు శబరాధ్యక్షుండు.
శివరాత్రి మాహాత్మ్యము (1-12)

## ఇతర కవ్యనుసరణములు-శివకవులు

## పండితారాధ్యుల శివతత్త్వసారము

13 క. ఆయతిఁ త్రిపురాంతక దే
వాయని, సతిచంటకేలు నంతన వేగ
న్నా యెడను నొడయ నఖికి
'నో' యని యెలుఁగివె తొల్లి యురగాభరణా! పీఠిక, 1922

రగడ. "ఒడనంబెన్నకుఁగాఁ దత్కాంత వయోధమున
నోహో యని పలికితి- (3-287) 27 వ పాదము

నన్నెచోడకవి కుమారసంభవము

14 సీ. పలఁకెడు కారాకులలితాస్థిచయముగా
పోలుకొమ్మలు పలు కేలుగాఁగ
బాలపల్లవములు వ్రేలు కెంజడలుగా
బెనఁగుతీగలు దొడ్డఫణులుగాఁగఁ
గంకంతనికరంబు గళమున కప్పుగాఁ
బుప్పొడిమేని విభూతిగాఁగ
ఫలములు వరదాన ఫలములుగా నవి
మాలికల్ రుద్రాక్షమాలికలుఁగ
ఆ శంభుమూర్తిఁదాల్చి సహకార భూరుహ
చక్రవర్తి నవవసంత వేళ
నతిశయిల్లుచుండె నక్కడఁగని మది
నుదరిపడి మనోజుఁడోసరింప. (4-101)

సీ. చిగురు జొంపంబుల నిగిడిన కెంజాయ
రుచిర జటాచ్ఛటారోచిగాఁగఁ
గలయంగఁగప్పిన కమ్మ పుప్పొడిదుమ్ము
పొలుపొందు భసితంపుఁ బూఁతగాఁగ
పోలుచుఁ బూఁదేనెఁగ్రోలు రోలంబ బా
లికలు రుద్రాక్షమాలికలుగ ఁగ
తలచు కొమ్మలవెంటఁదగిలి ప్రాఁకిన నవ్య
లతలహిభూషణ తతులుగాఁగ

గీ. ఇసుకవల్లిన రాలక పసరుడాలు
నాకు దళసరిహస్తి చర్మాంబరముగ
నలరి సాక్షాత్కరించిన హరునిఁబోలి
పాదుకొనియుండు నక్కొండ పాదపములు. (1-80)

నన్నచోడ డుపయోగించిన క్రియలను రామలింగకవి యుపయోగించుటచే, నా గ్రంథము నాతఁడు చక్కగా చదివినాడని గ్రహింపవచ్చును. సోదుముట్టు - సొలయునెత్తావులు సోదుముట్ట - (కు. స. ఉద్భట-సొలయునెత్తావులు సోదుముట్టెడు. 1-90, 2-148. అరలు-అచ్చరువుపదములు

## పాల్కురికి సోమనాథుడు-వేశ్యవాత వర్ణన

### 15 పండితారాధ్య చరిత్ర

ద్వి. నెట్టనవేలకు నింగికి సూత్ర
పట్టు, మోఁకాళ్ళను బండతలయు
నిలమంచుకుంచానఁ గొలువ, రేబవలు
సేయ నాకసమునఁ జిత్రరూపములు

సీ. పగలు రాతిరిసేయఁ బరగంగ రాతిరి
పగలుసేయఁగ గాడ్పుఁదగిలిపట్ట

... ... ... ...

మున్నీరు దెగనీద మన్నుమిన్నునుఁగూర్పు
(మంచునుగొలువ ధూమంబు) దివియుఁ

ద్వి. గ్రచ్చఅనీనంఁగాచి నక్కలకు
నిచ్చినవొట్లయ్యో సీడితకీర్తి ఏ స. 7-612-14 పంక్తులు
ఈనునంతకున్‌గాచి వృకాలికిచ్చిన ప్రకారముదోచె
(8-2,0) ఉ. చ.

### 16 యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకము

మ. జలజాత ప్రభవాండబుద్బుదము లక్రాంతంబునుం బుట్టుచున్
గలయంబ్రాఁగుచునుండు నీవృథుల లింగస్ఫారగర్భాబ్ధిలో
7-వ పద్యము

గీ. వారినిధిఁదోచు బుద్బుదప్రాయమట్లు
త్రిజగములు భర్గతేజోఽబ్ధిఁ దేలనెఱుఁగు. 3-64.

## 17 రావిపాటి త్రిపురాంతకుడు

ప్రథమావిభక్తి-రగడ-

ఆయుదేకుల మంత్రకుసుమమునందు వెలిగెడి చంచరీకము.
ఆయుదేశంబున మంత్రకుసుమమున
నవి రాజముక్రియనవిఁ గ్రీడించితి- 3-287
కొలిచినదయ బాణాసురు మోసలఁగూరిమి గాచిన ఫణిహారికినై
కడుఁ బ్రియమున బాణాసురు మోసలఁగాచు
టకును నిరవధి కృపసలిపితి- 3.287 ఉ. చ.

## దశకుమార చరిత్ర

అందనిమ్రానిపండ్లకును నఱ్ఱులుసాచెద వేమిసేయుదున్ (3-331)
అందనిమ్రానిపండ్లకును నఱ్ఱులుసాచినయట్లు (2-61)

## ఇ త ర క వు లు

## తి క్క న

## 18 నిర్వచనోత్తర రామాయణము

రవియుదయంబుకంటె మునిరాజశిఖామణి మేలుకాంచి 7-189
రాజునకంటె మున్న మునిరాజశిఖామణి మేలుకాంచి
(2-51) ఉ. చ.

## 19 భా ర త ము

ఉ. ఆయతబాహులున్ వెడఁదయైన సమున్నత వక్షమున్ వి.రా 1-234
ఆయతబాహులున్ వెడఁదయైకనుపట్టు
భుజాంతరంబునున్ (1-245) ఉ. చ.

## 20 కే త న

ఉ. అందనిమ్రానిపండ్లకును-నఱ్ఱులుసాచెద నేమిసేయుచున్
దశ. (3-131)
ఉ. అందనిమ్రానిపండ్లకును నఱ్ఱులు సాచినయట్లు ఉ. చ

## 21 ఎఱ్ఱన-ఎఱ్ఱాప్రగడ

సీ. పా. కమనీయ కమలినీ కల్లోలవీథుల- ఆంధ్ర 7-213
సీ. పా. కమనీయకల్లోల కలితఘనాంబోధి-2- 30 ఉ.చ.

## తిక్కన నిర్వచనోత్తర రామాయణము

చ. రవి యుదయంబుకంటె మునిరాజశిఖామణి మేలుకాంచె
నిర్వ, 7-129

ఉ. రాజునకంటె మున్న మునిరాజశిఖామణి మేలుకాంచి (2-5)
రామ. తిక్కన.

ఉ. ఆయతబాహులున్ వెడఁదలైన సమున్నత వక్షమున్.
భార, విరా. (1-234)
రామ. ఆయతబాహులున్ వెడఁదలైయె కనుపట్టు భుజాంతరంబునున్
1-24

1 ఉదాహరణ వాఙ్మయ చరిత్ర-ద్వితీయ ముద్రణము
పుట 104; 107,

## 22 నాచన సోమనాథుడు

సీ, యమునాతరంగడోలాధి రోహణమున
డఁబులిా తెడు మరాళంబువోలె
హరినీలమణి మనోహరమందిర స్తంభ
ముల వినోదించు కేల్బొమ్మవోలె
దళితనీలోత్పలదళదామ సంగతిఁ
గొమరారు సంపఁగిగుత్తివోలెఁ
దరుణతమాల పాదపశిఖాశాఖలఁ
జెచ్చెలువారు వలరాచచిలుకవోలెఁ
తే. బారిజాత గోవర్ధనోత్పాటనమున
బలిమితోడవైన మురవైరి బాహుయుగము
తెప్పగా మన్మథాంబుధి దేలుచుండె
రమ్యగుణమణి రుక్మిణీ రమణిభీతి. ఉ. హ. (3-73)

సీ. తరుణ శశాంక శేఖర మరాళమునకు
సారగంభీర కాసారమగుచుఁ
కైలాసగిరినాథ కలకంఠ భర్తకుఁ
గొమరారు లేమావికొమ్మయగుచు
సురలోకవాహినీధర షట్పదమునకుఁ
బ్రాతురుద్బుద్ధ కంజాతమగుచు
రాజరాజప్రియ రాజకీరమునకు
మానితపంజర స్థానమగుచు
గీ. నగవల్లభహార మయూరమునకుఁ
జెన్ను మీఱిన భూధర శిఖరమగుచు
లలిత సౌభాగ్యలక్షణ లక్షితాంగి
యద్రినందనయొప్పె విహారవేళ. (1-94) ఉ. చ.

ఉత్తర హరివంశమున రుక్మిణీ కృష్ణులు-ఇచ్చట పార్వతీ పరమేశ్వరులు-రెండింటియందు రుక్మిణీ పార్వతుల వర్ణనయే గలదు-అయినను రామలింగకవి, పై పద్యమున జగత్తున కాధారాధేయమగు శివశక్తి స్వరూపము నతి మనోహరముగా వర్ణనలో సంతరించియున్నాడు-

| శక్తిస్వరూపము-ఆధేయము | శివస్వరూపము-ఆధారము |
|---|---|
| కాసారము- | మరాళము |
| మావికొమ్మ- | కలకంఠము |
| తామరపూవు- | షట్పదము- |
| పంజరము- | కీరము |
| భూధరశిఖరము | మయూరము- |

శక్తిస్వరూపమాధేయము - శివస్వరూపమాధారము - నాచన సోమునిలో-నీ-యాధ్యాత్మికదృష్టి లేదు. "మన్మథాంబుధి దేలుచుండె" అనునదియే యిచ్చట-కేవలము కావ్యశృంగారపరమైనది.

ఇంకను నాచన సోము ననుకరించు రచనలు గలవు.

23 "కూడనిపనిసేయఁ జూతు వకటా వికటా చరణంబు పాడియే
ఉ. హ. 1-93

"నీ యనుపమ సత్ప్రభావ మకటా వికటా చరణంబు మాపదే
(3-282) ఉ, చ.

24 "ప్రతివీరప్రమదాకపోల ఫలకప్రాంతాల కాంతమ్ములన్
(1-15) ఉ. హ,

"ప్రతివీరప్రమదాకపోలతలమున్ ప్రాపించుగస్తూరి.
(1-199) ఉ చ,

## జక్కన

25 సీ. భరతునిలాగున, పరశురాముని భాతి
రంతిదేవునిభంగి, రాముగరిమ
అంగునిరేఖ యయాతిభావంబునఁ
బృథువిధంబున భగీరథునిమాడ్కి
గయులీల మాంధాతకైవడి నంబరీ
షునిరీతి శశిబిందు సోయగమున
శిబిపోలిక మరుత్తుచెలువునను దిలీపు
కరణి సుహోత్రుని గారవమున
గీ. సగరు వెరవునఁ బురుకుత్సుసరణి నలుని
రమణ, నర్జునుక్రియఁ బురూరవుని చంద
మున హరిశ్చంద్రు తెఱఁగున వినుతికెక్కి
సాహసాంకుండు వసుమతీ చక్రమేలె. విక్ర. చరిత్ర-(2-69)

ఇందిరువదిరెండు శబ్దార్థములు గలవు. లాగు, భాతి, భంగి, గరిమ, రేఖ, భావము, విధము, మాడ్కి, లీలకైవడి, రీతి, సోయగము, పోలిక, చెలువు, కరణి, గారవము, వెరవు, సరణి, రమణ క్రియ, చందము-తెఱఁగు-

సీ. సింధుబల్లహురీతి శ్రీపతి పండితు
మరియాద ధూపద మాచిదేవు
నట్లు సుహాళానుననువున, నల్లక
ల్కుద బ్రహ్మదేవఁ గక్కయవిధమున
శూలదబ్రహ్మయ్య చొప్పున బిబ్బబా
చనలీల వీరనాచాంకుపోల్కి
కదిరె రెమ్మయగారి కైవడి తెలుగేశు
మహణయ్య చందాన మాచిరాజు

గీ. కరణి, మోళిగ మారయ్య గతిఁ దెలుంగు
జొమ్మనార్యుని వడువున సురియచౌడు
పగిది బసవేశ్వరునిమాడ్కి భక్తియుక్తి
శంభుఁబూజించి బ్రదుకు రాజన్యచంద్ర. (3-86)

ఇందు రీతి, మరియాద, అట్లు, అనువున, లేవ, విధమున, చొప్పున, లీల, పోల్కి, కైవడి, చందము, కరణి గతి, వడువు, పగిది మాడ్కి-అను 16 ఇవార్థములు గలవు. ఈ రెండింటిలో సమాన పదములు తీసివేయగా తెలుగున 30 ఇవార్థము లున్నవి.

26 "వచ్చునె బ్రెద్దునాకి యుపవాసముమాన్పి కొసంగనేఁటికిన్"
1-130, విక్రమార్కచరిత్ర

"వారక బ్రేలునాకి యుపవాసఫలం బెడలించునట్లు"
ఉ. చ. (3-236)

27 న్నేమనుదాన నింక నెటులేమనుదాన మహాదరిద్రతన్"
విక్రమార్కచరిత్ర (3-8)

"ఏమనువాఁడ నిన్ను సఖ! యేమనువాడ నిన్-"
2-197 ఉ, చ,

## పిల్లలమఱ్ఱి పినవీరన ఎత్తుగడలు

28 "క, వాలికలై వెలిదమ్ముల
యేలికలై భవభవునియెల దూపులకుం
బోలికలై" శృంగా. 2-88

"క, వాలికలగు తెలిగమ్ముల
జాలికలై" 2-194 ఉ, చ.

29 సీ. పా, అమృతాంశు మండలంలవాతాలముగాఁగ
జైమిని. భా. పీఠి. 22

సీ.పా. అమృతాంశుకులవనాయత వసంతాగమంబు
(3-44)ఉ.చ.

## ఉద్భటారాధ్య చరిత్ర ననుసరించిన కవులు

ప్రౌఢతరమగు తెనాలి రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యము కన్న-ప్రాథమికముగా రచితమైన ఉద్భటారాధ్య చరిత్రమునే-కవులు

హెచ్చుగా ననుసరించుటచేత, నిది చాలా వ్యాప్తికెక్కినదని మనము నిర్ణయింపగలము-తన పెదతాత కృతియగుటచే, మనుమడగు రామభద్రకవి దీనిని అనుసరించినాడు-వాని వివరములు దోనూరి కోనేరు నాథకవి.

## సరస్వతీ స్తుతి

సీ. సింహా[సనీకృత చిరయశఃకవిచిత్త
యుపవనీకృత రసాభ్యుదిత రచన
లీలాపదీకృత కీలితాచ్ఛాం] భోజ
సైంధవీకృత మదస్ఫారహంసి
ప్రియసఖీకృత మనఃప్రియద పాండురకీరి
సరసీకృతాంభోజజాత వ[దన]
విహృతస్థలీకృత వేధఃపరిష్వంగ
విహ్వాతిస్థలీకృత వేదవీథి
గీ. అనవరత కరుణార్ఘురీకనదపాంగ
ధ్వనిత మణిమయ వీణావితాన ఝుంక్రి
యాసమాకర్ణన ప్రహృష్టాంతరంగ
శారదాదేవి మతికృతీశ్వరున కొసగు. 1-9 ఉ. చ.

## దోనూరి కోనేరునాథకవి పద్య బాలభాగవతము

సీ. సింహాసనీకృత శ్రీమదోంకారయా
స్థానీకృతోపనిషద్రహస్య
శుభమంటపీకృత శ్రుతిసూతికాగేహ
శేఖరీకృతజాణ శిశిరకిరణ
ముకురీకృతానేక సుకవి శుద్ధస్వాంత
సహచరీకృత వాక్యచతురకీర
హస్తభూషీకృత పుస్తకోజ్జ్వల వీణ
యాతపత్రీకృత శ్వేతపద్మ
గీ. హాసనీహాసఫణిరాజ హారహీర
హారభాసురఘనసార చారువర్ణ

భారతీదేవి మన్మనఃపద్మ సద్మ
వసతిరై సత్కవిత్వంబు నొసఁగుగాత. (1-1)

కోసేరునాథ కవి క్రీ. శ. 1560 ప్రాంతమువాఁడు—

వ్యాసస్తుతి—

శా. సంసారాహ్వాయ సింధు పోతము జగస్సంబోధ దీపాంకురున్
కంసారాతి పదాబ్జబంభరము సాక్షాత్పద్మగర్భున్ బుధో
త్తంసంబున్ శ్రుతి సంకరోద్ధళనపాథఃక్షీరభేదక్రియా
హంసంబున్ పరిశీలితస్మృతిరసున్ వ్యాసున్ బ్రశంసించెదన్. (1-10)

శాకమ్రాని గంగాధరుఁడు— బాలభారతము (క్రీ.శ. 1560)

శా. సంసారార్ణవపారగున్ పరమహంసవ్రాత చూడావతం
త్తంసంబున్ శ్రుతిసంకరోద్ధళనపాథః క్షీరభేదక్రియా
హంసంబున్ జగదేకవంద్యు జలదశ్యాము మహాపాతక
ధ్వంసాభారతు భారతామృతనిధిన్ వ్యాసుం బ్రశంసించెదన్.

ఇది ప్రబంధరత్నావళిలో నుదాహృతము. 132 పద్యము.

శా. మత్తారాతినృపాలకంధరల దుంపంబుట్టి కొన్నెత్తురున్
హత్తన్ జిప్పిలుచెమ్మఁగ్రమ్మ నసిధారాధ్వంబుతే మెట్టియు
ద్వృత్తిన్ వచ్చును జిక్కువారక సమిద్వీధిం జయశ్రీ తదా
యత్తత్వంబువహించి చిత్రఘటనా వ్యాపారపారీణయై. ఉ.3-67

బా ల భా ర త ము

శా. మత్తారాతిమహాంధకారపటలీ మార్తాండుఁ డుద్దాటితా
దత్తోద్వృత్తురగావళీఖురపుటోత్పన్న క్షమా ధూళికా
యత్తాంబోధి యయాతిఁజెప్పఁదగు నుద్యద్వ్రజధారావ భా
జిత్తేజున్ సితకీర్తికై తకదళ శ్రీమూతనాంబోధమున్.

ప్రబంధరత్నావళి 128 ప,

## తెనాలి అన్నయ్య

రామలింగని తరువాతి కవుఁడు-అతని కృతి ననుసరించినను. కవియై, రామలింగనికి సాక్షాత్తు సోదరుడైన-అన్నయకవి తన సుద క్షిణాపరిణయమున రామలింగని కృతుల ననుసరింపకపోవుట సరికదా-అతనిపేరైన-తన కృతిలో నెత్తలేదు.

రామకృష్ణుడై, పాండురంగమహాత్మ్యాది కృతులు రచించిన ప్రసిద్ధుడైన కాలమున-అన్నయ పెద్దవాడై యుండును-కాని, రామకృష్ణుడు, తొలుత శైవుడేయైననూ, తరువాత వైష్ణవపరమగు కృతులు రచించుటచే, సహజ శైవాచార సంపన్నుడగు అన్నయ తన యన్నను స్తుతియింపక పోవచ్చును[1].

రామకృష్ణుని సోదరుని మనుమడు రామభద్రకవి మహాత్మ్యము తన పెదతాత యందలిగౌరవమున నాతని కృతులను-చక్కగా, ననుసరించినాడు. తన ఇందుమతీ కల్యాణమున నాతని సగౌరవముగా, పేర్కొన్నాడు-ఆతని యనుసరణ లిక చూపెదను.

క. వారణవాజి వధూవసు
వారాత్మకమైన రాజ్యవైభవమిది దా
నౌరసుడులేని కతమునం
జారుముఖీ! యెన్నలేని సస్యముగాదే. (౨-౨౧) ఉ. చ

క. ఇల నాల్గుచెఱగులందును
గలరాజులు కరములియ్యంగా వెలసిన నా
కలిమియిది సుతులు గలుగమి
జలజాక్షీ! యెన్నులేని సస్యముగాదే. ఇందు. (1-126)

శా. నీల స్తంభ విజృంభితోజ్జ్వల హిమానీశుభ్ర సౌధంబులో
నాలోలంబగు తొట్టిమంచమున నొయ్యంజేర్చి జోకొట్టి యు
య్యాలోజొంపలయంచు నూవుడురు శుద్ధాంతాబ్జపత్రాక్షులా
బాలుం బాలశశాంకశేఖర కృపాపారీణు గా రామునన్.
(౩-౫౪) ఉ చ.

శా. లీలాకల్పిత చిత్రచిత్రతర కేళీధామ మధ్యంబునన్
డాలుంజొంపములీను మానికపుం దొట్లంబెట్టి జోకొట్టి "యు
య్యాలోలాలి" యటంచుఁజేరి కలకంఠారావ కంఠధ్వనిన్
జోలల్పాడుదు రొయ్యనొయ్యన సఖీ చూడామణుల్ రాసుతున్.
(ఇందు. 2-51)

---

1 ఉద్ధృతారాధ్యచరిత్ర ప్రథమ ముద్రణ పీఠిక-6.

సీ. అలికపట్టికమీద నతుల ముక్తాఫల
  శ్రీకరంబగు రావి రేక మెఱయఁ
బాలబుగ్గలకాంతి మేలంబులాడుచు
  మద్దికాయల తళ్కు ముద్దుగురియ
మణిబంధములయందు మట్టసంబగుచేతఁ
  గనుపట్టు హస్తకంకణము లమర
సిగ్గెఱుంగని కటిసీమ నడ్డిగలు గ్రు
  చ్చిన గట్టియగు కాంచిజిగిదొలంక

గీ. తొక్కుపల్కుల నమృతంబు పిక్కటిల్ల
మురిపమంతయు లావణ్యగరిమగాఁగ
నడ్గులకు మడ్గులొత్తంగ నల్లనడుచుఁ
బడుచు నవకంబుమీఱిన ప్రాయమునను. (8-58) ఉ. చ.

సీ. అలకావళులనంటి తళుకు ముత్తెపురావి
  రేక నెన్నుదిటిపైఁ జౌకళింప
నిద్దంపుఁజెక్కుల నిగనిగల్ గొను కెంపు
  మద్దికాయలచెల్వు ముద్దుగుల్క
రాణించు నునుమూల రాకట్టు నునుమింత
  పులిగోరుగళమునఁ బొలుపుమిగుల
జిగిమించు నవరత్నజి చిఱుత గంటలచాలు
  మొలనూలు కటిసీమ మురువుసూప

గీ. లలిత కలహంస కలకలక్రమము దోపఁ
జరణముల నందియల్ మ్రోఁత నందడింపఁ
దల్లిదండ్రుల కనుపమోత్సాహ మొసఁగు
లీల నడయాడుచుండు నబ్బాలకుండు. (ఇందు. 2-59)

## స్వసంవాదములు

# ఉద్భటారాధ్య చరిత్ర
## పాండురంగ మాహాత్మ్యము

| ఉద్భటారాధ్య చరిత్ర | పాండురంగ మాహాత్మ్యము |
|---|---|
| 1. మదాలసుని కథ 180 గద్య పద్యములతో చెప్పబడినది. ఇచట మదాలసుని విరహ వర్ణన-15 పద్యములలో గలదు | 1 నిగమశర్మోపాఖ్యానము 110 గద్యపద్యములున్నవి. మదాలసుని కథకన్న కవితాశిల్పము హెచ్చుగానిందు గలదు. ఇందు నిగమశర్మ వాచాలుడని మాత్రమే చెప్పినాడు. విరహవేదనలేదు. |
| 2. మదాలసుని పుట్టుక. "మింటి దయ్యముల నేలకుఁ దెచ్చి కుమారుఁగాంచెఁ దత్సతి" 2-115 | 2. నిగమశర్మ పుట్టుక. "నింగి వేల్పుల నేలకు నేలవేల్పుకులము నింగికిఁ దెచ్చుచుఁ గొలువ"- పుట్టినాడు. (3-5) |
| 3. పొటమరించిన వీటివిటుల యల్కలుదీర్పు 2-129 | 3. విటవాదములు దీర్పు వేగిలేచి (3-12) |
| 4. మదాలసుడు గుడి కొల్లగొట్టి "ఇరులు ఠ గున వోయను నడికిరేయి." వెళ్ళిపోయెను. 2-137 | 4 నిగమశర్మ భార్య నగలన్ని యొలుచుకొని "గాఢతమోనికర మతనతగు తోడుగ" వెడలిపోయెను, |
| 5 మదాలసుఁడు ఎత్తుకొనివచ్చిన సొమ్ముతో క్రొత్తయూరిలో నిట్లున్నాడు. "మానితలీల సజ్జనునిమాడ్కి మహీసురుఁ డప్పురంబులోమానవపంక్తితోఁ గలసి మచ్చికయై తలలోని నాల్కయై దీనిధి యూతఁడే యనఁగఁ | 5 కాపుపుత్రునియింట నిగమశర్మ ఇట్లున్నాడు:<br>క. తలలోపల నాలుక, పూ<br>సలలో దారంబు, పాలజల్లిన నీరుం<br>బలెవెలి యెఱుఁగక మనసులు<br>గలిసి యభేదమున కాపుకడ<br>నతఁడుండెన్. 3-59 |

దేకువఁదేజముగాంచె, (2-141)
మానసపద్మకేలితోత్కధ్వజభక్తి తులితోత్కధ్వజను
(1-7)
ద్యావాపృథ్వ్యవకాశపుంఖిత ద్యావాపృథ్వ్యవకా
(1-33)

## ఉద్భటారాధ్య చరిత్ర

### కందర్పకేతువిలాసము

ఉద్భటారాధ్య చరిత్రలో దండకమున పార్వతీదే ముగా నిరూపితమైనది.

"వక్షోజచక్రంబులన్ జారునేత్రాసితాబ్జంబులన్ : బునం గుంకలోత్తాల శైవాలజాలంబునన్, బాహువల్లీ లన్, బంధురోష్ఠాచ్ఛబంధూకపుష్పచ్ఛటన్ మందహాసా పిండీరసారంబునన్, నిమ్ననాభీశుభావర్తగర్తంబునన్, గో శీచ్ఛేదవీచీసముల్లాస సౌభాగ్యయోగంబునన్, నిత్యలక్ష్మీ తంబస్ఫురత్సైకతాభ్యున్నతిన్ బాదకూర్మస్థితిన్, భ్రేమ శైలాత్మజాతా సరోజాకరంబున్ మహాకేళిహంసంబవై (శి

కందర్పకేతు విలాసమున దండకములోని రూపకవ మున సంగ్రహింపబడినది.

మ. లలితాస్యాంబురుహంబు నీలకచరోలంబంబు నేత్రా
త్పలముచ్చైస్తన కోకమోష్ఠ విలసద్బంధూక ముద
పులినంబుద్గత చిత్తజాతరసవాః పూరంబు ప్రాణేశ
జజలావాలము సొచ్చి యాదకమనోజాతానలంబాం

మానవల్లి రామకృష్ణకవిగారి కుమారసం
ప్రథమ భాగము లఘుటీక, (1908)

## ఉద్భటారాధ్య చరిత్ర

### ఘటికాచల మహాత్మ్యము

రామకృష్ణుని చివరికృతియందు, ఘటికాచల మహా ఉద్భటారాధ్య చరిత్రమునుండి సంవాదము లుండుటచే

రాధ్య చరిత్ర మాతని ప్రథమకృతియైనను నెంత ప్రాధాన్యము వహించెనో తెలియుచున్నది.

సీ. అచలసుతాభర్త కర్పించి మఱికాని
మృగములు లేఁబూరి మేయవచట
అసమలోచనునకు నర్పించి మఱికాని
యళులు క్రొవ్విరి తేనెలానవచట
అంధకధ్వంసికి నర్పించి మఱికాని
కోయిల లిగురాకు కొఱుకవచట
అంగజారాతికి నర్పించి మఱికాని
చిలుకలు పండ్లు భుజింపవచట
గీ. తక్కుఁగల జంతువులు శంభు దలచి కాని
యుచితవర్తనముల గోరి యుండవచట
వదనములు వేయుగల యంత వానికైన
నా యరణ్యంబు గొనియాడ నలవియగునె. ఉ.చ, 1-54

సీ. మొకరిచేటులు మూతిముట్టవు తేలియల్
శ్రీమధుశాసికర్పించికాని
కోకిలమ్ములు చిగురాకులు గొఱుకవు
శ్రీ వనమాలి కర్పించికాని
లేఁబచ్చికలు గబళింపవు హరిణముల్
శ్రీ నీలమూర్తి కర్పించికాని
ఫలభుక్రియలకుఁ జిలుకలు దలఁపవు
శ్రీ మాధవునకు నర్పించికాని
గీ. ఇతర జంతువులును హరి మతిదలంచి
కాని యేవర్తనమునకుఁ బూనవనిన
నా తపోవనమాహాత్మ్య మభినుతింప
నలవియే వేయిమొగంబుల చిలువకైన. ఘు.చ.మ (1 13)

మ. హరిణంబుల్ బురివెంచు సింగమొగి నశ్యాటంబులాడున్ గరిన్,
ఉత్త. చ. (1-55)

మ. పులువేదున్ మృగశాబకంబుల హరుల్ పోషించు నత్యాదృతిన్
ఘటికా, (1-11)

గీ. తలిసి మొత్తంబు రేపాడి తానమాడి
దిగ్గియల చేరువలను (బూదింపులందు)
కాలమునఁ బుల్కునుఁ "ద్రియంబకంపుజాము
హే" యటంచును బలపము లెల్ల యెడలఁ, ఉద్భ.చ.(1.56)

క. ఒక చిత్రమచటి బటివట
లికమున్ సంజలను గ్రుంకిలేచి సమాధిన్
సకల శకుంతంబులు తా
రక మంత్రోచ్చారణాభి రతిమతిఁ బొదలున్ ఘటి. (1-9)

ఉ. సామగుణంబుఁ గ్రోల్చుఁ బికశాబకపంక్తులు శైవధర్మముల్
ఉద్భ. చ; (1-57)

తు ......పికముల్ సాత్రాజితి ప్రాణనా
యక నామావళినకుల్ పఠించు
నతతోద్యద్భక్తి తా చాతురిన్ ఘటికా, (1-8)

సీ. అభ్రగంగా ప్రవాహంబు లెన్నియొ కాని
తలధరియింతు రందఱును నదులు
పదిసూలుపడగల పాము లెన్నియొ కాని
నందఱును రగేంద్రవాళయుతులు
డాలొందు చంద్రఖండంబు లెన్నియొ కాని
యందఱు ధరియింతు రమృతకరులు
విషరాశిబుట్టిన విషములెన్నియొ కాని
యాతఱు హాలాహలాంకగళులు

గీ. గంధగజదైత్యు లెందఱో కాని యంద
ఱతుల కరిచర్మ నటధారులైనవారు
కర్మబంధంబు [స్వప్నభాగముననైన]
ద్రాలుకొనకుండ నిద్రింపఁజాలు ఘనులు. ఉద్భ.చ. (2-87)

సీ. నునుగాలి దూదిపానుపు లెన్నియో కాని
యంతఱు శయనీయ తాహివరులు
సురలోకవాహి నిర్ఝరము లెన్నియొ కాని
యందఱు దివ్యతీర్థాంబువరులు

సీటజనించు మానికము లెన్నియొ కాని
యందఱు కౌస్తుభహారయుతులు
చలివేఁడి వెలుఁగుల సాములెందఱో కాని
యందఱు నిందు కంజాప్తదృశులు
గీ. ఖగకులాధీశు లెందఱో కలరు కాని
యందఱును పుల్గురాలెక్కు యమములవారు
నారువోసినరీతి నున్నారు ధీరు
లన్నగరి యందు కాపురంబున్నవారు. ఘటికా. 1-25

మ. వలభీంద్రోపల ఖండదీధితుల రేవల్ కంఠహాలావాలం
బులు పన్నంబులు భూతి వెల్లవడగల్ మూర్ధస్థితస్వర్ధునీ
జలపూరంబులులోన గ్రుమ్మరుసతుల్ పాఁజాలు మైఁగొన్న యా
యలఘుంబోదుల యొప్పునై తగుఁబురిన్ హర్మ్యేశ్వర శ్రేణికిన్.
ఉద్భటారాధ్య చరిత్రలో (1-151)

అను నీ పద్యమే-ఘటికాచల మాహాత్మ్యమున - కాంచీపుర వర్ణనలో గలదు. 2-206.

## సంస్కృతకవి అనుసరణములు

తెలుగుకవుల యనుసరణలేగాక, సంస్కృతకవి అనుసరణలు-గలవు,

గీ, శైశవంబునఁ జదువును జవ్వనమున
భోగసక్తియు వార్ధకమున మునీంద్ర
వృత్తి నిలుచుటయును మీఁద విపులయోగ
కలనమై ద్రోచుటయు మన కులము నడక. 3-86

శ్లో. శైశవేభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణామ్
వార్ధకేమునివృత్తీనాం యోగేంత్యేశ్చతనుత్యజామ్.
రఘువంశము,

"చ. హరిహారిదంబుజాక్షి నిటలాంచిత చందనబిందువోయనన్
గరముఁ దలిర్చెఁ జందురుఁడు" (2-163)

"దిక్సుందరీవదన చందన బిందురిందుః" బిల్హణీయము,

క: దొరకు నిరంతర పుణ్యము
పరోపకారమునఁ గరము పాపమువచ్చున్
పరపీడనంబుచే నని
పరువడి నయ శాస్త్రవిదులు పలికిరి వత్సా,
"పరోపకార పుణ్యాయ పాపాయ పరపీడనమ్"

## క వి తా క ళ

ఉద్భటారాధ్యచరిత్రయందలి కవిత-కుమారభారతి బిరుద మన్వర్థమగునట్లు, సౌకుమార్యముతో నలరారుచున్నది-ఇందు సౌకుమార్యమను కావ్యగుణము గలదు-పరుషత్వములేని పదబంధము సౌకుమార్యము అర్థము ప్రసన్నముగానుండు గుణమును సౌకుమార్యమే. ఇది రామలింగని ప్రథమకవిత-కౌమారమున రచితమైనది కావున కోమలత్వమిందు ప్రాయికముగా నున్నదని చెప్పవచ్చును-

ఈ కృతియందలి "ముక్తికామినీ చంచల దృగ్విలాసములు-(3-199)-ముక్తికురంగలోచనాకోమల దృగ్విలాసములు (8-135)-పాండురంగమాహాత్మ్యమున-" ముక్తికామినీ కఠినకుచద్వ యీ నిచిత కాంచన మాలికయైనది. (1-32)

ఉద్భటారాధ్యకృతి కోమలత్వము, పాండురంగ కృతిలో ప్రౌఢత్వము సంతరించుకొన్నది.

రసము. ఈ కృతియందు ప్రధానమైనది భక్తిరసము[1]. ఇది శైవసంప్రదాయిక విశిష్టమైన కృతి యని, శివపారమ్యము శివభక్తి యిందాద్యంతముల ప్రతిపాదితమైనదని యీ వరకే వివరించి యున్నాను.

శృంగారము: శృంగార రసావిష్కరణకు మదాలసుని కథ యిందు ప్రత్యేకముగా, కథాసందర్భమును పురస్కరించుకొని రచిత

---

1 భక్తిరసమును నొక కావ్యరసముగా, శృంగారాదులతో నాలంకారికులు పరిగణించినారు. (చూ. కావ్యాలంకార సంగ్రహము సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారిది. (రసప్రకరణము) తృతీయాశ్వాసము. 304-307 పుటలు.

మైనది-ఇందు సంభోగ, విప్రలంభ శృంగారములు రెండును వర్ణితము లైనవి-పురుషవిరహమిందు సరసముగా నున్నది-ఈ సందర్భమున భావములు మనోహరములు.

## విప్రలంభము

సీ. మదిరాక్షి! నీ ముద్దుమాటలాడించిన
పారఁబట్టనె పిక స్ఫారరమణి
ఎలనాఁగ! నీముఖంబింత చూచిన మాత్ర
వెలవెలచేయనే విధువిభూతి
హరిమధ్య! నీ వదనానిలంబులు గ్రోలి
కలచి తూలించనే కమ్మగాడ్పు
కొమ్మ! నీకమ్మని కెమ్మోవిఁ జుంబించి
చిదిమి వైవనె మావి చిగురుటాకు
గీ. మత్తగజయాన నీమేను హత్తియుండి
పెలుచనాకుల పఱువనే యలరుఁదీవ
నీ యుపేక్షణ నాకింత నివిడిశాస
మానవలసె, వివేకంబు మానవలసె." (2-191) ఉ. చ.

జలరుహగంధి! నీ వదనసన్నిధి, పెన్నిధి నీ మనోహరా
త్యలఘ కటాక్షవీక్షణ విహారము, హారము, నీ సుధామిళ
త్కల మృదువాక్యవైఖరులగర్వము. సర్వము, నీకపోల ని
స్తులకళ చెల్మికల్మియుఁ జుతోఁచెదునాకిక నెన్ని రీతులన్. 2-190

మదాలసునికి కనకలత యను వేశ్యపై ననురాగము గలిగి, ఆమెనుగూర్చి చెప్పిన మాటలుగల పద్యములను పరిశీలింపగా, రామలింగకవి బిల్హణకవి సంస్కృతమున రచించిన బిల్హణీయ కావ్యము ననుసరించినట్లున్నది. అందలి, 'అద్యాపి' అను ప్రారంభముగల శ్లోకముల భావములు కొన్ని యిందు గలవు-

సంభోగ శృంగారమెుక్క పద్యములో వ్యంగ్యముగా సూచిత మగుట హృద్యము.

ఉడుగని కామతంత్రములనూని మనోజ్ఞము పల్లవింపఁగాఁ
గడఁగి పశావశేభపతి కైవడి మత్తమరాళికాతతిం

బుడికెడు రాజహంసపతిపోల్కి మదాలసుఁ డమ్మృగాక్షితో
నొడబడియుండె సంతతము నొండు తెఱంగుల మజ్జగించెదన్.

2-229

ఆ. వె. కమలనయన నీవుకలచోటు సరసంబు
నీవులేనిచోటు నీరసంబు
కంబుకంఠి నీవుకలవాఁడు కలవాఁడు
లేనివాడు నీవు లేనివాఁడు, కాశీ. (3-48)

కరుణ

శివుడు గంధర్వులపై కోపించి, వారు పిశాచ రూపములు గండని శపించునపుడు గంధర్వులు శివుని వేడుకొను ఘట్టము కరుణ రసప్లుతము.

క. కలుషించి తేల తృణక
ల్పులమగు మామీఁద కరుణవోనాడి! కటా!
బలుతెగఁగొని బ్రహ్మాస్త్రం
బిలబిచ్చుక మీఁదఁబూని యేయఁగఁ దగునే. (1-119 ఉ.చ.

అయిదు పద్యములలో కవి యీ రసము వర్ణించి తానే యిట్లు చెప్పినాడు.

"అని యనేక ప్రకారంబుల సకరుణంబు గాఁ ప్రార్థింపుచు."

అద్భుత రసము

కాశీక్షేత్రమున మరణించినవా రీశ్వరునికన్న నధికులని, యద్భుతముగా నీ క్రింది పద్యమున వివరింపబడినది.

సీ. పౌరుషంబు కొలంతపడుట మేననెగాని
కలుకదు వాని వంగడమునందు
నెద్దుచంకంబెల్ల నెక్కరింతనెగాని
తగులదు వాని వర్తనమునందు
రెండునాలుకతొట పెండారమునగాని
హత్తదు వాని వాక్యములయందు
(కడిఁడి బండతనంబు) విడుపుటెంకినెగాని
పరగదు వాని ప్రాభవమునందు

గీ. భంగపోవుట తలపూవుపై నెకాని
నాటుకొన దింక వాని మానసమునందు
నెవ్వఁడే కాశికాపురి కేగుదెంచి
పొందిదిగఁద్రోయు భాగ్యంబుఁ బొందెనేని. (2-280) ఉ.చ.

భయానక రసము-పిశాచవర్ణన

సీ. తలలపైఁ బచ్చపూసలు కండతిండియు
భీషణ దగ్ధాస్థిభూషణములు
శూలాగ్రనర కంఠశోణితా స్వాదంబు
బిలసంప్లవ శిశుశిరః పలలసేవ
సవ్యకంకాళ తండములు చేపట్టుట
యూఱక నల్గడ చిచ్చు లుమియుటయును
బలితంపుఁ బ్రేవుల మొలమూలి చేఁతయుఁ
గిలకిలయును బొబ్బ నులివుతవణి
గీ. కొఱవి మసిబొట్టు పురియలి కోఱలుందు
నింగలంబిడి రాజించు బెట్టుగుడ్లు
మిడుఁగురులు గ్రమ్మఁ ద్రిప్పుఁచు బడమిమింట
బ్రమరి వాఱుటయునుఁ బిశాచముల కొదవె, (1-13)

శాంతరసము

భక్తిరస ప్రధానమగుటచే నీ కావ్యమంతయు శాంతరస ప్రాధాన్యముగా పర్యవసించుచున్నది.

వర్ణనలు

ఇందలి వర్ణనలన్నియు సందర్భానుసారములై యున్నవి.

1. పురవర్ణన – వల్లకీపుర వర్ణన – (1-142-162)

| | | |
|---|---|---|
| కాశీపురవర్ణన – | 2-70-110 | 40 పద్యములు |
| | – 259 | 1 ,, |
| | 279 – 288 | 9 ,, |
| విశ్వేశ్వరాలయ వర్ణన | | 12 |
| | | 62 |

కాశీక్షేత్రవర్ణన యింత విపులముగా వేఱొక కావ్యమున గన్పట్టదు.

2. నాయకవర్ణన - ప్రమథేశ్వరుడు (1-162-167)
3. వనవర్ణన - నైమిశారణ్యము (1-52-59)
4. శైలవర్ణన - కైలాసపర్వతము (1-76-1-82)
5. ఋతువర్ణన - (1) వసంతవర్ణన - (1-82-88)
(2) శరద్వర్ణన - (2-172-179)
6. సంధ్యావర్ణన - (2-177)
7. నక్షత్రవర్ణన - (2-178)
8, సూర్యాస్తమయము (2-179)
9. చంద్రవర్ణన (2-179-186)
10. సూర్యోదయము (2-49)
11. దౌహృద వర్ణన - 3-37-44
12. స్త్రీసౌందర్య వర్ణన - 1-13, 3-159, 217,

వర్ణనలన్నియు శివపరములే-

పురవర్ణనయందు ప్రతిపద్యమున శైవసంప్రదాయికములే గలవు.

1, పురసౌధములు- "శ్రీకంఠరాచలోర్జిత సముజ్జ్వలకూట
సంకాశవిధు కాంత సౌధకులము-

2. హర్మ్యముల కేతనకింకిణులు- హరునహంకరించుచున్నవి.

3. అచ్చట హర్మ్యములు శివుని బోలినవి.

మ. వలభీంద్రోపల ఖండదీధితుల లేవల్ కంఠహాలాహలం
బులు సున్నంబులు భూతి వెల్లపడగల్ మూర్ధస్థిత స్వర్ధునీ
జలపూరంబులు లోనగ్రుమ్మరు నతుల్, సాంగాలు మైఁగొన్న యా
యలరుంబోఁడుల యొప్పునై తగు బురిన్ హర్మ్యేశ్వర శ్రేణికిన్.
(1-151)

| హర్మ్యములు | శివుడు |
|---|---|
| వలభియందలి | శివుని కంఠమున |
| యింద్రనీలములు | కేశిమ |
| సున్నములు | విభూతి |
| వెల్లపడగలు | హర్మ్యములపై నుండు తెల్లని నీరుగల కేళాకూళులు- |
| లోనగల లోల్లాక్షులు | శివుని అర్థశరీరమున నున్న మగువ. |

4. పల్లకి కాళినిబోలినది
5. బ్రాహ్మణులు శివదత్త శాంతబుద్ధులు.

## వనవర్ణన

1. జంతువులు శంభుఁదలచి కాని యుచితవర్తనలు నెఱపవు.
2. జలపక్షులు-"త్రయంబకం యజామహే" యను శ్రుతి పఠించును.
3. పికములు- సామగానము సేయును,
చిలుకలు- శైవధర్మముల నుపన్యసించును
శారికలు- ఈశ్వర యోగశాస్త్రములు పాడును.
తుమ్మెదలు- తుమ్మెద పదములు పాడును.
పంక్తియందలి యింద్రనీలములు - కంఠ
4. తపస్వులు- శైవధర్మగతిచే నొప్పుదురు,

## వసంతఋతువు

1. శివపూజ కనువగునట్లు పువుగుత్తులు పూచినది,
2. శివుగొల్చువారల పాతకములు రాలిపోవునన్నట్లు శాఖాకులు రాలినవి.
శివునిపై విబుధులకనురాగము గలిగినట్లు చెట్లు చిగిర్చినవి.
ఈశ్వరభక్తులిండ్ల సంపదలు నవలెత్తినవన్నట్లు చెట్లు మొలక లెత్తినవి,
శంభుదాసుల సంకల్పములట్లు చెట్లు ఫలించినవి.
3. భూరుహములు, నీలరుచిచేత, మొగ్గలచేత, చంద్రఖండమును ధరించిన శివు ననుకరించుచున్నవి.
4. గురువిందకమ్మతీగె లల్లుకొనిన సహకారములు (తియ్యమామిడి చెట్లు) గిరిజనాలింగనము చేసికొన్న పరమేశ్వరునట్లుండెను.

## రాజవర్ణన

1. మనఃపద్మమునకు-హారగాధ-పరిమళము.
2. కీర్తిపల్లికి-సర్వవిభుడు-మూకటివేరు.
3. గుణములకు-శివభక్తవర్గములు-ఉనికిపట్టు.

## అ లం కా ర ము లు

1-67. సీ. మ్రొక్కు నెవ్వాఁడప్పటి రాత్రికి. క్రమాలంకారము.

70. గీ. వానపై వానకురిసిన నాను నొక్కొ-
సహజ కాఠిన్యముడిగి పాషాణకులము అర్థాంతర న్యాసము.
(2-109)

76. చ. విలసుదార నాగకుల విశ్రాంతము. శ్లేష.

80. సీ. చిగురు జొంపంబుల నిగుడిన కెంజాయ
రుచిర జటచ్ఛటారోచిగాఁగ ఉత్ప్రేక్ష

2-29. శచీపురందరులు ధారుణిపై విహరించు కైవడిన్. ఉపమ.

౬-౫౪౭. అకూపారములు (వోలె) మాతులు
కైరవహితురాక బొంగగా నేర్చునొకో.
అర్థాంతరన్యాసము.

## భా వ ధ్వ ని

ఉ. కేతువు నీటముంచి తమకించి ధనుర్లత మళ్ళఁబెట్టి వి
ఖ్యాతబలంబు చెట్టులకుగట్టి, గుణంబునగల్గు పత్రముల్
వేళయలించి, యంపగమి వేడుక మూలకుఁద్రోచి యమ్మనో
జాతుఁడు తత్పురింగలుగు శైవులపై జననోడు నెంతయున్.

మన్మథుడు శివునిపై దండెత్తినప్పుడు-మత్స్యధ్వజముతో చెఱకు వింటితో, కోయిల బలగముతో, తుమ్మెద వారితో పుష్పబాణములతో వెడలినాడు. కాని యవియన్నియు-వ్యర్థములైనవి. శివుడు లోబడ లేదు సరికదా, అతడు భస్మీభూతుడైనాడు-మన్మథధ్వంసకుడను కీర్తి శివునకే దక్కినది-నాటినుండి మన్మథుడు. శివునిపై నేగాడు శివాపరావ తారులగు శైవులపైని అతడు దండు వెడలుటకు భయపడునని రామ లింగకవి పై పద్యమున ధ్వనిగా వర్ణించినాడు.

కేతువు నీటముంచి = అతని ధ్వజము చేపగాన దానిని నీటిలో ముంచి
నాడు-చేప యెప్పుడు నీటిలో నుండును.

ధనుర్లతమళ్ళబెట్టి = చెఱకు, మడిలో-అనగా. పొలములలో ప్రవేశ
పెట్టెను.

బలగము = కోయిల బలగము చెట్టులందుండ జేసెను,

గుణంబులగల్గు పక్షముల్ తరలించి=తుమ్మెద ఱెక్కలను తరలించి, అంపగమి=పువ్వులను-మూలకు అనగా కొప్పులందుచేర్చినాడు.

## వ్యాకరణ విశేషములు

రామలింగకవి, కావ్యమును సలక్షణముగానే రచించినాడు-అయినను నచ్చటచ్చట కొన్ని లక్షణ విరుద్ధములకు ప్రయోగములు కానబడుచున్నవి. అవి తత్పూర్వకవులనుబట్టి సమర్థనీయములే—అట్టి వానిని కొన్ని వివరించుచున్నాను.

(1) కొనికి, క, ప్రయోగము.

"కూడుకవత్తురే బుధులు." (1-41)
"కూడుక యుచ్చగంబులై" (3-45)
ఇట్టివి పిల్లవీరన-జైమిని భారతమున గలవు. కట్టుక (3-103) పట్టుక - (4-123) ఎత్తుక - (8-24)

(2) స్త్రీవాచక సంధి.

"పయోనిధి నావకటిన కరణి" నావ + అంటు = నావయంటు అని యుండవలెను. స్త్రీవాచక తత్సమ సంబోధనములకు సంధిలేదు,

(3) విసంధి-

భవ్యంకర దానముల్ ఒసగి- 3-315
ప్రావీణ్యంబగు దానముల్ ఒసగ 3-318

(4) మిశ్ర సమాసములు.

నవచన్నుదోయి-2-174. ఇది వైరి సమాసముక్రింద పరిగణితమ-కాని యది సరికాదు. ఇది మిశ్ర సమాసము. రామలింగకవి. పాండురంగ మాహాత్మ్యమున నిట్టి సమాసము లుపయోగించినాడు.
దినవెచ్చము-3-16 కనక క్రోవి- (4-8)

ఇట్టివి పూర్వకవుల కృతులలో గలవు[1]. పాండురంగ మాహాత్మ్యము న "వ్రాయసప్రవృత్తి" (1-20) అను సమాసము గలదు. దీనిని గూర్చి-అకాడమీ ముద్రణ-ఉపోద్ఘాతము 32 వ పుటలో నిట్లు గలదు[2].

"అతనియెడ రామకృష్ణునికి విశిష్టముగా కానవచ్చిన శక్తి చక్కని చేతివ్రాత! కనుకనే కాబోలు కొందరు పై 'రాయసము' వ్రాయసముగా పఠించినారు. కాని వ్రాయసము అనురూపము-వ్యుత్పన్నముగా గాని ప్రామాణికముగా గాని నాకు తోచదు. రాజ సము రాయసముగా ప్రాకృత కన్నడ ద్రవిడ భాషలలో నున్నది. అర్థమందును భేదములేదు."

'వ్రాయసము' అనురూపము వ్యుత్పన్నము కాకపోవుట యేమి? ఇది 'వ్రై' అను ద్రవిడధాతువునుండి పుట్టినది. 'బరై' కన్నడమున, "బరె, బరి" తెనుగున "నీకై దుబర్లు వచ్చునా" అను నానుడిలో నీ 'బరి' శబ్దమున్నది. ఇక తెలుగున, "వ్రై" వ్రాగా మారినది. పరజ్-ప్రా-కురంగ్-క్రోగా మారుట-తెలుగున గలదు. కావున నిది వ్యుత్పన్నమే.

వ్రాయసము ప్రామాణికముగా తోపదనుటయు నట్టిదే-ఇవిగో ప్రయోగములు.

వర్గంబు కవిలియు వ్రాయించి-పండితారాధ్యచరిత్ర పురాతన ప్రకరణము-

వానవత్తులు నీటివ్రాతలు,

[3]వ్రాయసప్రవృత్తి- (1-20) దినవెచ్చము, (3-16) కనకక్రోవి (4-8)

---

1. చూడుడు శబ్దరత్నాకరానుబంధము- సంస్కృతాంధ్ర మిశ్ర సమాసములు-

2. ఉపోద్ఘాతకర్తలు శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

3. ఇది "రాయసప్రవృత్తి"గా నుండవలెనని- అకాడమీ ముద్రణ పీఠిక (పుట ) కాని ప్రయోగములలో 'రా'తో ప్రత్యేకముగా యతి చెల్లింపబడిన ప్రయోగ మింతవఱకు లక్ష్యము కాలేదు.

వ్రాసినవ్రాఁత యుజ్జయిని-రాజ్యము చేరఁగ. (విక్రమ 2-55)

వరుసతో నిలుగేల వ్రాయనేర్చె (విక్రమ 1-50)

వనిత కుచద్వయాంబువయి వ్రాసిన- (పారి 1-113)

చాటుపద్యములను జూచిన నెన్నో ప్రయోగములు కన్పట్టును.

"వ్రాయరె యెల్లలోకమున-వారలు-"

"వ్రాయుట చిత్రమాలి కృతవైదికమూ"

"క. ఏవ్రాలైనను వ్రాయఁడు
నా వ్రాయడు వ్రాసెనేని నవ్వుచునైనన్
సీవ్రాసి తావడియ్యడు-
భావజ్ఞుడు రాయనార్య భాస్కరుఁ డెలమిన్"

చాటుపద్య మణిమంజరి- 77-80 పుటలు

ఇంకను గలవు-

పై ప్రయోగము లన్నింటియందును- 'వ్రా'లో 'వ'తోడను 'ర'తోడను ఉతి యున్న పదములే యున్నవి గాని, "రాయసము" అను రూపముతో నున్న ప్రయోగములే లేవు- ఒకవేళ రాయసము రూపమున్నను- అది వ్రాయు ధాతువునకు సంబంధించినదై యుండదు వ్రాయసమునకు 'రాయసము' అనునది సరియైనరూపమైన- వ్రాయు నకు- 'రాయు' అని లేఖకపరముగా క్రియ యేర్పడి యుండవలెను. ఏకవిద్వైన 'రాయు' అని ప్రయోగించినాడా! అది వ్యావహారిక రూపము- అల్లే రాయసము వ్యావహారిక రూపముగాని కవిప్రయుక్త రూపముగాదు- ఒక్కొక శబ్దమునుగూర్చి- ఎంతగా మనము పరి శోధింపవలెనో చూపుట కింతగా వ్రాయవలసి వచ్చినది.

## ఛందస్సు

ఈ కృతి చంపూకృతి-ఇందు ప్రథమాశ్వాసమున 207. ద్వితీయా శ్వాసమున 294 తృతీయాశ్వాసమున 341. మొత్తము 842 గద్య పద్యములు గలవు. వీనిలో 4 పద్యములు పరిపూరితములు కావున రామలింగకవి గద్య పద్యములు 838, ఇందువచనములు 44 కావున పద్యసంఖ్య 794. అని గ్రహింపవలెను- పద్యములలో- విశేషవృత్త

ములు- 1 మాలిని- 2 పంచచామరము 2 స్రగ్ధరలు 2 మత్తకోకిలలు. 1 అంబురుహావృత్తము 1 దండకము మాత్రముగలవు-

రగడ ఇందు 37 పాదముల రగడ గలదు. దానికి పేరు ముద్రణమున లేదు- (3-287)

శ్రీకంధర గంధేభ ముఖజనక శీతాంశు కళాశోభి జటాధర
కాకోదరవల్లభ హారలతా కలిత సుధీజనపద్మ దివాకర.

ఇది హరిగతి రగడ, చతురస్రగతిని నడచునది- అనగా నాలుగు మాత్రలకు విలుగునది.

శ్రీకం, ధరగం, దేభము, ఖజనక, శీతాం, శుకళా, శోభిజ, టాధర.

(రగడలో గురువును రెండు మాత్రలుగా లెక్కింపవలెను)

దండకము ఇందలి దండకము, (3-27) శ్రీమన్మహాదేవ! దేవస్రవంతీ పయోధౌతసుస్నిగ్ధరుగ్ధారి చంచజ్జటాబృంద!

ఇది ఖండగతిని నడచుదండకము, ఖండగతి యనగా 5 మాత్రలకు విలుగునది.

శ్రీమన్మ-హాదేవ, దేవస్ర, వంతీప, యోధౌత, సుస్నిగ్ధ,రుగ్ధారి, చంచజ్జటాబృంద-

ఇందు రగడవలె, ఒక గురువు రెండు లఘువులుగా చేసికొనవలెను-

ఛందస్సు- రామలింగకవి యిందు ప్రసిద్ధవృత్తములనే తప్ప విశేషవృత్తములను వాడలేదు- ఆశ్వాసాంత పద్యములలో నొకే క్రమము పాటింపలేదు.

ప్రథమాశ్వాసము- శార్దూలము- కందము- మాలిని- (3 పద్యములు)

ద్వితీయాశ్వాసము- శార్దూలము, కందము, పంచచామరము (3 పద్యములు)

తృతీయాశ్వాసము- మత్తేభము- కందము- అంబురుహావృత్తము. (3 పద్యములు)

ఇందు రెండు పట్టుల గీత పద్యములకు ప్రాస పాటింపబడినది-

గీ. చూచు శుద్ధాంతవీథిలో సోమధరుని
గాచు శరణన్న మాత్రలోఁ గడిఁదివగలఁ
ద్రోచుఁ గలిదోష మెచ్చట దొరలకుండఁ
బ్రోచు నారాజు జయపెట్ట భూమిప్రజలు. (1-171)

గీ. దేవ సంసార భవతితిజమునకు
నావ కలుషాంబునిధి తారణంబునకును
ద్రోవ దుర్లభతర ముక్తి దుర్గమునకు
శ్రీమదారాధ్యపాద రాజీవసేవ. (3-303)

ఇందు మూడుపాదములలో ప్రాస పాటింపబడినది.

ఈ క్రింది కందమున త్రిప్రాస గలదు.

క. అలకాంత కవితముఖయుగు
కులకాంతయుఁ దానుగూడి గోపతిగమనుం
డలకాంతక కలధౌతా
చలకాంత స్థలులఁ గ్రీడసలుపుచు నుండెన్. (1-94)

## యతివిశేషములు

ప్రాదియతులు-

"జంబాలితాఖ"

లావనీపాల మందిర ప్రాంగణంబు- (1-14). ఆ- ప్ర+అంగణ = ప్రాంగణ.

అచ్చంద్రకిరీటుఁ బలుకఁ బ్రాంజలి యగుచున్. (3-388)

ఉపసర్గయతి-

వైభవోపేతుఁడు ముంజభోజుఁడు మహేంద్రుఁడు. (3-397)

ఏవకారార్థయతి-

నీవ రచింపుము కావ్యమొకటి వర్ణనకెక్కన్. (1-29)

ఏవకారార్థమున అకారమునకు వ్యంజనయతి తప్పస్వరయతి లేదు.

శకంధ్వాదియతి-

కౌండిన్య మహామునీంద్రుఁడు మనీషిజనాగ్రణి- (1-32)

ఇచట వ్యంజనయతి.

రలయతి

సా. రెకుఁ గష్టాళ జరింపుచున్ ఫలము దూలిరంపన్. (1-80)

అఖండయతి

నాభీసరస్సున వాడఁజొచ్చి- (2-159)

నో నా డ

ణామాటఁ జేయు ధృఢప్రతిజ్ఞుఁడు. (3.277)

బోరున. (3 292)

బోరున. అను దానికి నిర్ధారకము.

గొబ్బున- గొబ్బున......భోగేంద్ర. (3-283)

వీనికి ప్రాచీనమున బోరన. గొబ్బన- అని రూపము లుండెడివి.

## వే ద సూ క్తు లు

అపుత్రస్య గతిర్నాస్తి (2-59)

అవయో స్సిద్ధిరస్తు (3-157)

ఓమానస్సత్వ (3-155)

గురోరాజ్ఞాం నలంఘయేత్ (3-241)

త్రయంబకం యజామహేఁ

నకచాదిద్వియోజయే. (3-157)

నయ మ్మే అస్తోభగవాన్ (3-157)

ప్రారబ్ధకర్మాణాం దేహాభోగక్షయం (1-110)

బ్రాహ్మణో నహంతవ్య (2-131)

లోకాస్సమస్తా స్సుఖినోభవంతు (3-337)

శతాయుః పురుషః (3-79)

## శ్రు తి స్మృ తి వా క్య ము లు

"త్రయంబకం యజామహే"

ప్రారబ్ధకర్మాణాం భోగాదేవ క్షయమ్ (1-110)

అపుత్రస్య గతిర్నాస్తి (2-59)

బ్రాహ్మణో నహంతవ్య (2-131)

శతాయుః పురుషః (3-79)

అనెడి వేదవాక్యము (3-155)
ఓమూన స్సర్వ్యా
అవయో స్సిద్ధిరస్తు (3-157)
నయమ్మే అస్తోభగవాన్ (3-15)
నకచాచి ద్విరయోజయే (3-157)
గురోరాజ్ఞాం నలంఘయేత్ (3-241)
లోకాస్సమస్తా స్సుఖినోభవంతు. (3-337)

## సూక్తులు

ఎంతవారికిఁ దప్పునే యీశ్వరాజ్ఞ (1-100)
దైవగతి దీర్పన్ శక్యమే యెరికిన్ (1-134)
చెడదె యశము కామియగు మూఢునకున్ (1-130)
విత్తహీనుఁడగు వాఁడును, ప్రాణము లేనివాఁడు
ధాత్రినములు (2-336)
పతియట్ల మెలఁగవలదా, పతిదేవతలైన పుణ్యభామలకెల్లన్
(3-18)
హరకరుణా సంపన్నుల కరుదారఁగ నందరాని యట్టిదిగలదే
(3-21)
క. తమ తలఁచిన యత్నంబులు
సమకూరుచు నుండు నెపుడు సత్కర్ములకున్
దమదలఁచిన యత్నంబులు
సమకూరవు దుష్టకర్మ సంపన్నులకున్. (3-261)
ధనకాంక్షాపరుడైన వానికి నిషేధంబేల చూపట్టెడిన్.
(2-256)

## సామెతలు

అందని మ్రానిపండ్ల కఱ్ఱుఁజాచినట్లు (2-61)
ఈనునంతకుం గాచి వృకాలికిచ్చిన ప్రకారము (3-260)
(ఈనగాచి నక్కలపాలు చేసినట్లు)
ఎన్నలేని సస్యము (2-21)

ఓ యన వో యను మాడ్కి (1-137)
కాపురము నాకుఁ గడుఁబెద్ద కంచియంత (2-253)
(కంచంత కాపురము)
కొఱుకనకుంబోవబడి కల్లుఅక పయింబడిన కరణి. (1-108)
తోఁబుట్టిన పుట్టగుణము తొలగునె (2-142)
పిచ్చుకమీద బ్రహ్మాస్త్రము (1-119)
పులినాకి విడిచినట్లు (1-109)
పొన్నాకుపై తేనియ (2-102)
బయలాడిన మాటలు (2-64)
బయలు పందిరి పెట్టుట (2-66)
మొలకైన తఱినిఁ జెట్టువంప
బడుగాక పెచ్చిన వంపనగునె? (1-132)

వెదకఁబోయిన తీగఁ గాలఁజుట్టునట్లు (2-257)
వ్రేలునాకి యుపవాసఫలం బెడలించునట్లు (3-259)

## జాతీయములు

అరచేతిలోని సురరత్నము (3-120) అనాయాసలభ్యము
ఆబాలగోపాలము (2-33) అందఱుజనులు
ఈనుబుచ్చుకొను (2-225) ఇచ్చిపుచ్చుకొను సమర్థత
ఉఱుమని పిడుగు (1-108) హఠాత్తుగావచ్చిన కష్టము
ఊపిరివట్టు (1-114) ప్రాణ తెచ్చుకొను
ఏనికకొమ్ము దాదిరొమ్ము (3-61) దంతపు టుయ్యాల దాదిరొమ్ము
ఐదు పది సేయు (1-160) నమస్కరించు
ఒడగట్టిన దూలము (2-211) అనుకూలమగు
కమపుగొట్టు (3-8) ఖండించు
కన్నువైచు: (1.69) దీనికి "వలచుట" అని యర్థము. రామలింగకవి దీనిని శివభక్తిపరముగా నుపయోగించినాడు, విష్ణువు శివుని

వేయికమలములచేత ప్రతినిత్యము పూజించువాడు- ఒకనాడా వేయింటికి ఒక కమలము తక్కువైనది- వెంటనే ఆతడు తన కన్ను సర్పించినాడు శివుడు విష్ణుని భక్తికి సంతసించి ఆతనికి- చక్రము నిచ్చినాడు-

ఇచట విష్ణువు శివునియందలి భక్తి వశపు- గొన్నవాడు గావున కన్నువైచుపదము సరసముగా నున్నది.

| | | |
|---|---|---|
| కాలనుబొమ్మగట్టు | (2-103) | జయించినవారలమ కాలిక్రిందనణచు- |
| కొంగ్రడవేయు బండు | (3-79) | అధికముగా ఫలించు |
| గుల్భము బంటి | (3-131) | |
| చాయనుమాట | (2-174) | తిరస్కరించుట |
| జిట్టుమని చీదదు | (1-171) | ఆరోగ్యముగా నుండుట- |
| తంగేటి జున్ను | (1-66) | అనాయాసముగా లభ్యమగునది |
| తలలోని నాల్క | (2-141) | |
| తిప్పకాయచందములు | (2-139) | దుష్టచేష్టలు |
| తీగతెంపు | (3-161) | ఎడతెగకుండ నుండుట |

జా తీ య ము లు

| | | |
|---|---|---|
| కొంగ్రడవేయుబండు | (3-79) | అధికముగా ఫలించు |
| అరచేతిలోనిసురరత్నము | (3-120) | చేతిలోచింతామణి- కొంకు పసిడి వంటిది |
| గుల్భము బంటి | (3-131) | |
| తొండముక్కువడు | (3-177) | తండోపతండములుగా |
| ఈనుబుచ్చుకొసామర్థ్యము | (2-225) | ఇచ్చిపుచ్చుకొను సమర్థత. |
| తెరచిరాజు | (1-97) | |
| తొండముక్కు పడియె | (3-177) | బాగుగాపండు |
| నల్లిండ్లు | (2-85) | అగ్రహారములు |
| నేలయీనినట్లు | (3-181) | తండోపతండములుగా |
| పటాపంచ | (2-18) | నలుదిక్కులచెదరు |
| పుట్టగతి లేక | (1-143) | జన్మాంతరములేక |
| పూచిన తంగెడు కరణి | (3-125) | శోభాయమానమైన విధము |

ముంగొంగుపసిడి (2-25) తంగెటి జున్ను
ముక్కారుపంట (1-170) సస్యసమృద్ధి
మూసినముత్తెము (2-126-129) గారాబముగా పెరుగుట
పట్టినమ్రాకు లిగురువట్టుట (1-153) మోడుమ్రాకులు చిగుర్చుట
సగము చావు (1-116) అరచావు

## సంస్కృతము తెలుగు సేతలు

ఆకాశవాణి బయలాడినమాట- (1-64)
ఆకాశహర్మ్యము- బయలుపందిరి. (2-66)
వ్యాఘ్రాజినము- పసిదిండిపలువ. (2-77)

కన్నువైచు- (1-69) దీనికి వలచుట యని యర్థము. రామలింగడీ జాతీయమును శ్లేషగా ప్రయోగించినాడు- విష్ణువు, శివుని వేయి కమలములచేత ప్రతిదినము పూజించుచుండెను- ఒక్కనాడా వేయింటిలో నొకటి తక్కువైనది- అప్పుడు విష్ణువు తన నేత్రము. (కన్ను) నర్పించి పూజించెను- అందుకు శివుడు మెచ్చి సుదర్శనచక్రము నిచ్చెను- ఇచ్చట కన్నువైచుట యనగా కన్నర్పించుట అనియే యర్థము. కన్నువైచుట యనగా వలపు గొనుటయని యర్థము- శివునియందు వలపుగొన్నవాడు అనునర్థము సరిపడును
చా యనుమాట (2-174) తిరస్కరించుట
ఒడగట్టిన దూలము (3-211) అనుకూలముగానుండు
ఆబాల గోపాలము (3-32) జనులందఱు
పనికకొమ్ము దాదికొమ్ము (3-61) దంతపు టుయ్యెలలోను దాది రొమ్ముపైని పెరుగుట.

## పద ప్రయోగములు

ఉద్భటారాధ్య చరిత్రమున కొన్నిపదములు నిఘంటువున కెక్కదగినవి కలవు.

కావ్యుఁడు. కావ్యకర్త: కవి. నిఘంటువులలో కావ్యుడనగా శుక్రాచార్యుడను నర్థమున్నది. గాని- తెలుగున నిది కవి పరముగా వాడుక. సంస్కృతమున కవి యనగా శుక్రాచార్యుడు- కాని శుక్రాచార్యపదమే ప్రసిద్ధము.

ఇందు- "ఆదికావ్యుల కవితా నిగుంభనల" (1-26) అని ప్రయోగము. దీనికి బసవపురాణమున- "శ్రీపతిపండితుల్ శివుడ మీా కావ్యుఁడు" అనియు, సుమతి శతకమున "గాథలు పెక్కాడువాడె కావ్యుడు సుమతీ" అని ప్రయోగములు గలవు. రామలింగకవి తరువాత పెక్కు ప్రయోగములు గలవు- కావ్యుఁడు సితపక్షమునను గావించిన "అప్ప కవీయము." (2-414)

కెల్లా- (అన్యదే అరబీ) కోట- 'తన కెల్లా కెల్లిగ' (1-140)

చిట్లు కన్ను- దే. అనలనేత్రము-

సీ. పా. నెలకొల్పఁడేల కోసిటలభాగమునఁ గాశ్మీర బిందువుగాఁగ చిట్లుకన్ను. (1-178)

ఈ పదమున కిదియొకటే ప్రయోగము.

చిట్లు పదమునకు నిఘంటువులలో అగ్ని అన్న అర్థములేదు. కాని చిట్లకోఅని పదములో చిట్లు చిట చిటలాడు అన్న అర్థములో నున్నది. అగ్ని చిట చిట లాడును.

చెదలువాడ- చెదలువాటీపుర శ్రీరఘుద్వహాభుజా స్తంభ రక్షణ విధాసంభృతంబు (1-14)

ఇచట 'చదలవాడ' అకారాదిగా నుండుటకు బదులు-

ఎకారముతో 'చె'అని నిర్ధారకముగా యతిస్థానమున నున్నది. 'చదలువాడ' అనునది గ్రామనామము- [1]చతుర్వాటికాశబ్దభవము- కాని గ్రంథములలో "చదలు" అనగా, ఆకాశమని యర్థము గావున- దీనికి- ఖవాటము-అని సంస్కృతీకరణము చేసిరి (చూ. చదలువాడ సుందరరామశాస్త్రిగారి ఆదిత్యశతకము. (శ్రీ) ఖవాటాన్వయేనఖ= చదలువాట-వాడ).

చెన్నశబ్దమునకు చన్న అను రూపముగలదు- "చన్నమల్లేశ శివలింగ శరణు శరణు" అను మకుటముతో నొక శతకమే గలదు.

చేయిచ్చు- ఆసరాయిచ్చు- 'నిశాకరులకు చేయిచ్చువిధంబు (1-18) దీనికి పూర్వకవి ప్రయోగము గలదు.

ఇంటివారిని లేపి యీావల దొంగ

---

1. చూడుడు- శబ్దరత్నాకరము- సంశోధితముద్రణము.

బంటుకు చేయిచ్చు పాపాత్మురాలి-గౌరనహరిశ్చంద్ర-1 భా,పుట. 168
చేయోడు = వెనుకకు జంకుట. అవనిభరింపం జేయోడు. (1-131)
"ఐదుల యోగికి నకట చేయోడకుండ-భార. శాంతి. (4-158)
చేర్వ = చేరువ: రుద్రభూమికిం జేర్వ. (1-122)
పుట్టగతి- (మి|శ) మానవుడుగా జన్మించుగతి: మనుష్యజన్మ
"ఇట్టి చెడ్డ చేసినవానికి పుట్టగతులుండవు" అని వాడుక-
పుట్టగతి లేక భూత ప్రేత పిశాచ రూపంబుఁ (1-143)
భంగపోవు= భంగపడు, భంగపోవుట తలపూవుపై నెకాని (2-280)
రసము ఈ శబ్దమును భూమిపర్యాయపదముగా రామలింగకవి
వాడినాడు- ఇతరకవులలో నంతగా కన్పట్టదు. రసాధీశుడు (1-15)
రసావలయము (1-179) జలముచే చుట్టబడినది, భూమి
రసావల్లభా- (2-156) రసానరసీరుహాలోచన (3-38)
భూ కాంత- రసాస్థలి భూమి (3-26)
రసశబ్దమునకు భూమియను నర్థము నిఘంటువులలో లేదు- అది
నానార్థ రత్నమాలలో నున్నది.
ఆస్వాదనధ్వని సుధాంబురసాఖ్యధాతు
ష్విష్టోరసోఽథ రసనా ధరణీ రసాస్యాత్- 472-శ్లో.
రసశబ్దము స్త్రీలింగమైనవుడు నాలుకకును భూమికిని పేరు.
హాలహాలము=హాలాహల రూపాంతరము.
"శజ్జలము హాలహాల భోజనము గాఁగ. (1-18)
హిమానీ-మంచు. హిమానీశుభ్రకీర్తి (3-30)
హిమానీ శుభ్రసౌధంబులో (3-54)

## కావ్య విశేషములు

1. 1-12. కుకవినింద పద్యమందు సుకవి ప్రశంసయే హెచ్చు.

2. 1-14. సీ. మహితమూలస్థాన.......

గీతము చివరిపాదము- గురుసమృద్ధుల సయిదోడు కొండవీడు.

ఇందు గూఢ చతుర్థిగలదు. గూఢచతుర్థి అనగా సీసపద్యమున గీతమున నాల్గవపాదములో చెప్పవలసిన యంశము నిముడ్చుట-

పై పద్యమున, నాల్గవపాదము లేనిచో నీ పద్యము దేనికి వర్తించునో తెలియదు.

3. చాటుకవితాస్ఫురణ- రామలింగని చాటు కవితాస్ఫురణకి క్రింది రెండుపద్యములుదాహృతములు.

ఉ. వాలుక లెన్నవచ్చు నుడువర్గము లెన్నఁగవచ్చు భూరిభో
జాలము లెన్నవచ్చు నతిచంచలవార్థి లి కర్ణవీచికా
మాలిక లెన్నవచ్చు బుధమండల కర్ణపుటామృతంబుతా
బాలశశాంక శేఖరుని భవ్యచరిత్రము లెన్నవచ్చునే. (1-64)

ఉ. వాసనలేనిపూవు, రసవర్ణనలేని కవిత్వరేఖ య
భ్యాసములేని విద్య జలజాప్తుడులేని దినంబు చంద్రికో
ల్లాసములేని రాత్రి కమలస్థితిలేని కొలంకు చూవె కై
లాస నివాసు నాత్మలో దలంపని మూఢులజన్మ మారయన్. (1-68)

41-142. ఉరిపెట్టుకొని మరణించిన వారు, నీటిలోబడి ప్రాణము పోగొట్టుకొనెడివారు- విషముత్రాగి చనిపోయినవారు- అగ్ని హోత్రమున కాహుతియై జీవము గోల్పోయినవారు- పిశాచ రూపములు ధరింతురు.

3-113) సీ. పా. పెనుబాము రెడ్డిగంబునమించి వలయాచ
లావృతక్షితివోలె నలరువాని

ఇది ఈశ్వరుని వర్ణన-

పాము రెడ్డిగము వైచుకొని కూర్చున్న ఈశ్వరుడు చక్రవాళ పర్వతముచుట్టిన భూమివలె నున్నాడు- అని చెప్పబడినది.

"రెడ్డిగము" అనునది ఆసనములలో భేదము-

"ముడుచుకొన్న యెడమకాలి తొడమీది మోకాలు మీఁదుగా, ముడుచుకొన్న కుడికాలి పాదము మోపి, ఆ కాలిని వీపును వస్త్రముతో బిగించి కట్టుకొని కూర్చుండుట-" (శ.ర.)

ఈశ్వరుడు శేషుని- వస్త్రమువలె- ఈ ఆసనమున, కాలికి వీపునకు బంధించినాడు-

# ద్వితీయ ఖండము.

## 1. రామకృష్ణుని రచనలు

నేడు మనకు, రామలింగ (కృష్ణుని) రచన లీ క్రిందివి మనకు తెలియుచున్నవి.

| | |
|---|---|
| 1. లింగపురాణము.<br>2. ఉద్భటారాధ్య చరిత్ర<br>3. కందర్పకేతు విలాసము<br>4. హరిలీలా విలాసము. | రామలింగనామముతో వెలయుచున్నవి. |
| 5. పాండురంగ విజయము.<br>6. పాండురంగ మాహాత్మ్యము.<br>7. ఘటికాచల మాహాత్మ్యము. | రామకృష్ణ నామముతో వెలయుచున్నవి. |

పై వానిలో ఉద్భటారాధ్య చరిత్ర, పాండురంగ ఘటికాచల క్షేత్రమాహాత్మ్యములు సంపూర్ణముగ లభ్యమగుచున్నవి. కందర్ప కేతు విలాస, హరిలీలావిలాస పాండురంగ విజయములలో కొన్ని పద్యములు మాత్రమే లభించుచున్నవి. లింగపురాణమునుండి పద్యములు లభించలేదు.

### 1. లింగ పురాణము

రామకృష్ణుని కృతులలో మొదటిది లింగపురాణము. దీని నాతడు, లింగధారణ స్వీకరించిన వెంటనే రచించెను- లింగపురాణమున లింగధారణ దీక్షావిధానమంతయు నున్నది. లింగపురాణ రచనను మెచ్చుకొని కవులిట్లు ప్రశంసించినారు.

"ఉ. లింగనిషిద్ధు కల్వలచెలింగని. మేచక కంధరుంద్రిశూ
లింగని, సంగతాశిలవలింగని, కర్ధమదూషిత స్మరణా
లింగని, కృష్ణచేలునిహలింగని నీలకచన్ విధాత్మనా
లింగని, రామలింగకవి లింగనికీర్తి హసించు నిచ్చలున్.

ఇది ఛాలా వ్యాప్తిలోనున్న పద్యము.

ఈ పద్యమును క్రీ. శ. 1650 ప్రాంతము నందుండిన కోడూరి వేంకటాచలకవి తన శివరహస్య ఖండమున దీని నిట్లనుసరించినాడు.

ఉ. లింగనృపాల పుత్రుడగు లింగనృపాలుని శుభ్రకీర్తి శూ
లింగని, శారదాభ్రపట లింగని, నాకధునీతరంగ పా
ళింగని నీలచేలునుహలింగని మానవ విస్ఫురన్మరా
ళింగని పద్మగర్భునిచెలింగనిసారె హసించు వెంతయున్.

(శివరహస్య ఖండము- సంభవ కాండము అవతారిక)

ఇందువలననీగ్రంథము వ్యాప్తిలోనున్నట్లుమనము భావింపవలెను.

## కందర్పకేతు విలాసము

ఈ ప్రబంధము రెంటూరి చిట్టమరసుకు కృతియని తెలియుచున్నది. ఈవిషయము మానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసినారు.[1] ఈగ్రంథము లభ్యము కాకపోవుటచే నే విషయము నిర్ణయింప వీలులేదు ఇందుండి నాల్గు పద్యములు మాత్రము లభ్యమగుచున్నవి. ఆ పద్యములను బట్టి చూడగా నిది శృంగారరస ప్రధాన ప్రబంధమని తెలియనగును.[2]

ఉ. అక్కమలాక్షిఁ గన్గొనిన యప్పటినుండియు నేమిచెప్పనా
కెక్కడఁజూచిన న్మదనుఁ డెక్కడఁజూచిన రోహిణీ విభుం
డెక్కడఁజూచినం జిలుక లెక్కడఁజూచిన కమ్మతావుల్ లిం
కెక్కడ వెట్ట యోర్వఁగల నీవిరహానల తాపవేదనన్. 425-ప.

ఉ. కామిని చంద్రుఁజూచి మదిగందు సరోరుహగంధి మందిరా
రామముఁజూచి ప్రమానుపడు రాజనిభాననసారెకున్ శుక
స్తోమముఁ జూచి యేఁకరును దొయ్యలి కోకిలఁజూచి కంటఁగెం
పౌమదలీలదాల్చు మదనానలతాప విషాద వేదనన్. 426-ప.

సీ. తారామనోరంజ నారంభమే దొడ్డు
శిలలు ద్రవింపంగఁ జేయుననినఁ
జాకోరహర్షమో జనకేళి యేదొడ్డు
పేర్చి యంబోధు లుబ్బఁచుననినఁ

---

1. పూర్వోక్త మానవల్లి రామకృష్ణకవిగారి వ్యాసము- తెనాలికవులు ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక. 1914- పుట. 103

2. ప్రబంధ రత్నావళి: 424-428 పద్యములు.

గుము దేషు కాపోవ శమకృత్య మేదొడ్డు
సృష్టియంతయుఁ జిల్లనేయుననినఁ
వరనిశాకామినీ పాల్లభ్య యేదొడ్డు
వర్ణింప సత్కళాపూర్ణుఁ డనినఁ—
గీ. దనకు సర్వజ్ఞ శేఖరత్వంబు గనిన
హితసుధాహార వితరణంబేమి దొడ్డు
ననఁగ విలసిల్లు హారిదంత హస్తిదంత
కాంతినిభ కాంతిఁ జెలువారి కలఁడు వైరి. 427-వ,

ఉ. వారిజ! మీన! కోక! యళివర్గ! సితచ్ఛద! సల్లతావనీ
మీసుచిరాస్య మీనయన మీకుచ, మీయలకాలి మీ గతిన్
మీ రమణాంగి మత్ప్రియను మేయగతిన్ విరహాతురానన్
మీరును మీరు మీరు మఱి మీరును మీరును మీరు
మీరుమన్. 428,

ప్రభాకరశాస్త్రిగారు పై నాల్గు పద్యములు మాత్రముదాహ రించిరి కాని రామకృష్ణకవిగారు కుమారసంభవము ప్రథమభాగము లఘుటీకలో — కందర్పకేతు విలాసమునుండి యీ క్రింది పద్య ముదాహరించినారు.

మ. లలితాస్యాంబురుహంబు, నీలకచరోలంబంబు, నేత్రాసితో
త్పలముచ్చైస్తన కోక మోహ్మవిలసద్భం ధూక ముద్యత్కట
పులినంబుద్గత చిత్తజాత రసవాఃపూరంబు ప్రాణేశ్వరీ
జలజావాతము నొచ్చి యాడక మనోజాతానలం బారునే
(చూ. కుమారసంభవము ప్రథమభాగము ముద్రణము, 1908)
ఇందువలన నిందులభించిన పద్యము లైదని గ్రహింపవలెను.

హ రి లీ లా వి లా స ము[1]

కందర్పకేతు విలాసము తరువాతి కృతి హరిలీలావిలాసము- పెదపాటి జగ్గన- దీనినుండి పద్యము లుదాహరించుచు, నిది తెనాలి రామలింగయ్యది అని చెప్పుటచేత నిందలి గద్యమందు రామలింగకృత మేయని యుండునమట నిశ్చితము.

జగ్గన యిందుండి 21 పద్యముల నుదాహరించుటచేత నిది చాల ప్రశస్త ప్రబంధమని చెప్పనొప్పును. లభ్యములైన పద్యములనుబట్టి

చూడ నిందు సాకేతపుర వర్ణన ముండుటవలన, నివి రామావతార లీలను వర్ణించునవిగా నుండబోలును. ఇట్లే దశావతార లీలలను వర్ణించు నీకృతికి, హరిలీలావిలాసము అను పేరు రామలింగకవి పెట్టి యుండవచ్చును. ఈ పేరు నిశ్శంక కొమ్మన శివలీలావిలాసము నుండి గ్రహించెననుట నిర్వివాదము.

రామకృష్ణుని కీ రచనయందు మిక్కిలి మక్కువ. అందుచే రెండుపద్యముల నిందుండి తన పాండురంగ మాహాత్మ్యమున దీసి కొన్నాడు. మొదట నిందుదాహరించిన పద్యములను వివరించి యాపై పాండురంగ మాహాత్మ్యమున నున్న పద్యములను గూర్చి తెలిపెదను.

## హరిలీలా విలాసము[1]

### తెనాలి రామలింగకవి

### పు ర వ ర్ణ న[2]

క. పురనిధి రక్షకునై ఫణి
పురము వెడలి వెట్టినట్టి పొంగారు ఫణా
ధరపరివృఢు కరణి తదీయం
కరమగు ప్రాకారపరిధి కడునచ్చెరువై. 1

ఉ. పున్నమచందమామఁ బొరపుచ్చి సుధారస మొయ్యఁ
జిల్కుచున్
సన్నముగాగ నూటి ఘనసారమునం బ్రబిపాక మిచ్చి మీఁ
దన్నెలయుంగ నల్కిన విధంబున వెన్నెలగాయ నవ్వురిన్
సున్నపుమేడ లభ్రపదచుంబి శిరోగృహరాజి రాజిలున్, 2

---

1. నిశ్శంక కొమ్మన క్రీ. శ. 1485 ప్రాంతమున రచించిన శివలీలావిలాసము ననుసరించి. రామలింగకవి- హరిలీలావిలాసము అను పేరు పెట్టినాడు.

2. ప్రబంధరత్నావళిలో- పద్యములు వరుసగా నున్నవి. నేను వానిని వళ సాంకముల క్రింద వివరించితిని. (427-458 ప)

చ. సకళ దళత్సరోరుహరసార పరాగ పరంపరా పరి
స్ఫురిత సువర్ణ వర్ణమును బూరిత దిఙ్ముఖహంసనాదమే
దురముసై యగడ్త కనుదోయికి పండుగసేయఁ బ్రోయుఁద
త్పురవరలక్ష్మి యెప్పుడును బూనెడు కాంచన కాంచికైవా
యనన్, 3

బ్రాహ్మణులు

ఉ. వేదపురాణ శాస్త్రములు వేడుకవిద్యలు, సర్వయజ్ఞ సం
పాదనశక్తి నిత్యనియమాయవిధి ప్రతిపాలనంబు దా
రాదిమతత్త్వముం గనుట, హస్తగతామలకంబుగంట ధా
త్రీ దివిజావతంసముల కరింపమ మప్పురిగల్గు వారికిన్, 4

క్షత్రియులు

ఉ. వీటి మహానుభావులిహి హీ జమదగ్ని తనూజుఁ డేదు ము
మ్మాటులుగాని శత్రుమదమర్దన దక్షుడుగాడు గోత్రమే
మాటుగఁ జేత, తల్లి మెడ ద్రుంచెగదా యని యీసడింతురా
గాటపు పంతగాండ్రుడు పలగణ్యులి గణ్యులు పుణ్యులప్పురిన్. 5

వైశ్యులు

చ. యుగములు వేయువోవు నొక యుద్ధరువుల్ గణుతించు నంతకే
యుగములు అతచెల్లుఁ బొరినున్న ధనంబు మితింపనమ్మహా
యుగ శతకోటులేగు నిజరోన్నత వస్తువులెన్నఁ గీన వె
ల్తిగ నలకాధినాధులు గదే పురిలోపను వైశ్యపుంగవుల్. 6

శూద్రులు

ఉ. ఆకరివేల్పుసామి చరణాబ్జములన్ జనియించినారు మం
దాకిని తోడునీడలయి నారు నిజంబుగఁ గమ్మగట్టి దా
మై కమనీయ కీర్తిమహిమాతిశయంబున మించినారు భ
ద్రాకృతులద్రి ధీరులు ప్రభాద్రులు మాద్రులు శూద్రులప్పురిన్ 7

స్త్రీలు

సీ. ముదురుఁ జీకటి మన్నె మూఁకకుఁ గెజీత
మొనఁగు కుంతలముల యొప్పు వెలయఁ
బండువెన్నెల ఢాఁక బంటుగా నేలు చ
క్కని మొగంబుల నిక్కుగని భజింపఁ
బసిఁడిగ్రచ్చేని చేపట్టు కుంచము నేయు
జిగిమించు చన్నుల బిగువు నిగుడ
గబ్బి యేనిక దొర గాఁకాముగాఁగ మ
న్నించు వేనడవుల నేర్పు మెఱయ
గీ. యూరువులె గాడు రంభమై యొఱపుఁ దమ వ
శమ్ముఁ గావింపఁ బదనఖ చయమొగాదు
విలసము దార పాటింప వీటఁ బద్మ
పత్రనేత్రలు చాల చూపట్టుచుంద్రు
సీ. వలమాల చంపకోత్పల మాలికాది సం
గ్రథన చాతురి నెఱ కవులఁ బోలి
దళము గెలిచిన నూత్రమున నూలు కొల్పునే
ర్పున యౌధవీరుల పోలుపు దెలిపి
ఖండితత్వమున రాగముగల పల్లవా
వలిగోయుటల వేశ్యవలపు నెఱపి
పలుతావులరసి యెత్తులు పచరించు పెం
పున జూదరుల తేవ పొడమఁజేసి
గీ. తమనిజాంగ మరీచులు తత్తదన్య
పుష్పములసావి నిక్కంపుఁ బువ్వు లమరు
పేరఁ బేర్కొను పొరుల గేరిగేరి
నవ్వుదురు పుష్పలావికాసలినముఖులు, 9

ఏనుఁగులు

సీ. మదభిన్నకట గళన్మౌక్తికంబులు తోట
తోటరాల మస్తవిధూననముల
ఆనమత్కులంబులగు పదక్రమముల
ఘణ ఘణం కృతి నాభినుంటులులియఁ

గి_రిచంద్రికల యాకృతి దట్టమై ధళ
ధళఁ బర్వ దంత కుంతముల రుచులు
పుష్కర పూత్కారముల వకాళపు వాన
కారుతెల్లతఁ దమతార కురియఁ
గీ. దమకుఁ బరవాహినులలోను దలియఁ జొచ్చి
క్రీడలాడుట యుచితంపు జాడలసఁగఁ
బెసగి సరయూ జలంబుల సరస లీలఁ
గ్రాలఁ జనుచుండు సవ్వారి గంధకరులు. 10

గు ఱ్ఱ ము లు

ఉ. చంగునదాఁటు థే యనిన సప్తసముద్రములైన వేగ వా
గంగుదియింప నిల్చు నడుగెంటనె శస్త్రనిపాత ధీరతన్
సంగర రంగవీథిఁ దమస్వామికి గెల్పు ఘటించునట్టియు
త్తుంగతరంగ రత్నములు తొంటి హయాకృతి శార్ఙ్గి
పుట్టువుల్. 11

ప్రా భా త మా రు త ము

చ. తెలతెలవాఱ నొయ్య నరుదెంచు నితాంతర కాంతకాంతలా
చెలువల కింపుగా మెలఁగుఁ జెక్కులఁగూరిన చూర్ణకుంతలా
వళిసరసంబుగా జడియు వాడిన సెజ్జలమీఁద ప్రావిరుల్
దొలఁగఁగవేయు నూడిగపుఁ దొయ్యలులంబలె వేగు
దెమ్మెరల్. 12

రా జ న గ రు

సీ. వినుత మాణిక్యనందన మాలికాకాండ
కల్పిత రోహితాకార రేఖ
జాలకానన నిర్యదాలోల వాసనా
గరుధూప పోషిత కంధరాళి
చంద్ర శాలాతిగర్జన్మృదంగధ్వాన
విరచిత పరిఘోష విభవలహరి
సంభోగ సంరంభసమయ విచ్ఛిన్నము
క్తాహారమణి కృతకర కనికర

గీ. మదనమద భార మంధర మత్తశాలి
నీ దృగంచల సంచిత నిబిడ చంచ
లాంశుశాతల్లజయునై యిలా వివక్త
వర్షయన నొప్పుఁగాకుత్థ్స వంశనగరి. 13

## గృ హ దీ ప ము లు

గీ. భాను శశిమండలంబుల లో నడంచి
యిరులు పెనువాన గురియుచు నేపుచూపు
రాత్రి వర్షర్తువునఁ బుట్టెఁ బ్రతిగృహోక
రములఁ బటు దీపవైడూర్య రత్న సమితి. 14

## సాం ధ్య రా గ ము

ఉ. రాసి సహస్రభాను ఫణరత్నము లెల్లనుఁబోవఁ దన్నుచున్
వాసర భోగిరాజ ఫణివైరి కడున్వడి నొక్కినక్కుగాఁ
జేసినఁ గ్రమ్ము తద్రుచిర శీకరపూర విజృంభణం బనం
గానముద్గతం బొలిచెఁ గ్రమ్మి జపోపమసాంధ్య
సూర్యాస్తమయము రాగముల్. 15

ఉ. ఎంతయురాజు తోడ పగయేకోదవో మధు ప్రవర్తియ
క్రాంతముగల్గు తమ్ముల ప్రచారముగాదని చూడనోడి దే
శాంతర మేగె నాఁగ నపరాశఁ బతంగుఁడు డాఁగెనట్టి వృ
త్తాంత మెఱింగి సిగ్గొలపినట్టులఁగందె సరోరుహాంబులున్. 16

## న క్ష త్ర ము లు

గీ. ఉడుపథం బనుములు దోసతోడిమ యూడఁ
దామరస బంధుఁడను పండుతనకుఁ దానె
విశ్రుతి గనుపింప కనుపట్టు విత్తులనఁగఁ
దనరె నెఱసంజఁ గెంపగు తారకములు. 17

ఉ. కాలధనంజయుండు తనుగాంచి దివాకరమత్స్యయంత్రమున్
గీలెడలించి సంధ్యయను కృష్ణ నుదంచిత రూపవిభ్రమ
శ్రీలలితాంగినిం దగవరించి తమోమయ ధార్తరాష్ట్రభూ
పాలక సేననేయు సిత భల్లములోయనఁ బర్వెఁదారకల్. 18

## చంద్రాస్తమయము - సూర్యోదయము

సీ. నీరింకఁదొడఁగె వెన్నెల మానికంబుల
 వేఁడి రాతూఁపుల విడిసెవహ్ని
కలఁగె జీవం జీవముల నిండుమనములు
 జక్కవ పులుగుల జాలివదలెఁ
గనుమూసె కుముదకానన విభావిభవంబు
 శ్రీలక్ష్మినిలిచె రాజీవపీఠి
వాజువాఱఁగఁ జొచ్చె వరుణుని దిక్కున
 నేర్పడి దీపించెఁ దూర్పువలన
గీ. తారలుడివోయె వికసించెఁ దరులవిరులు
చంద్రికలు గందె కొలఁకులు చాలఁదేఱె
దీపరుచిదాఁగె తలమూపె రేపటెండ
చందురుఁడు వ్రాలెఁ బొడిచెఁ గంజాత హితుఁడు.

## వంటకము

ఉ. ఆలఘృతంబు వేఁచియగు నన్నము సుర్పిన ముద్దపప్పు క్రొం
దాలిపుగూర అప్పడము ద్రబ్బెడచారులు పానకంబులున్
మేలిమి పిండివంటయును మీఁగడతోడి దధిప్రకాండమున్
నాలుగు మూడు తోయములు నంజులు గంజదళాళి
 పెట్టఁగన్. 20

## మ ధు పా న ము

చ. సరసులపొందు గల్దనఁగఁజాలి బహూన్నతచారు శాఖలం
బెరిగి మహోద్విజావనమె పేర్మినిజాయతిగాఁ దనర్చి ని
ర్భర జనతాపసంహరణ పాత్రములయ్యె మహీజవాటికల్
పురివెలినిల్చి మేటియు నపూజుఁడగున్ మధుపానుకూలతన్. 21

హరిలీలా విలాసమునుండి రామకృష్ణుడు పాండురంగమాహాత్మ్యము
మున గ్రహించినవి-

## అశ్వ వర్ణము

ఉ. చెంగునదాటు ధేయనిన సప్తసముద్రములైన వేగవా
గెం గుదియించి "నిల్చు నడుగెంటనె" శస్త్రనిపాత ధీరతన్
సంగరరంగవీథిఁ దమస్వామికి గెల్పు ఘటించునట్టియు
త్తుంగ తురంగ రత్నములు తొంటి హయాకృతి శార్ఙ్గి
పుట్టువుల్. (435 ప)

పాండురంగ మాహాత్మ్యము నందలి యీ క్రింది యశ్వవర్ణనము చూడుడు.

ఉ. కెరలక క్రమ్మరించు "నడుగెంటనె నిల్చు" నోకింత నూఁకినన్
శరనిధులేడు దాఁటుమెయి చాచి చివుక్కున, నుక్కుమీఁటి సం
గరమున గాయమైన పతిఁ గాచుఁ జలింపక, తత్పురీహరుల్
హరిహయు మావుమున్ దిగిన యంబుధి ఠేవున వచ్చె
నోజుమీ. (1-114)

రెండును అశ్వ వర్ణనములే. 'అడు గెంటనె నిల్చు' అను నది రెండింటికి సమానమే. భావములు సమానమే- అయినను పద్యభావ విన్యాసమున మొదటి దానికంటె రెండవది యే ప్రౌఢత చూపుచున్నది

## ప్రభాత మారుత వర్ణన

చ. తెలతెలవాఱ నొయ్యొ నరుదెంచు నిశాంత రతాంత కాంతలా
చెలువల కింపుగా మెలఁగుఁ జెక్కులఁగూరిన చూర్ణకుంతలా
వళిసరసంబుగా జడియు, వాడిన సెజ్జలమీఁది ప్రావిరుల్
దొలఁగఁగఁ జేయు నూడిగపు తొయ్యలులంబలె వేగు
దెమ్మెరల్. (ప. 437)

పాండురంగ మాహాత్మ్యము నందలి ప్రాభాత మారుత వర్ణనము,

చ. [1]తెలతెలవాఱ నొయ్యొ నరుదెంచి, నిశాంత రతాంత కాంతలా
చెలువల కింపుగా మెలఁగి, చిక్కులగూటిన చూర్ణకుంతలా

1. అకాడమీ ముద్రణము- రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి పరిష్కరణము.

వాలి సరళంబుగా జడిసి, వాడిన నెజ్జలమీఁది ప్రావిరుల్
దూలఁగఁ బ్రభాతవాయువులు దోఁచు (ద్రోఁచు?) బురిం
బరిచారికా కృతిన్, (1-119)

పుటయందుగున పాఠభేదములలో 10. చెక్కుల ముద్రి. అని కందు.

ఈ పద్యమున రామకృష్ణుడు నాల్గవపాదము కొంచెము మార్చి నాడు. ఊడిగపు తొయ్యలి "పరిచారికాకృతిన్" అన్నాడు. కాని రెండు పద్యములలో కొంత భేద మున్నది. పాండురంగ మాహాత్మ్యము నందలి పద్యమున క్రియలు క్త్వార్థకములుగా నున్నవి. హరి లీలా విలాసమున పద్యమున కాలవివక్ష లేకుండ, సర్వకాలములందును ఆ క్రియ జరుగునని సూచితమైనది,

తెల తెలవారగానే పనిమనిషి వచ్చి, ఇంటివారి కింపుగా మెలఁగి ప్రక్కలను దులిపి, యిల్లు మార్జనము చేయుట నేడును మనము చూచు చుండినదే- రామకృష్ణుడీ పద్యమున ఆ ఊడిగపు తొయ్యలినే వర్ణించియున్నాడు-

పరిచారికకు "ఊడిగపు తొయ్యలి" అనుట రామకృష్ణుడు సంస్కృతమును తెనుగు చేయు నేర్పు సూచించును. ఇట్లే ప్రభాత వాయువులకు వేగుదెమ్మెరలు "చిక్కులగూటిన...సరళంబుగాజడిసి-" అనుట కన్న "చెక్కులఁ గూరిన ... సరసంబుగా జడిసి" అనుటయే సరసము.

ఈ పద్యమున నింకను నొక విశేషము- పురవర్ణనలో మారుత వర్ణనము నన్నెచోడుని కుమారసంభవముతో ప్రారంభమైనది. కవు లందఱును, వాయువును, 'గంధవహుడు', 'మందానిలుడు', పవనుడు 'కోడెగాడు' అని పుల్లింగ వివక్షచే వర్ణించిరి. కాని యిందు రామ కృష్ణుడు వాయువునకు స్త్రీత్వము ఘటించుట చిత్రము-

సాధారణముగ కవులు తాము ప్రథమముగా రచించిన కృతుల నుండి తరువాతి రచనలలో పదబంధములను, పద్యములను నుపా హరించుకొందురు. వీనినే స్వసంవాదము లందురు, తిక్కన నిర్వచ నోత్తర రామాయణము నందలి పద్యములను భారతమున నుద్ధరించుట పారస్వతేయులకు పరిచితమే. అట్లే రామకృష్ణకవి హరిలీలావిలాసము

నుండి పద్యమును పాండురంగ మాహాత్మ్యమున మార్పుతో సంధా
నించెను.

దీనినిబట్టి 'హరిలీలా విలాస రచన' పాండురంగ మాహాత్మ్యము కన్న ముందని గ్రహింపవలెను.

హరిలీలా విలాసమునుండి యీ క్రింది పద్యమును కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణసార సంగ్రహమున 'బిందువడి' కి లక్ష్యముగా నుదాహరించి యున్నాడు-

ఉ. ఆకలివేల్పుసామి చరణాబ్జములన్ జపియించినారు నుం
డౌలిని తోడునీకలయినారు నిజంబుగఁ గన్నుకట్టి దా
సై కమనీయకీర్తి మహిమాతిశయంబున మించినారు భ
ద్రాకృతులద్రి ధీరులు ప్రభాద్రులుమాద్రులు శూద్రులవ్వారిన్.
(పుట 183)

ఈ పద్యము ప్ర. ర. లో 429 వ పద్యముగా నున్నది.

పై లక్ష్యమునుబట్టి తిమ్మకవి కాలమునాటికి అనగా క్రీ. శ. 1740 నాటికిది ప్రచారములో నున్నదని తెలియుచున్నది.

## పాండురంగ విజయము

హరిలీలా విలాసము తరువాత రచితమైనకృతి పాండురంగ విజయము-

1) ఈ గ్రంథమును తెనాలి రామకృష్ణకవి రచించినట్లు తొలుత తెలిపినవారు ప్రథమ కవిచరిత్రకారులు గురుజాడ శ్రీరామమూర్తిగారు[1] వారి వాక్యము క్రింద నుదాహరింప బడుచున్నవి. "ఇతడు నియోగి బ్రాహ్మణుఁడు. శుక్లయజుశ్శాఖలోని వాఁడు. ఇతఁడు తనవంశమును గూర్చి పాండురంగక్షేత్ర మాహాత్మ్యములోఁ గొంత చెప్పియున్నాడు.

1. ఆంధ్ర పంచకావ్య కవుల చరిత్రము. 12 తెనాలి రామకృష్ణ కవి. (1898) (పుట 193) ఈ సాటి గురజాడ కవిజీవితములను పుక్కిటి పురాణముగా పరిగణించుట తెల్గుయందు చరిత్రకారులకు పరిపాటియైనది. తెనాలి రామకృష్ణ కవిని గూర్చి వారు వ్రాసిన విషయములే, తరువాతి చరిత్రకారులకు ఆధారములైనవి- (చూ. తెనాలి రామకృష్ణుడు: ఆతని సమకాలికులు భారతి-1941)

అంతేకాక విశేషమగు వృత్తాంతములేమైనను "పాండురంగ విజయమను గ్రంథములో నుండవచ్చును. కాని యా గ్రంథ మామూలాగ్రముగ దొరకుటలేదు. నామిత్రు లా గ్రంథములోని కొన్ని యాశ్వాసములు చూచినట్లే చెప్పియున్నారు." ఇట్లు వ్రాయుటయే గాక. అందుండి కొన్ని పద్యములను చాటువులుగా నుదాహరించి, "ఇవి పాండురంగ విజయములోనివి" అనికూడ తెలిపియున్నారు. కావున నీకృతి రామ కృష్ణునిదే.

## దశావతార పద్యములు

2) శ్రీ రామమూర్తిగారే తొలుత నేను వ్యాప్తిలోనున్న దశావతార పద్యములను రామకృష్ణకవి రచితములుగా నిట్లు ప్రకటించినారు.

"విష్ణుని దశావతారములు పద్యదశకంబున వర్ణించె దానిం జూచిన నీతని సంస్కృత సాహితీ పటిమయు, సమాసకల్పనలోని ప్రజ్ఞయు గాన్పించును"గాన వాని నీక్రింద వివరింతము (పుట 240-241). పద్యముల చివర.

ఈ పద్యములలో నేకసమాసము లుండుటయు 'అను' అను తెనుగు పదముండుటయుం జిత్రము. (పుట 241) యీ పద్యము ఎల కూచి బాలసరస్వతీ కృతమని కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్య మణిమంజరి ప్రథమ భాగము (  ) న తెలిపినారు.

గురజాడవారు దశావతార పద్యములను. పాండురంగ విజయ ములోనివే యని చెప్పలేదని పైనియుదాహరించినవాక్యములే తెలుప గలవు, అయినను. అవి పాండురంగ విజయములోనివే యని యీ క్రింది "దశావతార పద్యటీక" తెలుపుచున్నది.

దశావతారములు; సటీకము. పై పేరున, ఈ దశావతార పద్య ములు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నొక తాళ పత్ర గ్రంథమున గలవు (గ్రంథసంఖ్య R 543) ఆ గ్రంథ గద్యయం దిట్లున్నది.

"ఇది శ్రీవత్సగోత్ర పవిత్ర శ్రీమదాపస్తంబసూత్ర శ్రీమద్రఘు నాథభట్టరాచార్య కృపాపాత్ర,శ్రీమత్కోదండరామాచార్యవర్యపుత్ర,

దుర్వ్యాదిగర్వ లతాలవిత్ర, శ్రీమద్వ్యాప్యాది గ్రంథప్రబంధార్థ్యయనాధ్యా పన విరచిత కృష్ణమాచార్యగోత్ర విరచితాఖండ పండితమండలిదుర్వి జేయ తాత్పర్య పర్యాయ పిచండిల పాండురంగ ప్రబంధ మధ్యనిధేయ హృద్యతమ దశావతారికా పద్యమాలికా టీకా నిగూఢార్థ చంద్రికా కర ద్రాకా సమాప్తా"[1]

పై టీకయందు దశావతార పద్యములు పాండురంగ విజయ మున నున్నవని తెలుపునేగాని అవి రామకృష్ణ కవిత్వమని తెలుపదు. కవివని నిశ్చయపఱచుటయేగాక, అవి పాండురంగ విజయస్థ పద్యము లని నిర్ధారణ చేయుచున్నవి. కాని ఆ తాళపత్ర లేఖన మేనాటిదో తెలియలేదు.

ఇది చాటువేయైనను నిది పాండురంగ విజయమున రామకృష్ణ కవిదే యన్న మాటకు బలమొసంగుచున్నది.[2]

పై యుదాహరణము దశావతార పద్యములు, పాండురంగ విజయములోనివని స్పష్టము చేయుచున్నది గాని, పాండురంగ విజ యము తెనాలి రామకృష్ణునిదే యని చెప్పుటకు నీ గద్యయందే యాధారము లేదు-

3) పాండురంగ విజయము లోనివని పద్యములుగా, పైదశావ తార స్తుతి పద్యములు నిశ్చితములైనవి- ఇక, వీనికిని రామకృష్ణుని

---

1. ఈ దశావతార పద్యటీక- టీక ప్రతి పూర్వోక్త ఘటికాచల మాహాత్మ్య పీఠిక 6వ పుటలో నుదాహృతమైనది. ఈ దశావ తార టీక-కృష్ణమాచార్యుల గద్యలేకుండ "వానార్థ గాంభీర్య చమత్కారిక" అన్న గ్రంథమున క్రీ శ 1888 లో ముద్రిత మైనది. ఇందే "పద్మవ్యూహచిత్రము గూడ నున్నది. ఇది నా జనకులు సుందరము పంతులుగారి పుస్తక భాండాగారము లోనిది. నేడు శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ పుస్తక భాండా గారమున నున్నది.

2. ఈ చాటువు రామకృష్ణ కవిదిగాదు. అయినను పాండురంగ విజయము తెనాలి రామకృష్ణకవిదిగా తెలుపును-అంతే.

కృతులకును, పోలికయున్న, లేక భావానుసరణములున్న నట్టిదీ కృతి రామకృష్ణునిదేయని మనము చెప్పుట కవకాశము గలుగుచున్నది- దీనికి యీ దశావతారస్తుతి పద్యము లెట్లు తోడ్పడునో చూతము-

పాండురంగ విజయమున దశావతార పద్యములు పదునొకండు గలవు. ఇందు బలరాముడు, కృష్ణుడు వేరు వేరు పద్యములతో స్తుతింప బడినారు-

బ ల రా ము డు

మ. కరిపూరుద్ధతకృత్త లాంగలవిభగ్నక్ష్మాభృత్పాదతటీ
కృరిపాద ప్రహార స్ఫుటస్ఫుటిత భోగవ్యావృతగ్రీవ సా
కర పీఠీకృత వృత్తకాహిత మహాగాడాభి హూత్కాధిరా
ట్పరిక్లృప్తప్రసరణాంబుగాహనహావిర్బ్రహ్మన్ స్తుతుస్త్వామనున్

కృ ష్ణా వ తా ర ము

మ. అతిదోఃపీడన కర్కశీఫలిత కంఠాభశ్వేదుద్ధూర్త్వ ధూ
ర్తకృశానర్త దృఢాంగ పాతహితగోత్రా భర్తృప్రోత్పాదిత
క్రతుభుగ్రాద్గ్రిహణా గ్రహోన్ముఖ శరారధ్వస్తమైనాక ని
ష్పతన ప్రాంతిక నందగోపకసుత బ్రహ్మన్ స్తుమస్త్వామనన్-

ఇట్లు, బలరామ కృష్ణులకు రెండుపద్యములు వేరు వేరుగా నుండి పదకొండు పద్యము లైనను, నివి దశావతార పద్యములే యని వ్యవహృతమగు చున్నవి. అందుచే సాహిత్య విమర్శకులకు సందేహము గలిగించినవి-

కాని రామకృష్ణుడీ దశావతారస్తుతి శ్రీనాథమహాకవి ననుసరించి చేసినాడు- శ్రీనాథుడు నైషధమున నిట్లే-బలరామ కృష్ణులను వేరు వేరుగా వర్ణించినాడు. శ్రీకృష్ణు నైదుపద్యములతోను, (8-131-135) బలరాముని ఒక్కపద్యముతోను (8-136) స్తుతించి, ఆ యవతారైక్యమును గూర్చి యిట్లు చెప్పినాడు-

క. బలరామ కృష్ణ సంజ్ఞల
దెలుపు వలుపునైన దివ్యతేజంబులలో
నిలమీద నవతరించిన
బలరాముని వెలులు శర్మ సౌరభమొసఁగున్. (8-137)

ఇట్లుచెప్పి- కల్కి అవతారమును-

జ్ఞాన కర్మేంద్రియోపాధి సంప్రభూత
దశ మహాకల్కనీహార దశ కరాంకు
దశమ దివ్యావతారు సత్యాంత నియతిఁ
గల్కి దేవుని నినుఁగొల్తు కైటభారి (8-141)

కల్కి అవతారము స్పష్టముగా దశమావతారమని చెప్పుటచేత బలరామ కృష్ణులు వేఱువేఱుగా వర్ణితులైనను ఒకటే యవతారముగా పరిగణింప వలెను. రామకృష్ణకవి శ్రీనాథు ననుసరించి బలరామ కృష్ణులను, పాండురంగ విజయమున వేర్వేఱుగా స్తుతించి, తరువాతి రచనలైన పాండురంగ మహాత్మ్యమున ఘటికాచల మహాత్మ్యమున వా రిరువురే కావతార మగుటవలన బలరాముడు శ్రేష్ఠుడు గావున బలరామునే స్తుతించి శ్రీకృష్ణుని విడిచి పెట్టినాడు. అదిరహస్యము.

ఇందువలన రామకృష్ణకవి కృతులు మనమెంత జాగరూకతతో నధ్యయనము చేయవలెనో తెలియగలదు. దీనిని కనిపెట్టలేక ఘటికాచల మాహాత్మ్య పీఠికాకర్త లిట్లు వ్రాసిరి.

"శ్రీమహావిష్ణువు సంపూర్ణావతారములు రెండింటిలో కృష్ణావతార మొకటి యైనప్పుడు, తాను కృష్ణభక్తుడై యుండి దశావతారములలో కృష్ణావతారమును రెండు వైష్ణవ గ్రంథములలోను రామకృష్ణుడు స్మరింపకుండుట యది వింత"[1]

బలరాముని స్తుతించిన శ్రీకృష్ణుని స్తుతించినట్లే. అందువలన రామకృష్ణకవి కృష్ణస్తుతి ప్రత్యేకముగా రెండిటియందు చేయలేదు.

దశావతారస్తుతులు, పై రెండు గ్రంథములలో నొక్కొక్క పర్యాయము మాత్రమే యున్నట్లు పై పీఠిక తెలుపుచున్నది. కాని యది సరికాదు. పాండురంగ మాహాత్మ్యమున దశావతారస్తుతి మూడు మాఱులు చేయబడినది. వీనిలో రెండు నొకేచోట యున్నవి.[2] కావున

---

1. ఘటికాచలమాహాత్మ్య పీఠిక. 75 పుట అకాడమి ముద్రణము
సంపాదకుడు డాక్టరు కేతవరపు రామకోటిశాస్త్రి.

2. ఈ దశావతారములను గూర్చి నేను వ్రాసిన వ్యాసము చూడుడు. పరిశోధన. బుద్ధజయంతి సంచిక. (1957)

నా స్తుతులు మూడు, మొదటిది ద్వితీయాశ్వాసమున- 55 నుండి 65 పద్యము వఱకును దశావతారస్తుతి, రెండవది దీని వెనుక నీ క్రింది సీసపద్యమున గలదు. మూడవది తృతీయాశ్వాసము 102 పద్యము రెండవది-

సీ. నీటిలోఁ జివుకక నిలిచి క్రుమ్మరుపూని
కఠిన కర్పరపుఁ జుక్కాను బిగువు-
దంష్ట్ర నెత్తిన మహీతలపు గాడుపుఁజీర
యురు దారు కలనయుం దుదయమగుట
పరుఁకు తన కట్ల బలిమిఁజూపు విధంబు
పులిమిన నెత్రు గుగ్గిలపు నూనె
ద్వీపాంతరమునకుఁ దెగువయైయెఁ జను పెంపు
చేముట్టు నాగంటి జీని తగులు,
గీ. సాగశా గతమాలిమి శాస్త్రసరణి
వల్గుఫల్గన చిత్రభావనము గలుగు
నిన్నుఁ దరిచేసి భవవార్ధి నిస్తరించి
దరిఁ దఱియకున్నఁ గలదె మోహము మురారి. 66-వ

ఈ పద్యము బహుగంభీరమైనది. భావవిస్తరణకు చోటులేదు- అవతారములను మాత్రము తెలుపుదును-

మొదటి పాదము-

| | | |
|---|---|---|
| మొదటి దళము | నీటిలో నిలుచుట- | మత్స్యావతారము |
| రెండవ దళము | కఠిన కర్పరము | కూర్మావతారము |

రెండవ పాదము-

| | | |
|---|---|---|
| మొదటి దళము | దంష్ట్ర నెత్తుట | వరాహావతారము |
| ద్వితీయ దళము | దారుకలనోద్భవము | నృసింహావతారము |

మూడవ పాదము-

| | | |
|---|---|---|
| మొదటి దళము | తనకట్లబలిమిచూపుట | వామనావతారము |
| రెండవ దళము | పులిమిన నెత్రు | పరశురామావతారము |

నాల్గవ పాదము-

మొదటి దళము ద్వీపాంతరమునకుజనుట రామావతా
రెండవ దళము నాగంటి జీని బలరామావతారము

గీ. మొదటి పాదము సౌగతాగమము బుద్ధావతారము
రెండవ పాదము వల్గువల్గనచిత్రధావనము కలికిఅవతారము,

మూడవది- తృతీయా శ్వాసము- 102 పద్యము.
నిగమశర్మప్రపత్తకన్యతో సంసారము- అను ఘట్టము-

సీ. ఒక యింత ఱెప్ప వేయక చూచుఁ బెఱవారిఁ
దలగొట్టుకొని దుఃఖజలధి మునుగు
బిలము తెలువుమందు పృథివిలోఁ జూఱఁబాఱు
సమధిక స్తంభోద్భవము గమించుఁ
దిరియువాఁడును బోలె దెసలకుఁ జెయిజాచుఁ
దొరగు నస్త్రాంబుధిఁ దొవ్వదోఁగు
"హా"పోయితేయని యఱచు భార్య గుఱించి
బహువిధారాసక్తి భ్రాంతిఁబొందుఁ

గీ. జేరఁగారాని దర్శన స్థితి వహించు
బాడబస్ఫూర్తిలోఁగొన్న పగిదిమందు
దానవారాతి కాఁబూని తదవతార
దళకమును మున్నె తాల్చెనా ధరణిసురుఁడు,

ఇందుస్పష్టముగా దానవారాతియవతారదళకమని చెప్పియున్నాడు.

మొదటి పాదము-

మొదటి దళము. ఱెప్పవేయక చూచుట- మత్స్యావతారము
చేప అనిమిషము- ఱెప్పపాటులేనిది-
రెండవ దళము- తలగొట్టుకొని జలధి మునుగుట కూర్మావతారము
తాబేలు తలకొట్టుకొనుచు నీటమునుగును

రెండవ పాదము-

మొదటి దళము- పృథివిలో బొరబాఱుట- వరహావతారము
వరాహము-భూమిలో బొరియలు చేయును.

రెండవ దళము- స్తంభమున నావిర్భావము నరసింహావతారము.

మూడవ పాదము-

మొదటి దళము- తిరియుట భిక్షవేయుట వామనావతారము.

రెండవ దళము- అమ్మలయంబుధి దోగుట- పరశురామావతారము.

నాల్గవ పాదము-

మొదటి దళము- భార్యనుగూర్చి యఱచుట- రామావతారము

రెండవ దళము- బహువిధారాసక్తి- కృష్ణావతారము

గీ. ప్రథమ పాదము- చేరగారాని దర్శనస్థితి- బౌద్ధావతారము.

ద్వితీయ పాదము- బాడబస్ఫూర్తి- కలికి అవతారము.

ఈ పద్యమునను రామకృష్ణకవి రచనా ప్రౌఢిమ యెంతటిదో తెలుపును-

ఇందు నిగమశర్మ మానసికస్థితి మానవచేష్టా దశావరిణామము వర్ణితము-

1. తెవ్వ వేయక- ఆదేవనిగా దేనినైన చూచుచుండుట,
2. తల కొట్టుకొనుట.
3. జలమున్ననందు లోనికి పోవుదుననుట,
4. స్తంభమువలె నిశ్చేష్టత వహించుట,
5. తనకు కావలసినది భిక్ష పెట్టుమని దిక్కులకు చెయిచాచుట.
6. ప్లవకన్యను గూర్చి విచారించుట,
7. ఏ భూమినైనను పోదతునుకొనుట.
8. ఏమి చేయుటకు తోచక మౌనముగా నుండుట,
9. హృదయములో దుఃఖము బడబానలమువలె రగుల్కొనుట.

ఇచట రామకృష్ణుని నిశిత మనస్తత్వ పరిశీలనము- వ్యక్తమగుచున్నది, ఇది నిగమశర్మ చరమదశ- అహోబల నరసింహుని దర్శించినాడు- అట్టి, ఆ నృసింహవిగ్రహమును ధ్యానించి, తాదాత్మ్యస్థితి బొందినాడు-

ఇందలి రచనాశిల్ప మనల్పమైనది-

ఘటికాచల మాహాత్మ్య పీఠికాకర్త గ్రంథ పరిశీలనచేయకయే వ్రాసినందున నింతగా వ్రాయవలసి వచ్చెను.

పాండురంగ విజయములోని కూర్మావతార వర్ణన ననుసరించి పాండురంగ మాహాత్మ్యమున కూర్మావతార వర్ణనగలదు- దానిని వివరించుచున్నాము.

కూర్మావతారము

శా. ద్యూత్తంభద్గిరి కల్పితావతరణద్యోవాహినీ సంగమో
పాత్తేందూదయ నిష్కృతర్ణజలధి ప్రారబ్ధ పుత్రోత్సవో
దాత్తక్ష్మాత్త గజాశ్వ వస్త్రశన కన్యాగోమణీ దానసం
పత్తిప్రీణిత దేవ ధుర్యధిపతి బ్రహ్మన్ స్మరామ స్త్వామున్.

కూర్మావతారమున, శ్రీమహావిష్ణువు మందర పర్వతమెత్తినప్పుడు, ఆకాశగంగా సంగమము చేత-సముద్రుడు చంద్రుడనుపుత్రుని గనెను- తనకు పితృఋణ విముక్తి యైనదని పుత్రోత్సవము చేసి లక్ష్మి అనెడి కన్యాదానము కామధేనువను గోదానము, ఐరావతమనే గజదానము- ఉచ్చైశ్శ్రవమనే అశ్వదానము- అమృతము అనే అన్నదానము ఇంద్రునకు చేసినాడు. ఇట్లు సముద్రునకు దానములు చేయుట కవకాశము కల్పించిన కూర్మరూపుడైన విష్ణువును స్తోత్రము చేయుచున్నాము- అని పద్య తాత్పర్యము-

పాండురంగ మాహాత్మ్యము తృతీయాశ్వాసమున సముద్రవర్ణన గలదు, అందీ క్రింది పద్యమున పై పాండురంగ విజయ పద్య భావము గలదు-

ఉ. ధేను గజాశ్వ రత్నసుదతీ ప్రముఖాఖిల వస్తుకోటి పై
మానికభర్తమున్ గొనియు మచ్చరమూరఁ బయోధిలోఁతు గై
కోనెసకొత్పెనో బలు మొగుల్ గని పుష్టకరిషపిండ రే
ఖానిభవృత్తి నత్తెఱఁగు గాకట నీరవి ద్రావ నేటికిన్. 144-వ.

పాండురంగ విజయమున భావమునకంటె ప్రౌఢత దాల్చినది.

రామకృష్ణుని చాటు ధారా పద్యములు- గురజాడవారు పైశీర్షికలో నిట్లు వ్రాసినారు-

"ఈ రామకృష్ణుడు పదగుంభన కవిత్వమునకు మిగుల ప్రసిద్ధుడు- కావున నీతడు పాండురంగ విభుని పదగుంభనమని తొంటి పదంబున

వాక్రుచ్చెను. దానికి దార్కాణంబుగ నీక్రింది కొన్ని పద్యంబుల విచరింతము,

తే. అతివశచనాభిజఘన దేహాననములు
మీనదరసాంతా రాజసా నిరాశ
రణమనంత మనాది నేత్ర గళభుజ స
ఖోష్ఠకుచ పచోదంతములు భయగతిని.

ఈ చిన్ని పద్యంబున నొకస్త్రీ యవయవంబులవర్ణన మంతయునిమిడ్చె-
మఱికొన్ని పద్యంబుల వివరింతము-

సీ. భుజగలోకాధీశ భూరితల్ప శయాన
హరిరూపధర మహాపురుష యనుచు
నతులాబ్జముకుట వర్ణిత పాదరాజీవ
రామార్చనీయ శ్రీరంగ యనుచు
మారీచ మదభంగ మహిత వాయవ్యాస్త్ర
శరద నిద్రిత నేత్ర జలజ యనుచు
సముద్రగ వర్షావసర యోగ నిద్రాణ
కరిరాజవరద శ్రీకాంత యనుచుఁ

గీ. దలఁకుచు లుకు పలంకు చెగ్గిలుచుఁ బలుకు
సఖుల నయనస్వన శిఖోజ చర్యకలన-
పవన కందర్ప ఘనహంస జవన తురగ
ఘటనట ప్రియ సముదాయ పటిమ దోప-

క. విధుకృత కదనము వదనము
మధుకర నికరములఁ గేరు మగువ చికురముల్
విధుమధుకర లీలాజయ
మధురోక్తులు పిక్కలౌర మధురాధరకున్

సీ. ద్విరదంబు నడతోడ సరాక ముఖభంగ
దళనొంది సవ్యతో-దనరఁ జూచె
గగనంబు నడుముతోఁ బగఁ జెంది మధ్యమాం
తమునొంది వేణితో సమతఁ బూన

సారసం బంఘ్రితో సరిరాక సావర్ణ్య
గతిమాని మోవితోఁ గదియఁజూచె
కనకారి కటితోడ నెనమాని నారి వే
షముఁ బూని మేనితో సరిగఁజూచె

గీ. తిరిగి సతి కంఠ కుచ బాహు సరస నాభి
కలకు భయమంది మొల పెట్టి గతులుమాని
యొరగి ధరకూలవత్తులై యొకట రెంట
మూఁట నాల్గింటితో సరి మొనయవయ్యె

గీ. అధర ముఖవర్ణ శూన్యంబు లతివకుచము
లాన నాకార రహిత మజ్జాక్షి మేను
అజ జఘన మండలము లంచయానకురులు
చరణ ఖాతి తకారములు చాన తొడలు—

తే. గీ. పల్లఁబూని సకియ మేనెల్లఁ జేసె
పద్మగర్భుండు లాదీసి వాగుడిచ్చి
బూ విసర్జించి యప్పు డప్పూవుబోడి
డెంద మొనరించె సందేహమంద నేల

ఇంకను ననేక పద్యంబులున్నవి. ఇవి యన్నియు, పాండురంగ విజయములోనివని యందురు. పాండురంగ విజయమునకు గథానాయకుడగు దన పేరిటి వానినే నిర్మింప దలంచి తన నామాంతరమైన పాండురంగడను పేరిడెనట! (పు. 240)

ఆపై మరికొన్ని చాటువుల నుదాహరించినారు.

చ. ధర భుజగైణ సింహములఁ దగ్గత వేణ్యవలోకనద్వయో
దరముల కోడి వారిధిపదంబులఁ బుట్టఁ బూరులన్ గుహాం
తరములఁబూన నిక్కఁదిన దాగ స్రవింపఁగ మార్పులూర్ప న
త్వరముగ నేఁగి నీడగని తత్తరమందఁగ జేసితా చెలీ

మ. ప్రతిబింబాధరమున్ పయోధరములున్ వక్త్రాలకంబుల్ మనో
హరలోలాక్షులఁ జూవ కవ్వలి మొగంబై నంత నేమాయె నీ
గురు భాస్వజ్జఘనంబు క్రుమ్మడియు మాకుం జాల వే గంగ క
ద్దరి మే లిద్దరి కీడునుంగలదె యుద్యద్రాజబింబాననా

క. తారకములఁ గోరకముల
హారకములనెల్ల నెల్లహారకము లిడున్
శ్రీరమణీ హార మణీ
ధారమణీయ త్వదీయ పద నఖరంబుల్

తే. తామర విహారుకొప్పు నెమ్మోమునకును
సారచంద్ర చంద్రస్ఫూర్తి సాటియగునె
నాతి తలమిన్న చెక్కిలి హా తెలుపును
సారచంద్ర చంద్రస్ఫూర్తి సాటియగునె

సీ. ఘనకేశయని నీవు చెవకరాకు సమీర
భుజగరోమాళి యీ పుష్పబోఁడి
మీనాక్షి యనినచో మీఁటకు కోకంబ
చక్రికాహీన యీ చంద్రవదన
బింబోష్ఠి యనినచో బెదరింపకు శుకంబ
సాంకవామోద యీ సన్నుతాంగి
కంజాస్య యనినచోఁ గలహించకు మృగాంక
స్వర్భానువేణి యీ జలజపాణి

గీ. శ్వాస, వక్షోజ వచనాస్య బాంధవములు
బంధువులుగాన మీకు చెప్పంగవలెనె
నిట్లు వినకున్న బరువులువిడుట యొగిరి
పడుట పదరుట కందుట ఫలము సుమ్మి

సీ. చక్రస్తనియటంచు జగడించకు శశాంక
గురుతమోవేణి యీ కుందరదన
మధుకాధర యటంచు మట్టుమీఱకు తేఁటి
చంపకనాస యీ జలజవదన
బిసబాహయని మాఱుమసలకు రాయంచ
జలధరచికుర యీ కలువకంటి
పల్లవకరయని త్రుళ్లకు కోయిల
శ్రీరామమూర్తి యీ కీరవాణి

తే. వదన కుంతలయాన సుస్వర సఖత్వ
మెనసియుండిన కతన మీ కితవొనర్చు
నమచు వళిచంద్ర పరభృత హంసములకు
భయము నయనాను దెలియంగఁ బలికెమఱియు

చ. అల ఘన చంద్రబింబ నిభమై తగు కాంత మొగంబు దానితోఁ
గలిగిన యర్థ భేదములఁ గైకొని చెప్పఁగ నొప్పు కొప్పు చె
క్కులు రదనాంశుకంబు నవి గుబ్బలకున్ సరిరాకపోరొఁ దే
తులు సరియయ్యెఁ దానిగతి దోఁచెను బొంకపు టాట దానికిన్

ఉ. అన లిఖాక్షి వేళలికి నంబుధరంబు సమంబుగామి చే
దానిదు ప్రయ్యలై చనినఁ దద్దశఁజూచి దయార్ద్రులై బుధుల్
దాని పదాంతరంబునను దారువసించినవారు గావునన్
బూనితదంశమున్ సమతఁ బోల్చిరి తత్పతి దృక్కుచంబులన్

ఉ. అతుర పక్షపాతమున నర్థము నూళ్లనొసంగ నొబ్బుచున్
భిక్షుజటాధరాధికులు భిన్ననిజవ్రతులౌదురైన దు
ర్భిక్షుక జాలకుచ్యుతులు పెక్కగు భక్తియచాలు దానినా
తతుభిక్షత్వమే యఘము దార్పఁడు శంక తొలంగుమీ యెడన్

చ. సతి కచవాక్సమత్వ మరిజాత సుధల్గొనఁ బూని వాదులై
హతులయి పారిజాత వసుధాకృతులూని యుదృజ్ఞితం బని
ర్జితరు విగాంచియుం ధర నశిత్వము జెందిన చంద్ర సేవధి
స్థితిని ... నొడినన్

తే. పల్లవంబూని సకియ మేనెల్లఁ జేసి
పద్మగర్భుండు లా దీసి వా గుడిచ్చి
పూవినర్జించి యువ్వా డపూర్వుఁ బోఁడి
డెంద మొనరించె సందేహ మంద నేల,

క. అలివ కచనాభి జఘన దేహాననములు
మీన దరసాలతా రాజపా నిరాక
రణమనంత మహాది నేత్రగళ భుజ న
ఖోష్ఠ కుచ వచోదంతములు భయగలిని.

తే. అనసాధర గళమూర్తు లతివ కబుఁడు
చంద్ర కురువింద శంఖ చంచలలఁ జేసె
చెలఁగితచ్చిన్న కాఠిన్యసిత చలతలు
సొరిది కచకుచ హాసదృష్టులుగ జేసె,

సీ. నడచెనా గంధ గంధేభ బంధ ధుర్య వే
దండతండము నటుండుండు మనును
పలికెనా వల్లకీ కలకంఠ కలరవ
మండితధ్వని నటుండుండు మనును
నవ్వెనా మల్లికా నవహీర చంద్రికా
డిండీరము లనటుండుండు మనను
చూచెనా పుష్ప నారాచ జాతస్ఫుర
త్కాండదృష్టుల నటుండుండు మనును

గీ. ఏమి చెప్పుదు నా యింతి కెవ్వరీడు
అహహా! రతివలె నిది నీకు నబ్బెగాక
పరమ భాగ్యైకశాలి వౌ పాండురంగ
విఠలేశ! యనంత రవిప్రకాశ!

చ. అల ఘన చంద్రబింబ సమమై తనరారెడు వక్త్రమందులోఁ
గలిగిన నామభేదముల కై నడి నొప్పెడి గప్పు కొప్పు చె
క్కులు రదనాంశుకంబులవి గుబ్బలకున్ సరిరాక పోయెఁ జే
తులు సరులయ్యె దానివలె నున్నది పొంకపుటారు బోటికిన్.

ఈ పద్యముల నుదాహరించి, చివరకు వారిట్లు వ్రాసినారు:

పై పద్యములలో నన్నియుగాని కొన్నిగాని రామకృష్ణుని వని నిస్సంశయముగ జెప్పజాలము. కావనియు నిర్ధారణచేయ వలను పడదు- (పుట. 243)

శ్రీ రామమూర్తిగారు వీనిని చాటుధారా పద్యములక్రింద పరిగణించినను నివియొక ప్రబంధములోని పద్యములేయని మనకు నవ కాశము కల్పినది వీరేశలింగముగారు- ఈ పాండురంగ విజయముపై వారి యభిప్రాయమును వివరించుచున్నారు-

## పాండురంగ విజయము

"దీనిని గూర్చి వీరేశలింగముగారి యభిప్రాయమిది. పాండురంగ మాహాత్మ్యమునకే పాండురంగ విజయమను నామాంతరము గలదు. ఇదిగాక పాండురంగ విజయమని రామకృష్ణకవి విరచితగ్రంథము వేఱొకటి యున్నదని కొందఱందురు. గాని యా మాట పాటింప దగినది కాదు. ఈ కవికి తర్వాత నల్పకాలములోనే యున్న యప్పకవి లోను గాగల లాక్షణికు లొక్కరును పాండురంగ విజయమున్నదని చెప్పి దానిలో నుండి యొక్క పద్యమునైన నుదాహరించి యుండలేదు. ఇప్పుడు పాండురంగ విజయములోనివని యందందు జదువబడు పద్యములలో ననేకము లితరగ్రంథములోనివి గాను యప్రౌఢకవి కల్పితము గాను గానబడుచున్నవి ఎట్లనఁగా:

సీ. భుజగలోకాధీశ భోగితల్పశయాన
హరిరూపధర మహాపురుష యనుచు
నతులాబ్జ మకుటవర్ణిత పాద రాజీవ
రామార్చనీయ శ్రీరంగ యనుచు
మారీచ మదభంగమహిత వాయవ్యాస్త్ర
శరద నిద్రితనేత్ర శౌరి యనుచు
సముదగ్ర వర్షావసర యోగనిద్రాణ
కరిరాజవరద శ్రీకాంత యనుచు
గీ. తలఁకు నులుకును నలుక బెగ్గిలుచుఁ బలుకు
సఖుల నయనస్వర శిరోజ చరణకలన
పవన కందర్ప ఘనహంస జవనతురగ
భటనటప్రియ నముదాయ పటిమదోప.

ఈ పద్యము పాండురంగ విజయము లోనిదని సర్వసాధారణముగాఁ జదువుదురు— నిజము విచారింపగా నిది పైడిమఱ్ఱి వేంకటకవి కృత చంద్రాంగద చరిత్రములోని చతుర్థాశ్వాసమున నున్నది. ఇట్లే

గీ. అరుణ పల్లవరుచిబోలు నాపదంబు
నాపదంబులఁబోలు నయ్యలక జాత
మలక జాతముఁబోలు నిత్యముఖ లీల
నిత్యముఖ లీలఁబోలు నన్నెలఁత నడుము.

అను నీ పద్యము పాండురంగ విజయము లోనిదని చెప్పుచున్నను, ఇది సింహాద్రి వేంకటాచార్య విరచితమైన చమత్కార మంజరిలోఁ గనబడు చున్నది. ఈ ప్రకారముగానే పాండురంగ విజయము లోనివని చదువ బడెడు మఱికొన్ని పద్యములు ఇతర ప్రబంధముల లోనివిగా గనబడు చున్నవి. తాను ప్రబంధరూపముగా పాండురంగ మాహాత్మ్య కథనే స్వీకరించి యా కవియే మరల పాండురంగ విజయమని మఱియొక ప్రబంధము జేయవలసిన యావశ్యకము సహితముండదు గాన పాండు రంగ విజయమను వేఱొక ప్రబంధము మున్నదన్న వార్త కల్లయని నిశ్చయింప వలసియున్నది-

ఆంధ్రకవుల చరిత్ర, ద్వితీయ భాగము. (175-177 పుటలు)

వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము ననుసరించి యిది రామకృష్ణకవి కృతముకాదు- అయినను నిందులో వారు చాటుధార అని దశావతార పద్యములలో పాండురంగ మాహాత్మ్యములోని వానికి పోలిక యుండుటచేత పై పద్యము లన్నియు గాక పోయినను కొన్నైనను పాండురంగ విజయము లోనివని మనము నిర్ణయింప వచ్చును-

5. ఇందుల కుపబలముగా నొక యుదాహరణము చూపుచున్నాను-

ఉ. అక్షర పక్షపాతమున నర్థము నూళ్ల నొసంగ మబ్బుచున్
భిక్ష జటాధరాధికులు భిన్న నిజవ్రతు లౌదురైన దు
ర్భిక్ష రుజాశిశుచ్యుతులు పెక్కగు భక్తియచాలు దాన నా
రక్షుభిత త్వమే యఘము దార్పఁడు శంకర దొంలింగు మీయెడన్

ఇది వైష్ణవము నందలి నీ క్రింది పద్యము ననుసరించినది.

ఉ. అక్షరముల్ పఠించు సమయంబునఁ జారము నేయుఁ డయ్యెనో
శిక్షితవర్ణ మధ్యమునఁ జెందెనో విస్మృతి? నంచునర్థ లు
ప్రేక్షయొకర్తు రి క్రియ నభీష్టఫల ప్రతిపాదనక్రియా
దక్షుని నిమ్నుఁ గూర్చిన యధర్మ నికారము నన్న కారమున్

(శి-70)

రామకృష్ణ డితరకృతులలో శ్రీనాథుని హెచ్చుగా ననుసరించివాడు-

6. పాండురంగ విజయము నందలి యీ క్రింది పద్యము చాలా వ్యాప్తి చెందినది.

మ. సరళింబాధరమున్ పయోధరములున్ వక్త్రాళికంబుల్, మనో
హర లోలాతులుచూప శవ్వలి మొగంబైనంత నేమాయె నీ
గురు భాస్వజ్జఘనంబు క్రుమ్మడియు మూకుంజాలవే గంగక
ద్ధరి మేలిద్దరి కీలునుంగలదె యుద్యద్రాజ బింబాననా"

ఇది యిప్పటికి రెండుశతాబ్దుల క్రిందట సంకలనము గావింప బడిన "ప్రబంధ మణిభూషణము" అను గ్రంథమున 802వ పద్యముగా నున్నది. దీనిని తొలుత క్రీ.శ. 1910లో ప్రకటించినమానవల్లి రామకృష్ణ కవిగారు "ఈ చాటువు తెనాలి రామకృష్ణకవి చెప్పినట్లున్నది" అని వ్రాసినారు.[1] ఈ పద్యమును రామకృష్ణకవి పద్యముగా నిర్ణయించుచు గురజాడవారు- దీనికి సంబంధించిన కథను గ్రంథస్థము చేసియున్నారు, ఇది స్వర్ణ యోగ చింతామణి లోని యోగి భోగినీ సంవాదములో, వ్యాఘ్రాజిన శయ్యా సందర్భమున- చెప్పినది- రాయలవారి వేశ్య యొకతె రాయలు తనయందే ఎక్కువ మోహముగల వాడనియు, తాను పరపురుషుని కన్నెత్తి చూడననియు డంబములు పల్కుచుండెడిది రాయలును ఆమెనుగూర్చి- కవిపండిత గోష్ఠిలో శ్లాఘించుచుండెడివాడు. రామకృష్ణుని కవియు మఱికొందఱు వేశ్యలమాట నమ్మరాదని చెప్పినను, వేశ్యలలో పతివ్రత లుందురని వాదించెను. రామకృష్ణుడు, ఆ వేశ్య యెట్టిదో ప్రకటించుటకు పూనుకొని. ఒక యోగి వేషముదాల్చి. వేశ్య ఇంటి యెదుట పీఠముపెట్టెను. కొంత కాలమున కా వేశ్యమాత తన యింటిలోనికి రమ్మనెను. హస్తసంజ్ఞల చేతనే నాత డక్కడ నివసించుచు, నొకనాడు మూడువరహాల నిచ్చి తనకు కావలసిన వస్తువులను దెమ్మనెను. అదియే పదివేలుగా సంతోషించి వేశ్యమాత యితనివద్ద స్వర్ణయోగవిద్య యున్నదని గ్రహించి, దానిని వశపఱచవలెనని తన కూతురైన రాయలవేశ్యను అతని పరిచర్య కప్పగించెను. ఆ వేశ్యయు చాల కాల మాతనిసేవ చేసినను. ఆత

1. ప్రబంధ మణిభూషణము సంకలన గ్రంథము- ద్వితీయ ముద్రణము 1971 పీఠికాకర్త- నిడుదవోలు వేంకటరావు- సంపాదకులు డాక్టరు పి. యస్. ఆర్. అప్పారావుగారు- ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణము- పుట 60.

డింద్రియ నిగ్రహమును చూచి అతని లోబఱచుకొన లేకపోయెను. ఒక నాడామె, యోగి విభూత్యాకృత నిరాహారాసనము చూచి, కన్నులు మూసికొని యోగిప్రక్కనే పరుండెను- ఇదే సమయమని రామకృష్ణ కవి తలంచి, స్వర్ణయోగవిద్య నుపదేశించెదనని పై పద్యము చదివెను- వెంటనే ఆమె యోగి రామకృష్ణుడని తన్ను భంగపఱచెనని తల్లితో చెప్పెను. తరువాత రాజాస్థానమునకు వచ్చి,

"గంగ కద్దరి తీరు లిద్దరి కీడునుం గలదె యుద్యద్రాజ బింబాననా" అను సమస్య నిచ్చి కవులను పూరింపుమనెను- కాని వారు తాము పూరింపలేమనియు, అతడే పూరింపవలయునని చెప్పిరి. అతడది స్వర్ణయోగ చింతామణిలో యోగి భోగినీ సంవాదము లోనిదని చెప్పి- రాయల వెలయాలు అని చెప్పక ఒక దేశమున రాజు వెలయాలని, ఆమె డంబమెట్లు భంగమైనది- వివరముగా చెప్పెను. రాజు తన వృత్తాంతమే యని లోన తెలిసికొని సెబాష్ యోగిని మెచ్చవచ్చు నననెను- యోగియు నంతమాత్రమునే కోరియుండెను- అని రామకృష్ణు డుత్తర మిచ్చెను-

ఈ వేశ్యా కథా సందర్భము పాండురంగ విజయము లోనిదే యని కవి కావ్య ప్రశంసా చంద్రిక అను గ్రంథము తెలుపుచున్నది- ఉత్తరప్రాంతమున నీకథ ప్రచారములోనున్నది.

దీనినిబట్టి పై వర్ణనల పద్యములను బట్టి యిది శృంగార రస ప్రధానమైన కావ్యముగా గన్పట్టుచున్నది. తొలుత రామకృష్ణుడు పాండురంగ విజయమున శృంగార రసమును ప్రదర్శించి ఆ వెనుక పాండురంగ మాహాత్మ్యమున భక్తిరసమును ప్రపంచించెనని గ్రహింప వలెను.

ఇంతకుముందు నేను వ్రాసినట్లు, పాండురంగ శబ్దము శివుని పర్యాయమైనను నది వైష్ణవపరమైనది. మఱియు నీ పాండురంగ విజయమునందే తొలుదొల్త పాండురంగ విఠల ప్రశంస గానవచ్చు చున్నది-

సీ. నడచెనా గంధ గంధక బంధురార్యావే
దండతండము నటుండుండు మనుము
పలికెనా వల్లకీకలకంఠ కలరవ
మండితధ్వని నటుండుండు మనుము
నవ్వెనా మల్లికా నవహీర చంద్రికా
డిండీరములు నటుండుండు మనుము
చూచెనా పుష్ప నారాచ జాతస్ఫుర
త్కాండ ద్యుతుల నటుండుండు మనుము

గీ. ఏమి చెప్పుదు నాయింతి కెవ్వరీడు
అహహా! రతిపతి పతి సిజునదృ గాక
వరసు భాగ్యైకశాలి రా పాండురంగ
విఠ్ఠలేశ! యనంత పవిత్రలోక-

చాటుపద్య మణిమంజరి ప్రథమ భాగము పుట

పై పద్యమునుబట్టి- పాండురంగ మాహాత్మ్యమున పాండురంగ విజయము తరువాతి రచనయని మనము విశ్వసింపవచ్చును-

ఆంధ్రకవితరంగిణిలోని కీ. శే. శ్రీ చాగంటి శేషయ్యగారు-వీరేశలింగముగారి ననుసరించి పాండురంగ విజయము రామకృష్ణుని కృతి కాదని వ్రాసినారు. 'ఆరుద్ర' సమగ్ర ఆంధ్ర సాహిత్యమున నీ పాండురంగ విజయ కర్తృత్వ విషయము లేనే లేదు- ఇట్లున్నను, పై యుపపత్తుల వలన తెనాలి రామకృష్ణుని రచనకు పాండురంగ విజయమని- జన ప్రవాదము చాటువులు సరియైనవేయని- మనము విశ్వసించవచ్చును

పాండురంగ విజయమున పై పద్యమును రామకృష్ణుడు పాండురంగ మాహాత్మ్యములో నిట్లు సమకూర్చుకొన్నాడు-

సీ. కరుణించి చూచెనా కవిగాయకార్థార్థి
నివహా గేహంబున నెనయు సిరులు
కోపించి చూచెనా కొండలో నెనకప్పు
నెనవప్పు తేజస్సైన నెవ్వరూలు

మెచ్చి తున్నించెనా మెదక పాలసుఁడైన
దొరతనంబున నిల్పి పరిభవించుఁ
బొందుగావించెనా ఘననెట్టి ఖలునకు
నాదట గరణా ప్రసాదమొసగు

గీ. మంత్రిమాత్రుండె దుర్మంత్రి మథన కథన
చారుచర్యా చమత్కార చక్రవర్తి
యప్రదినిధుఁడు విరూరి వేదాద్రి, రామ
భద్రపాద సరోరుహ బంభరంబు. (1-34)

ఇందువలన- పాండురంగ విజయము నిస్సంశయముగా రామ కృష్ణుని కృతి మే-

పాండురంగ విజయము, శృంగార పరము: పాండురంగ మాహాత్మ్యము భక్తిపరము-

## కవికాలము - అష్టదిగ్గజకవి

రామలింగ (కృష్ణ) కవి కాలమునుగూర్చి తొలుత 1829 వ్రాసిన కావలి వేంకటరామస్వామిగారు. అతడు శా. శ 1384-అనగా క్రి. శ. 1462 వ సంవత్సరమున నున్నట్లు వ్రాసినారు,[1]

గురుజాడవారు తొలుత- పాండురంగ మాహాత్మ్యము క్రి, శ. 1543 నాటిదని- నిరూపించు శిలాశాసన ప్రమాణము జూపిరి.[2]

వీరేశలింగముగారు పై పాండురంగమాహాత్మ్య రచనాకాలము నుపేక్షించి యిట్లు వ్రాసినారు-

పాండురంగ మాహాత్మ్యము రచియింపబడిన కాలము 1650 సంవత్సరముకంటె పూర్వమైయుండదు. అప్పటికి రామకృష్ణుడు వృద్ధుడను కొన్నను నతడు కృష్ణదేవరాయల యాస్థానము కవుల నాక్షేపించెనన్న కథ లన్నియు నసత్యకల్పనము లనుట స్పష్టము.[3]

---

1. Sketches of Dekhan Poet-English. (1829)
2. కవిజీవితము పుట, 236- (1893)
3. ఆంధ్రకవుల చరిత్ర- ద్వితీయ భాగము- పుట 178. (1897)



♦ తెనాలి రామేశ్వర(రామలింగేశ్వర)స్వామివారి ఆలయము లోని ఉత్సవవిగ్రహములు



"Tenali was the birth place of Garlapati Ramalingam one of the eight poets who adorned the Court of Krishna Deva Raya. On one of the bronze images in the Rameswara Swamy Temple, there is a Sanskrit Sloka in four lines that in Vol. 23 (1509) AD this poet performed the marriage Ceremony of the God."

—Mackenzie : The Krishna District Gazetee

---

♦ ఫోటోలు : తెనాలి శ్రీ రామేశ్వరస్వామివారి దేవాలయ ట్రస్టీ సౌజన్యముతో

రామలింగకవి, రాయలఆస్థానమున అష్టదిగ్గజములలోని వాడని పరంపరాయాతముగా వచ్చుచు, గురజాడ వా రుదాహరించిన కథలను గూడ వీరేశలింగముగారు విస్మరించిరి.

కాని క్రీ. శ. 1925లో ఉద్భటారాధ్య చరిత్ర ప్రకటితమైన వెనుక- రామకృష్ణుని కాలము మారినది- అది యాతని కాలనిర్ణయమున కెట్లు తోడ్పడినది వివరింతును-

ఉద్భటారాధ్యచరిత్ర పీఠికలోని యంశము-

ఈతని జీవిత దశలు- (3)

1) గార్లపాటి రామలింగము.
2) తెనాలి రామలింగము.
3) తెనాలి రామకృష్ణుడు.

## 1. గార్లపాటి రామపండితుడు

తెనాలి రామలింగ(కృష్ణ)కవి తండ్రి రామయపండితుడు తెనాలిలో నున్న రామలింగేశ్వరాలయమున- రామలింగేశ్వరుని ఉత్సవ విగ్రహాన్ని చేయించి సమర్పించినట్లుగా, ఆ ఆలయములో ఉత్సవ విగ్రహ పీఠము మీద యీ శ్లోకమున్నది.

"శ్రీ తెనాలి నగరే వ్యరాజయ
ద్గార్లపాటిపుర రామపండితః
శుక్ల మాఘ సిత పంచమీ గురౌ
రామలింగమమ హోత్సవాకృతిమ్"[1]

కీర్తిశేషులు ప్రభాకర శాస్త్రిగారీ శ్లోకము నుదాహరించుచు- నిది రామకృష్ణుని తండ్రి రామయపండితుడు ఉత్సవ విగ్రహాన్ని సమర్పించినప్పుడు వేయించిన శ్లోకమని వ్రాయుటయేగాక, సామికణ్ణుపిళ్ల గారి గ్రంథము ననుసరించి కాలనిర్ణయము చేయుటకు వీలుగానున్నదియని వ్రాసినారు.[2]

---

1. ఉద్భటారాధ్య చరిత్ర పీఠిక. పుట-7. వే. ప్ర శా.
2. పై శ్లోకము క్రింద పుట చివరగున అధోజ్ఞాపికలో నీ విషయమ్ము గలదు. మాహిష్మతి ముద్రాక్షరశాల ముక్త్యాల

# కాలనిర్ణయము

పై శ్లోకమున- శకసంవత్సరము తెలుప బడక పోయినను "శుక్ల మాఘసిత పంచమీ గురౌ" అని వారము కూడ నీయబడుట చేత- కాలము నిర్ణయించుట కనువగు చున్నది. కాని శుక్ల సంవత్సర మాఘశుద్ధ పంచమీ గురువారము- స్వామికన్నుపిళ్లగారి గ్రంథము ననుసరించి[1] 14-1-1510 అగుచున్నది. కాని- అది గురువారము కాదు. కావుననే ప్రభాకరశాస్త్రిగారు "కాలము కుదుర కున్నది" అని వ్రాయుట తటస్థించినది- కాని సూక్ష్మముగా పరిశీలించిన నీ శ్లోక కాలము సరిగా నిర్ణయించ నవకాశమున్నది- "మార్గశిర పంచమి" అనుటకు బదులు, శిల్పి "మాఘశిర పంచమి" అని తప్పుగా చెక్కినాడు. మార్గశబ్దము పూర్వ లిపి సంప్రదాయము ననుసరించి "మాగ్ర"గా వ్రాసెడి వారు. 'మాగ్ర' క్రమముగా 'మాగ' "మాఘ"గా లేఖకులు వ్రాయుట తటస్థించినది- అందువలన కాలనిర్ణయము చేయ వీలులేక పోయినది.[2] శ్లోకమున-

"శుక్ల మార్గశిర పంచమీ గురౌ"

అనునది సరియైన పాఠము- అప్పుడు శుక్ల సంవత్సర మార్గశిర శుక్లపక్ష గురువారము క్రీ.శ. 14-1-1510 తో సరిపోవుచున్నది-

ఈ కాలము క్రీ.శ. 14-1-1510 రామకృష్ణుని గ్రంథరచనా క్రమమునకే గాక- ఇతని శైవమతావలంబనమునకు చాలా ముఖ్యమైనది- కాని యింతవరకు నీ శ్లోకము తెనాలిరామకృష్ణుని తండ్రియగు రామయపండితునిదే యనియు రామకృష్ణుని కే మాత్రము సంబంధము లేదనియు నిర్ణయించుటవలన- అతని కాలనిర్ణయమునకు గ్రంథరచనా క్రమమునకు, అవ్యవస్థ యేర్పడి వివాదముల కాస్పదమైనది.

---

1. Indian Ephemeris Vol-5
2. "మార్గ" "మాఘ" శబ్దముల లేఖన ప్రమాదము వలన కాలనిర్ణయమున నెట్టి చిక్కులు కలుగునో, నా-"మడికి సింగన కాలనిర్ణయము"-అను వ్యాసమున తెల్పితిని. (భారతి- జూలై 1967).

ఈ శ్లోకము తొలుత ప్రకటించిన ప్రభాకరశాస్త్రిగారు గార్ల పాటి రామపండితు డనగా తెనాలి రామకృష్ణుని తండ్రి రామపండితు డని వ్రాసియుండుట నీవలుకే తెలిసితిని[1] దీని ఆంధ్రకవి తరంగిణి కారులు మొదలుకొని ఆధునికులవరకు అందరును యథాతథముగా నను వదించిరి.[2] కాని

"ఉత్సవవిగ్రహములు ప్రతిష్ఠించిన వాడు
రామకృష్ణకవి తండ్రి రామయ్య కాదు
అతడు రామలింగకవి గా నున్న
రామకృష్ణుడే"

అని ప్రమాణ పూర్వకముగా నిరూపించుచున్నాను.

గార్లపాటి రామపండితుని కొడుకు రామయ్య తెనాలి శ్రీరామ లింగేశ్వరునిపై భక్తిప్రపత్తుల వలన-

'గార్లపాటి రామలింగము' అని వ్యవహరింప బడుచుండెను.[3]

తెనాలి రామలింగేశ్వరస్వామి ఆలయమున ఉత్సవవిగ్రహములం ప్రతిష్ఠించినది రామకృష్ణకవి తండ్రి రామయ కాదు రామలింగకవియే యని ఈ క్రింది కృష్ణామండల వృత్తాంతిని నిరూపించుచున్నది.[4]

"Tenali was the birth Pl ce of Garlapati Ramalimgam one of the eight poets who adorned the Gourt of Krishna Deva Raya. On one of the bronze images in the Ramalingaswara Temple.
there is a sanskrit sloka in two lims that in (23)(1509 Ad) this poet performed the marri ge Ceremony of the god"

---

1. పూర్వోక్తము, పుట-7
2. ఆంధ్రకవి తరంగిణి 8 వ సంపుటము- సమగ్ర ఆంధ్రసాహిత్యం 8 వ సంపుటం- నవాబులయుగం తెనాలిరామకృష్ణుడు.
3. దీని ననుసరించియే- గురజాడ శ్రీరామమూర్తి గారు తమ కవి జీవితములలో- తెనాలిరామకృష్ణునిగూర్చి వ్రాయునపుడు వీరింటిపేరు "గార్లపాటివారు" అని వ్రాసిరి. (పుట-199)
4. Krishna district Mannual gordan Mackenzie P-253 Lawrance Asylum Press Madras-1883. (Repalle Taluq)

"కృష్ణదేవరాయుని ఆస్థానములోని నలంకరించిన ఎనమండుగురు కవులలో (అష్టదిగ్గజములలో) ఒకరైన గార్లపాటి రామలింగము జన్మస్థలము, తెనాలి- అచ్చట రామలింగేశ్వరాలయములో నున్న కంచు విగ్రహములలో వొకదాని క్రింద నొక సంస్కృతశ్లోకమున (రెండు పాదములలో) క్రీ. శ. 1509వ సంవత్సరమున నీ కవి రామలింగేశ్వర కళ్యాణ మహోత్సవము జరిపించెను" అని పై ఆంగ్ల వాక్యములకు తెలుగు.

పై "కృష్ణామండల వృత్తాంతిని"లో చెప్పబడిన విషయము చాలా ప్రామాణికమైనది- ఆ వృత్తాంతములను సంగ్రహించిన వారికా కాలమున- మెకంజీదొరవారి చారిత్రక సంపుటములే- ఆధారములు- అందున్న కైఫీయతులలోని విషయము లాయా మండల వృత్తాంత సంగ్రహములు రచితము లైనప్పుడు- తత్కర్తలచే గ్రహింపబడినవి- పై విషయము మెకంజీ సంపుటములలో తెనాలి కైఫీయతునుండి గ్రహింపబడినది. ఇట్లే నెల్లూరు - కర్నూలు - మండల వృత్తాంత సంగ్రహములలో మెకంజీ కైఫీయతులనుండియే విషయములు గ్రహింపబడినవి- తరువాత- ఆంగ్ల ప్రభుత్వము వారు ప్రకటించిన- మండల వృత్తాంతముల (District Gazetteer లో పై Mannual లోని విషయములు లేనే లేవు.[1]

## తె నా లి కై ఫీ య తు

ప్రస్తుత మీ కైఫీయతునుండి ఉత్సవవిగ్రహములను శ్రీ రామలింగేశ్వరాలయమునకు సమర్పించినది. తెనాలి రామలింగడే యని నిరూపించు భాగము నుదాహరించు చున్నాను.

"తదనంతరం వీరశ్రీపురుషోత్తమదేవు వీరభద్రదేవు అధికారములు జరిగిన తరువాతను శాలివాహన శకం ౧౪౩౩ మొదలుకొని నరపతి సింహాసనస్థులైన కృష్ణదేవ మహారాయలు ప్రభుత్వం చేసే

1. ప్రస్తుత మా మండల వృత్తాంతములు (Gezetteer) అన్నియు సంస్కరింపబడినవి- వీనిలో పూర్వపు గెజటీరులలోని విషయములు లేకపోవుట విచారకరము నివియింకను అచ్చుగాలేదు- వ్రాతలోనున్నవి- నేను రెండు మూడింటిని పరిశీలించినాను.

టర్వాతు గార్ల పాటి రామలింగం అనే లింగధారి యీ స్థళంలో ఉండి శ్రీరామలింగేశ్వరస్వామి వారిని గురించి బాల్యకాలమందే వుపాస్తి చేసినందున స్వామివారు ప్రత్యక్షమై అభీష్టవరములు యిచ్చినారు. అతడు ఈ స్థళమందు వుండుటవల్లను తెనాలి రామలింగమని పేరువచ్చి నది. అతిని దినములలో స్వామివారి ఆలయం మరమ్మత్తు చేయించి నాడు. ఉత్సవముల విగ్రహములకోడు సమర్పించినాడు. తదనంతరం రాయలవారి సముఖమునందు ఆస్థానకవి అయినాడు.

కృష్ణదేవరాయులవారు ఈ స్థళానికు వచ్చి శ్రీగోవర్ధనస్వామి వారికి తెంప్రోలుఅనే మజుకూరిలో చేరిన శివారుపాలెం కుచ్చెళ్లు అగ్ర హారిక యిచ్చినారు."[1]

ఈ భాగము తెనాలి రామకృష్ణకవి చరిత్రకే కాక, కృష్ణరాయల చరిత్రకు చాలాముఖ్యము- కృష్ణదేవరాయలు, తెనాలివచ్చి అచ్చటి గోవర్ధనస్వామి ఆలయమునకు తెల్లప్రోలుగ్రామము అర్పించి నట్లింత వఱకు విజయనగర చరిత్రకారులెవ్వరును వ్రాయలేదు- అది యట్లుండ నిండు- రామలింగకవిని గూర్చి యింకను మఱికొన్ని విషయములు తెనాలిరామేశ్వరాలయ ధర్మకర్తనుండి, స్థానాచార్యులనుండి తెలియు చున్నవి.

తెనాలి శ్రీరామలింగేశ్వరస్వామి ఆలయమున ప్రస్తుత స్థానా చార్యులు- అర్చకులు వ్రాసిన విషయములు, పై యంశములు సరియైన వని ఋజువు చేయుచున్నవి.[2]

---

1. Mackenzie Local Records Vol. 23 P. 59 ఈ Local records నే స్థానిక సంపుటములందురు, ఇవి 69 సంపుటాలు. ఈ సంపుటాలన్నింటిని బ్రౌనుదొరగారు తమ స్వంత ద్రవ్యము వెచ్చించి మెకంజీ కైఫీయతులనుండి వ్రాయించినారు. ఈ తెనాలి కైఫీయతు ప్రజోత్పత్తి నామసంవత్సర వైశాఖ బ ౧౩ లు సోమవారం మే ౨౦ అన ౧౮౧౧ న నల్లయచే వ్రాయబడినది. ఇవి అముద్రితములు.
2. వీనిని సేకరించి నాకు శ్రీ కుదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు పంపినారు- వారికి కృతజ్ఞుడను.

1. వారును- ఉత్సవ విగ్రహములు- ఇవిమూడు- పార్వతి, శివుడు, నంది- అష్టదిగ్గజకవీశ్వరుడైన గార్లపాటి రామలింగ మర్పించి నట్లే తెలిపిరి-

2. ఉత్సవవిగ్రహ సమర్పణ శ్లోకము నేటికిని గలదు.

3. వారు తెలిపిన వానిలో నొక క్రొత్తవిషయము గలదు. అది రామలింగకవి- "అష్టభుజ దుర్గ"ను సేవించుట- ఆమె కటాక్షమువల్ల అతడు కవియయ్యెను[1]- ఈ అష్టభుజ దుర్గ విగ్రహ మిటీవల కనుగొనబడినది.

ఇందువలన తేలిన సారాంశము-

1. తెనాలి రామలింగేశ్వరాలయమున- ఉత్సవ విగ్రహములు సమర్పించినది- తెనాలిరామలింగకవియేగాని- అతని తండ్రి రామయ ఎంతమాత్రము కాదు-

2. అతడు క్రీ.శ. 1510నాటికి నిండు యౌవనదశలోనున్నాడు-

ఇది రామలింగని కాలనిర్ణయమున కత్యంత సహాయకారి- రామలింగకవి తండ్రి కాలమును కొన్ని వాఙ్మయ చరిత్రకారులందఱును మొత్తము మీద క్రీ. శ. 1510 ప్రాంతమున రామలింగకవి యున్నట్లు నిశ్చయించినారు. తండ్రియనుకొనుట వలన నొకతరము తప్పినది- అంతే- అప్పుడు రామలింగకవి జననము క్రీ.శ. 1480-85 ప్రాంతమగును.

వాఙ్మయ చరిత్రకారు లిట్లు వ్రాసినను- ఉత్సవవిగ్రహ శ్లోకములోని- కాలపరిగణనను బట్టి, అతడు క్రీ.శ. 1630 ప్రాంతమున నుండెనని- ఆర్షశాఖాధి కారులైన- శ్రీ యన్. లక్ష్మినారాయణ రావుగారిట్లు ఆంగ్లమున తెలిపినారు-

"శాసనమున నిచ్చినకాలము- మాఘశుద్ధ 5 గురువారము, యీ క్రింది సంవత్సరములలో నిట్లు వచ్చినది-

1510 Ad మాఘ శు 5 సోమ వారము

---

1. రామలింగము వికటకవి యైనందుకు కాళికాదేవి నుపాసించిన విషయమునుగూర్చిన కథను గురజాడవారు గ్రంథస్థము చేసినారు. (చూ 233-38 పుటలు).

1570 Ad మాఘ శుక్ల బుధవారము
1630 Ad ,, ,, గురువారము
1690 Ad ,, ,, ఆదివారము

పై వానిలో క్రీ. శ, 1630 సరియైన తేది 7-1-1630 నాడు రామకృష్ణుడీ విగ్రహములను స్థాపించెనని నిర్ణయింపవచ్చును-[1]

కాని క్రీ.శ. 1680 ప్రాంతము రామకృష్ణకవి కాలమని, ఒక్క వీరేశలింగముగారు తప్ప మఱి యెవ్వరును తెలుపలేదు- ఈ వ్యాస కర్తలు బహుశః వీరేశలింగముగారి కాలనిర్ణయము ననుసరించి దీనిని సరిపెట్టినట్లున్నది- ఉత్సవవిగ్రహ శ్లోకమున-నేను ముందు సూచించిన మార్పుతోకూడ- ఆ తేది 1510 కి సరిపోవుచున్నది. క్షేపించిన సంవత్సరము లేకపోయినను, కృష్ణామండల వృత్తాంతమున- నిది క్రీ శ. 1509 గా నుండుట గమనింపదగినది. అందుచే నిది గ్రాహ్యముకాదు-

ఇందువలన- రామలింగకవి క్రీ. శ, 1510 లోనే వాని నర్పించె ననుట నిశ్చితము- క్రీ. శ. 1510 లోనే రామలింగకవి శ్రీరామ లింగేశ్వరునకు ఉత్సవవిగ్రహములు సమర్పించి ఆలయమును బాగు చేయించుటచే నాతని కప్పటికి యిరువది యైదు సంవత్సరము లుండి యుండవలెను. అప్పు డాతని జననకాలము క్రీ శ. 1485 ప్రాంత మగును- నిందుజవ్వనము దాటి కౌమార దశలో నాతడు రాయల ఆస్థానమునకు క్రీ శ 1515లో చేరెను- ఆ వెనుక నాతని జీవితమును రచనలును నీ క్రింది విధముగా నేర్పఱింపవచ్చును.

## రామలింగని కాలము - కావ్యరచనాక్రమము

క్రీ. శ, 1485- జననము-

1510- ఉత్సవవిగ్రహ సమర్పణము లింగపురాణ రచనము-

1516- ఉద్భటారాధ్యచరిత్ర రచన-

---

1. A definite date for Tenali Ramakrishna by N. Lashminarayana Rao Govt. of India Epigraphist. Journal of oriental Research Madras Vol. XXI— 1951-52 Part 1 to IV P. 102-104.

1516– 1530 రాయల ఆస్థానమున– అష్టదిగ్గజముగా నుండుట:
చాటుకవితా విహారము–

1530– 1540 కందర్పకేతు విలాసము– హరిలీలావిలాసము–
పాండురంగ విజయము–

1547– పాండురంగ మాహాత్మ్యము–

1560– ఘటికాచల మాహాత్మ్యము– జీవిత సమాప్తి.

ఘటికాచల మాహాత్మ్యము రామకృష్ణుని చివరకృతి యని తొలుత తెలిపినవారు శ్రీ. శే మానవల్లి రామకృష్ణకవి మహోదయులు– వారివ్వటి కించుమించుగ నరువదేండ్లకు పూర్వమే[1] మనకు రామకృష్ణకవిని గూర్చి నూతనాంశములు దెలిపినారు. తెనాలి రామభద్రకవి ఇందుమతీ పరిణయము గూర్చి మొదట లోకమునకు వెల్లడించినది వారే[2] ఈ కృతిమూలమున తెలియదగిన తెనాలి కవుల వివరములు దెలుపుచు– కందుకూరివారు చేసిన తెనాలి రామకృష్ణకవి కాలము విమర్శించుచు– శాసనాది ప్రమాణములు చూపుచు నిట్లా తని కాలము నిర్ణయించినారు.

"రామకృష్ణకవి కృష్ణరాయల సభలో నూత్న యౌవనము చెలించి తిరుమలరాయని రాజ్యకాలమున– వృద్ధుడై ఘటికాచల మాహాత్మ్య కృతిలోఁ జేవడఁకు చుండును–"

ఆనాటికి ఉద్భటారాధ్యచరిత్ర వెలువడలేదు. శ్రీకవిగారి కాల నిర్ణయము ననుసరించి నేను పై వివరించినరీతి వ్రాసితిని–

---

1. ఆంధ్రపత్రిక 1914 సంవత్సరాదిసంచిక ఈ వ్యాసము మానవల్లి రచనలు అను గ్రంథమున పునర్ముద్రితమైనది. పుట 815 ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ ప్రచురణ పీఠికాకర్త నిడుదవోలు వేంకటరావు.

2. ఇందుమతీ పరిణయము రామభద్రకవిది యన్నట్లు– కవిగారు వ్యాసము ప్రకటించిన 21 యేండ్లకు– శ్రీ. శ 1935 లో తంజావూరి గ్రంథాలయ పుస్తక సూచినుండి తెలిపినది– అది ఆంధ్రవిశ్వవిద్యాలయ ప్రకటితము.

పాండురంగ మాహాత్మ్య కృతిపతి- క్రి. శ. 1547 లో నున్నట్లు శాసనప్రమాణములున్నను, ఆకృతి, ఆ సంవత్సరములోనే రచితమైనట్లు చెప్ప వలనుపడదు, అందలి ప్రౌఢత్వమును బట్టిచూడగా, రామకృష్ణ కవి, తన కరువదేండ్లకు పైబడిన వయస్సున దీనిని రచించి యుండ వచ్చును- అట్లయిన పాండురంగ మాహాత్మ్యము క్రి శ. 1545-50 ప్రాంతముల రచితమై యుండవచ్చును-

ఘటికాచల మాహాత్మ్య రచనము నాటికి నాతడు కడువృద్ధుడై అంతిమదశలో నుండవచ్చును, దానికి కృత్యాది లేకుండుటచే- అది పూర్తియైన వెనుక ఆతడు మరణించి యుండవచ్చును- ఎట్లుచూచి నను క్రి. శ. 1485-1560 ఆతని జీవితకాలమని నిర్వివాదమని చెప్ప నొప్పును,

అష్టదిగ్గజ కవీశ్వరుడు- రామలింగడు. రాయల అష్టదిగ్గజకవిగా రామలింగడు క్రి.శ. 1515 నుండి ఒకదశాబ్దార్థ అనగా క్రి శ, 1530 వఱకు యుండినట్లు మనమా కాలమందు జరిగిన విద్యాగోష్ఠులలో ప్రవర్తిల్లిన- విషయములనుబట్టి అందు పాల్గొన్న కవులను బట్టి గ్రహింప గలము - రాయల ఆస్థానమున తెనాలి రామలింగము రామలింగడుగానే యున్నాడు- ఆ రామలింగని పేరితోనే — ఆతని గూర్చిన కథలన్నియు ప్రచారములో నున్నవి-1 అంతే కాదు సాహిత్య ప్రపంచమున రామలింగని పేరే కవిస్తుతులలో వెలసి నది- ముందు నేనుదాహరించిన పట్టమెట్ట సరస్వతీ సోమయాజి స్తుతికి సమకాలికమగు జగ్గన ప్రబంధ రత్నాకరమున నుదాహరణలు- రామ లింగ నామమునే స్థిరపఱచుచున్నవి, జగ్గన- రామలింగని కృతులు, కందర్ప కేతు విలాసము- హరిలీలావిలాసము అను రెండింటినుండి పద్య ములుదాహరించుచు- స్పష్టముగా- తెనాలి రామలింగయ్య కందర్ప కేతు విలాసము- తెనాలి రామలింగయ్య హరిలీలావిలాసము- అనియే

1. రామలింగని కథలు తమిళ భాషలోను-ఆంగ్లభాషలోను కూడ కలవు, దీనినిబట్టి దక్షిణదేశమున వాని వ్యాప్తి యూహింప వచ్చును.

పేర్కొన్నాడు.[1] "అల శాళ్లపాక చిన్నన్నను శ్రీ రామలింగకవీంద్రు" అని రాజలింగకవి కూర్మపురాణమునను "రామభద్ర రామలింగన తిమ్మన ప్రముఖులగుచు" అని గూళికల్లు వేంకటరమణకవి కనకరంజిత శిఖామణిపరిణయమునను, "భీమకవి రామలింగని శ్రీమంతుండై వెలుంగు శ్రీనాథకవిన్- అని కూచిమంచి జగ్గకవియు రామలింగ నామమునే పేర్కొనిరి- ఇక వల్లూరి నరసింహకవి నాగ్నజితీపరిణయములోని యీ క్రింది స్తుతి చూడుడు-

ఉ. రంగుగఁ బాండురంగని తెలుంగలరంగ రచించి పేర్కొనీ
అంగ ఛలోక్తులన్ నృపుగరంగ నొసర్చు హొరంగు నింగి ము
ట్టంగ మెలంగు నేరుపు గడంగి చెలంగు సదృశో
లింగని రామలింగ కళింగ కళానిధిఁ న్ గణించెదన్[2].

ఇంకను కొన్నిగలవు. గ్రంథవిస్తర భీతిచే విరమించుచున్నాము. శైవమగు రామలింగని పేరే- శాశ్వతముగా సాహిత్య లోకమున వెలగొన్నది-

అద్యతన కాలమున- శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు రామలింగకవిగానే రామకృష్ణుని నుతించి యున్నారు.

ఉ. సంగత చాతురీమహిమసార ఘనుం ఘుమిత ప్రసిద్ధ స
ర్వాంగ మనోహరాయు కవితారభటి పరిపూర్ణ సర్వ ది
క్ప్రాంగణు హాస్యకృత్కవి ననర్గళచారు పదప్రయోగ శా
లిం గణుతించువాఁడఁ గవిలింగని లొంగని భక్తిపెంపునన్-[3]

ఆంధ్రకవులు, 1914.

---

1. చూడుడు ప్రబంధరత్నావళి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంకలనము (1918) పుటలు 125 126.

2. ఈ ప్రబంధములన్నియు నముద్రితములే- ఒక్క కూచిమంచి జగ్గకవి చంద్రరేఖా విలాపము మాత్రము రహస్యముగా ఇందరుతో ముద్రింపబడినది.

3. కలగూరగంప.

రామలింగకవి పేర కొన్ని ప్రబంధము లున్నను- అవి రాయల ఆస్థానమున జరగని హాస్యధాటు కవితా రచనా ప్రతిభ వలన- అతను- ప్రబంధకవిగా పరిగణితుడు కాలేదు- రాయల ఆస్థాన ప్రవేశము గలి గించినది- ఉద్భటారాధ్య చరిత్రమే- తరువాతకూడ నాతడు కందర్ప కేతు విలాస హరిలీలా విలాసాది కృతులు రామలింగని పేరితో రచి యించినట్లు తెలియుచున్నది. అయినను- పై కారణమున నాతడు ప్రబంధకవి ప్రశస్తి బడయలేదు-

ఆతని పాండురంగ మాహాత్మ్యము వ్యాప్తముకాగానే అనగా- అప్పకవి యుదాహరించిన కారణమున- నతడు కావ్యకవిగా పరిగణితు డయ్యెను. కావున రామకృష్ణనామము తోడనే ప్రసిద్ధి (కవుల) కెక్కెను- శబ్దరత్నాకర కారునినుండి- కవుల చరిత్రలం దన్నిట- నీ రామకృష్ణనామమే గలదు-

ఆధునిక కాలమున రామకృష్ణనామము తోకూడస్తుతి లేకపోలేదు,
గోక్రియావధాన కోవిదత్వంబున
బహుముఖముల వారి పద్దుమాపి
పాండురంగ మహిమ భాసిల్లుచుండుట
రామకృష్ణ ఘనత రహితలంతు-

అని తమ బిల్వేశ్వరీయమున కవిస్తుతిలో- భారతవర్ష మహా మహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు పేర్కొ న్నారు-

శివపురాణాది మహోద్గ్రంథ కర్తలు శ్రీ నందిరాజు చలపతి రావుగారు తమ మంగళగిరి మాహాత్మ్యములో రామకృష్ణకవి నిట్లు సతించినారు :

చ. సకల కళా విలాసయుతు సారరసజ్ఞుని గణ్యపుణ్య భా
స్కరకవి సమాజమంజుపదగుంభన సన్నుత పాండురంగ నా
మక కృతికర్త హాస్యరసమాన్యుని ధన్యుని ధీరు రామ కృ
ష్ణకవి మహీపతిం పనుమ పన్నుతిచేసెద మానసంబునన్‌। 1-51

ఇంకొక విశేషము, కవులచరిత్రలలో రామకృష్ణకవి పేరున్నను, రామకృష్ణకవి జీవితములో- అన్నియు రామలింగని కథలే యుండుట చేత, తొలినుండియు వారిరువురు నొకే వ్యక్తులని స్పష్టపడుచున్నది.

ఆధునిక ఖండ కావ్యములలో కృష్ణపక్షమునకు ప్రతిద్వంది గా వ్రాయబడిన శుక్లపక్షమున- తెనాలిరామకృష్ణు నద్భుతముగా సిద్ధాంత కర్తలైన- అనంతపంతుల రామలింగస్వామిగారు చిత్రించినారు-

తెలుగుకవులలో వెండితెరపై యెక్కిన చరిత్ర తెనాలి రామకృష్ణునిదే-

## తె నా లి వం శ ము

తెనాలి రామకృష్ణకవి మూడవ తమ్ముని మనుమడు. రామభద్రకవి తన "ఇందుమతీ పరిణయము" అన్న కృతిలో తన వంశము నిట్లు వర్ణించుకొన్నాడు-

సీ. ప్రౌఢి మీ పెదతాత పాండురంగాదిన
          త్కృతు లొనర్చెను రామకృష్ణ సుకవి
   యనుజుం డన్నప్ప మీ పినతాత రచియించెఁ
          బంగ సుదతీగా పరిణయంబు
   మీ తాత శ్రీగిరి చాతురీ విఖ్యాతి
          శ్రీశైలమాహాత్మ్య కృతి యొనర్చెఁ
   గడిమి మీ తండ్రి యమ్మడి రామకృష్ణార్యుఁ
          డనఁ గీర్తిగనెఁ సంస్కృతాంధ్రములను
గీ. వారలను మించె మీ యన్న వీరరాఘ
   వాఖ్యకవి సర్వకవితా మహత్త్వమునను
   నిన్ననూ చాన సంతాను నెన్నఁ దరమె?
   ప్రాజ్ఞహృదయాబ్జరవి! రామభద్ర సుకవి![1]          22 వ.

---

1. ఈ ప్రబంధమును నీ వరుసనే- ఆంధ్రప్రదేశ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమువారు ముద్రించియున్నారు-

పై పద్యమును బట్టి రామకృష్ణకవి వంశము నిట్లు దెలుప వచ్చును-

కౌండిన్య గోత్రము-

రామయ - లక్ష్మమ-




అన్నయ సుదక్షిణా పరిణయము ముద్రితమైనది- కవిచరిత్రల కెక్కనదే- కాని దీనిని గూర్చి ప్రత్యేక విమర్శన లేనే లేదు-

శ్రీగిరి శ్రీశైల మాహాత్మ్యము లభ్యము కాలేదు-

రామభద్రకవి తన పెదతాతయని రామకృష్ణకవిని ప్రశంసించుటయేగాక, కవిస్తుతిలో ప్రత్యేకముగా నాతని నిట్లు వర్ణించినాడు,

ఉ. మామక నవ్యకావ్యము సమంచిత మాధురి సాధురీతిగా
యామకృత ప్రబంధ రచనా యతపాక చతుర్విధైక వా
ర్తా మహిమోజ్జ్వలాఢ్య కవితా ఘన కామహు మత్పితా
మహున్
రామయ రామకృష్ణకవిరాజుఁ దలంచి మతించి మ్రొక్కెదన్.
13. ప.

తన పినతాత నన్నయ నిట్లు స్తుతించినాడు-

గీ. తదను సంభవ మణిని సుదక్షిణా ప
రిణయముఖ కావ్యరచనా ధురీణు నంధ్ర
కవిగదంబులోనఁ బ్రఖ్యాతిఁగన్న
యన్నప కవీంద్రు ధీసాంద్రు నభి నుతింతు- 14-ప.

రామకృష్ణకవికి కొడుకులు లేరు. ఒక్క కొమార్తె మాత్రము గలదు- ఆమెను లింగమగుంట రామకవికిచ్చి పెండ్లి చేసినాడు-"రామ

కృష్ణాఖ్యజామాత ప్రకట విభవు" అని ఆతడు చెప్పుకొన్నాడు- "రామకృష్ణాఖ్య జామాత" అన్నందువలన రామకృష్ణుడుగా వ్యవహృతుడైన తరువాతనే యీ వివాహము చేసెనని తెలియుచున్నది.

అల్లుడు లింగమగుంట రామకవి క్షేత్రమాహాత్మ్యములు వ్రాయుటలో, మామగారిని మించినవాడు- మామ రెండు క్షేత్ర మాహాత్మ్యములు వ్రాయగా, అల్లుడు మూడు వ్రాసినాడు-

అవి : 1, ఆనందకానన మాహాత్మ్యము- (కాశీ క్షేత్రము)

2, చతుర్వాటికా మాహాత్మ్యము- (చదలువాడ)

3, వేంకటగిరి మాహాత్మ్యము- (తిరుపతి)

ఇవిగాక మత్స్యపురాణము, వామనపురాణము-అనుపురాణములనే గాక లక్షణతిలకము అను లక్షణ గ్రంథము రచించినాడు- పై వానిలో మొదటి రెండు మాత్రమే లభించుచున్నవి- అవి అముద్రితములు, ఈ విషయములు నేటి కవిచరిత్రల వాఙ్మయ చరిత్రల మూలమున తెలియుచున్నవి.

## లింగమగుంట రామకవి - రామకృష్ణుని జామాత

లింగమగుంట రామకవి రామకృష్ణకవి యల్లుడని నిదినటికే కవి చరిత్రకారులు, వాఙ్మయ చరిత్రకారులు లిఖించినట్లు వ్రాసితిని- కాని యీ విషయమై కొంత నిదానించి చూడగా నిది సరియైనట్లు కన్పట్టుట లేదు-[1]

తెనాలిరామకృష్ణుని యల్లుడైన రామకవి- క్రి. శ. 1560-70 ప్రాంతమువాడు- రామకృష్ణుడు క్రి.శ. 1560 ప్రాంతములకు డెబ్బది యేండ్లపైబడిన వృద్ధు- అతను తానేబది యరువది సంవత్సరముల

1. ఈ విషయము నా దృష్టికి తెచ్చినవాడు, నా పెద్దకుమారుడు శివసుందరేశ్వరరావు- అతడీ పీఠికను చదువుచున్నప్పుడీ రామకవి జామాతృత్వమునుగూర్చి సందేహము వెలిపుచ్చి నన్ను మఱియొకసారి పరిశీలింపమని కోరినాడు. బాగుగా పరిశీలింపగా, అతని సందేహము సరియైనదే యని తోచి యీవిషయ ప్రకటించినాను.

లోపల నీ వివాహము చేసెనని యనుకొన్న నది పొసగదు–ఆకాలమున నంతకుముందు రామకృష్ణుడు, రామలింగనామముతోనే యున్నాడు. రామకవి– రామకృష్ణనామము చెప్పుటచే– అతడు తన వయఃకాలమున నీ పెండ్లి చేసెనని చెప్పుట కుదురదు–

ఇంతకూ, రామకృష్ణునిగూర్చి, అతని సోదరులను గూర్చి– తెనాలికవి కుటుంబమును గూర్చి విశేషములను దెలిపిన–రామభద్రకవి– రామకృష్ణకవి మూడవ తమ్ముని కుమరుడు– రామకృష్ణుని కొక కూతురున్నట్లు గాని– ఆమె లింగమగుంట వారి కోడలని కాని తన యిందుమతీ పరిణయమున చెప్పలేదు. (చూడుడు ఇంతకుముందు నే నిచ్చిన తెనాలి కవివంశవృక్షము) వాస్తవముగా లింగమగుంట రామ కవి, రామకృష్ణుని అల్లుడే అయిన యెడల– వారి సమకాలికుడగు– రామభద్రకవి యీ విషయము తప్పక తన ఇందుమతీ పరిణయమున చెప్పెడివాడు– అతడు రామకృష్ణకవికి సంతానమున్నట్లు చెప్పలేదు– సరికదా తన చినతాత– అన్నప్పకు సంతానమున్నట్లు చెప్పలేదు– తన తాత శ్రీగిరినుండియే ప్రారంభించినాడు. రామకవికూడ కవిగా ప్రసిద్ధుడేగాన– రామభద్రకవి తనకృతిలో నాతని పేర్కొని యుండెడి వాడు.

అయితే. "రామకృష్ణాఖ్యు జామాత" అను దానికెట్లు సమన్వ యము– అన్న ప్రశ్న వచ్చును దానికి జవాబు నిట్లూహింపవచ్చును.

రామభద్రకవి యిచ్చిన వంశవృక్షమును బట్టి రామభద్రుని తాతయైన– శ్రీగిరికవికి– రామకృష్ణుడను కొమారుడుగలడు– ఇతడే ఇమ్మడి రామకృష్ణకవి. రామభద్రకవి తండ్రి– రామభద్రకవికి, వీర రాఘవకవి యను అన్నయున్నట్లుగా నందుగలదు– ఈ యిమ్మడి రామకృష్ణకవి కుమార్తె– లింగమగుంట రామకవిభార్య కావచ్చును– రామకవి,"రామకృష్ణాఖ్యు జామాత" అనగా ఈ రెండవ రామకృష్ణుని కుమార్తె యాతనిభార్య కాదగును– కాని రామభద్రకవి తనకొక చెల్లెలున్నట్లు చెప్పలేదు–వంశ వర్ణనలలో సాధారణముగా కొడుకులనే గాని, కూతుండ్రను పేర్కొను నాచారమంతగా కానరాదు ఎటున్నను రామకవి తెనాలివారి యల్లుడే– అతని మామ కవీశ్వరుడైన రామ

(లింగ)కృష్ణుడుగాక, ఆతని సోదరుని కుమారుడైన రెండవ రామ కృష్ణుడని మనము గ్రహింపవలెను.

ఇంకను నిమ్మడి రామకృష్ణుడే రామకవి మామయునియు రామ కృష్ణకవి కాడనియు మఱియొక విధముగా సమర్థింపవచ్చును-

నిజముగా, రామకృష్ణ కవీంద్రుడివంటి మహామహుడే తన మామగారైన అట్టి తన మామగారిని గూర్చి- ఏమియు చెప్ప కుండ రామకవి "రామాకృష్ణాఖ్యు" అని ముక్తసరిగా చెప్పుటయెంత మాత్రము తటస్థింపదు- కాబట్టి- రామకృష్ణాఖ్య శబ్దము రెండవ రామ కృష్ణునకే వర్తించును.

### 3. రామలింగకవి - వైష్ణవమతస్వీకారము - రామకృష్ణుడు

ఉద్భటారాధ్య చరిత్రము మూలమున తెనాలి రామలింగ కవియు, పాండురంగ మాహాత్మ్యకవి, తెనాలిరామకృష్ణుడును నొకరే యని నిర్ణయమైన వెనుక తెనాలి రామలింగకవి శైవమును వీడి, వైష్ణవమతమును స్వీకరించెనని విమర్శకులందఱును వ్రాసియున్నారు- ఈ విషయమై నింతకు ముందెవ్వరు చర్చించిరేమో నాకు తెలియదు- అందువలన దీనినిగూర్చి కొంత పరిశీలన చేసి, యీ క్రింది విషయము లను పాఠకలోకమునకు నివేదించుచున్నాను.

పాండురంగ మాహాత్మ్యము విరూరి వేదాద్రి మంత్రికి కృతి- వేదాద్రిమంత్రి పెదసంగయరాజునొద్ద వ్రాయసోద్యోగి. అతనికాలము క్రీ. శ. 1543- కావున వేదాద్రి మంత్రి కాలమదియే- ఇందువలన- క్రీ. శ. 1543 నుండి రామకృష్ణ నామము వ్యాప్తిలోనికి వచ్చినదని మనము గ్రహింపవచ్చును.

ఈ కావ్యమున రామలింగకవి కృతిపతియైన వేదాద్రిమంత్రి తనను సంబోధించిన విషయమిట్లు దెలిపినాడు.

"నను రామకృష్ణకవి (1-22)

"రమ్యగుణ కృష్ణరామయ రామకృష్ణ (1-23)

"రామకృష్ణ కవిచంద్రా! సాంద్రకీర్తీశ్వరా (1-28)

వీని కనుగుణ్యముగా నాశ్వాసాంత గద్య మూర్చినాడు "ఇది శ్రీ పరమ పద సనాథ నిరవధిక కృపా పరిపాక పరచిత సరసకవితా సనాథరామ

కృష్ణకవినాథ ప్రణీతమైన పాండురంగ మాహాత్మ్యంబను పరమ భాగవత చరిత్రంబునందుఁ బ్రథమాశ్వాసము".

వేదాద్రిమంత్రి రామకృష్ణుని "పరతత్త్వ సిధీ" (1-35) అని సంబోధించి, శ్రోత్రకావ్యముచే, "పరమ వైష్ణవకోటి నలంకరింపు"మని కోరినాడు- రామకృష్ణుడు "పరమ వైష్ణవ రత్నంబులకుం బ్రణతి పూర్వకముగా నభినందనం బాచరించి

క. వాక్కాంతాశ్రయ భట్టరు
చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద
నిక్కావ్యకళా కలాప మీడేఱుటకున్ (1-17)

అని వైష్ణవాచార్యుడగు చిక్కభట్టరును, తన గురువుగా పేర్కొన్నాడు- ఈ వైష్ణవ గురు శిష్యత్వము చేతను కృతియందలి కథావస్తువు వైష్ణవ క్షేత్రమగుట చేతను విమర్శకులు రామకృష్ణుని వైష్ణవత్వమును స్థిరపఱచినారు.

రామకృష్ణుడీ కృతియందు చేసిన స్తుతులు వాడిన వైష్ణవ పారిభాషిక పదములను నాతడు వైష్ణవమును స్వీకరించి నాడన్న భావమునకు మఱింత దోహదము చేసినవి-

I ఆ 1. వ. వైష్ణవ స్వీకారార్హ.
7. వ. గరుత్మంతుని స్తుతి.
34 వ. శ్రీమదష్టాక్షరీ సేవైక నిపుణుండు-
పరిచిత దివ్యప్రబంధ సంధానుండు-
దివ్యవైష్ణవ పురాణ చతుష్టయజ్ఞుండు.
53 వ. సకలవైష్ణవశాస్త్ర సిద్ధాంతము.
70 వ. యతిరాజ రచిత భాష్యగ్రంథ నిర్ణేత.
II ఆ 2-19 విష్ణు సహస్రనామ పాఠము-
24 తిరువారాధనము.
100 పరమపదసనాథు పరమపదనాథుడు. 112, 116

పాండురంగక్షేత్ర మాహాత్మ్యముకంటె రామకృష్ణుని చివర కృతియగు ఘటికాచల మాహాత్మ్యమునందు కొంచెమెక్కువగా నీ వైష్ణవ పారిభాషికములు గలవు.

నూటయెనిమిది దివ్యతిరుపతి క్షేత్రములు 'తిరు'నామముతో నీయబడినవి.

గోవిందశర్మ 'తిరుపవిత్రంబును, తిరుమణి తిరుచూర్ణమును' మేనధరించి
తిరు తులసితో పూజచేసెను- (2-8-11)
ఆయన భోజనమున తైరు-నీరు మోరు కలవు (2-17)
తిరుపతిలో సత్పురుషులు స్నానమాడినది ఆళ్వారు తీర్థము
విష్ణుపారమ్యము విశదీకరింప బడినది.
"శర్వాది సుపర్వ నయన సాఫల్యకరము- (3-4)

కౌండిన్యుడు గోవిందశర్మకు వైష్ణవాగమ శధామర్మార్థముల బోధించినాడు (2-49) బాలుడైన నారదుని కౌండిన్యుడు సుదర్శన శంఖ చక్ర చిహ్నితుని గావించి మంత్రోపదేశము చేసినాడు (2-61) ఇంకను, పంచబేరార్చనము (3-37) ముకుందదాసజన శేషాన్న పరిగ్రహణము (2-24) ఊర్ధ్వపుండ్ర ధారణ (3-28) వైఖానస ప్రశంశ (3-28) ఇట్టి వైష్ణవమత సిద్ధాంత ప్రవర్తకములైన విషయము లిందు ప్రస్తావింప బడినవి.

పై రీతిగా రామకృష్ణుని కృతులలో వైష్ణవ సంప్రదాయిక రచనా విధాన ముండుటచేతను పేరుకూడ వైష్ణవ సంబంధియగుట చేతను రామలింగకవి శైవమునువీడి, శ్రీ వైష్ణవు డయ్యెనని విమర్శకులు వాఙ్మయ చరిత్రకారులు నిర్ణయించి యాతనికి నామములుంచినారు. ఈ సందర్భమున రామకృష్ణుని కృతులు నామూలాగ్రముగ చదువకుండ, నొకరొక యభిప్రాయము ప్రకటింపగా అంధపరంపరా న్యాయమున- నితరులు దానిని యనుసరించుటచే రామకృష్ణకవిని గూర్చి యింతటి యపప్రథ వ్యాప్తమైనది రామకృష్ణుడు వైష్ణవుడే యనుటకు వారుచూపిన ఉపపత్తులివి.

1. రామలింగడు వైష్ణవమగు కృష్ణుని పేరు ధరించుట.
2. వైష్ణవ సంప్రదాయిక పారిభాషికములు వాడుట
3. వైష్ణవ గురువు నాశ్రయించుట.
4. వైష్ణవుని కృతిపతిగా నొనర్చుట.

౬. వైష్ణవక్షేత్ర మాహాత్మ్యములనే కావ్యవస్తువుగా స్వీకరించుట
ఈ యుపపత్తుల నన్నింటిని సపాటముగా ఖండించి

"రామకృష్ణ దాజన్నాంతము
శైవుడేగాని వైష్ణవు డెంత
మాత్రము కాడు"

అని సిద్ధాంతము చేయుచున్నాము.

## 1. వైష్ణవనామ స్వీకరణము

రామకృష్ణాది నామములు వైష్ణవులలోనే గాని శైవులలో నుండవని యనుకొనుట ఎంతమాత్రము సరికాదు- ప్రాచీన శైవ వాఙ్మయమును పరిశీలించిన నందు వీరశైవు[1]లు, వైష్ణవనామములు ధరించినట్లుగా నెన్నియో యుదాహరణములున్నవి. వీరశైవమత ప్రవర్తకుడగు బసవనతండ్రి మాదిరాజు (మాధవరాజు) తల్లి మాదాంబ (మాధవాంబ). బసవపురాణమున - కేశిరాజు (కేశవరాజు) గోవింద భట్టారకుడు చెన్నరాముడు, నరసింగ మొన్నయనారు, నారయ్య, (నారాయణుడు) మాదన్నగణదాస, మాదన్న గొబ్బూరి, మాదవ్వ భాగవాది, రామనాథుడు, ఏకాంతరామయ్య (ఇతడు చాలా ప్రసిద్ధుడు. బసవపురాణము 7 వ ఆశ్వాసమున నీతని కథ గలదు) ఉదరద రామయ్య. చిక్కలరామవ్వ, సింగయ్య-సింగబల్లహుడు, సిద్ధరాముడు మొదలగు శివభక్తులు గలరు. పండితారాధ్యచరిత్రమున - కమలవ్వ కేశి (ఉత్తమాంగద) కేశి (ధూర్జటి) కేశిరాజయ్య కొండగుడి, కేసయ్య కేసరయ్య. కేసయ్య (దాన) మధువయ్య, మాదన్న (చిక్క) రామదేవడు. రామయ్య (మైదున) రామవ్వ, రామిసాహిణి, సింగనమంచి, సింగయ్య. సింగయ్య దసగణ. సింగవ్వ. సింగిదేవడు, మొదలగు శివభక్తులు గలరు, వీరందఱు 12వశతాబ్దివారు, అంతకు పూర్వులును

1. తెలుగు దేశమున శైవము అనగా. వీరశైవము, తప్ప వేఱొకటి లేదని యెఱుంగునది. అది జంగమసంప్రదాయము. ఆరాధ్యసంప్రదాయము అని రెండు విధములు. ఆరాధ్యులనే వీరమాహేశ్వరులని యందురు. జంగమసంప్రదాయము తెలుగుదేశమున వ్యాప్తము కాలేదు.

ఇంతయొందుకు వీరశైవమునకు విజ్ఞానపీఠమై, ఆరాధ్యవీరశైవ సంప్రదాయములను ఆచంద్రార్కము సాహిత్యమున నిలువజేసిన పాల్కురికి సోమనాథుని తండ్రి పేరు విష్ణురామదేవుడు, తల్లి పేరు శ్రియాదేవి.

"శ్రీఖాజిష్ణుడగు విష్ణురామదేవుండు
తేజిష్ణువగు శ్రియాదేవి యమ్మయంచు
గారవింపంగ నొప్పుగాదిలిసుతుండ"

బసవపురాణావతారిక

పండితారాధ్యుని శివతత్త్వసారమున - "గోవిందప్రియ," "విష్ణువరేణ్యా"యన్న సంబోధనలు గలవు - 15,16వ శతాబ్దులలో ఇకటూరివారిలో రామలింగ, రామనాథాద్యనామధేయులు పెక్కుమందిగలరు,

ఆధునిక యుగమున - చాగంటి సీతయ్యశాస్త్రిగారు - (వీరు ఉర్లాము(శ్రావణీ విద్వత్పరీక్షాధికారులు, గొప్ప విద్వాంసులు) ఆరాధ్యులు - విజ్ఞాన సర్వస్వము తొలుత వెలయింపజేసిన కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావు గారాధ్యులు - ఈ నడుమనే శివసాయుజ్యము నందిన శివలెంక శంభుప్రసాదుగారు (వీరు పండితత్రయములోని శివలెంకమంచన పండితుని వంశమువారు) తమ కుమారునికి రాధాకృష్ణయని పేరుపెట్టినారు. రాధాకృష్ణగారే నేడు ఆంధ్రపత్రిక భారతి సంస్థల కధ్యక్షులు.

రామలింగమను పేరులోనే వైష్ణవమున్నది, అది శైవమే-అట్లే - [1]రామకృష్ణుడను పేరున్నను అది శైవమే,

శైవుడగు రామకృష్ణుడును శైవసంప్రదాయాను సారముగానే కృష్ణనామము దాల్చినాడుగాని వేఱొండు భావముచేగాదు - అతనికి "శైవవైష్ణవ పురాణావళీ నానార్థములు కరతలామలకములు" (పాండు 1-23) ఆతడుత్తర హరివంశమున శ్రీకృష్ణుడు సంతానార్థియై

---

1. క్రీ, శ, 1612 లో వీరవెంకటపతి రాయలకాలమున లింగనారాధ్యుని పౌత్రుడు మల్లికార్జునారాధ్యపుత్రుడు, రామకృష్ణారాధ్యజోస్యులున్నట్లు శాసనములవలన తెలియుచున్నది. శాసనావళి సి, ఆర్, కృష్ణమాచార్యులు - ఆంధ్రపత్రిక 1925 సంవత్సరాది సంచిక పుట 256

శివునిగూర్చి పండ్రెండేండ్లు తపస్సుచేసిన కథ యెఱుగుము - అందు వలన లింగశబ్దమునకు బదులు - కృష్ణశబ్దమును చేర్చుకొని రామకృష్ణు డని వ్యవహృతుడైనాడు - కృష్ణుడు శివభక్తుడేగదా, ఇంతేకాక ఆరాధ్యశైవమున రాముడు కృష్ణుడు పరమ పాశుపతులుగా నారాధితులు.

శ్లో॥ దుర్వాసకశ్యప విరించి మృకండుపుత్ర
దేవేంద్ర, బాణ, హరి, కృష్ణదధీచిరామ
శ్రీ నామదేవకవి కుంభజగౌత మాదీన్
పుణ్యానిమాన్ పరమ పాశుపతాన్ స్మరామి"

దుర్వాస, కశ్యపుడు, విరించి, మార్కండేయుడు, ఇంద్రుడు, బాణుడు, హరి, కృష్ణుడు, దధీచి రాముడు, నామదేవుడు. శుక్రా చార్యుడు, అగస్త్యుడు, గౌతముడు - వీరు పరమపాశుపతులు.

ఇది శైవులకు నియతమైన దీక్షావిధానములో వ్రతపూజా సమయమున దేవతాహ్వానములో నున్నదిగాన చాల ప్రాచీనము.

## శైవకవుల కృతులు

### విష్ణు ప్రశంస

శివపూజా విధానమున విహితమైన విష్ణు రామకృష్ణ నామ స్మరణమువలన, శివకవులు రచించిన శైవకృతులలో విష్ణు పారమ్యము వర్ణితము కాదుగాని, విష్ణుమాహాత్మ్య మగ్గడింపబడును - ఈ హేతువుచేతనే, రామలింగకవి శైవకృతియగు ఉద్భటారాధ్యచరిత్ర మున - విష్ణుమాహాత్మ్యమును ప్రతిపాదించియే యున్నాడు.

### శైవకృతులలో విష్ణుప్రశంస

శివపూజా విధానమున-రామకృష్ణుల స్మరణయుండుట చేతను విష్ణువు శివభక్తుడని పురాణకథ యుండుటచేతను శైవకవి కృతులలో విష్ణుపారమ్యము వర్ణితము లేదుగాని-విష్ణుమాహాత్మ్య మగ్గడింపబడును. శంభుదాసుడగు ఎఱ్ఱన యిట్టిదృష్టితోడనే, నృసింహపురాణమున శైవు డైనను విష్ణుమాహాత్మ్యమును నద్భుతముగా వర్ణించినాడు. పోతన

భాగవతమున విష్ణుమాహాత్మ్యము నెట్లువర్ణించినది సర్వాంధ్రసాహిత్య లోకమునకు విదితమే.

"శా. చూడాభూషణ రత్నమై వెలయుచున్ శ్రుత్యుత్తమాంగంబులన్ జూడంగాదగు విష్ణుపాదమున" (1-157)

"దేవకీయును వసుదేవుఁడును గన్నకేలి
మనుజ విగ్రహుండగు త్రైలోక్యవిభునకు" (3-59)

ఈ శైవసంప్రదాయము నెఱుంగక రాళ్లపల్లి వారు-పై రెండింటిని ప్రస్తావించి, యిట్లు వ్రాసినారు.

"ఉద్భటారాధ్యచరిత్రమున (అ. 3 వ 145-157)

ఇష్టలింగధారణ విధిని కవి వర్ణించిన తీవ్రధోరణిని గమనించితి మేని ఆదీక్షను అతడును గ్రహించియుండెనేమో యనిపించును. కాని స్మార్తుల సాంప్రదాయకమైన ఆతని విష్ణుభక్తిని ఉద్భటారాధ్య చరిత్ర మునగూడ,

"చూడాభూషణ రత్నమై వెలయుచున్ శ్రుత్యుత్తమాంగంబులన్ జూడంగాఁదగు విష్ణుపాదము" (1-157)

"దేవకీయును వసుదేవుఁడును గన్నకేలి
మనుజ విగ్రహుండగు త్రైలోక్య విభునకు (3-59)

అనుమాటలు సందుచేసుకొని చూపుచున్నవి" (పుట 16)

మతసంప్రదాయ విధులలో "తీవ్రధోరణి" "శాంతధోరణి" అను రెండు పద్ధతులున్నవా? ఉన్నయడల శ్రీ శర్మగారు వానిని వివరించి, రామలింగకవి శైవము "తీవ్రధోరణి" అని చెప్పవలెను. అంతేకాని, పద్ధతి వివరింపకుండ యిట్లు చెప్పుట ఎంతమాత్రము సరికాదు-ఇంతకు, రాళ్ళపల్లి వారికి, అసలు రామలింగకవి లింగధారణ దీక్ష గ్రహించిన విషయముకూడ అనుమానాస్పదముగా నున్నదేయని "గ్రహించియుండెనేమో అనిపించుచున్నది." అను వాక్యము స్పష్టపఱచుచున్నది-రామలింగకవి కంఠోక్తిగా, తాను దీక్షను గ్రహించినాడని-ఉద్భటారాధ్యచరిత్ర ప్రారంభముననే చెప్పగా, తరువాతి కవి చరిత్రకారులు విమర్శకు లెల్లరును నాతడు తొలుత శైవుడనియే ఘోషించుచుండగా, వీరనుమానపడుచుండుట యెట్టిదో, ప్రాజ్ఞులే-తెలుపుదురుగాక.

శైవకృతిలో "ఈ మాటలు సందుచేసుకొన్నవి" సందుచేసుకొనుట అనగా, అవకాశములేకపోయినను "చోటుచేసికొనుట" అని యర్థము-రామలింగకవి శైవసంప్రదాయము ననుసరించియే, విష్ణుమాహాత్మ్యమును ప్రకటించెనని యీ వఱకే తెలిపితిని-రాళ్ళపల్లివారు పై రెండే చూపినారు-కాని యింకొక విష్ణుసంబంధ ప్రశంస యింకను గలదు.

సీ గీ. "సత్యభామాధిపతిచేతఁ జలనమొంది
బలిమిదింపని నాటి కల్పద్రుమంబు" (1-38)

అని-కృష్ణుని పారిజాతాపహరణ వృత్తాంతము-సూచితమైనది.

ఇక "స్మార్తుల సంప్రదాయము, విష్ణుభక్తి యొక్కటియే"యని శర్మగారు తలచినట్లున్నది. ఇది యసంబద్ధమే. స్మార్తులలో, విష్ణుభక్తిగలవారేకాదు-శివభక్తికలవారును ఉందురు. వారే-యిందు (పుట 15.) "అద్వైతిస్మార్త బ్రాహ్మణులలో శివభక్తి యెక్కువగా కలవారుకూడ లింగధారణము చేయరు" అని స్పష్టపఱచినారు. ఈవారి వాక్యములవలన, స్మార్తులలో శివభక్తిగలవారుకూడ నున్నట్లు నిశ్చితమే గదా. అప్పుడు-15వ పుటలో వారు వ్రాసినదానికి, 16 వ పుటలో వారు వ్రాసినదానికి, సంబంధము లేకపోవుటయేగాక అవి పరస్పర విరుద్ధములై యున్నవి[1].

## 2. వైష్ణవ పారిభాషిక పద ప్రయోగము

రామకృష్ణుడు వైష్ణవసంప్రదాయిక పారిభాషికపదప్రయోగము చేసినంతమాత్రమున-అతడు వైష్ణవుడు కానేరడు-రామకృష్ణునికి వృద్ధాప్యమున సమకాలీనుడును కవిత్రయములోని ఎఱ్ఱన వంశీయుడైన చదలువాడ మల్లన-వైష్ణవప్రబంధమగు విప్రనారాయణచరిత్రము (తొండరడిప్పొడి ఆళ్వారు) ప్రబంధముగా రచించియున్నాడు-కథ విశిష్టాద్వైత మతమునకు పట్టుగొమ్మలైన పన్నిద్దరాళ్వారులలో నొకడగు విప్రనారాయణుని కథ-కాని మల్లనకవి ఎట్లు తన్నుగూర్చి చెప్పుకొని నాడో చూడుడు :

---

1. చూ పూర్వోక్త సాహిత్య అకాడమీ పీఠిక—

"క: వినదొన్నతుఁగామాటీ
జననీ నందనుని సరససాహిత్యజనీ
జనకుని నార్వేలాన్వయ
జనితుని శ్రీ వత్స గోత్రుశైవాచారన్." 17 వ.

తాను శంభుదాసగు ఎఱ్ఱన చిన్ని మనుమడనని చెప్పుకొన్నాడు. గద్యకూడా, ఎఱ్ఱన గద్యవలెనె ప్రారంభించినాడు. "శ్రీ శంకరస్వామి సంయమీశ్వర చరణసరోరుహధ్యానానందసౌందర్యధుర్య" తండ్రి యైన లింగన-శివపూజా పరాయణత్వము నిట్లు తెల్పినాడు.

శా. రాజుల్మెచ్చఁగ జెప్పి కావ్యములు హేలాశంబుగా నద్రిశ
న్యాజానినే భజియించు నిత్యనియతిన్ దత్కాల పూజాక్రియా
భ్రాజిష్ణుత్వమునన్ జపించు దినమున్ బంచాక్షరీ మంత్రమున్
దేజోవంతుఁడు లింగనార్యుఁడు గుణోత్కృష్టుండు
మా తండ్రియున్! 20-ప

మల్లన శ్రీ కాళహస్తీశ్వర భక్తుడు.

ఇట్టి శైవాచార సంపన్నుడగు మల్లన-[1]విప్రనారాయణచరిత్రమును, వైష్ణవుడు రచించినట్లుగానే-అప్పుగుద్దినట్లు ముచ్చటగా రచించినాడు-ఇందలి వైష్ణవపారిభాషికములు చూడుడు:

అంగరంగ వైభవములు, ఆచార్యపురుషుడు, కావి వేష్టువులు జియ్యలు, తన్నీరు దాసళ్ళు, తిరుకాపులు, తిరుచూర్ణము, తిరునావు తిత్తులు, తిరునామము, తిరునాళ్ళు, తిరుమజ్జనపు బిందెలు, తిరుమణి, తిరుమాలిగెలు, తిరువాముడి, తిరువుళ్ళము, తిరుపీనము, తీర్థపెరుమాళ్ళు, నంబులు, పట్టెనామములు, ముద్రకర్త రామానుజోదర్చ భాష్యము, రామానుజకూటము సంకీర్తనపరులు, సాత్తని వైష్ణవులు సావడి మున్నగునవి ప్రయుక్తములైనవి. పై వానిలో కొన్ని పదముల కీప్రబంధమే ప్రమాణముగా గ్రహింపబడినది.

---

1. ఈ ప్రబంధము, కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తువారిచే క్రీ. శ. 1938 లో ద్వితీయ ముద్రణ మందినది-దానికి పీఠికా కర్తను నేనే-ఈప్రబంధమును గూర్చి యింతవఱకు సాధికార విమర్శ ప్రకటితము కాలేదు.

సారంగు తమ్మయ వైజయంతీ విలాసకథ యిదే-ఆతడు వైష్ణవ ప్రవృత్తి గలవాడే-అయినను-ఆతని కృతిలో వైష్ణవ పారిభాషికము లిందున్నవిన్ని లేవు. అది కేవల రసైక ప్రబంధముగా నుండును. దీనిని బట్టి. వైష్ణవ పారిభాషిక పదరచనను పురస్కరించుకొని రామకృష్ణుడు వైష్ణవుడనుట పొసగదు.

## 3. వైష్ణవ గుర్వాశ్రయము

రామకృష్ణుడు, భట్టరు చిక్కాచార్యుని తన గురువుగా కీర్తించిన పద్యమీవల నుదాహరించితిని-వైష్ణవగురువును పేర్కొన్నంత మాత్రముచేత-రామకృష్ణుని వైష్ణవుడనుట సాహసము-శైవులకు-గురువులింగధారణ దీక్షనిచ్చినట్లు, వైష్ణవులకు గురువు తప్తముద్రాంక ధారణముచేసి, విశిష్టాద్వైత మతానుయాయిగా నొనర్చును-రామ కృష్ణుడు విశిష్టాద్వైత మతసంప్రదాయానుసారముగాచిక్కాచార్యుల శిష్యుడై, తప్తముద్రాంకధారి యయ్యెనని యెవ్వరైన ప్రమాణముగా నిరూపింపగలరా? అని యడుగుచున్నాను. వైష్ణవులు శైవులైనట్లు మనకు నిదర్శనములున్నవిగాని శైవులు వైష్ణవులైనట్లుగా నొక్క నిదర్శనమును లేదు-చక్రపాణి రంగనాధుడను వైష్ణవుడు శైవుడై శైవకృతులు రచించినట్లుగా కవి చరిత్రలు సాక్షమిచ్చుచున్నవి-రామ కృష్ణుని విషయమున నట్టి యుదంతె మెప్పటను గానరాదు. రామ కృష్ణుడు తప్తముద్రాంక ధారియైన వైష్ణవుడైనచో, పాండురంగ మాహాత్మ్యమున నిష్టదేవతాస్తుతి పూర్వాశాస్త్ర సంప్రదాయాను సారముగా నుండక మఱియొక విధముగా నుండెడిది-గురుముఖమున మతదీక్షపొందిన శిష్యులు, శైవులుగానిండు, వైష్ణవులుగానిండు వారి వారి మత సంప్రదాయముల ననుసరించి, ఇష్టదేవతా స్తుతిని గావిం

చెదరు[1], శైవులైన వారెట్లుగా, ఇష్టదేవతాస్తుతి చేయుదురో, ఆ రీతిని తన ఉద్భటారాధ్య చరిత్రమున రామకృష్ణుడు చూపియేయున్నాడు. ఇక పాండురంగ మాహాత్మ్యమున నిష్ట దేవతాస్తుతియు శైవకృతి యరిదున్నట్లున్నదేగాని, వేఱుగా లేదు- ఇందు శివస్తుతియున్నది.

## వైష్ణవ కృతులు

### ఈశ్వర స్తుతి

శైవులలో ముందు నేను చూపినట్లు, విష్ణుని పాశుపతునిగా శైవునిగా భావించుటవలన - విష్ణుస్తుతి యుండును - (చూ నన్నెచోడనికుమార సంభవము.) శివకవియగు శ్రీనాథకవిసార్వభౌముని హరవిలాసమున కంచి వరదరాజు ప్రథమముగా పేర్కొనబడినాడు-భీమఖండమున-నవతారికలో గోపాలస్తుతి కలదు (చూ మూడవపద్యము). రామలింగడే ఉద్భటారాధ్య చరిత్రమున-విష్ణుస్తుతి గావించినాడు. (చూ 3 వ పద్యము) కాని వైష్ణవమగు పాండురంగ మాహాత్మ్యమున నీ క్రింది రీతిని శివస్తుతి యున్నది.

ఉ. ఈ చివురాకు నీ(వనవ మిా ప్రవుదేనియ యొంకయొప్పెడిన్
జూచితిరేయటంచుఁ దనచుట్టు కుశాదులు గొల్వఁగాఁగవ
ర్ధాచిత చంద్రగాంగ జలమైన శివాహ్వయకల్ప శాఖ వే
దాచలమంత్రి) కీర్తికలశాబ్ధికి వెన్నెలమాడ్కిఁ జూచుతన్.

రామకృష్ణుడు తన వైష్ణవగురువై నభట్టరుచిక్కాచార్యుని యొద్ద విశిష్టాద్వైత మతసిద్ధాంతము ననుసరించి వైష్ణవుడైనతో. తన కావ్య

---

1 ఇంతవఱకును తెలుగుసాహిత్యమున-ఇష్టదేవతాస్తుతి ఉత్పత్తి వికాసములు-క్రమపరిణామము-భిన్నత్వము-మొదలగు విషయములపై పరిశోధన ప్రారంభమే కాలేదు-అట్టిపరిశోధనకు కొంత దోహదము-చేయుటకే యీ విషయమందు కొంచెము విస్తరించినాను-దీనినిగూర్చి పరిశ్రమ చేయువారికి, కొన్ని యర్హతలుండవలెను-పట్టభద్రులై పాశ్చాత్య విమర్శనాపద్ధతి ననుసరించువారిది చేయలేరు-ప్రాచ్య పండితులు మాత్రమే చేయగలరు.

మున శివస్తుతి చేయుట. ఇది విశిష్టాద్వైత మతమునకత్యంతవిరుద్ధము- వైష్ణవు లెంతమాత్రము శివనామోచ్చారణము చేయరు-శివ నామము వినబడకుండ గంటలు కట్టుకొను ఘంటాకర్ణులున్నారు- విశిష్టాద్వైత మతమున, శివుని పేరుకూడ తలపరని, తెలుపుటకు, నొక యుదాహరణము చూపుచున్నాను,

## శ్రీ మద్రామాయణము

రామాయణమున-శ్రీరాముడులంకనుండి యయోధ్యకు తిరిగి వచ్చునపుడు- సీత కా యా విశేషములను చూపించె.

"సేతుబంధమితి ఖ్యాతం త్రైలోక్యనాభి పూజితమ్
ఏతత్పవిత్రం పరమం మహాపాతకనాశనమ్
అత్రపూర్వం మహాదేవ ప్రసాదమకరోత్ప్రభుః"

అని చెప్పినాడు-పురాణములందేమి, వ్యాఖ్యానములందేమి, రాముడు సేతువువద్ద శివలింగప్రతిష్ఠ చేసెననియు, నదియే నేడు రామలింగేశ్వర నామముతో వెలయుచున్నదనియు స్పష్టముగా చెప్పుచున్నది.

కాని విశిష్టాద్వైతమత సంప్రదాయానుసారముగా రచితమైన గోవిందరాజీయ కృతతిలక వ్యాఖ్యానమున- మహాదేవశబ్దము శివ పరము గనుక దానిని చెప్పుట కిష్టములేక-ఆశబ్దమును-విచిత్రి- సముద్రుడని యిట్లర్థము చెప్పినాడు.

"మహత్ జలం తద్రూపో దేవః సముద్రః"

ఇచ్చట జలపర్యాయముగా నిఘంటువులలో మహచ్ఛబ్దమున్నది గాని, మహాదేవశబ్దము లేనే లేదు-శివనామమును బహిష్కరించుటకు వైష్ణవులెంత పట్టుదలతో నుందురో తెలుపుటకు పై విషయము వివరించినాను-(చూ గోపినాథరామాయణము-పీఠిక-21-28 పుటలు-శ్రీ. శే. మేడేపల్లి వేంకటరమణాచార్యుల వారిది (1928)

ఇట్లు వైష్ణవమతమున, శివనామమునకే అస్కారము లేకపోగా కావ్యములయందు శివస్తుతి యుండుట గగనకుసుమము.

విశిష్టాద్వైత మతానుసారముగా, కావ్యావతారికకు శ్రీకారము మట్టిన రాజులు. ఆముక్తమాల్యదలో, శివస్తుతి చేయలేదు సరికదా తనకృతిని శ్రీ తిరుపతి వేంకటేశ్వరునకు కృతినిచ్చియు, నెచ్చట

"వేంకటేశ్వర" అని "ఈశ్వర" శబ్దమును చేర్చి వాడనేలేదు-చూడుడు వేంకటభర్త (1-1) వేంకటపతి (1-16) వేంకటాచలపతి (1-49) వేంకటాచలరమణా (2-1) వేంకటరాయా (3-1) అలమేల్మంగా ఖిధేంది రాలయక్షణా (1-87) వృషగిరివక్షఖగాంకా (4-1)[1] శేషనగహార్యక్షణా (5 1) శాకోదర నగోదయస్థపతంగా (6-1)

ఈశ్వరశబ్దము శివునియందే. నితరదేవతలయందు వర్తింపదు.

'వేదాంతేషు యమాహురేక పురుషం వ్యాప్తస్థితంరోదసీ
యస్మిన్నీశ్వర ఇత్యనన్య విషయశ్శబ్దోయ థార్థాక్షరః
అంతర్యశ్చ ముముక్షుభిర్నియమిత ప్రాణాదిభిర్మృగ్యతే
సస్థాణుః స్థిరభక్తి యోగసులభో నిశ్శ్రేయసాయాస్తునః

కాళిదాసు విక్రమోర్వశీయనాంది

రాయలేకాక, రాయల యుగమున వైష్ణవకవులుని నియమము పాటించిరి. వైష్ణవమును స్వీకరించిన అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయమున సిద్ధిరాజు తిమ్మరాజు తన పరమయోగి విలాసమున శివస్తుతి చేయనేలేదు- కేవలము వైష్ణవులేయైన శేషముతిరుమలార్యుని యంబరీషోపాఖ్యానమున, శేషము రఘునాథాచార్యుని కులశేఖర మహీపాల చరిత్రమున-కట్టావరదరాజు శ్రీరంగ మాహాత్మ్యమున ఈశ్వరస్తుతి లేదు-ఇందువలన-శివస్తుతి వైష్ణవ కవిరచిత కావ్యములలో నుండదని సిద్ధాంతము.

## అల్లసాని పెద్దన వైష్ణవుడుకాడు

ఈ సందర్భమున, రామకృష్ణుని సమకాలికుడైన అల్లసాని పెద్దనకు శఠగోపయతి గురువనియు, వందుచే పెద్దన వైష్ణవుడయ్యెననియు

---

1. ఆముక్తమాల్యద (వే. వేంకటరాయశాస్త్రిగారివ్యాఖ్య)యందు 7 ఆశ్వాసములున్నవి-7వ ఆశ్వాసాదిని "వేంకటాచలరమణా" అని సంబోధనగలదు-కాని ఈ పద్యము రాయలకృతికాదు చూడుడు-ఆముక్తమాల్యద-ఆశ్వాససంఖ్య-అనునావ్యాసము-భారతి-(1970. అక్టోబరు)
ఈ విషయము నింతకుముందెవ్వరు తెలుపలేదు.

విమర్శకులందఱును వ్రాసియున్నారు-కాని పెద్దన వైష్ణవుడు కాడు. మను చరిత్రమున- "ఉల్లమునందు నక్కటికమూనుట" అన్న శివస్తుతి పద్యమందఱికి పరిచితమే. ఆతడు గురువువలన సమాశ్రయణమునందిన వైష్ణవుడేయైనయెడల, తన కావ్యమున శివస్తుతి చేయకూడదు. కాని శివస్తుతి చేసినవాడు కావున పెద్దన వైష్ణవుడు కాడు. ఇట్లే, భట్టపరాశర దేశికేంద్రుని శిష్యుడగు-సంకుసాల నృసింహకవియు, కవికర్ణరసాయనమున-శివస్తుతి చేసినాడు, అందుచే నాతడును వైష్ణవుడు కాడు,

ఈ యుదాహరణలనుబట్టి వైష్ణవ గురువుశిష్యులమని చెప్పికొన్నంత మాత్రమున నా కవులు విశిష్టాద్వైతులు కారనియు, వారు స్మార్తులైనను శైవులైనను వైష్ణవమత సిద్ధాంతములను గ్రహించుటకు మాత్రమే వైష్ణవగురువుల నాశ్రయించిరనియు, నది కేవలము సాహిత్య విషయమేగాని మతవిషయికము కాదనియు గ్రహింపవలెను.

దీనికి హేతువు దెలుపుట సులభము-కవులు వైష్ణవమతానుయాయులైన రాజులకు కృతినిచ్చు నీ పురామత సంప్రదాయము తెలియుటుట యావశ్యకము.

పెద్దనయు, రాయలు తన కృతినంకితము గొనుటకు తగిన సాధన సంపత్తి సమకూర్చుటకే, శఠకోపయతి నాశ్రయించి యాతనికి శిష్యుడై, ఆ మతసిద్ధాంతములను గ్రహించెను[1]-రామకృష్ణుడు నట్లే వైష్ణవమత సిద్ధాంతములు గ్రహించుటకు, చిక్కాచార్యుల శిష్యుడయ్యెను-మఱియు నాకాలమున నిప్పటివలెగాదు మత సంప్రదాయిక గ్రంథములు, మతసంప్రదాయములు, గురుముఖతః-తెలుసుకొనవలసినదేగాని, వేఱుమార్గములేదు-కావున నీ సమయమువలన వైష్ణవ గుర్వా

1. ఈ సందర్భమున-రాయలు తాముకోరి అంకితము పుచ్చుకొన్న కావ్యమొక్క మనుచరిత్రతప్ప వేఱొక కృతిలేదని గ్రహింపవలెను.

శ్రీయమున్నంతమాత్రమున వైష్ణవులు కారని రామకృష్ణుడు వైష్ణవుడుకాడని నిర్ణయము.[1]

## 4. వైష్ణవకృతి పతిత్వము

పాండురంగ మాహాత్మ్య కృతిపతి విరూరి వేదాద్రి మంత్రి జన్మతః వైష్ణవుడు గాడు-ఆరువేలనియోగి- "సరసగుణరతీశా! షట్సహస్రాన్వయేశా!" అని పంచమాశ్వాసాంతమున కృతిపతి సంబోధన-'షట్సహస్రాన్వయేశా' అనగా ఆరువేలకులమున కధీశుడు ప్రముఖుడు-అని అర్థము-ఇదియొక్క ఆరువేలనియోగులకుమాత్రమే చెల్లును-విరూరి వేదాద్రిమంత్రి, నియోగియైనను విశిష్టాద్వైతమత సిద్ధాంత గ్రంథములన్నియు నధ్యయనముచేసి వైష్ణవము స్వీకరించుటకు తగిన యర్హత గడించెను. అందువలననే రామకృష్ణుడు కృతిపతిని గూర్చిన యీ విశేషమును గ్రంథాది పద్యముననే "వైష్ణవస్వీకారార్హు విరూరి పట్టణపతిన్ వేదాద్రిమంత్రీశ్వరున్" అని చక్కగా తెలిపినాడు. ఇదియు నొక విచిత్ర సన్నివేశము-రామకృష్ణుడు మొదట ఆదిశాఖ-అనగా ప్రథమశాఖ నియోగియై శైవమతమును స్వీకరించిన కవి, అట్లే వేదాద్రిమంత్రి మొదట ఆర్వేలనియోగియై యావెనుక వైష్ణవము స్వీకరించినవాడు-కవి కృతిపతి యిరువురు నియోగులై శైవ వైష్ణవమతములు స్వీకరించుట సంఘమున-శైవవైష్ణవ మత విద్వేషములు లేవని నిరూపించుటకు హేతువగుచున్నది. ఇందులకిరువురు నభినంద్యులే-ఇట్టి సంఘటనలు కేవలము వైష్ణవకవుల కృతిపతులలో గానరాదు.

## 5. వైష్ణవక్షేత్ర మాహాత్మ్య రచన

రామకృష్ణుడు-వైష్ణవక్షేత్ర మాహాత్మ్యములు రచించెనుగాన వాడు వైష్ణవుడనుటయు సమంజసముగాదు. రామకృష్ణునికృతులు-

---

1. మన ప్రబంధములు కేవలము రసపోషణకేగాక-మతసంప్రదాయికములని తెలుపుటకే విషయమింతవఱకు విస్తరింపవలసి వచ్చినది-సారాంశము, మన ప్రబంధములను కేవలము సాహిత్య దృష్టితోగాక మత సంప్రదాయిక దృష్టితో పరిశీలించి విమర్శింపవలయుననుట.

ండురంగ మహాత్మ్యము-ఘటికాచల క్షేత్రమహాత్మ్యము-రెండును హ్యములకు వైష్ణవముగా దోచినను, అవి స్వతస్సిద్ధముగా వైష్ణవ త్రములు గావు- శైవక్షేత్రములు వైష్ణవక్షేత్రములుగా మారినవి

## 1. పాండురంగ మాహాత్మ్యము

పాండురంగ క్షేత్రము శివక్షేత్రమే-అందలి దైవము విఠ ్వరుడు-పాండురంగశబ్దమునకు శివుడనియే యర్థము-పాండురాంగ ్వరుణ జటాచయావృత సితాహిఫణామణులొప్ప-అని నన్నెచోడని మార సంభవము 8-79 ఈ క్షేత్రము శివక్షేత్రమే-కాబట్టి యే-మకృష్ణుడీక్షేత్ర మాహాత్మ్యమును కాశీవర్ణనతో ప్రారంభించి-రావాతు-సామియేను శైవక్షేత్ర ప్రశంసదెచ్చి-అగస్త్యుడు (పరమ వోత్తంసుడు) కుమారస్వామితో కైలాసమున కేగినట్లు వర్ణించి డు. తరువాత గౌరీశంకరుల యుద్యానవన విహారము, కుమార ్మి తలిదండ్రులను దర్శించుట-ముక్తామణి సమర్పణము, శివుడు దైవతములోకచోమందునని చెప్పుటితో ప్రథమాశ్వాసము గిసినది-ఇందు కథాభాగమున వైష్ణవ ప్రశంసయేలేదు.

## 2. ద్వితీయాశ్వాసము - పుండరీకునికథ

ఇందు పుండరీకుడు ఉబ్బులింగమువలె నున్నాడని వర్ణన-ఉబ్బులింగము వోలెనుండువేడ" (2-28) వైష్ణవులెవ్వ ు, శివనామమువలె లింగనామమును నిరసింతురు. కథ ష్ణవమైనను రామకృష్ణుడు శివుని యుపమానమే వైష్ణవ స్తునికి వాడినాడు. దశావతారస్తుతిలో బుద్ధావతారము వర్ణిత వది. ఇది వైష్ణవ సంప్రదాయము గాదు- ఇదే 166వ పద్యమున మనిధి విఠ్ఠలేశ్వరుడు దైవతరత్నము" అని వైష్ణవ క్షేత్రాధిపతి

---

1. ఆ కా డ మీ ముద్రణమున "ఉబ్బలింగముబోలె" అని యుండుట తప్పు-అది "ఉబ్బులింగము"గా నుండవలెను. ఉబ్బు లింగము-అనగా భూమినుండి పైకుబ్బిన లింగము-స్వయం భూలింగము.

డైన విఠలునికి 'ఈశ్వర' శబ్దము చేర్చి విఠ్ఠలేశ్వరుడని వర్ణించినాడు. ఈ యాశ్వాసమున నారదుడు శివుని వద్దకు వచ్చుట తెలుపబడినది. ఇందు కైలాస వర్ణన గలదు. శివుడు నారదునితో శ్వేతమాహాత్మ్యము చెప్పుట కలదు.

3. తృతీయాశ్వాసమున భూదేవి విష్ణు కడకేగుట - అన్న శీర్షిక "వీరభద్రగదా విదారితంబగు పూషాదృక్ వదన గహ్వరంబునుం బోలె" (3-150) అని శివసంబంధమైన యుపమానము చెప్పబడినది. ఇందు రాధచరిత గలదు. విశిష్టాద్వైతమున రాధా ప్రసక్తి లేదు.

4. చతుర్థాశ్వాసమున రాధ తపస్సు. ఇందు రాధ విభూతి ధరించినట్లు చెప్పబడినది.

సీ. పా. కస్తూరి తిలకంబు గాలి నాటిన నేర్పు
నొసలెట్లునని చెనోభపితమునకు (4-3)

తపోవనమున "పుష్పాదుల సంటిన తేటులు-భూతిభృజ్జటా పుంజము" (4-14) వలె నున్నవి. ఇచ్చట-విభూతి చెప్పబడినది. విభూతి ధారణ శైవ లక్షణము.

5. సీ పా. కాళరాత్రి స్తనాగ్ర కృతావకాశమై
యురము వెల్మిడిపూఁత యొప్పుననఁగ (5-13)

ఇచట వెల్మిడిపూఁత-భస్మము-విభూతి పై వాని కన్నింటిని మించినది పాండురంగ విఠలుని వర్ణన

లయగ్రాహి. కంబువున రాళచికురంబులు గటీకృతకరాంబురుహ
యుగ్మ మళికాంబకము. నగ్న
త్వంబు బసిరొప్పు వెదురుంబెరుగు నుడ్డ పొదలుం
బదములం బలుకుచుం బొదలు మువ్వల్
అంబు ఫణిజిద్రుచి ఫలంబు మకరాకృతి గరంబమరు
కుండలములుం బరగఁ మంచా
ద్దంబులఁ దలిర్చు నిసువుం బలి భజించెఁ ద్విజగంబు
లకు రోహణనగంబగు నగణ్యున్ (5-56)

ఈ వర్ణనమున విఠ్ఠలు డై దేండ్ల వయసుగల శ్రీకృష్ణునిగా రామకృష్ణకవి నిరూపించినాడు. ఆతనికి "అలికాంబకము" అనగా

వొసట కన్నుగలదు. శ్రీకృష్ణునకు ఫాలభాగమున నేత్రము లేదు. ఫాలభాగమున నేత్రము గలవాడు శివుడే వేఱుదైవము లేదు-అతడు త్రినేత్రుడు.

ఇంకను నిందే విఠలుడు త్రినేత్రుఁడుగా వర్ణితుడు-

ఉత్సాహ. వచ్చివచ్చి కల్వకచ్చువంటి యొంటివానిఁగ

న్నిచ్చవచ్చు గ్రచ్చకాయలెంచి యాడువాని, లో

విచ్చు వెచ్చుగంటివాని వింటి వెన్నద్రుచ్చు న

వ్వచ్చ విల్తుఁ గన్నతండ్రిఁ బాండురంగవిఠ్ఠలున్(5-197)

ఇచట స్పష్టముగా "వెచ్చుకంటివాడు" అనగా అనల నేత్రుడు శివుడని గలదు.

ఈనాటి పాండురంగమాహాత్మ్య పరిష్కర్తలకు నీ విషయము మనగాహనము కాకపోవుటచే, చతుర్థాశ్వాసమున విఠ్ఠలుడు త్ర్యక్షుడు మూడు నేత్రములు గలవాడని యుండగా నది యర్థముగాక ఆ పద్యము నెట్లు సందేహాస్పదముగా ముద్రించిరో చూడుడు.[1]

"క. క్షణము క్షణార్ధమైన (మయిన?) దీ

క్షణలలితంబగు పయోధికయను వదన మీ

క్షణ మొనరించు కృతికి నా

క్షణమునఁ గల వఖిల సుకృతజాత ఫలంబుల్" (4-181)

ఈ పద్యము పరిష్కర్తల కర్థము కాలేదు-పద్య మిట్లుండవలెను.

క్షణము క్షణార్థమయినఁ ద్రీ

క్షణలలితంబగు పయోధిక యను వదన మీ

క్షణ మొనరించు కృతికి నా

క్షణమునఁ గల వఖిల సుకృత జాతఫలంబుల్.

పై పద్యార్థ మిది.

---

1. ఆకాడమీ ముద్రణము-పుట 182, పుట యడుగున పాఠములు 3. మైనఁద్రీక్ష-ర్థంబైనఁద్రి-బైనఁద్రీక్ష-మైనది 3 ప్రతులలో 'ద్రిక్ష' త్రీక్ష అని యుండగా దానిని గమనింపక-దీక్ష" అని నిరర్థక పాఠము మూలమున నుంచినారు.

ఒక్క క్షణమైన = క్షణకాలమైనను, అర్ధక్షణకాలమైనను త్రీక్షణ లలితంబు = మూడు కన్నులతో నొప్పు-పద్మాక్షిరమణ = విష్ణువు యొక్క వదనమును = ముఖమును, ఈక్షణ మొనరించు = చూచునట్టి కృతికి = మానవునకు, ఆ క్షణమున = ఆ తత్క్షణమే, అఖిల సుకృతజాత ఫలమ్ముల్ = అన్ని పుణ్యకర్మముల ఫలములు, గలవు = లభింపగలవు.

ఇచ్చట క్షణ, శబ్దము. త్రీక్షణ-ఈక్షణ-క్షణ-పదము వాటితో మనోహరముగా కూర్చబడి రామకృష్ణుని పదప్రయోగనైపుణ్యము తార్కాణగా నున్నది.

ఇందువలన విఠలుడు, శివుడేగాని విష్ణువు కాడు.

## ఘటికాచల మాహాత్మ్యము

ఘటికాచల మాహాత్మ్యమున వర్ణితుడైన నృసింహదేవుడు-శివుడే-ఘటికాచలేశ్వరుడు-నేటికిని ఘటికాచలమునకు చోళ లింగ పురమని నామాంతరము-ఈ కృతిలో వైష్ణవ పారిభాషికములు వైష్ణవ క్షేత్రవర్ణన యున్నను - నిచ్చట దైవము - నృసింహుడు త్రినేత్రుడే-

శ్లో॥ సత్యజ్ఞాన సుఖ స్వరూప మమలం క్షీరాబ్ధి మధ్యేస్థితం
యోగారూఢమతి ప్రసన్న వదనం భూషా సహస్రోజ్జ్వలం
త్ర్యక్షం చక్రపినాక సాభయకరా న్బిభ్రాణ మర్కచ్ఛవిగ్ం
ఛత్రీభూత ఫణీంద్ర మిందుధవళం లక్ష్మీనృసింహం భజే.

అని ధ్యానశ్లోకము-ధ్యానశ్లోకము లెప్పుడును దైవస్వరూపమును కూలంకషముగ వర్ణించునవి-ఈ ధ్యానశ్లోకము ననుసరించియే రామ కృష్ణకవి యీ కృతిలో నృసింహుని త్రినేత్రునిగా నిట్లు వర్ణించి యున్నాడు.

గీ॰ పా. కనకన వెలుంగు నంగారక విధమునను
గావనయ్యెడి మిక్కిలి కంటిలోని (3.8)

ఆధునికయుగ ప్రవర్తకులగు కొక్కొండవారు ప్రత్యేకముగా ఘటికాచల మాహాత్మ్యము రచించుటయేగాక, తమ మహాగ్రంథ మగు విశ్వేశ్వరీయమును, ఘటికాచల నృసింహునికి నంకితము చేసి యున్నారు. వారు పై ధ్యానశ్లోకము నిట్లాంధ్రీకరించినారు :

శా. సత్యజ్ఞాన సుఖస్వరూపుగొలుతున్ సద్ధుగ వార్ధిస్థితున్
శ్రీకణ్ఠం చన్ముఖ యోగి వంద్య నమితున్ శ్రీమద్వి
భూషోజ్జ్వలున్
నిత్యానంద కపినాక సాధుజనహారున్ నీరేజబంధుద్యుతిన్
శ్రుత్యంత ప్రవరాత వత్తుని త్రిర్యక్షున్ శ్రీ నృసింహ ప్రభున్.
(బిల్వేశ్వరీయము ప్రథమబింబము 120 పద్యము)

కృతిపతి సంబోధనల యందును నృసింహుడు త్రినేత్రుడుగానే సంబోధింపబడినాడు.

## డిండిమ వృత్తము

"జ్వల జ్జ్వలిన వీక్షణ ఘన సంఘగర్జనా"
పంచమ బింబము 620 ప.

## తారక వృత్తము

తరుణేందు హుతవహాంబక తారక విలసింహా
శరణాగత భరణాశ్రిత శంకర సురసింహా
హరణా లఘుకరణా ఘటికాచల నరసింహా
కరుణాకర కృతిరత్నము గైకొనుము నృసింహా.
(షష్ఠబింబము-కావ్యాంతము 19 ప.)

రామకృష్ణుడు ఘటికాచల క్షేత్రమున శివుడు మన్నట్లుగా నిట్లు తెలిపినాడు.

క. వారంతరద్విమాన
ద్వారము నొత్తించి నిలువ దక్షిణదిశగా
చేరి వెస ంబ్రసవాయుధ
వైరి నిరీక్షించి ప్రమథ వైభవమెసగన్ (8-7)

దీనినిబట్టి ఆ క్షేత్రమున దక్షిణదిశ-శివుడున్నట్లు స్పష్టము. దీని ననుసరించియే కొక్కొండవారును ఆ క్షేత్రమున శివుడున్నట్లుగా నిట్లు సంబోధించినారు.

## వసంత తిలక వృత్తము

ఈశా మహేశ పరమేశ రమేశ శేషా
ఈశా అముఖ్య దివిజేశ త్రివిక్రమేశా

కాశీశ భోగశయ కామద సత్ప్రకాశా
కాశీశ కాంతి తనుకా ఘటికాచలేశా. చతుర్థ బింబము 188

పై వానినిబట్టి ఘటికాచల క్షేత్రమును-పాండురంగ క్షేత్రము వలె, తొల్లి శివక్షేత్రమైనట్లు నిశ్చితము.

రామకృష్ణకవి వాస్తవముగా వైష్ణవుడే యైనచో, పై రెండు క్షేత్రముల యందు శివప్రసక్తి యెంతమాత్రమును లేకుండగనే కేవలము వైష్ణవపరముగా నీ క్షేత్రములను వర్ణించియుండును. అట్లు లేక పోవుటచే ఇదియు నాత డారాధ్య శైవుడనియే నిరూపించుచున్నది.[1]

సాహిత్యమున శైవ వైష్ణవ మత విభేదమువలన-మన ప్రబంధము లుత్తమ స్థాయినిలేవని యీనాటి విమర్శకులోక మూహించుట కేవల మజ్ఞాన జనితము. శైవవైష్ణవమత సాహిత్యసమన్వయము వలననే మన ప్రాచీనాంధ్ర సాహిత్యము సుసంపన్నమై, మహోదాత్తమైనది. రామకృష్ణకవియు ననూచానముగా వచ్చుచున్న ఆరాధ్య శైవ సంప్రదాయము ననుసరించియే యీ రెండు వైష్ణవ క్షేత్ర మహాత్మ్యములు రచించినాడు.

రామకృష్ణుడు తనకు పూర్వులును శైవాచార సంపన్నులగు ఎఱ్ఱన, పోతనల సాధారణముగాగాని తాను విష్ణుకథాసంబంధమైన క్షేత్రమాహాత్మ్యములను వర్ణించినాడు, ఎఱ్ఱన, శంభుదాసుడయ్యు, లక్ష్మీనృసింహావతారము, (అహోబిల క్షేత్రము) అను నృసింహ పురాణము రచించుటయేగాక రామకృష్ణావతారముల రెండింటిని, రామాయణమున హరివంశముల వర్ణించెను, పోతన ఏకైకముగా, భాగవత భక్తి సంప్రదాయమునకు మూలస్తంభాయమానమైన భాగవతము రచించెను. ఎఱ్ఱన, పోతన లిద్దఱు ఆరాధ్యశైవులే. అట్లే రామకృష్ణుడును ఆరాధ్యశైవ సంప్రదాయము ననుసరించి, ఆ సంప్రదాయ ప్రవర్తకుల యడుగుజాడలలో వైష్ణవ క్షేత్రమాహాత్మ్యములు రచించి ప్రసిద్ధి వహించి, ప్రాచీన కవితా సంప్రదాయమును నిలిపెను.

---

1. ఇందువలన రామకృష్ణుని రచనా వైఖరి అన్న శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారి గ్రంథమంతయు పూర్తిగా నరాప్తమైనదని పాఠక లోకము గ్రహింపవలెను.

మతవిషయమై చర్చించునపుడా యా మత సంప్రదాయములు తెలియని యెడల, సాహిత్య విమర్శ అసత్య న్యస్తమగునని చూపుటకే యింతగా వ్రాయవలసివచ్చినది. రామకృష్ణుడు శైవుడే యని సిద్ధాంతము.

ఈ సందర్భమున ఘటికాచల మహాత్మ్యమున వర్ణింపబడిన నూటయెనిమిది దివ్యతిరుపతులను గూర్చి చర్చింపవలసియున్నది.[1] రామకృష్ణుడు నూటయెనిమిది తిరుపతులలో ఆంధ్రదేశమునకు సంబంధించినవి తిరుపతి, అహోబిలము అను రెండింటినే పేర్కొన్నాడు,గాని రామకృష్ణున కించెంచెండ్ల వెనుకనే యున్న అయ్యలరాజు నారాయణామాత్యుడు, హంసవింశతిలో నూటయెనిమిది తిరుపతులను పేర్కొను సందర్భమున (4-2.2) నొక సీసమాలిక 108 చరణములు గలది కలదు. అందు తెలుగుదేశమున శ్రీకూర్మము, సింహాచలము, ధర్మపురము, శ్రీకాకుళము, రామతీర్థము-అను వైష్ణవ క్షేత్రము. లుదాహృతములైనవి. ఇందు పాండురంగ విఠ్ఠలుడు-ఘటికాచల నృసింహుడు గలరు. కాని తక్కినవానిలో కూడ భేదములున్నవి-వానినన్నిటిని చర్చించుట కిది యదనుకాదు-"తిరుపతులు" అన్నపదము చేతనే, నివి విష్ణుసంబంధమైనవని తెలియుచుండుటచే, వైష్ణవము వ్యాపించిన తరువాతనే వీని గీ ప్రసక్తి సాహిత్యమున గలిగినది. ఈ నూటయెనిమిది తిరుపతులను గూర్చి యింకను పరిశోధింపవలయునని తెలుపుచు నీ విషయము ముగించుచున్నాను.

## విమర్శకాభిప్రాయములు - ఖండనము

రామకృష్ణుని గ్రంథములను కూలంకషముగా వ్యాసంగము చేసిన అతని చరిత్రను సమన్వయించిన, నాతడెట్లు తన జీవితమున, శైవారాధ్య మత సాంప్రదాయములు పాటించినాడో తెలియగలదు-కాని నేటి విమర్శకులు, వాఙ్మయ చరిత్రకారులు. దీనిని సరిగా గ్రహింపకపోవుటవలన నింతవరకు వ్రాయవలసి వచ్చినది.

---

1. చూ. ఘటికాచల మాహాత్మ్యము సాహిత్య అకాడమీ ప్రచురణ-డాక్టరు కేతవరపు రామకోటిశాస్త్రిగారి పీఠికా పరిష్కరణములతో నున్నది.

కవి జీవితమున గ్రంథముల మూలమున వ్యక్తమగుచున్న యంశములను గ్రహింపక నొకరి నొకరనుసరించుటవలననే యిట్టి పరిస్థితి యేర్పడినది.

ఈనాటి విమర్శకులలో ప్రముఖస్థానము వహించిన విశ్వనాథ వారు రామకృష్ణునిగూర్చి యెట్లు వ్రాసిరో చూడుడు.

"రామకృష్ణునిదిజన్మతోడిది శైవము అతనియెడ వైష్ణవము శిథిలమైనది"[1].

రామకృష్ణునిది జన్మతోడిది శైవము గాదనియు, పుట్టుకచేత నాతడు స్మార్తుడనియు యీవఱకే నిరూపించితిని-ఇక విశ్వనాథ వారు రామకృష్ణుని వైష్ణవమునకు శిథిల వైష్ణమన్నారు-ఇది రామ కృష్ణుని గ్రంధములలో ఒక్క పాండురంగ మాహాత్మ్యమును మాత్రమే పురస్కరించుకొని వ్రాసినది. రామకృష్ణుడు వైష్ణవము స్వీకరించెననియు, అది వైష్ణవమతము క్షీణదశలో నున్నప్పుడు తను గ్రహించెనని యర్థము. కాని ఉద్భటారాధ్య చరిత్రను బట్టి, పాండు రంగ మాహాత్మ్య, ఘటికాచలమాహాత్మ్యము ననుసరించి యీ వాక్యము, పూర్తిగా సదియు, వది వైష్ణవము క్షీణదశయనియు వారి ప్రాయము. ఇది అవిమర్శన మూలకము ఒక మతమునుండి మఱి యొక మతము మార్చుకొన్నప్పుడు-అందును, ఒక మతము నిష్ణాతు డైన పండితుడైనప్పుడు, క్షీణదశలో, శిథిలమైన సంప్రదాయములు గల మఱియొక మతమును స్వీకరించునా? అదియుగాక రామకృష్ణుడు భట్టరు చిక్కాచార్యుడను వైష్ణవ గురువు నాశ్రయించి, ఆ మత సిద్ధాంతములను నామూలాగ్రముగా నెఱిగినవాడు. అట్టివాడు, శిథిలమైన వైష్ణవము నవలంబించుననుట పూర్తిగా అసంగతము- అసంబద్ధము.

విశ్వనాథవారి వాక్యములను ప్రమాణముగాగొని, వైష్ణవులే అయిన రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారును రామకృష్ణుని వైష్ణవ గురుశిష్యత్వమును పరిశీలింపక-రామకృష్ణునిది శిథిల వైష్ణవమనియే

---

1. తెలుగు విజ్ఞాన సర్వస్వము: పుట 1002

వ్రాసినారు. వారు రామకృష్ణుని వైష్ణవమును గూర్చి చర్చించి వ్రాసినమాటలివి.

"అసలు బుడమే భద్రములేని రామకృష్ణుని యా వైష్ణవములో అది వడగల సంప్రదాయమా, తెంగలె సంప్రదాయమా అను ప్రశ్న వట్టి వినోదమాత్రమే.

అంగా సాహిత్య విమర్శనము-[1] వినోద మాత్రమని వారి యభిప్రాయమున కెట్టి విలువ 'యీయవలెనో పాఠక లోకమే నిర్ణయింపగలదు. ఇది యంతయు గ్రంథములు శుణ్ణముగా చదువక పోవుటచేతను. నితర మత సంప్రదాయము తెలుంగక పోవుటచేతను వచ్చిన యనర్థకము వీరి పీఠిక చదివినచో, వీరు-ఆముక్త మాల్యద యందు-ప్రతిపాదితమైన వైష్ణవ మత సిద్ధాంతములనుగాని-రాయ లందు ప్రతిపాదించిన విషయములుగాని గ్రహింపలేదని స్పష్టమగును.

వైష్ణవమును గురించి సాధికారముగా చెప్పగలవారు. అనంత కృష్ణ శర్మగారని, వారి యభిప్రాయములను-నాధారముచేసికొని, ఘటికాచల మాహాత్మ్య పీఠికాకర్త[2] వైష్ణవము, పుట్టు పూర్వోత్తరములు-రామకృష్ణుని మధ్య వైష్ణవము-ఘటికాచల మాహాత్మ్యమున వైష్ణవ సంప్రదాయములు అన్న శీర్షికలలో 58 నుండి 81 వఱకు 23 పుటలు వ్రాసియున్నారు. అసలు విశ్వనాథ అనంతకృష్ణ శర్మల యభిప్రాయములే-నిరాధారములని పైన సోపపత్తికముగా నిరూపించినాను-ఇది యంతయు-

"రామకృష్ణుడు మతము మార్చుకొన్నాడు"

అన్న అభిప్రాయము నొకరు ప్రతిపాదింపగా, విమర్శకులందరు దానిని పరిశీలించకుండ వ్రాసినందువలన యేర్పడినది.

"రామకృష్ణుడు పేరుమాత్రమే మార్చుకొనెను
గాని
మతము మార్చుకొనలేదు"

---

1. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ముద్రణము. పుట 18.
2. ఘటికాచల మహాత్మ్య పీఠిక పుట 60.

అని నిర్ణయించితిని గనుక దీనిని గురించి వ్రాసిన పుటలన్నియు వ్యర్థములైనవి.

రామకృష్ణుని గూర్చి మదరాసు విశ్వవిద్యాలయములోను ఆంధ్ర విశ్వవిద్యాలయములోను, పరిశోధనలు జరిగి. ఆ ఇరువురు రచయితలు పట్టము పొందినారట-వానిని నేను చూడలేదు. అందువలన వానినిగూర్చి నేనేమియు చెప్పజాలను.

మతము మార్పు విషయమై యింత వ్రాసిన విమర్శకులు-ఈ విషయమును గూర్చి "రామకృష్ణుడు మొదట శైవుడైనట్లు, తరువాత వైష్ణవుడైనట్లు కన్పట్టుచున్నది" అని యొక్క వ్యాసము వ్రాసి మిగిలిన పుటలన్నియు నాతని కవితా వైశద్యమును గూర్చి వివరించిన, రామకృష్ణునికి ప్రబంధ కవులలో గల యున్నత స్థానము ఎంతో విశదమయ్యెడిది-కాని నేటి మన విమర్శన పథకమట్టిదిగాదు ఇకనైన మత సంప్రదాయములు తెలియకుండ, మతమును గూర్చి విమర్శకులు చర్చించినది సాహితీ విమర్శనా పథకమునకు భంగకరమని గ్రహించి అట్టిది విరమింతురని యాశించుచున్నాను.

## 4. రామలింగ (కృష్ణ) కవితా తత్త్వము

రామలింగ కవి కవితా తత్త్వము-శైవ వైష్ణవ మత సమన్వయముచేయుటయేగాక, భక్తిశృంగారరసములనుసమ్మేళనము చేసినది.

"సీ. పా. శైవ వైష్ణవ పురాణావళీ నానార్థ
ములు నీకు కరతలామలకనిభము"

అను వాక్యముపై తత్త్వమును విశదీకరించుచు.[1]

ఈ శైవ వైష్ణవ మతసమన్వయము - రామలింగకవి, ఎఱ్ఱన, పోతనలనుండి గ్రహించినాడు-ఈ విషయ మిదివఱకు తెలిపినాడను-

### రచనలు - భక్తి శృంగార రస సమన్వయము

రామలింగకవి రచనల క్రమపరిణామమును బట్టి చూడగా, మొదట, భక్తిరసముతో ప్రారంభమైన అతని కవిత - "శృంగార

1. శైవ వైష్ణవ పురాణావళీ నానార్థ రచనా పటిష్ఠైక రమ్యమతివి" అని పాఠాంతరము.

రసాలింగితమై" అంతమున భక్తిరసముతో, పరమ పరివ్యాప్తినొంది నది-భక్తిరసప్రధానములైనను నందు శృంగార రసమొక యంగముగా నుండును.

ఉద్భటారాధ్యచరిత్ర - తొలికృతిలో-శివభక్తి ప్రధానరసము శృంగార రసమంగము.

కందర్ప కేతువిలాసమున - శృంగారము ప్రధానరసము

హరిలీలావిలాసము - శృంగార రసప్రధానము భక్తిరసమంగము

పాండురంగ విజయము - శృంగార రసప్రధానము

పాండురంగమాహాత్మ్యము - భక్తిరసప్రధానము శృంగారమంగము

ఘటికాచలమాహాత్మ్యము - భక్తిరసప్రధానము.

ఏ కవియైన ఒకేమతము ననుసరించిన, భక్తిరసమును శృంగార రసమును-సమన్వయించి, కావ్యరచనము చేయవచ్చును-కాని భిన్నములైన శైవ వైష్ణవ మతములను సమన్వయము చేయుచు, ఒక పట్టున శైవ భక్తియు మఱొకపట్టున వైష్ణవ భక్తియు ప్రపంచించుట యసాధ్యము-భక్తి, కవితాప్రతిభ, రెండు గుణములు మూర్తీభవించిన కవితప్ప యితరులట్టి కావ్యరచన చేయజాలరు-రామలింగకవి, రామకృష్ణుడై అట్టి లోకోత్తర కవితా సమన్వయము చేసినాడు.

స్పష్టప్రతిపత్తికై-యిట తిరిగి వివరించుచున్నాను

శైవము - శివభక్తి, శృంగారరసము - వైష్ణవము - వైష్ణవభక్తి

ఉద్భటారాధ్యచరిత్ర- → శివభక్తి

కందర్పకేతు విలాసము → పాండురంగ విజయము

హరిలీలావిలాసము → పాండురంగమహాత్మ్యము, ఘటికాచలమాహాత్మ్యము → వైష్ణవభక్తి

రామలింగ (కృష్ణ)కవి కృతులలో నొక యద్భుత కవితాశక్తి నిట్లు వివరము చేయవచ్చును. ఆతని శివభక్తి పరకృతులు చదివినపుడు

మనమాతడు అచ్చముగా శైవుడనియే భావింతుముగాని వేఱొండు భావన మనకు గలుగదు. అట్లే-అతని వైష్ణవ కృతులు చదువుచున్నప్పు డాత డచ్చముగా వైష్ణవు డనియే భావింతుము. ఇదియే అతని కవితా శిల్పరహస్యము-ఈ మత సమన్వయ దృష్టితో నై కావ్యములను కూలంకషముగా వ్యాసంగము చేయవలెను.

అట్లు వ్యాసంగము చేసినగాని మనము రామలింగ (కృష్ణ) కవితా తత్త్వమును-సంపూర్ణముగా నాకళించుకొనలేము.

## నవ్య కవిత్వము

ఆధునిక యుగమున-"నవ్య కవిత్వ"మనగా ప్రాచీన సంప్రదాయమునకు భిన్నమై, నూతన రీతులలో కవిత (భాష, భావములు ఛందస్సు) వెలయించుట యను నర్థమున మిక్కిలి వాడుకలోనున్నది. కాని రామలింగ కవి తన పాండురంగ మాహాత్మ్యమున, నీ నవ్య కవిత్వము" అను పదమును, కృతిపతిచే నిట్లు ప్రయోగింపజేసినాడు.

"ఉ. స్కాందపురాణ నీరనిధి కౌస్తుభమై ప్రభవించు దేవకీ
నందను సత్కథోదయము నవ్యకవిత్వ కళా కళాపమున్
కుందనమున్ ఘటించి-కడు క్రొత్తగు సొమ్ము నొనరించి విష్ణునే
వందులకించు నప్పరమ వైష్ణవకోటి నలంకరింపుమా." (1-36)

శ్రీకృష్ణుని కథ కౌస్తుభరత్నము వంటిది-దానికి, నవ్యకవిత్వ కళాకలాపమను బంగారము ఘటించి నూతనమైన భూషణముగా చేయుము అని భావము.

రత్నమును రత్నముగా, భూషణమువలె మనము ధరింపలేము[1]. అది బంగారముతో పొదగబడిన తరువాత నే మనకు-భూషణమై ధారణ యోగ్యమగును-ఆ రీతిగానే-ప్రాచీన పౌరాణిక కథలను రత్నములను పూర్వకవులు గ్రహించి, తమ కవితా రచన యను

---

1 విష్ణుమూర్తి భగవంతుడుగాన కౌస్తుభమును-బంగారు సంపర్కము లేకయే భూషణముగా ధరించినాడు ఇతరులకట్లు ధరింప నర్హతలేదు. రాజులకైనను రత్నములు కిరీటమున పొదుగబడును.

సువర్ణముచే, దానిని మనోహరమగు కావ్యభూషణములుగా, సంత రించినారు-ఇందువలన మనము గ్రహింపవలసిన దేమనగా, ప్రాచీన కథావస్తువులనే గ్రహించి, ప్రాచీన కవుల మార్గము ననుసరించుచు, "నవ్యత"ను, ప్రదర్శించుటయే-పూర్వకవుల లక్ష్యమని మనకు స్పష్ట పడుచున్నది. ఈ ప్రాచీనానుసరణమైన "నవ్యత"యే కవి ప్రత్యేక ప్రతిభను వ్యక్తిత్వమును ప్రదర్శించును-ఇదియే మన కవితా సంప్ర దాయము,

తనకు ముందుగల ప్రాచీన కవుల ననుసరించుచు, తానొక "నవ్యత"ను తన కవిత కాపాదించినవాడు కావుననే-రామకృష్ణకవి-తన కవిత "నవ్యకవిత్వము"అని చెప్పినాడు.

క్రీ శ. 1550 ప్రాంతముననే - ఈ నవ్యకవిత్వము అనుపదము ప్రయుక్తమగుటచే, నీ పదమును-తొలుత సాహిత్యమున ప్రవేశ పెట్టినవాడు, రామకృష్ణుడేనని వ్యక్తముచేయుచున్నది.

రామకృష్ణుని "నవ్యకవిత్వ"మనగా, ప్రాచీన కవితానుసరణ మగు నవ్యత-ఆధునిక యుగమున నవ్యకవిత యనగా, ప్రాచీనతను పూర్తిగా విస్మరించిన నవ్యత-అందులకే ప్రాచీనకావ్యములు నేడును-అస్వాదనీయములగుచు ప్రచారములో నుండగా, నవ్యకవిత్వ కావ్య ములు-విస్మృతము లగుట తటస్థించినది.

దీనికి కారణము లేకపోలేదు-ప్రాచీన కవిత యెప్పుడును నొక రీతి కట్టుబాటుతో నుండును-ఆ కట్టుబాట్ల ననుసరించి "నవ్యత" వృద్ధిజెందును-కాని నవ్యకవిత్వ మట్టిదిగాదు-దాని కొక నిబంధనలేదు. అందుచే నది-భావకవిత్వ వాస్తవిక, అతి వాస్తవిక, దిగంబర, వచన కవిత్వాదినానావిధ రూపాంతరములొంది. దేనికి నిలుకడ లేకుండ పోయినది,

## పదగుంభనము — పద్యంబు హరువు

రామకృష్ణుడు "నవ్యకవిత్వము"ను, తనప్రత్యేకకవితా గుణముచే నిరూపించినాడు-ఇది

"పాండురంగ విభుని పదగుంభనము
పాండురంగ మకవి పద్యంబు హరువు"

అని రెండు రీతులుగా వాడుకలో నున్నది - పదగుంభనము పద్యంబు హారువు-భిన్నార్థకములు-

గుంభన మనగా-మాటల కూర్పు

హారువు-అనగా మనోజ్ఞత-ఈ రెండింటిలో "పద్యంబుహారువు" అనునదే ప్రాచీనమైనట్లు తోచుచున్నది, సీతారామాచార్యులవారు శబ్దరత్నాకరము, హారువు శబ్దము క్రింద నిట్లు వ్రాసినారు. "హారువు. దే వి. మనోజ్ఞము-ఆ. పాండురంగమకవి పద్యంబు హారువున" పాంచా. 7" (పుట 811).

ఇట పాంచా. అనగా. పాంచాలీ పరిణయము అన్న కావ్యమునకు సాంకేతికము. పాంచాలీ పరిణయము అన్నకృతి, కాకమాని మూర్తి యను కవి రచించెను. ఈతడు క్రీ. శ. 1570 ప్రాంతమువాడు ఇందువలన నిది గ్రంథస్థమైన పూర్వపాఠమని చెప్పవచ్చును. వీరేశలింగముగారి "హారువు" పాఠమునే యుదాహరించినారు.

పాండురంగ విభుని పదగుంభనంబును అన్న దానిని గూర్చి విచారింతము-దీనిని తొలుత గురుజాడవారు తమ కవిజీవితములలో దెలిపినారు.

"అల్లసాని వాని యల్లిక జిగిబిగి
ముక్కుతిమ్మనార్య ముద్దుపల్కు
పాండురంగ విభుని పదగుంభనంబును
కాకమాని రాయ! నీకె తగుర (పుట-221)

"పదగుంభనము" అను పాఠమెట్లు గురుజాడ వారికి లభ్యమైనదో మన మూహింపలేము. వారు చాటుపద్యముల క్రిందట భట్రాజులు చదివిన పద్యమునే యుదాహరించియుందురు-పదగుంభనము అనునది వ్యాప్తిలోనికివచ్చుటకే క్రిందవిషయము హేతువుకానోపును,

ఉద్భటారాధ్య చరిత్రమున 'నిగుంభన' అను పదమున్నది. "ఆదికావ్యుల కవితా నిగుంభనమున్నది" (1-26) కాని "గుంభన" పదములేదు. గుంభనపదము పాండురంగ మాహాత్మ్యమున గలదు.

పురాణ "గుంభన" కథల్ (1-21)
మధురోక్తి "గుంభన" భారమ్మురణా (1-49)
నవీన దానగుణ "గుంభన" సంభృతి (1-61)

అవతారికతోనే యున్న యీ 'గుంభన' పదమును మూడు మాఱులు ప్రయోగించుటంబట్టి పాండురంగవిభుని పదగుంభనంబును అను పాఠము వ్యాప్తిలోనికి వచ్చి యుండవచ్చును.

'నిగుంభన' యన్నను "మాటల కూర్పు" అనియే యర్థము.

మ. ఒకచో మాధురిఁ గుల్కు—వల్కు—గము లింపొందంగ వేఱొక్కచోఁ
ప్రకట ప్రౌఢవచోనిగుంభనల దీవ్యత్స్ఫూర్తి వర్తిల్లి"
కాళిందీ కన్యాపరిణయము 5–8 అహోబలపతి.

వాస్తవిక స్థితిబట్టి చూడగా, పదగుంభన పాఠమే అర్థవంతముగా నున్నది. "హరువు" అనగా మనోజ్ఞమని యర్థములేని యిది యొక ప్రత్యేక కవితా గుణముగా నాలంకారికు లెవ్వరును పేర్కొనలేదు.

ఇంకొక యుపపత్తిచేతగూడ 'గుంభన' పాఠమే సరియైనదని నిశ్చయింపవచ్చును,

"గుంభనము" అని తెలుగు కవులు వాడినను నీ పదము నీ రూపమున సంస్కృతమున లేదు–సంస్కృతమున "గుంఫన" అని మాత్రమే కలదు–దానికిని కూర్పు; మాటల కూర్పు అనియే యర్థము.

ఉ కంభుజటాటవీతట వికంకట విస్ఫుటదివ్యవాహిని
కుంభదనర్గళ ప్రభవశోభిత రంగ దభంగ భంగసా
రంభ విజృంభమాణ పటురంభ ఘుమం ఘుమనించు కా
గ్గుంభుల వెంచి, నిన్నుమది కోర్కె నుతించెగదమ్మ భారతీ!

అని గుంభశబ్దము ప్రాసలో–రామలింగకవి సమకాలికుడగు ఎడపాటి ఎఱ్ఱన తన మల్హాణ చరిత్రలో "మాటలకూర్పు" గలవాడు–అను నర్థమునందే ప్రయోగించియున్నాడు. ఇట్లు తెలుగుకవి ప్రయుక్తమగుటవలన "గుంభన" పాఠమునే మనము గ్రహింపవచ్చును.

## పదగుంభన

రామకృష్ణుని రచనల యందలి యీ పదగుంభనె యెట్టిదో ఇంతవఱకు విమర్శకులు వివరించినట్లు కానరాదు. కవి యనగా మాటల కూర్పరి, అది అందఱి కవులకు వర్తించును. అప్పుడు పాండురంగకవి కవితలో ఏదో యొక విశిష్టత మాటల కూర్పున

నుండవలెను. అదియే పదగుంఫనము. అది యీ క్రింది విధములుగా నున్నది. ఉదాహరణములు కొలదిగా చూపినాడను.

### 1. సంస్కృతము-తెలుగుచేయుట

1. ఆకాశవాణి-బయలాడుమాట-ఉద్య. 2-10
2. ఆకాశహర్మ్యము-బయలుపందిరి ఉద్య. 2-68
3. త్రినేత్రుడు-వెచ్చకంటివాటు పాండు. 5-19]

ఇచ్చట త్రినేత్రుని-ముక్కంటి యన్న తెలుగు భాషాంతరీకరణము అది పదగుంఫన కాదు-వెచ్చకంటివాతనిన-తెనుగుచేయుట.

4. పరిచారిక-ఊడిగపుఁదొయ్యలి-హరిలీలావిలాసము.
5. బ్రాహ్మణ బ్రువుఁడు-త్రాటిగట్టుబోయ పాండు. 3-68.
6. వ్యాఘ్రాజినము-పసిదిండివలువ ఉద్య. 2-77

### 2. తెలుగు సంస్కృతముగా జేయుట

1. ఏనుగు-కుంజరాశనము.
2. గచ్చకాయలాట-కుబేరాక్షకేళి.
3. నింగివేల్పులు-దేవతలు (3-5)
4. నేలవేల్పులు-బ్రాహ్మణులు (3-5)
5. నిండుకుండలు-రిక్తకుంభములు (3-11)

ఇచ్చట 'నిండు' శబ్దము పూర్ణతను దెలుపదు. తెలుగువారి జాతీయమున వస్తువులయిపోయి శూన్యముగనున్నప్పుడు "బియ్యము నిండుకొన్నవి" అను రీతి వాడుకలో యర్థము.

మాలవాడు = వినిందితకులుడు (3-91)[1]

### 3. అపూర్వ పదబంధములు

1. అసికాక్షేయుఁడు = కన్ను ఆయుధముగా గలవాడు (పాండు 1-157)

---

1. సీ. పా. తగ సంస్కృతము తెనుంగుగఁ జేయఁ దెనుగు సంస్కృతముగఁ జేయఁగఁ జతురమతివి (పాండు. 1-38)

2 ఊత్పిబకము = చాతకము (పాండు 2-110)
3. కతకఫలము = ఇండుగపిక్క (పాండు-4-7)
4. శాసూధరుఁడు = కుమారస్వామి (పాండు 2-180)
5. చంద్రగోళి = వెన్నెల (పాండు 5-24)
6. మరుత్పలము = హరివిల్లు (పాండు 1-161)
7. వార్మణి = కౌస్తుభము 5-26)
8. శ్రాణమూకుడు = గంజిమూకుడు (4-173)[1]

## 4. పర్యాయపదవైచిత్రి

1. ఇంద్రనీలవేదిక = తోయదవాహనరత్నవేది (2-36)
2. త్రిముఖాస్త్రము = త్రిశూలము
3 వసుధారథుఁడు = భూమి రథముగా గలవాడు; శివుడు.

## 5. అర్థవైచిత్రి

1. కలభము-ఇది కరిశాబకమునకే పేరుకాని ఏశాబకమైన కావచ్చును.

"భసల కలభకులా కృష్ట కుసుమవివర"
ఇచట తుమ్మెదపిల్లలు (పాండు (1-161)

2. కోలము-వేషము-కాని-"ఏకోలంబో జనియించు (3-73) అన్న చోట-వేషము వేసికొని ఎగతాళిచేయుట అను నర్థముగలది- "ఏకోలంబో జనియించు" అనగా ఏ యెగతాళియో లేక - వేళాకోళమో జరుగును అనుట-వేళాకోళము అను శబ్దిగతమైన శబ్దిమే (కోలము-కోళము)

3. పన్నాగము = పన్నగము-పాము
4. మాయి = మోసగాడు (పాండు. 4-145)
మాయి అనగా గారడీవాడు. ఇచట "బద్ధమత్సరుండన్య బుద్ధి మాయి" అనుచోట మోసగాడు.

---

1. ఇట్టివి కొన్ని పాండురంగ మహాత్మ్యమునుండి నాశబ్దరత్నాకరానుబంధమున నిచ్చితిని-ఇవి సూర్యరాయాంధ్ర నిఘంటువులో లేవు.

## 6. అర్థవిపరిణామము

1. ఛాందసుండు–"సారథిఛాందసుండు 1–115
ఛాందసుడు అనగా వైదికచ్ఛందస్సు తెలిసినవాడు. వాడు కలో ప్రతిపనియు జడత్వముతో ఆలస్యముగా చేయు వాడు అని అర్థము–వాడుకలో యర్థమే పైని గలదు.
2. పూజ్యము = పూజింపదగినది–అని యర్థము (2–155)
కాని "వానికిం బూజ్యముల్" అనుచో వానికి – శూన్యములు–అని యర్థము.
3. దర్శనంబిచ్చు = రాజు సమ్ముఖమునకువచ్చునట్లుచేయు
కాని "దర్శనంబిచ్చుట మున్నుగాఁగ" (1–199) అనుచో, "కానుక నర్పించి" అను నర్థము.

## 7. స్త్రీసంబోధన దీర్ఘ సమాసములు

1. అరవిందకోరక సహోదరచారుపయోధరాఢ్య 2–81
2. రదనచ్ఛదకర్త్రితవిద్రుమముద్రుమా 2–98

## 8. యమక రచన

1. [1]శబరి కబరి నిబిరీసనీవిమల్ 2–188
2. ప్రమోదపదవీ మదవీప్స 2–146

పై యమకము ననుసరించుటయేగాక–పాండురంగ మాహాత్మ్యమునందలి పదగుంభనకు కవితాశిల్పమునకు వ్యామోహితుఁడై భట్టుమూర్తి తన నరసభూపాలీయమున ననుకరించెను–

పాండు. సీ. హుంకారములు లేవె యీవపురందర హాత్
త్పాటనంబునకుఁ జాల్పడవుగాక
భ్రూభంగములు లేవె ? యాభీల వింధ్యగ
ర్వస్తంభమునకును రావుగాక

---

1. ఈ రచనము భట్టుమూర్తి వసుచరిత్రము ననుసరించినాడ "లోన కబరీ శబరీ నిచిరీపకాంతి విన్నాణము (వసు, 2–38)

చలుకాళ్ళతులు లేవె; జలరాశినిశ్చిష
భూషణక్రీడకుఁ దొరవుగాక
జారరాగ్నులు లేవె; జటిలాని వాతాపి
తను దాహముస వెదురొక్కనవుగాక
గీ. నిష్టనీమాద్రి లోకప్రశస్తి గుటిది
దుష్టనిగ్రహ శిష్ట సంతుష్టి హేతు
రోష భీషణ రేఖా నిరూఢ గాథ
లీలగ్రీడింపఁ బోడలు లేరుగాక 5-176

కావ్యాలంకార సంగ్రహము (నరసభూపాలీయము)

సీ. శర వేగములు లేవె; చలయంత్రపాఠీన
పాటవక్రియకు వేర్పడవుగాక
చాతుర్యములు లేవె; కారదాభాండార
చోరకారశికిఁ జొరవుగాక
వితరణంబులు లేవె; వివిధ యాచకవృపా
లక కంఠదఘ్నముల్ గావుగాక
సామర్థ్యములు లేవె; సరిదన్యవథయాశ
కాసనప్రౌఢికిఁ జనవుగాక
గీ తొలుత గడిదుర్గమునవున్న దొరలు లేరె!
మహిమనీమాద్రిగదన దుర్మద సపాద
సార సప్తాంగ హరణులు లేరుగాక
నరమతాటోప రోబర నరసభూప. 4-63

రామకృష్ణుని కవితా విశేషములను గూర్చి యింకను నెంతో పరిశీలనము చేయదగియున్నది. అది అనమకరణీయము-అసాధారణము-చూపవలసిన విషయములెన్నో యున్నను గ్రంథవిస్తర భీతిచే విరమించితిని-

## పాండురంగమాహాత్మ్యము - పాఠభేదములు

తెనాలి రామకృష్ణుని కృతులలోనేగాక, తెలుగుసాహిత్యమున నాచంద్రార్కము నిలువదగిన ప్రబంధము పాండురంగమాహాత్మ్యము- ఇప్పటివఱకు వచ్చిన రామకృష్ణుని గూర్చిన విమర్శలన్నియు, నీగ్రంథ

మాధారముగా చేసికొని రచితములైనవే. పాండురంగమాహాత్మ్యమిా వఱకు ఏడు పర్యాయములు ముద్రితమైనను, దీనికి ప్రసిద్ధ విద్వాంసులు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు వ్యాఖ్యానము వ్రాసినను- నీ కావ్యము, సాధుపాఠములతో పరిష్కృతముకాలేదు.

సాహిత్యఅకాడమిావారి ముద్రణమున, పాఠభేదములు తాళపత్రప్రతులనుండి యుదాహరింపబడినవి. అయినను, మూలపాఠములు ప్రశ్నార్థక చిహ్నములతో నట్లే నిలిచియున్నవి. ముద్రణలలోని యీ సందిగ్ధ పాఠముల మూలమున, మనము పాండురంగ మాహాత్మ్యము నందలి బహుళగంభీరార్థముల నేగాక, రామకృష్ణుని కవితాతత్త్వమును నవగాహనచేసికొనలేని స్థితిలోనున్నాము-ప్రాచీన కావ్యవిశిష్టతను గ్రహించుటకు పాఠనిర్ణయము ప్రథమసోపానము,

## శబ్దరత్నాకర పాఠములు

ఇంతవఱకు పరిష్కృతములైన గ్రంథములలో నేనియందు, శబ్దరత్నాకర పాఠముల ప్రసక్తియే లేదు. శబ్దరత్నాకరము సూర్యరాయాంధ్ర నిఘంటువున ప్రామాణికముగా గ్రహింపబడినదని పరిష్కర్త తెలుగరు, శబ్దరత్నాకర పాఠముల మూలమున. నీ కావ్యములోని వైశిష్ట్యము నెట్లు గ్రహింపగలమో కొన్నింటిని చూపుచున్నారు.

### 1. ఉన్నారు-ఉన్నారరు[1]

ముద్రి, పా. గీ. బలియు రత్నాకరములు సంచులుగఁజేసి
పొదివి నిధులెల్లఁ గొని సంచి మొదలుచేసి
బేరమాడెడుపాటి యుదారలక్ష్మి
బచ్చులప్పురి నున్నారు పెచ్చుపెరిగి

శర. పా. "బచ్చులున్నారరప్పురిఁ బెచ్చుపెరిగి" (బచ్చు శబ్దము) ఉన్నారు అనుటకు "ఉన్నారరు" అనుట ప్రాచీనప్రయోగసరళి.

---

1. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ముద్రణము

క. ధరే యేలింపఁగ మన్నా
  దరు మీకుం దగునె సంగరములోఁగలఁగన్ (భార.|ద్రోణ.౬-111

2. ఆదిభూతివి - ఆదిభూతుఁడు

ముద్రి. పా. గీ. పా. భువనమునకెల్ల నీవాదిభూతివగుచు"
శర పా. "భువనమునకెల్ల నీ వాది భూతుఁడగుచు" (నిట్టనిలుచు)
  వెలయ గో సంజ్ఞ నెటిఁగి గోవిందుడయితి (ఉహరి 2-210)
  ప్రథమపురుష క్రియ ఉత్వలోపము

3. నెత్తురు ధారలు నెత్తురు దారలు

ము. పా. నెత్తురుధారలు దార
శర. పా. నెత్తురు దారలు దార విప్రతి.
ఇచ్చట యమకము గనుక శ. ర. పాఠము సరియైనది
4. నీ నామములు వక్కాణింతు మెపుడు (4-92) ము. పా.
నీ నామములు వక్కణింతు మెపుడు శ. ర. పా.
సూర్యరాయునిఘంటు-శ ర.పాఠమే గ్రహించినది
ఉదాహరణకు మాత్రమే చూపితిని-ఇతరములు.

1. కపిలవనుఁడు

సీ. పా. నాకపిలవనుచే ననుమతుండై చొచ్చి
  చవియొక్క ముత్యాల చవికిగాంచె 2-169
ఇచట కపిలవముఁ డన్న పాటము శుద్ధముగాన సంబద్ధము-ఇది నారదుడు కైలాసముచేరి-శివుని కొలువుకూటమునకు వచ్చు సందర్భము. శివదర్శనము చేయువారు ముందు నందీశ్వరుని యనుమతి వడసి లోనికేగవలయును. నందీశ్వరుడు - కపివదనుఁడు గాని కపిలవనుడుగాడు-చూ. ఉత్తరరామాయణము.
నందికేశ్వరుని ముఖము కపివదనము-అందువలన-రావణు డతని చూచి నవ్వెను-వెంటనే నందీశ్వరుడు-
"కపివదనుండనై సననుఁగన్గొని నీ ... మానదృష్టితో
నిపుడు హసించినాఁడ విట నీదృశ ... క్రమ. ఘల్ నఖాయుధుల్

కపులిఁక నీకులంబడఁవగల్గుదు రంతట కండగర్వమున్
తపమునఁబుట్టు వెట్టిదము దామి యడంగెడు రాతసాధమా!
(3-78)

## 2. రెడ్డియింటికి 3-68

దీనికిడా దేష్టి-క.త.వ. (దేష్టి = దేసటి?) అను పాఠములు గలవు. 'దేసటి' అనునది సరియైన పాఠము, ప్రశ్నార్థక చిహ్నమక్కరలేదు.

పంట దేసటి రెడ్లు, రెడ్డికులమున-రాజ్యాధిపత్యము వహించిన వారు. కాశీఖండ కృతిపతి వీరభద్రారెడ్డి యాతని అన్న వేమారెడ్డి యీ పంట దేసటి శాఖవారే

శ్రీ మద్దేసటి వంశశి
ఖామణి! మూర్ధాభిషిక్త కంఠీరవ! స
త్రామనిభ వైభవోన్నత!
భామాపాంచాల వీరభద్రనృపాలా. కాశీఖండము 3-1

"బంధులోకపారిజాత! పంటవంశపావనా!" అని యిందు సంబోధనగలదు. 2-167

ఇందువలన పాండురంగమాహాత్మ్యమున "నెవ్వడా దేసటింటికి నెగ్గుదెచ్చె"-అనునదే సరియైన పాఠము-ఈ కృతియందే.

విసాలి బావనిన్
బంటదిఁ గోరుఁజాతు కుచపంజరకీరముగా రచింపఁగన్ (3-61)

అనుపాదమున పంటది-అనునది పంటదేసటి వంశము సూచించును-

## 3. కలిఁతేజాలు

వలనా! యేటికి నాశ్రయించి మనఁగా వానీరమున్ నీరమున్
దలవెట్టపచరింప నేమిటికి సమిద్ధానంబుదానంబున
చ్ఛలమా యేటికి నెత్తిగట్టుకొనఁగా సన్యాసమున్ న్యాసమున్
గలిఁతే (గలదేఁ?) జాలు మదీయ భక్తిరుచి భక్తశ్రేణి
క్రాంతమున్ 3-98

ఇందు చివరిపాదమున

"గలితేఁగలఁదేఁ?) జాలు-మదీయభక్తిరుచి భక్తశ్రేణిక
క్రాంతమున్"

అనుపాదమునకు క్రింద అధోజ్ఞాపికలో నిట్లు గలదు.

"గలిఁదే-ముద్రిఁ కలిగితే అనుటకు (కలితే-అని అన్నమాచార్యుల ప్రయోగములు గలవు ఈ ప్రయోగ మితరులలో గానరాలేదు)".

ఈ పద్యార్థము పరిష్కర్తల కవగాహనకాలేదు - అయినచో గలిఁతే-కలిగితే-అనుదానికి రూపాంతరమని వారు భ్రాయసాహసించి యుండరు-అచ్చటపదము గకారాది కాదు-కకారాది-ఆపదము.

'కలి' అనునది కలి తరువాత అరసున్న యుండరాదు-ఇచట 'కలి' అనునది కలియుగము అనుదానికి సంగ్రహరూపము-

కలి=కలియుగమే, మదీయ భక్తి, రుచి=నాయొక్కభక్తిరుచిని భక్త శేణికి=భక్తసమూహమునకు, తేఁజాలును=తెచ్చియీయగల సామర్థ్యముగలది-కలికాలమున-భక్తిమార్గమే-ముక్తిమార్గము.

మూడవపాదమున-సన్యాసము గర్హింపబడినది కలికాలమున సన్న్యాసము నిషిద్ధము.

"అశ్వాలంభం గవాలంభమ్
సన్న్యాసం పలపైతృకం
దేవరాత సుతోత్పత్తిం
కలౌపంచవివర్జయేత్"

ఈ రీతిగా నీ పద్యము మొదటి మూడుపాదములను సన్వయించుకొన్న కలితేజాలు అన్నపాఠమే సరియైనదని గ్రహింపవచ్చును.

## 4. శ్రావమూకుఁడు

సవోదనం బొసగెఁబూనితదాజ్ఞను శ్రావమూఁకటన్ (4-178)

శ్రావమూఁకుడు-అన్నపాఠము సరికాదు-

అది శ్రాణమూఁకుడు" అని యుండవలెను-

శ్రాణమనగా గంజి-గంజిమూఁకుడు అని యర్థము

"యవాగూరుష్టికాశ్రాణా" అని అమరకోశము.

## 5. మును (నిః) చట్టు - (5-179)

"మునిచట్టు మొదలవఱచెను" అనియే యుండవలెను-ఇచట మునిచట్టు అనగా మొదటి శిష్యుడు - అయుతుడు.

ముని అనునది మొదటి-శబ్దమును బోధించును.

మునిముని మీసంబు మొలకలెత్తిననాడు,

గణపవరపు వెంకటకవి

మచ్చునకు మాత్రము కొన్ని చూపితిని. అర్థము ననుసరించి-అక్షరముల మార్పుచే-నర్థము భేదించు పాఠములు గలవు.

"తరళ తరద్రుమమూర్తిన్-5-273"

"తరళతర ద్రుమమూర్తి" అనుచో నర్థము లేదు చలనము గలిగిన చెట్టు- అని యర్థముండునా? చెట్టునకు చలనముండదు అచ్చట-

"తరళ దళ ద్రుమమూర్తి" అని యుండవలెను తరళదళ మనగా, చలదళము-అనగా అశ్వత్థవృక్షము.

బోధి ద్రుమశ్చల దళః పిప్పలః కుంజ రాశనః అశ్వత్థే అని అమరకోశము.

సరియైన పాఠములలో నున్నగాని రామకృష్ణకవి కవితలోని లోతును మనము గ్రహింపజాలము.

### ఉపసంహారము

ఇప్పటికే పీఠిక అతిదీర్ఘమైనది గావున ఉపసంహరింతును-రామకృష్ణుని కవితనుగూర్చి యింకను మనమెంతయో పరిశ్రమ చేయ వలసి యున్నదని చూపుటకే యింతగా వ్రాసితిని- ఇంతవఱకు తేలిన సారాంశములు!

1. రామలింగకవి- మొదట గార్లపాటి రామలింగము. తెనాలి యందలి, రామేశ్వర భక్తుడైనాడు-

2. శ్రీ రామలింగేశ్వరస్వామి యాలయమున-ఉత్సవవిగ్రహములు సమర్పించినవాడు, రామలింగకవి తండ్రియైన రామయ పండితుడు గాక రామలింగకవియే.

3. రామలింగము తొలుత- ఆ|గశాఖ అనగా ప్రథమశాఖా నియోగి బ్రాహ్మణుడు. ఆతడు లింగధారణ దీక్ష గ్రహించి శైవ మతము స్వీకరించెను. నాటినుండియు తెనాలి రామలింగమని వ్యవహృతుడయ్యెను,

4. క్రీ శ. 1515 ప్రాంతమున ఉద్భటారాధ్య చరిత్ర రచించి, యీ దేచమంత్రి కంకితమిచ్చెను. అప్పుడాతనికి "కుమార భారతి" అని బిరుదము.

5. క్రీ శ. 1516 నాటికి రామలింగకవి కౌమారవయస్సు- 25-30 సంవత్సరములుండిన ఆతని జననము క్రీ. శ. 1485 ప్రాంతము.

6. ఉద్భటారాధ్య చరిత్ర రచనమూలమున నాతడు రాయల భువన విజయమున- అష్టదిగ్గజములలో నొకడుగా ప్రఖ్యాతికెక్కెను;

7. రాయల ఆస్థానమున క్రీ. శ. 1516నుండి 1530వఱకు నుండి, తన చాటుకవితాలహరిని నాంధ్ర దేశమున ప్రవహింపజేసెను.

8 రామలింగకవి యను పేరుతో- కందర్పకేతువిలాసము- హరిలీలా విలాసము అనుకృతులు రచించెను.

9 పాండురంగవిజయము- అను కృతితో కూడ, రామకృష్ణ నామముతో వ్యవహృతుడై తన వైష్ణవత్వమును తెలియబఱచెను.

10. క్రీ. శ. 1542 ప్రాంతమున పాండురంగమహాత్మ్యమును- రచించి తన వైష్ణవత్వమును బాహాటముగా ప్రకటించెను.

11. గార్లపాటి రామలింగము-
తెనాలి రామలింగము-
తెనాలి రామకృష్ణుడుగా
త్రివిక్రమావతార మెత్తి-ఆంధ్రసాహితీ ప్రపంచము నాక్రమించెను.

12. తనకుముందు శైవులైన ఎఱ్ఱన పోతనవలె, తానును శైవుడై వైష్ణవకృతులను రచించెను. గాని ఆతడెంతమాత్రము వైష్ణవమతమును స్వీకరించి వైష్ణవుడుకాలేదు.

13. పాండురంగవిజయము మొదటి వైష్ణవకృతి శృంగార పరముగాను, పాండురంగమహాత్మ్యము భక్తిపరముగా రచించి, తన కృతులకు మకుటాయమానము గావించెను.

14. ఘటికాచల మహాత్మ్యమను కృతి అవతారికలేకయే రచించుటచే నాతని చివరకృతి.

15. క్రీ. శ. 1485-1560. ప్రాంతమాతని జీవితకాలము.

తెనాలి- తెనాలి రామలింగ (కృష్ణ) కవి.

రామలింగ (కృష్ణ) కవి మూలమున- తెనాలి- ఆంధ్రసాహిత్యమున చిరస్థాయి యైనది. ఆంధ్ర సాహిత్యముననేగాక, ఆంధ్రదేశమున- తెనాలిని చిరస్థాయి చేసినది-రామకృష్ణుడే.

"శ్రీ తెనాల్య గ్రహారనిర్ణేత."

అని చెప్పుకొనుటచేత. క్రీ. శ. 1542 ప్రాంతములు. నేడు ప్రసిద్ధ పట్టణమైన తెనాలి- ఒక అగ్రహారముగా నుండెనని. "నిర్ణేత" అనగా, ఆయగ్రహారము నేర్పరచినవాడు, రామకృష్ణ కవియేయని మనకు నిశ్చితమగుచున్నది.

తెనాలి పట్టణమునకు; మూలపురుషుడు రామలింగ (కృష్ణ) కవియే గాన నీవాడు తెనాలి పౌరులు రామలింగ (కృష్ణ) కవిపేర నొక స్మారకమందిరము నిర్మించి, ఆతని చరిత్ర మఖిలవ్యాప్తము చేయుదురు గాత!

## - కృతజ్ఞత -

తెనాలి రామలింగకవి రచితమై తెనాలియందే వెలసిన యీ యుద్భటారాధ్య చరిత్ర - నేడు తెనాలి వాస్తవ్యులై, స్తవ్యులైన శ్రీ ముదిగొండసుబ్రహ్మణ్యశర్మ గారిచే (కృష్ణా పత్రికాధిపతులు-) తెనాలియందే ముద్రితమై ప్రకటితమగుట మొదటి విశేషము,

ఈకృతి నాయకుడైన ఉద్భటారాధ్యుని వంశీయులైన శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారే దీని ద్వితీయావృత్తినిఅద్వితీయముగా సంతరింపజేయుట రెండవ విశేషము.

మూడవది, శ్రీ సుబ్రహ్మణ్యశర్మగారిదివరకే ఆంధ్ర వీరశైవ వాఙ్మయమున, ప్రాథమికమై, ఆరాధ్యశైవ సంప్రదాయమునకు ప్రామాణికమైన మల్లికార్జున పండితుల శివతత్త్వసారమును-రెండవ

సారి- నాపీఠికాపరిష్కరణములతో ప్రకటించిరి[1] ఆసందర్భమున నిట్లు వ్రాసితిని.

చ. అతులిత శైవ వాఙ్మయమున కాశ్యయమునై, శివధర్మసత్క్రియా
స్థిత వివిధాగమాంచిత విశేషితమై, శివభక్తిభావనా
ద్భుత మత భక్త పూతమయి, పూజ్యుడుపండిత మల్లికార్జున
కృతమయి కంద పద్య గతి కీర్తితమౌ శివతత్త్వసార మ
త్కృత మతి నద్వితీయము ద్వితీయము ముద్రణచేసె నెంతయున్.
మతినుతియింపగాదగును మాన్యుని- మాముదిగొండ శర్మమున్.

శివతత్త్వసారమువలెనే, శైవవాఙ్మయమున మధ్యయుగమున వెలసిన శివకృతులలో నుత్కర్షమగు నుద్భటారాధ్య చరిత్రమును పరిష్కరించి, విపులపీఠికాదులతో దానిని వెలయించుటకు ప్రోత్సహించి, నాచే నీకార్యమును సానుకూలముచేయించిన- శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారికి- నామనఃపూర్వక కృతజ్ఞతాసూచక వందనములు.

శా. శ్రీమత్పద్మభవాది సర్వసుమనస్సేవ్యుండు, లోకత్రయీ
భూమానందకరుండు శంకరుడు, సంపూర్ణాయురారోగ్య భా
గ్యామోదంబుల నిచ్చి ప్రోవుత. కృపాయత్తైక చిత్తంబు పెం
పారన్ శ్రీ ముదిగొండ వంశమణి సుబ్రహ్మణ్య
శర్మాహ్వాయున్.

సీ. శ్రీకాశికాపుర సిద్ధసువర్ణలిం
గోద్భవుల్ శ్రీ ముదిగొండవారు
కలిత లింగైక దీక్షాకర్తృతాధికా
ఖండలుల్ శ్రీ ముదిగొండవారు
బహుళ శిష్యగణాళి ప్రాపితా నేకది
క్పూర్ణులు శ్రీ ముదిగొండవారు
సకల శైవారాధ్య మకుటాయమానితో
ద్దండులు శ్రీ ముదిగొండవారు

1. ఇది నేటి వ్యాప్తిలోనున్నది. ఆంధ్రవాఙ్మయ చరిత్రకారులు దీనిని గుర్తించినట్లులేదు.

గీ. అట్టి ముదిగొండ వంశ మహాంబునిధి హి
మాంశుడైనట్టి శ్రీ సుబ్రహ్మణ్యశర్మ
ప్రథితమైనట్టి యుద్భటారాధ్య చరిత
మచ్చు వేయించె బుధమనోహరముగాగ
ఆంధ్రశైవవాఙ్మయము విఖ్యాతిఁ జెంద.

మ. సుకవిస్తుత్యరసైక నవ్యకవితా శ్లోకంబునౌ రామలిం
గ కవీశుండు, కుమారభారతి, లసత్కావ్య క్రియారీతిమా
తృకగాఁగన్ రచియించినట్టి కృతియే శ్రీ యుద్భటారాధ్య దే
శిక చారిత్రము నాంధ్రసాహితికి సంసేవ్యంబు గాకుండునే.

ఆంధ్రసాహిత్య చరిత్ర నవలోడించిన ముదిగొండ వంశీయు లగు గురువులు మనకు చాలమంది ప్రస్తుతులగుదురు-ఆధునిక యుగమున కైలాసవాసులు శైవాగమ పారావారపారీణులు మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగ శివయోగి, శైవవాఙ్మయవిశారదులు ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారు మొదలగువారు గలరు. నేడు, శివయోగ, శైవసర్వస్వ గ్రంథకర్తలు పండిత ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు, విద్వత్కవులు ముదిగొండ జ్వాలాపతి లింగ శాస్త్రిగారు, మధురకవి, ముదిగొండ వీరభద్రమూర్తిగారు-ఉద్భటారాధ్య సంప్రదాయ ప్రవర్తకులై విలసిల్లుచున్నారు. ఇంకను వైద్య రాజులగు శ్రీ ముదిగొండ మల్లికార్జునరావుగారు మున్నగువారు, ఈ వంశమునకు కీర్తి దెచ్చుచున్నారు.

ముదిగొండ వంశీయుల చరిత్ర : అను గ్రంథమున, నీ వంశీయుల సమగ్రవృత్తాంతము-ఆంధ్రదేశ రాజకీయ, సాహిత్య, సాంఘిక రంగములలో-వారు ప్రదర్శించిన విశేషములు - వివరముగా దెలుప నెంచితిని-ఉద్భటారాధ్య వంశీయులైన మహనీయులందఱును నా యుద్యమమును సఫలీకృత మొనర్తురుగాక.

స్వాతంత్ర్యావతరణమైన వెనుక, నిట్టి-శైవశాఖా చరిత్రము మనకున్నగాని, ఆంధ్రుల సంపూర్ణ సాంఘిక చరిత్ర మన కవగతము గాదు-ఈ దృష్టితో చూచిన పై గ్రంథమావశ్యకము,

ఈ ఉద్భటారాధ్య చరిత్రమున మొదటినుండియు ఆకర గ్రంథములను సమకూర్చి నాకు చేదోడు వాదోడుగానున్న నా పెద్ద కుమారుడు చిరంజీవి శివసుందరేశ్వరునకు నా యాశీస్సులు.

సీ. వీరశైవాచార విపుల ధర్మప్రధాను
　　　　వర్తి వీరన్న మావంశగురుఁడు
ప్రథితమల్లమవల్లి వంశజ పార్వతీ
　　　　తరుణీమతల్లి నాతండ్రితల్లి
సార్థి వేశ్వర దివ్యపాద సేవకుఁడు సుం
　　　　దర నామధేయుఁడు నాదుతండ్రి
సహజశైవలింగ నిష్ఠాపరతంత్రుండు
　　　　నాగయ్యయోగి దీక్షాగురుండు-

గీ. జననమే యా నియోగివంశమునగాని
　　బాల్యమునుండి శివభక్తిపరతచేత
　　అమలతర శైవసంప్రదాయములు దక్క
　　వేఱెఱుంగను పండితులార నేను.

23-8-73
లక్ష్మీకాంతనిలయము
2-2-1137/5
క్రొత్తనల్లగుంట
హైదరాబాదు-44

ఇట్లు
నిడదవోలు వేంకటరావు

# వ్రాత ప్రతుల - వివరము

ప్రభాకరశాస్త్రిగారు ప్రథమ ముద్రణ పీఠికలో-వ్రాతప్రతులను గూర్చి తెలుపలేదు-ప్రబంధ రత్నావళిలో పై పీఠికలోని చల్లా సూర్యనారాయణగారు తమకు పంపిన ప్రతియని చెప్పిన దానినిగూర్చి కూడా వారు తెలుపలేదు-అయినను ప్రథమముద్రణమున-విజ్ఞప్తిలో వీనిని గూర్చి యున్నది-ఆ విజ్ఞప్తి శ్రీ ముదిగొండ బసవయ్యశాస్త్రి గారిది-వారిట్లు తెలిపినారు.

ప్రప్రథమమున నీ చరిత్రము నైజాంమండలమునుండి సంపాదించి నా కొసగినవారు మన్మిత్రులును వేములపల్లియగ్రహార వాస్తవ్యులును అగు ములుగుసుబ్రహ్మణ్యశాస్త్రిగారు. వీరొసంగిన తాళపత్ర గ్రంథము శిథిలావస్థనంది మఱియొక ప్రతియుండినఁగాని వ్రాయుటకు వలను పడని స్థితిలో ప్రత్యంతర మొసగినవారు అస్మద్వంశ మౌక్తికాయమానులును, విద్వద్వరేణ్యులును కాకికొండ వాస్తవ్యులు నగు బ్ర॥ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు. ఈ రెండవ ప్రతియందు ఆశ్వాసములో కింత శిథిలమైయున్నవి. ద్వితీయాశ్వాస మసలే లేదు-ఈ 1, 2 ప్రతుల సంప్రతింపుతో గొఱితెపడిన పద్యభాగములట్లనే యుంచి లభించినంతవఱకున్నదున్నటుల నొకప్రతియెత్తి వ్రాసితిని. తదుపరి నేనిద్దానిని సంస్కరణ మెట్లు సమకూరెదునని విచారించుచున్నెడ నుభయశాస్త్రజ్ఞులును, భోగేశ్వర సత్యవత్యుపాఖ్యానాది గ్రంథ రచయితలును పెదన వాస్తవ్యులు నగు బ్ర॥ మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిగారు లేఖక ప్రమాదముల నవరించి లుప్తభాగముల జాలవఱకుఁ బూరించి దయచేసిరి.

అనంతరము దీనిని ముద్రింపించు ప్రయత్నములో నేనున్న సంగతి విని, సరస్వతీ పత్రికాధిపతులైన మహారాజరాజశ్రీ రాజా వాసిరెడ్డి శ్రీ దుర్గాసదాశివేశ్వరప్రసాద్ బహదర్, జయంతిపురం రాజాగారు గురువంశమునకు మూలకందమైన నీ యుద్భటారాధ్య చరిత్రము నత్యంత గౌరవభావముతోఁ దమ పత్రికయందుఁ బ్రకటింప నుద్యుక్తులై యుండ, నింతలో భాగ్యవశమున మా ముఖ్యాల

సంస్థానమును దర్శింపవచ్చిన సుప్రసిద్ధ విద్వత్కవివరేణ్యులును మన్మిత్రులును నగు బ్ర॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఈ యుద్భట చరిత్రమును జూచి తెనాలి రామలింగని కవిత్వమౌటఁ గదుంగడు సంతసించి, పురాతన గ్రంథములనిన సహజోత్సాహపరులగు శాస్త్రి గారు మా ప్రార్థనమున పై గ్రంథపరిష్కారమున కియ్యకొని చక్కగఁ బరిశోధించి కవి హృదయమెఱింగినంతమట్టు పూరణముల సంస్కరించి మఱింత మెఱుగు పెట్టుటయగాక పాండురంగమాహాత్మ్యాదికృతులు రచించిన రామకృష్ణుడే రామలింగకవియని సిద్ధాంతీకరించు విపుల మైన పీఠిక వ్రాసి యొసంగిరి."

పై యంశమును బట్టి-దీనికి రెండు తాళపత్రప్రతులు గలవని తెలియుచున్నది.

1. ములుగు సుబ్రహ్మణ్యశాస్త్రిగారిప్రతి-పూర్తిప్రతి-శిథిలము,

2. ముదిగొండ నాగలింగశాస్త్రిగారి ప్రతి 1, 3 ఆశ్వాసములు.

3. చల్లా సూర్యనారాయణరావుగారు - ప్రభాకరశాస్త్రిగారికి పంపిన ప్రతి-ఈ ప్రతిని గూర్చిగాని పై యితర వ్రాతప్రతులనుగూర్చి గాని ప్రభాకరశాస్త్రిగారేమియు తమ పీఠికలో దెలుపలేదు. ఇది విజ్ఞప్తిలోమన్నదని మానియుందురు. వారు ప్రబంధరత్నావళిలో నుదాహరించిన చల్లా సూర్యనారాయణరావుగారు పంపిన ప్రతి, విజ్ఞప్తిలో నుదాహృతమైన తాళపత్రప్రతులకన్న భిన్నమైనదో కాదో మనకు తెలియరాలేదు-1918 లో దీనినిగూర్చి వ్రాసిన ప్రభాకరశాస్త్రి గారు 1925 లో నా ప్రతివశంబ యెత్తుకపోవుటచేత, చల్లావారు పంపిన ప్రతి- పై ప్రతులలో నొక దానికి ప్రతికయై యుండవచ్చునని యూహింపవచ్చును-ఇందువలన - ఉద్భటారాధ్యచరిత్రకు తాళపత్ర ప్రతులు పై రెండే యని నిర్ణయింపవచ్చును.

## ప్రథమ ముద్రణము

### శిథిలపూరణములు - కుండలీకరణములు

పై రెండు తాళపత్రప్రతులు సంప్రతించి వ్రాసిన ప్రతియందు లుప్తభాగములుండుటచేత నవి మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిగారిచే, పూరింపబడినట్లు విజ్ఞప్తినుండి తెలియుచున్నది - వారి పూరణము

అన్నియు ప్రథమముద్రణమున[1] కుండలీకరణము చేయబడినవి. వారు సత్యవత్యుపాఖ్యానాది ప్రబంధకర్తలుగావున నీ పూరణము లెంతో జాగరూకతతో, అర్థస్ఫురణ కల్గించునట్లు చేసినారు. వాని నుదాహరించుచున్నాను,

ప్రథమాశ్వాసము

1-1 (నిత్యశ్రీయుతున్ జేయుతన్ 1-10 (రాహ్వాయసింధు 1-20 (డై చెలంగు) 1-24 (నామ) 1-50 ధైర్య 1-53 (తేజరిల్లు) 56 (బూదియులలందు) 1-104 (బలోనీశ్వరితో) 1-105 (త్మనెటిఁగి శివుఁడు కుపితుఁడై) 1-108 (కిఁగటకంఠు చేత) 109 (గలుఁగజే) 149 (గాఢాంధ)

ద్వితీయాశ్వాసము

25, (గ్రహము లేశా) 36 (కొండిమ్యా) ౩ (జెందిపరస్పరవైర) 43 (నగికరుణయుండ నృపాలు) 45 (మహీశున కుచితంబుగాఁ బ్రియము) 48 (వేశువరాఁబోడ) 53 (సఫలకమువనుశ్రై) 55 (నీంద్రుడంత విస్ఫుటమ) 67 (భవత్రి) 68 (దనుకొఁటకై రాం) 72 (హస్తములకు) 78 (రచ్చటమ్ముతుండా) 79 (కాశికాపురిబ్రః హిం) 82 (ఆకాశమందలి) 87 (తలధరియింతు) (విషరాశి) 88 (లవిగూర్చి) 89 (వూవధరించు నరుఁడు నిక్కము) 96 (చదివినట్లు) (ఇదె కాశికాపురి) 99 (తురంబున్

1. ప్రాచీనకావ్యములలో లుప్తభాగము లితరులచేత పూరింపబడినప్పు డిట్లు ( ) కుండలీకరణము చేయుట యత్యంతావశ్యము, ఆ కుండలీకరణము లేనిచో, ఆ భాగము కవి స్వంత రచనగా మనము పరిగణింతుము-నాచన సోముని ఉత్తర హరివంశమున నేటి ముద్రణములో నట్టి కుండలీకరణము లేవందున నెట్టి యవ్యవస్థ కలిగినదో నే నిదివఱకే వెల్లడించినాను.
చూ. సకలనీతి సమ్మతము పునర్ముద్రణము పీఠిక-పూరణములు కుండలీకరణము,
పుటలు-16-18. ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీ ప్రచురణ (1970).

గురుకరణేఁద) 106 (సకలతీర్థా) (ప్రీతిసంవీక్షణము బంధ) 107 (మదాలసమందు) 109 (నంబువిధ) 115 (వ్రతములు చేసి) 116 (రీతి) 126 (వంతకం) 139 (కుబ్జమున్) 144 (అనుపమమైనయు) 155 (యొకింత పేపు రమణీమణిఁగాంచి) 155 (కామాంధుండయి) (లతారామంబున్నలి) 164 (వికచసారసలో) 167 (ధనికులుకు పాటనదేటికి వింటి) 168 (జలజలోచిన యీనాడు) 176 (లకుంజనె) 181 (నిపక్కనఁదాను) 199 (సూచకంబులన్) 202 (మత్కృతిమత్కృతిధూర్తచేటికా) 217 (రతనాల జిగితేట) 217 వేడ్క ముది వేశ్య) 234 (తన కష్టసుఖము లఁగను) దుఃఖియగుచు) 250 (తటధర్మతీదేవతాకుల పావకుఁడు 252 (నిజవృత్తమెఱిఁగింతు) 292 స్వర్గంగాలహరీపయో)

## ద్వితీయముద్రణము

### శిథిల పూరణములు కుండలీకరణములు

ఈ ద్వితీయముద్రణము ప్రారంభము కాకముందు శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు. ప్రస్తుతగ్రంథము పునర్ముద్రణము గావించునపుడిట్లు చుక్కలతో ముద్రించుట సరికాదనియు గ్రంథమున నొకటి రెండుచోట్ల గ్రంథపాతములుండుటచే, నచట పద్యములను, పూరింపజేసి ప్రకటింపవలయుననియు సంకల్పించిరి. వారి సంకల్ప మెంతయు సమంజసమై సమర్థనీయమైయున్నది. ఏలననగా- గ్రంథ మందలి విషయములను పూర్తిగా గ్రహింపవలయునన్న- గ్రంథమున లుప్తభాగములుండరాదు- దీనిని గమనించియు శ్రీ శర్మగారు కావ్యము ద్వితీయముద్రణమున- శిథిలభాగ పూరణకై యిరువురు ప్రసిద్ధకవులను నియోగించిరి. వారు.

1) శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారు.

2) శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు. (కరుణశ్రీ)

ఇరువురును కవితాకళయందారితేరినవారే గాక- ప్రాచీన కావ్యకవి హృదయము నెఱిగినవారు గావున నెంతో పమిాచీనముగా నర్థస్ఫురణ, భావస్ఫురణ గలుగునట్లు పూరించిరి- ఆ వివరములుకూడ

పాతక లోకమెఱుగుట- యావశ్యకముగాన- వాని నీ క్రింద వివరించు చున్నాను. ఇవియు ఖండలీకరణము చేయబడినవి.

# I

## శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారి పూరణములివి :

1. శా. [శ్రీవత్సః కమలాసనాది దివిజశ్రేణీ శిరోమణ్యాభి
ఖ్యావృద్ధి ప్రదశాణవన్నఖర] పాదాంభోజుఁడధ్యాత్మవి
ద్యావిభ్రాంతుఁడు చంద్రశేఖరుఁడు నిత్యశ్రీయుతుం జేయుభ
ద్రావాసుండగు నూరదేవవిభు [సత్యస్థాన జిహ్వాగ్రునిన్]

2. మ. [కమనీయంబగు నాథుమోము ననపాంగక్రీడఁగావించి] క
ర్ణమరుద్భూషణ రత్నదీప్తిలహరి రక్తాంగగండస్థలే
ఖమృగాత్యంతరదత్త నూతన నఖాంకంబందు శంకించునా
హిమశైలాత్మజ [యూరదేవవిభు నెంతే బ్రోచు నశ్రాంతమున్]

3. ఉ. [స్వీకృత తల్పరూపుఁడగు శేషుఫ] ణామణి కాంతిపర్విని
ష్కాకర రత్నగైరిక మహాద్యుతిఁబోల్పఁగు నీలశైలముం
డీకొను వేను పేటిజగతీధరధారి మరా [శవాహనన్-
పాకిన బొద్దుకమ్మిగల శౌరి యలర్పుత దేవ ధీనిధిన్]

4. ఉ. అంచితపక్షపాతగతి నారయఁగూరుటఁగల్గి శారదా
చంచలనేత్ర హంసిక్రియఁజారు నిజాసన పద్మమందుఁగ్రీ
డించ సుఖాంచుప్రో [దప్రకటీకృత సృష్టికిఁదోడు నీడయా
కాంచన గర్భుఁడేలునొడి]కంబుగ నన్నయమంత్రి దేవనిన్

5. సీ. సజల వలాహకశ్యామ మోహనమూర్తి
భద్రకాళికి నేత్రపర్వమొసఁగ
వీరరసా[పగా వీచీలసద్వీక్ష
ణములు భువనరక్షణమునకు దెలుప]
[సరద్భశ మందహాసాంశుజా] లంబులు
నెలపూవు నమృతంపుఁగలిమిఁబోల్పఁ
దరళదంష్ట్రాశిఖాళ ధళ్యంబులును భూష
ణ ప్రభాంకురములున్నతిఁ దలిర్ప

గీ. కొండవీటి[కనకపీఠిఁగొలువుదీరు
భక్తమానస చాతకవారవర్ష
సమయవిస్ఫూర్తి] శ్రీవీరశరభమూర్తి
బ్రోచు నూరప్పధీమణి దేచమంత్రి

6. చ. అస్ఫుటశారావతంసు తలయందలి యేటి జలంబుఁగ్రోలి తొం
డము గొ[ని తోడుతోఁగుధరనాథతనూభవుమ్రోల స్తన్యపా
నము ననసంగి యిర్వురు పెనంగొని ముద్దిడుకొన్న]యుగ్మవి
భ్రమమువహించు హస్తిముఖుఁ బ్రార్థనచేసెద నిష్టసిద్ధికిన్.

7. ఉ. అధ్వరకర్మ కౌశలసమంచితు మానస పద్మకేళితో
ద్ధధ్వజు [భక్తిసౌరభు నఖండపదధ్వ రహస్యపారగున్
మధ్వమతిశ్రాయి వాణిశ్రితమానస గుప్తమౌనభోమ] జిన్
సాధ్వసభావు మద్గురుఁబ్రసన్ను భజించెద నైలనాహ్వయున్

8. మ. కలశాంభోనిధి యాడుబిడ్డ శశికిం గారాబు తోఁబుట్టు [వి
ద్యల దేవేరికి సత్త్వయజ్ఞపురుషుండౌ విష్ణునిల్లాలు శ్రీ
జలజాతేక్షణ[ప్రోచుఁగాత] నిరతైశ్వర్యంబవార్యంబుగా
వలను ప్రాభవునూరయన్నవిభు దేచామాత్యు
నిత్యోన్నతున్.

9. సీ. పింపో[సనీకృత చిరయశశ్శశి చిత్త
యుపవనీకృత రసాఖ్యోచిత రచన
లీలాపదీకృత కేలికాచ్ఛాం] భోజ
సైంధవీకృత మదస్ఫారహంసి
ప్రియసఖీకృత మనశ్శ్రియదపాండుర కీరి
సరసీకృతాంభోజజాత సదన
[విహృతస్థలీకృత వేధాఃపరిష్వంగ
విహృతిస్థలీకృత వేదవీథి

గీ. అనవరత కరుణార్ధురీ కనదపాంగ
ధ్వ]నిత మణిమయ వీణావితతఝుంకృ
యా సమాకర్ణన ప్రహృష్టాంతరంగ
శారదాదేవి మతి కృతీశ్వరున కొసఁగు.

క. అనిపలికి వజ్రదంష్ట్రుఁడు
మనమున నెలకొన్నభీతి మలుగఁగ నోరా
ర్చెను మట్టినీడ నాశా
జనక వచన రచన నా పిశాచగణములన్ 144 వ-

అని పూరణము ఇది (144 ప) అని ముద్రితమైనది

గీ. తనకు బలె స్వచ్ఛమైనట్టి తనువొసంగి
తనదు నొక పాయ మల్లెపూదండఁ జేసి
వానిసిగ నిడు దేహావసానవేళ
స్నాతయైఁ గాశి గంగ కెంత కనికరము? 92

గీ. మూడ దతనికి చావుచావునకె మూడు
మూఁడు జన్మంబులం దంత్య మూడిపోయి
కనులు రెండున్న వానికిఁ గనులుమూఁడు
వారణాసి గంగాస్నాన కారణమున. 93

గీ. కాశిలో బట్టతలవాఁడు గంగమునిఁగి
జడముడి ధరించు దానిపై సవదరించు
ఫణిఫణా రత్నరుచి దానిపై వహించు
మొలకజాబిలి జాజిపూ మొగ్గవోలె 94

గీ. ఈ భవమ్మున ఫలమున కేమిగాని
రాగల భవమ్ము మొదలంట రాచినాఁడు
గంగలో వారణాసి మునుంగువాఁడు
దొంటిభవమున బుణ్యంబు దొడికినాఁడు (95)

ఆ. 1 -65

ఆ 2, 4- 9- 10-12-14-15-16-24-41-66-70-72-79-80-81-87-95-96-97-98-105- 108-109- 114- 115-117-119-123-124-125-126-127 -128-134-135-137-139- 150-151-153-165-179-180-292

ఆ. 3, 309-310-325-333-334-335-338-339-341

# II

## శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు- కరుణశ్రీ-పూరించిన.

### లుప్తభాగములు :

ద్వితీయాశ్వాసము 26వ పద్యమునుండి అయాశ్వాసము చివర 290 పద్యమువఱకు ఆపై తృతీయాశ్వాసమున నాలుగు పట్టులగలవు. వాని వివరము, ద్వితీయాశ్వాసము 2-26, 2-35, 2-47, 2-99, 100, 106, 107, 118 వచనము (ఇందు 3 లుప్తభాగములు) 136, 140- (ఇందు రెండు లుప్తభాగములు) 141, 144, 149, 150, 154, 157, 160, 177, 178, 180, 185-187, 195, 247, 248, 260, 279, 280, 281.

### తృతీయాశ్వాసము

312, 327, 337, 2 లుప్తభాగములు- శ్రీ పాపయ్యశాస్త్రి గారి పూరణములును, సరసములై, కవిహృదయము నెఱిగించునవియై యున్నవి.

### ప్రస్తుతముద్రణము- లుప్తభాగములు-

పై యిరువురి విద్వత్కవుల పూరణములవలన- ప్రస్తుత ముద్రణ మెంతయో సమగ్రాకృతిందాల్చినది- పాఠక లోకమునకు- తెనాలి రామలింగకవి కృతిని ప్రవ్యక్తము చేయుటయేగాక- అతని కవితా రసము నాస్వాదించుటకు- ననుకూలమైనరీతిలో నవతరించినది- అయి నను- గ్రంథముద్రణ సమయమున- నీక్రింది పట్టులనుమాత్రమే అచ్చ టచ్చట లుప్తభాగములున్నవల్లే యుండిపోయినవి. అవియు శ్రీ పాపయ్యశాస్త్రిగారిచే పూరింపబడినవే- వాని వివరములు నీక్రింద నిచ్చుచున్నాను. ఇవి పుట 58 నుండి 167 వఱకు గలవు.

| పుట | పద్యము | లుప్తభాగ పూరణము |
|---|---|---|
| 58 | 2-26 | వ. [అను నవ్వల్లి వాధర నల్లాపమ్ముల కవ్వసుమతీ] వల్లభుండు. |

| పుట | పద్యము | లుప్త పూరణము |
|---|---|---|
| 58 | 2-36 | సంప్రాప్త[ప్రమోదమునై సముపలబ్ధ] సంతానులు కాఁజెలంగి. |
| 60 | 35 | సీ. బింబము [జపాప్రభ]విద్రుమములఁ బొబఁగు. |
| 63 | 47 | చ. క్రమ[మధులిల యంచు రతి] గాఢతరశ్రమ. |
| 75 | 99 | స్రగ్ధర. [దివిజేంద్రోపమాళి]స్థిత మణికళికో |
| ,, | 100 | సీ. పా. స్తన్యపానాది [దోషంబుపాయు] |
| 77 | 106 | సీ. పా. అఖిలస్థుఁడని యీలు నర[యుట జ్ఞానంబు] |
| 78 | 107 | మ. మదాం [సాహ్వాయుఁడుధీ]శూన్యుండు |
| 80 | 118 | వ. వి [విధశాస్త్రవిజ్ఞాన ధనులగు విద్వజ్జనుల సన్నిధిం] దజ్జనకుం. |
| ,, | ,, | ,, [గల్గించి ధర్మశాస్త్రాభి]ఘుఁడగు ధరామరు. |
| ,, | ,, | ,, సంవత్స[రమ్ములానందంబునం గడపి య] మ్మహి. |
| 86 | 141 | ఉ. పూనఁగఁగొన్నివాసరము [లుత్సుకతం దిగ్రదావి యం]తటన్. |
| 88 | 150 | మత్తకోకిల-అనింద్యమతి హృద్యమత్యమపమాన వాద్యంబునా. |
| ,, | 152 | శా ...సరోజాస్యల్ వయస్యల్[మనః]ప్రీతిన్. |

## పూరణములు

| పుట | పద్యము | |
|---|---|---|
| 100 | 2-203 | క. ...తద్దయుఁదగ్గేహోముఖమం]రమున కభిముఖుడై. |
| 102 | 2-218 | క. ధ[రామర]మిత్రుం |
| 118 | 2-291 | సీ. [చిరగతి]నరదంబుఁజేర్చ |
| 167 | 3-195 | సీ. హస్తయు[శాంతయు]నగు తన ప్రియకాంత- |

ఈ పదునెనిమిది పట్టులను లుప్తభాగ పూరణములు ముద్రితము కాలేదు-అయినను, నివి చాలా చిన్నవి యగుటచేత, కావ్యావబోధమునకు, అర్థమునకు నేమాత్ర మాటంకము గల్పింపవు.

## సవరణలు

| స్థాన పద్య సంఖ్య | సవరణలు ముద్రిత పాఠము | సవరణ పాఠము |
|---|---|---|
| 1-80 | సీ. పోలుచుఁబూఁదేనెఁ గ్రోలు రోలంబ వాలి కలంచిరాక్ష మాలికలు గాఁగ | సీ. పోలుచుఁబూదేనెఁగ్రోలు రోలంబ బాలికలు రుద్రాక్ష మాలికలు గాఁగ- |
| | | ఇది శివునికి కైలాస పర్వతమునకు పోలిక శివుని మెడలో రుద్రాక్షలున్నవి - కైలాస పర్వతమున తుమ్మెదలున్నవి రుద్రాక్షలను- తుమ్మెదలతో పోల్చుట కవి సమయము- రుద్రాక్ష మధువ్రత పరివృతంబును నగు నిషధరాజు పద్మంబునుబోని హస్తంబు- నైషధము-౨-౬. |
| 1-86 | ప్రేమశరా | శాతశరా |
| | | క. కుసుమాయుధు ప్రేమ శరాగ్ని సముత్థితధూమ వితతి. |
| | | ఇచట - 'ప్రేమశరా' అనుట కన్న 'శాతశరా' అనుటయే యొప్పు - కుసుమాయుధ - మన్మధుని-శాతశరా - వాడియైన బాణముల యొక్క- అనియర్థము వచ్చును-మన్మథ బాణములు మిగుల వాడిమి గలవి గదా. |

| | | | |
|---|---|---|---|
| 3) | 1-149 | సీ. శాతమన్యవ శిలాశకల దామజ ధామ కల్పితకారండకార భరము | సీ. శాతమన్యవ శిలాశకల ధామజ ధామ కల్పిత గాఢాంధకార భరము<br>ఇంద్ర నీలమణి శకలముల కాంతిపుంజముచే కటికచీకటి గలుగజేయుచున్నది. అని యర్థము. |
| 4) | 1-151 | మ. వలదింద్రోవల ఖండధీధితుల చేవన్ | మ. వలభీంద్రోపల ఖండ దీధితుల చేవన్<br>'వలభి' అనగా కొణిగె చంద్రశాల, |
| 5) | 1-205 | శా. ధీవిస్ఫూర్తి పయోజ సంభవ భవానీశ స్తవోచ్చారణ | శా. ధీవిస్ఫూర్తి పయోజ సంభవ, భవాధీన స్తవోచ్చారణ<br>భవాధీన స్తవములు - అనగా శివుని వధీనము చేసికొను స్తుతులు- శివపంచ స్తవములు వీనిని కృతిపతి దేచమంత్రి నిత్యము పఠించెడివాడు. |
| 6) | 2-129 | కలికి బాగులు మీల విలువు | కలికి బాగులుమీల నిలువు చూవు. |

## ప్రశ్నార్థక చిహ్నములు

| | | | |
|---|---|---|---|
| 1) | 2-22 | గీ. పూర్ణ పెతలనిండ ? | గీ. పూర్ణ తల నిండు పూర్ణములు కాగా అని అర్థము |
| 2) | 3-22 | సీ. దుస్తరంబైన సీతుం గందువమ | సీ. దుస్తరంబైన సీతుం గందువము కంత దమ్ము |

| | | | |
|---|---|---|---|
| | | గింతదన్ను నేరంబుగా దవిలి యరలు | నేరంబుల దవిలి యరలు? అరలు-అనగా ప్రకాశించు ఇది అలరు ధాతువు రూపాంతరము 'నెమ్మనం బరల'- అని ప్రాసలో ప్రయోగము నన్నెచోడని కుమార సంభవము 1081. |
| 3) | 3-105 | ఉ. ప్రాయము సత్తునాదగగు పంచమ! వాసర భోగ్య మింక; నా కాయజ వైరిఁ జేయుటయె కర్జము. | ప్రాయము సత్తువాగదగు పంచమ వాసర భోగ్యమింక నాకాయజ వైరిజేయుటయె కర్జము- పంచమ వాసరభోగ్యము అనగా అయిదు నాళ్ళ ముచ్చట - మూడు నాళ్ల ముచ్చటవలె- పెండ్లి అయిదు దినములే శోభ - తరువాత నుండదు- ప్రాయ మనిత్య మని అర్థము. |
| 4) | 3-195 | సీ. డాకేలు తామెడ? మైకొల్పి. | సీ. డాకేలు తామెడమైకొల్పి పార్వతీ పరమేశ్వరు లేకాసనస్థులై యున్నప్పుడు శివుడు పార్వతి కంఠమున తన యెడమ చేయిని కీలించి నపుడు ఆమె మెఱుగు పొలిండ్ల కాంతి. |

ఆ హస్తమున మెడమీద ప్రతిఫలించినది. మెడమైకొల్పి అనగా మెడయందు వెల కొలిపి-అని అర్థము.

## యతి ప్రాసలు

| | | ముద్రిత పాఠము | సవరణ పాఠము |
|---|---|---|---|
| 1) | 1-193 | సీ. అవని నార్యావర్త మను దేశమునవల్ల కీనామ విఖ్యాత మైన పురము | సీ. అవని నార్యావర్తమను దేశమున వల్ల కీనామ విఖ్యాతమైన పురము |
| 2) | 1-200 | గీ. సాధు సాలోక్య లక్ష్మిఁ జెందంగ గలఁడు | గీ. సిద్ధ సాలోక్యలక్ష్మి జెందంగఁ గలఁడు. |
| 3) | 2-76 | క. అవి ముక్తంబులు తక్కినయవి ముక్త శరీర జంతుపుంజంబులు. | క. అవి ముక్తంబులు తక్కిన భువి ముక్త శరీర జంతు పుంజంబులు. |
| 4) | 2-93 | గీ. మూడదతనికి చావు చావునకె మూడు | మూడదతనికి చావది మూడు చావె |
| 5) | 3-212 | క. వంచప్రేతేశ పువ్వు లుంచెద గొనుమా | ఉంచప్రేతేశ- పువ్వులుంచెదఁ గొనుమా |
| 6) | 3-281 | సీ. అగుటకు సకల భూతాళి ప్రభూత హర్షంబున నచ్చెరు వడుచుమండ | సీ. అగుటకు సకలభూతాళి ప్రభూతహర్షంబున మిగుల నచ్చెరువు పడఁగ- అచ్చరువు-అచ్చెరువు రెండు రూపములు గలవు. |



# ఉద్భటారాధ్య చరిత్రము

## ప్రథమాశ్వాసము



శా. [శ్రీవక్షః కమలాసనాది దివిజశ్రేణీ శిరోమణ్యభి
ఖ్యావృద్ధి ప్రదశాణవన్నఖర] పాదాంభోజుఁ డధ్యాత్మ వి
ద్యావిశ్రాంతుఁడు చంద్రశేఖరుఁడు నిత్యశ్రీయుతున్ జేయు భ
ద్రావాసుం డగు నూరదేచవిభు [సత్యస్థాన జిహ్వాగ్రునిన్.] 1

మ. [కమనీయంబగు నాథుమోమున నపాంగక్రీడ గావించి క]
ర్ణమరుద్భుక్ఫణరత్న దీప్తిలహరీ రక్తాంగగండస్థరే
ఖ మృగాక్ష్యంతర దత్త నూననఖాం కంబంచు శంకించు నా
హిమశైలాత్మజ [యూరదేచవిభు నెంతేఁబ్రోచు నశ్రాంతమున్].2

ఉ. [స్వీకృత తల్పరూపుఁడగు శేషు ఫ] ణామణి కాంతి పర్వ ని
త్యాకరరత్న గైరికమ హాద్యుతిఁ బొల్పగు నీలశైలమున్
డీకొను మేను మేటి జగతీధరధారి మరా [ళ వాహనున్
సాకిన బొడ్డుతమ్మిగల శౌరి యలర్చుత దేచ ధీనిధిన్]. 3

ఉ. అంచిత పక్షపాతగతి నారయఁ గూరుట గల్గి శారదా
చంచలనేత్ర హంసిక్రియఁ జారు నిజానన పద్మమందుఁ గ్రీ
డించ సుఖించుప్రో [ద ప్రకటీకృత సృష్టికిఁ దోడునీడ యా
కాంచన గర్భుఁ డేలు నొడి] కంబుగ నన్నయమంత్రి దేచనిన్. 4

సీ. సజలవలాహక శ్యామమోహనమూర్తి
భద్రకాళికి నేత్రపర్వ మొసఁగ
వీరరసా [ వగా వీచీలసద్వీక్ష
ణములు భువన రక్షణమును దెలుప ]
[ నసదృశ మందహాసాంశుజా ] లంబులు
నెలపూవు నమృతంపుఁ గలిమిఁ బోల్పఁ
దరళదంష్ట్రాధాళ ధళ్యంబులును భూష
ణ ప్రభాంకురము లున్నతిఁ దలిర్పఁ

గీ. గొండవీటి [ కనకపీఠిఁ గొలువుదీరు
భక్తమానస చాతకవార వార్ష
సమయవిస్ఫూర్తి ] శ్రీ వీర శరభమూర్తి
ప్రోచు నూరన్న ధీమణి దేచమంత్రి. 5

చ. అమృతకరావతంసు తల యందలి యేటిజలంబుఁ గ్రోలి తుం
డము గొ[నితోడుతోఁగు ధరనాథ తనూభవ మోలస్తన్య పా
నమున నెసంగి యిర్వురు పెనంగొని మద్దిడుకొన్న] యుగ్మ వి
భ్రమము వహించు హస్తిముఖుఁ బ్రార్థన చేసెద నిష్టసిద్ధికిన్. 6

ఉ. అధ్వరకర్మకౌశల సమంచితు మానస పద్మకేలితో
త్థధ్వజ [భక్తి సౌరభు నఖండమదధ్వ రహస్యపారగున్
మధ్వతి శాయివాణి శ్రిత మానస గుప్త తమోనభోమ] ణిన్
సాధ్వనుభావు మద్గురుఁ బ్రసన్ను భజించెద నైలనాహ్వాయున్. 7

మ. కలశాంభోనిధియాఁడుబిడ్డ శశికిం గారాబుతోఁ బుట్టు వ్రి
ద్యల దేవేరికి సత్త్రయజ్ఞ పురుషుం డౌవిష్ణు నిల్లాలు శ్రీ
జలజాక్షీక్షణ ప్రోచుఁగాత] నిరతైశ్వర్యం బవార్యంబుగా
సలఘుప్రాభవు నూరయన్న విభు దేచామాత్యు నిత్యోన్నతున్. 8

సీ. సింహాసనీకృత చిరయశః కవిచిత్త
యుపవనీకృతరసాభ్యుదితరచన
లీలాపదీకృత కీలితాచ్ఛాంభోజ
సైంధవీకృత మదస్ఫారహంసి
ప్రియసఖీకృత మనఃప్రియద పాండురకీరి
సరసీకృతాంభోజ జాతవ (దవ)
విహృతస్థలీకృత వేధాఃవరిష్వంగ
విహృతిస్థలీకృత వేదవీథి
గీ. అనవరత కరుణార్ఝురీ కనదపాంగ
ధ్వణిత మణిమయ వీణావితతఝుంక్రి
యా సమాకర్ణన ప్రహృష్టాంతరంగ
శారదాదేవి మతి కృతీశ్వరున కొసఁగు. 9

శా. సంసా (రా)న్వాయసింధు పోతము జగత్సంబోధదీపాంకురున్
కంసారాతి పదాబ్జబంభరము సాత్త్వోత్పద్మగర్భున్ బుధో
త్తంసంబున్ శ్రుతిసంకరోద్ధళన పాథఃక్షీర భేదక్రియా
హంసంబున్ బరిశీలితస్మృతిరసున్ వ్యాసున్ బ్రశంసించెదన్. 10

క. శ్రీరామాయణదుగ్ధాం
భోరాశిసుధామయూఖు బుధవినుత [1] గుణో
దారు నఘమత్తవారణ
వారణరిపుఁ బ్రస్తుతింతు వాల్మీకిమునిన్. 11

ఉ. గ్రాంథిక సన్నుతప్రతిభఁ గాంచి రసజ్ఞత మించి యాదిమ
గ్రంథము లుగ్గడించి ఫణిరాట్పరికల్పిత శాస్త్రవీథికిన్
బంధువులైన సత్కవులఁ బ్రార్థనచేసెద దుష్ప్రబంధ సం
బంధమహాంధకార ఖరభాను గభీరవచోమచర్చికన్. 12

---

1 గుణాధారు. పా. అం.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును, విశిష్టసత్కవి కీర్తనంబును బరిఢవించి యొక్క ప్రసిద్ధ ప్రబంధ రచనా కౌతూహలంబు మనంబునం బెనంగొనియుండు నవసరంబున. 13

సీ. మహిత మూలస్థాన మల్లికార్జునశిర
స్థ్సల చంద్ర చంద్రికా ధవళిమంబు
చెదలువాటీపుర శ్రీరఘూద్వహభుజా
స్తంభ రక్షణవిధా సంభృతంబు
వేదండముఖతడా గోదితపద్మసౌ
గంధిక గంధపా ణింధమంబు
రాజబింబాననా రాజిత గాంధర్వ
మాధురీ సాధురీతిధరంబు

గీ. కరటికట నిర్గళద్దాన నిరవధిక
మగ్రనూతన వృష్టి జంబాలితాఖి
లావనీపాలమందిర ప్రాంగణంబు
గురుసమృద్ధుల నయిదోడు కొండవీడు. 14

మ. వరఁగన్ వారిధివేష్టితాఖిలమహీ భాగంబునన్ రెడ్డిభూ
వరసింహాసనమై శుభాయతనమై వర్ధిల్లుతత్పట్టణం
బురుబాహాబలసంపదం బెనుచు భద్రోద్యోగి నాదెండ్ల గో
పరసాధీశుఁ డశేషబంధుకుముద ప్రాలేయధామాకృతిన్. 15

సీ. భూధురంధరభావ మున భోగిపతి యయ్యె
విప్రవరాసక్తి వృద్ధిఁ బొంది
వరవిక్రమప్రౌఢి నరసింహుఁ డయ్యె నె
పుడు హిరణ్యకశిపు స్ఫురణ గాంచి
దివ్యభోగవ్యాప్తి దేవతావిభుఁ డయ్యె
బలపోషణఖ్యాతిఁ బరిఢవిల్లి

ప్రచురకారుణ్య సంపద రాఘవుం డయ్యు
శివధర్మ పాలనస్థితి వహించి

గీ. బాణబాణాసనస్ఫూర్తి ద్రోణుఁ డయ్యు
నవ్య పాంచాలలక్షణోన్నతి వహించి
జలధివలయిత వసుమతీ స్థలమునందుఁ
గొమరు దీపించు నాదెండ్ల గోపవిభుఁడు. 16

సీ. దరహాసచంద్రికా ధాళధళ్యంబులు
భుజగేంద్రకాంతా కపోలములకు
తారహారచ్ఛటా ధాగధగ్యంబులు
చారణకామినీ స్తనములకును
సంఫుల్లమల్లికా చాకచక్యంబులు
గంధర్వమదవతీ కబరికలకు
నవచందనాలేప నైగనిగ్యంబులు
దివిషన్నితంబినీ దేహములకు

గీ. ధవళధామ సుధా శారదా పటీర
దర సుధావారినిధి సుధాం ధఃకరీంద్ర
సాంద్రతర కాంతివిభ్రమ సంగతములు
తిమ్మవిభుగోపమంత్రి సత్కీర్తిరుచులు. 17

సీ. కరవాలకామారి కరివధూనయన క
జ్జలము హాలహాల భోజనము గాఁగ
ప్రచురదానాంబుధారా పద్మ కర్థిహ
స్తంబులు వరనీరజములు గాఁగ
అకలంకమతిమ రాళికిఁ జతుశ్శ్రుతివీథి
సాంద్రపయఃపూర్ణ సరసి గాఁగ
గుణమహాకీర్తి ములకుఁ గోవిదశ్రుతిసీమ
లకుటిలగుప్తి పేటికలు గాఁగ

గీ. భూమ సప్తార్ణవీసప్తకీమనోజ్ఞ
సర్వసర్వంసహా పూర్ణచంద్రవదన
రాణివాసంబు గా ఖ్యాతి రాసి కెక్కె
గురుయశోహారి నాదెండ్ల గోవశౌరి. 18

సీ. అరిపురజయలక్ష్మి హరునిఁ బోలెను కాని
తగులందు విషధరత్వంబు నింత
సంపూర్ణతరకాంతిఁ జంద్రుఁ బోలెనుకాని
దోషాకరోన్నతి దొరలఁ డెందు
నిజభుజాబలరేఖ విజయుఁ బోలెను కాని
భీమోన్నతన్మూర్తిఁ బెరుఁగనీఁడు
గాంభీర్యమునఁ బాలకడలిఁ బోలెను కాని
భంగసాంగత్యంబుఁ బట్టఁ డర్థి
గీ. సకలదుర్మంత్రివదన ముద్రావతారుఁ
డాత్మపంకజవీథీవిహారిశౌరి
కీర్తి గంగాపవిత్రిత క్షితితలుండు
గుణమరున్మంత్రి నాదెండ్ల గోవమంత్రి 19

ఉ. ఆహవకౌశలప్రహసితార్జునతన్ సముదీర్ణధైర్యరే
ఖాహృతమేరుసారత మహోద్భుతుఁడై గుణనిర్జితేభర
క్షోహరుఁ (డై చెలంగు నల) గోవనమంత్రికి రాజకార్యని
ర్వాహకుఁ డూరదేచసచివప్రవరుండు దలిర్చు నుర్వరన్. 20

సీ. తనదానవిభవంబు ధనదానవద్యవి
శ్రాణనప్రక్రియఁ జౌకఁ జెఱుప
తనవచశ్శుద్ధి శాంతనవపౌత్రాదులం
దటివారలకు నద్భుతంబు సొనర్ప
తనమూర్తి చూచినంతన మూర్ఛములు వంచి
దర్పితారాతిబృందములు దలఁక

తనమనస్సన్నతి పురాతన మహామునిమృగ్య
మగు శంభుతత్త్వంబుఁ దగిలి ప్రబల

గీ. ప్రబలుఁడై యొప్పు నాదెండ్ల భవ్యవంశ
దీప తిమ్మ ప్రధానేంద్ర గోపసచివ
రాజ్యసంరక్షణక్రియా రబ్ధబుద్ధి
గోచరుం డూరయన్నయ దేచమంత్రి. 21

వ. ఇట్లు మహనీయమనీషి మనశ్శమల దివాకరుండును, వివిధవిరోధి హృదయ భీకరుండును, రసనాగ్రజాగ్రదశేష విద్యాసందర్భుండును, నభంగుర ప్రతిభాపద్మగర్భుండును, విశ్రుతవిశ్రాణనవిజిత సముద్రుండును, విశుద్ధస్వాంతవిశ్రాంత వీరభద్రుండును, వనీపకవనోల్లాస నవచైత్రుండును, కౌండిన్య గోత్రుండును, సన్నుత సమున్నత మహాభోగ సంక్రందనుండును, నిబిడభుజాబల విడంబిత కుమారుండును, కృష్ణమాంబికా కుమారుండును, శాశ్వతైశ్వర్య పురశాసనుండును నగు నా ప్రధాన పరమేశ్వరుం డొక్కనాఁడు.

మ. కవులున్ బాఠకులున్ బ్రధానులు సుధీ గణ్యుల్ పురాణజ్ఞులున్
వివిధార్థుల్ సఖులున్ బురోహితులు నుర్వీనాథులున్ జోస్యులున్
ధవళాక్షుల్ గొలువంగ నిండుకొలువై దైవారు హర్షంబుతో
నవధానంబున నుండి శంకరకథా వ్యాసక్తి భాసిల్లుచున్. 23

సీ. కౌండిన్యమునిరాజ మండలేశ్వరవంశ
పాథోధినవసుధా భానుమూర్తి
బాలగుమ్మలేశ పదపయోజద్వయీ
ధ్యానధారణ సముదాత్తచిత్తు
మానితాయాతయా మా (నామ) భావిత
విపులమహా యజుర్వేదవేది
రామేశ్వరస్వామి రమణీయకరుణావి
శేషపోషిత విలసిత సమగ్ర

గీ. సహజసాహిత్యమాధురీ సంయుతాత్మ
లక్కమాంబకు ఘనయశో లక్ష్మి వెలయు
రామధీమణికిని బుత్త్రి రామలింగ
నామవిఖ్యాతుఁ గావ్యనిర్ణయ ధురీణు. 24

వ. నన్ను సబహుమానంబుగా రావించి సమున్నతాసనంబునఁ గూర్చుండ నియమించి కర్పూరతాంబూలంబు జాంబూనద పాత్రంబున నొసంగి తారహారాంగుళీయ కంకణకర్ణభూషణ పట్ట మాంజిష్ఠాది విశిష్టవిస్తారవస్తు ప్రదానపురస్సరంబుగా నిట్లనియె.

చ. విలసదయాతయామబహు వేదవివేక పవిత్ర భావ సం
కలితము లైనవాక్యములఁ గావ్యముఁ జెప్పఁగ నేర్తు వాదికా
వ్యులకవితా నిగుంభన సమున్నతిఁ గాంచినవాఁడ వౌదు వీ
వలఘువచో విలాస సుగుణాకర రామయలింగ సత్కవీ. 26

మ. భవపాశత్రుటన క్షమంబు లగు నా ఫాలాక్షుగాథావలుల్
చెవులారన్ వినుచుండు నెవ్వఁ డతఁ డీక్షింపన్ మహాభాగుఁ డ
ట్లవుటన్ మామకబుద్ధి యెల్లపుడు దీవ్యచ్ఛైవ శాస్త్రార్థ సం
భవసాంద్రామృతసేవఁ దృప్తిఁ గనుచున్ భాసిల్లు నిస్తంద్రమై.

గీ. హరునికంటెను దద్భక్తు లధికు లనుచు
వేదవేదులు వివరింప విందు మెపుడుఁ
గాన తద్భక్త సత్కథాఖ్యాతమైన
భవ్యచరితంబు వినువారు ప్రాజ్ఞతములు. 28

క. హరభక్తులందు నుద్భట
గురుఁ డధికుఁడు ప్రసిద్ధ గుణమణిగణ వి
స్ఫురణాభిరామమును నీ
వ రచింపుము కావ్య మొకటి వర్ణన కెక్కన్. 29

మ. అని ప్రార్థించిన దేచధీమణికి నిష్టావాప్తియుం గీర్తిశే
లనయున్ భాగ్యసమృద్ధియున్ జయముఁ దుల్యస్ఫూర్తి వర్తిల్ల స
జ్జనతా వర్ణితరీతి నాంధ్ర మగు భాషాపద్ధతిన్ బల్కితిన్
వినుతశ్రీభరితో ద్భటస్ఫుటకథా విఖ్యాత సత్కావ్యమున్. 30

వ. ఇమ్మహాప్రారంభమునకు మంగళాచరణంబుగాఁ గృతీశ్వరు
వంశావతారం బభివర్ణించెద. 31

## కృతిపతి వంశావతార వర్ణనము

ఉ. ధన్యవివేకశాలి ప్రమథ ప్రభుపాదపయోజయుగ్మ మూ
ర్ధన్యమనోద్విరేఫపతి ప్రౌఢవచఃపరిభూతపండితం
మన్యుఁడు మాన్యకీర్తినిధి మన్యువిదూరుఁడు నైనయట్టి కొం
డిన్యమహామునీంద్రుఁడు మనీషికులాగ్రణి యొప్పు నెప్పుడున్. 32

శా. ఆవిర్భావము నొందెఁ దత్కులమునం దక్షుద్రకీర్త్యావృత
ద్యావాపృథ్వ్యవకాశుఁ డీశపదపద్మధ్యాన సం (ధానవి
ద్యావిశ్రాం) తుఁడు సత్కృపాభరిత శాంతస్వాంతుఁ డూరాగ్రహా
రావాసుండు పెదన్నమంత్రిమణి కొమ్మాంబా మనోభర్తయై. 33

క. ఆజంపతులకుఁ గలిగిరి
భూజనకల్పద్రుమములు పురహరపూజా
భ్రాజిష్ణు లైలమంత్రియుఁ
దేజోనిధి తిప్పవిభుఁడు దేచప్రభుఁడున్. 34

క. వారలలోఁ గవిజనమం
దారుఁ డుదారుండు కీర్తి ధగధగిత దిశా
వారణదంతాచలుఁ డగ
ధీరుఁడు ధీరుచిరమూర్తి తిప్పన వెలయున్. 35

గీ. చెప్పఁ జిత్రంబు శ్రీయూర తిప్పమంత్రి
యర్థులకు ధారవోయుట శిఖలనదులు

వెచ్చపెట్టంగ నీక్షించి వృషభకేతుఁ
డభ్రనది నాఁచికొనియుండు నాత్మమౌళి, 36

చ. బిసరుహపత్రనేత్ర యగు పేరమకున్ బ్రతివాసరార్చిత
ప్రసవశిలీముఖారి పదపద్మయుగుం డగుతిప్ప మంత్రికిన్
మసృణయశోవిభూషిత సమస్తదిశావదనుండు నిర్జరేం
ద్రసముఁడు సంభవించె జిత తామసుఁ డన్నవిభుండు సొంపునన్.

సీ. సింహికాసుతదంష్ట్రఁ జిక్కి నొవ్వనినాఁటి
సంపూర్ణపూర్ణిమా చంద్రకాంతి
పెలుచఁ గవ్వపుఁగొండ గలఁచి యాడనినాఁటి
క్షీరవారాశి గంభీరగుణము
దారుణశరవ్రజ ధార యంటనినాఁటి
దైవతాహార్యంబు ధైర్యమహిమ
వితతభైరవ కరాహతిఁ దలంకనినాఁటి
పద్మగర్భుని ప్రతిభాభరంబు

గీ. సత్యభామాధిపతిచేతఁ జలన మొంది
బలిమి దింపనినాఁటి కల్పద్రుమంబు
వితరణంబును దనయంద వెలయు, వెలయు
నూరయన్న ప్రధాన కంఠీరవుండు, 38

చ. హిమగిరిధైర్యుఁ డన్నవిభుఁ డీశ్వర ప్రెగ్గడమల్లనార్యు గౌ
రమకుఁ గుమారియై రమకు నద్భుత సంపద సాటియై మనో
రమకులయుగ్మహారమయి ప్రౌఢి వహించిన కృష్ణమాంబ నె
య్యమున వరించి మించె శివుఁ డద్రిసుతన్ వరియించుకైవడిన్.

సీ. సర్వసర్వంసహా దుర్వారతర భార
నిర్వాహకభుజుండు పర్వతయ్య

నీలకంధర హిమ నాళీకరిపు హార
కైలాస నిభకీర్తి మైలమంత్రి
శ్రీచంద్రశేఖర వాచంయమేంద్రసే
వాచారుతరబుద్ధి దేచమంత్రి
కుండలిమండ లాఖండదోర్దండాసి
మండలాహూతవైరి కొండశౌరి
యనఁగఁ గలిగిరి సత్పుత్రు లన్ననార్య
భార్య కృష్ణాంబకును నిత్యభాగ్యనిధికిఁ
బ్రణతభూపాలకోటీర మణిమయూఖ
రాజినీరాజితాంఘ్రి నీరేజు లగుచు. 40

భూభాగజంభభేదను
నాభాగదిలీపతుల్య నరవరమాన్య
శ్రీభరితు నూరవర్యతుఁ
బ్రాభవనిధిఁ బ్రస్తుతింతుఁ బటుతరఫణితిన్. 41

నిటలలోచనజటా పటలాంతరమునకు
భాగీరథీపయో భారధార
జంభభంజనపురీ కుంభివల్లభకర్ణ
సీమకు నభిరామ చామరంబు
జలజాతభవవధూ స్తనకుంభపాళికి
ననవద్యతరహృద్య హారయష్టి
సంపూర్ణపూర్ణిమా చంద్రబింబమునకు
విస్ఫురచంద్రికా విలసనంబు
నగుచు జగముల విహరించు నహరహంబు
నిర్నిరోధవిహార మానితవిభూతి
హత్తియూరయ్య సుప్రథానోత్తమ ప్ర
వృద్ధసుస్నిగ్ధనవయశో విశదకాంతి. 42

ఉ. యాచకకామరద్రుమ ముదగ్రతరాంత రరాతివిక్రియా
మోచనకారణం బ (ఖిల భూజనసంత) తసత్కృపాలస
ల్లోచనపద్మపత్రుఁ డతి లోకగుణాఢ్యుఁడు నై వసుంధరన్
దేచనమంత్రి యొప్పు జగతీధర కార్ముకదత్త చిత్తుఁడై. 43

క. ఖండపరశుపదసేవా
ఖండలనందనుఁడు కీర్తి గర్భీకృత ది
ఙ్మండలుఁ డూరన్నయవిభు
కొండన ధైర్యమునఁ బసిఁడి కొండన వెలయున్. 44

వ. వారిలోన. 45

మ. ప్రణుతప్రాభవుఁ డూర దేచవిభుఁ డభ్యర్చించు హస్తాగ్రక
కణఝుంకారము లంకురింప విరులన్ గంధంబునన్ బత్త్రిన్
మణిహారంబులఁ గాంచనాక్షతల శుంభద్వర్ణ పంచాక్షరిన్
బ్రణవాత్మున్ బరమప్రకాశు గిరిజా ప్రాణేశు నశ్రాంతమున్. 46

## షష్ఠ్యంతములు

క. ఏతాదృశకులమణికిని
మాతాపితృభక్తియుక్తి మహిమాఢ్యునకున్
కాతరజనసురశాఖికి
వాతాశన సార్వభౌమ వాగ్వైఖరికిన్. 47

క. శ్రీకరనిజగుణమాణి
క్యాకీర్ణ పయోజసంభ వాండకరండా
స్తోకాచ్ఛాదన సితవ
స్త్రీకృత సత్కీర్తినిధికి ధీసన్నిధికిన్. 48

క. గీష్పతి నిభమతికిని వా
స్తోష్పతివిభవునకు నాత్మ దోఃఖడ్గలతా

ర్చిష్పతివిపులజ్వాలా
నిష్పీడిత నిఖిలవిమత నృపసచివునకున్. 49

క. అలఘుతరహారిద్రంతా
పళకర్ణోద్భూతగంధ వాహాభర ప్ర
జ్వలితచటుల ప్రతాపా
నలునకు నసమాన (ధైర్య) నయధుర్యునకున్. 50

క. శ్రీ చంద్రశేఖరాహ్వయ
వాచంయమచంద్రపాద వనరుహ సేవా
శ్రీ చతురాత్మున కన్నయ
దేచామాత్యునకు సత్య ధీనిత్యునకున్. 51

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యీ మహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 52

కథా ప్రారంభము

ఉ. గణ్యము దండకప్రముఖ కాననకోటులయందు సర్వవై
గుణ్యనివారణక్షమ మకుంఠిత వైభవశోభితంబు స
త్పుణ్యఫలాదికారణము భూనుతిపాత్రము నైన నైమిశా
రణ్యము (తేజరిల్లు) మునిరాజ నికేతన భాసమానమై. 53

సీ. అచలసుతాభర్త కర్పించి మఱికాని
మృగములు లేఁబూరి మేయ వచట
అసమలోచనునకు నర్పించి మఱికాని
యళులు క్రొవ్విరితేనె లాన వచట
అంధకధ్వంసికి నర్పించి మఱికాని
కోయిల లిగురాకుఁ గొఱుక వచట
అంగజారాతికి నర్పించి మఱికాని
చిలుకలు పండ్లు భుజింప వచట

గీ. తక్కుఁగల జంతువులు శంభుఁ దలఁచికాని
యుచితవర్తనములఁ గోరి యుండ వచట
వదనములు వేయుఁ గలయంత వానికైన
నా యరణ్యంబుఁ గొనియాడ నలవి యగునె. 54

మ. హరిణంబున్ బులి పెంచు సింగ మొగి సయ్యాటంబు లాడున్ గరిన్
బురినీడన్ ఫణిడింభజాలముల నిల్పుం గేకి చిట్టెల్కలం
గరుణన్ బిల్లులజాలముల్ పెనుచుఁ గాకంబుల్ నిశావేళ భీ
కరఘూకంబులపొంతఁ గన్ను మొగుచున్ గాఢ్కించితద్భూములన్.

గీ. తబిసిముత్తంబు రేపాడి తానమాడి
దగ్గియలచేరువలను (బూదియలలందు)
కాలమునఁ బల్కును "త్రియంబకం యజామ
హే" యటంచును జలపక్షు లెల్ల యెడల. 56

ఉ. సామగుణంబుఁ గొల్చుఁ బికశాబకపంక్తులు శైవధర్మముల్
ప్రేమ నువన్యసించు శుక బృందము లీశ్వరయోగశాస్త్రముల్
కోమలరీతి శారికలు గూడి పఠించు వినోదలీలలన్
గామవిరోధిఁ బాడు సధికంబుగ ముచ్చట భృంగపోతముల్. 57

ఉ. ప్రాచినశ్రోత్రులుం దొరుఁగుపుప్పొడిఁ జెల్వగు మావులుం దగన్
గాచినమోవులున్ శుకనికాయసమప్రభ మించుజావులున్
వాచవియైనఁ బంచజనవాంఛలు తీర్చునవంట్లప్రోవులున్
జూచి ముదంబునన్ నిలువఁజూతురు తద్వనవీథి దేవతల్. 53

ఉ. నాలుగువేదముల్ గడచనంగఁ బఠించి సమస్తశాస్త్రముల్
మూలము ముట్టఁగాఁ దెలిసి మోహముఖాహితులం జయించి సం
శీలితశైవధర్మగతిచేఁ దనరారుచు నద్భుతస్థితిన్
గాలముఁ ద్రోచియుండుదు రఖర్వతపోనిధు లవ్వనంబునన్. 59

క. ద్వాదశవార్షిక మగు క్రతు
వాదరమునఁ జేయుచున్న యమ్మౌనుల సం
పాదితపుణ్యఫలము దా
నై దైవికఘటన సూతుఁ డట కేతెంచెన్. 60

క. ఏతెంచినసూతుం గని
యాతాపసముఖ్యు లెల్ల నతనికి వినయో
పేతమతి నుక్తవిధిచే
నాతిథ్యముచేసి రప్పు డధికప్రీతిన్. 61

సీ. అంతట వర్యాసనాసీనుఁ డై యున్న
సూతు సద్వినయసమేతుఁ జూచి
యవ్వాణ్యకుశలంబు నడిగి యాయన దమ్ము
నడిగినఁ దమసేమ మర్థిఁ జెప్పి
యుచితభాషణముల నొక్కింతవడి కాల
యాపనం బొనరించి యనఘచరిత!
యఖిల పురాణరహస్యంబు గరతలా
మలకమై యుండు నీమదికి నెపుడు

గీ. శైవధర్మసదాచారసరణి మిగుల
వినఁ బ్రియం బగుఁ జెప్పవే విశదఫణితి
ననుచుఁ దన్నట్లు ప్రార్థించి యడుగు శౌన
కాదిమౌనుల కిట్లను నతఁడు ప్రీతి. 62

చ. అనఘవిచారులార! వినుఁ డాగమతత్త్వమునందు మీ యెఱుం
గనియది లేదు నన్నుఁ ద్రిజగద్వినుతోదయుఁ జేయఁగాఁ దలం
చినపని కాదె యే నొకటి చెప్పఁగ విందు మటంచు నిట్లు మీ
యనికి భవత్కృపాగరిమ నొందితిఁ జెందితి భాగ్యసంపదన్. 63

ఉ. వాలుక లెన్నవచ్చు నుడువర్గము లెన్నఁగవచ్చు భూరజో
జాలము లెన్నవచ్చు నతిచంచలవార్ధి వికీర్ణవీచికా
మాలిక లెన్నవచ్చు బుధమండలకర్ణ పుటామృతంబు తా
బాలశశాంకశేఖరుని భవ్యచరిత్రము లెన్నవచ్చునే ? 64

ఉ. అంగద యోగసిద్ధికిఁ బ్రయాసముఁ బొందఁగ నేల సంశయాం
భోధిం గడు మునుఁగుచున్న బహుభిన్నపథంబులఁ బోవనేల భ
క్తిం గనఁజాల [శావృషభకేతను] బ్రస్తుతి సేయుచుండినన్
దంగెటిజున్ను గాదె హిమధామకిరీటుఁడు భక్తకోటికిన్. 65

ఉ. ఆకులఁ గందమూలముల నంబుఫలంబులఁ గూరగాయలం
జేకొని ప్రాణరక్షణముఁ జేసి మహాటవిలోనఁ దీవ్రని
ష్ఠాకలనన్ శరీరము గృశంబుగ నుండిన ముక్తి గల్గునే
ప్రాకట మైనభక్తిఁ బురభంజనుఁ బూజ యొనర్పకుండినన్. 66

సీ. మ్రొక్కు నెవ్వాఁ డష్టమూర్తికి నలవోక
బలె నాతఁ డమరులప్రణతి యందుఁ
జల్లు నెవ్వాఁడు ధూర్జటిమీఁదఁ బుడిసెఁడు
జలము లాతఁడు సుధాజలధిఁ దేలు
నుతియించు నెవ్వాఁడు శితికంఠు నేకవా
రం బాతఁ డలవచోరమణి నేలు
నిలుపు నెవ్వాఁ డీశు నిమిషమాత్రము మనం
బున నాతఁ డామీఁది పొడవుఁ దెలియుఁ

గీ. గాన మ్రొక్కఁగ నభిషిక్తుఁగా నొనర్ప
వినుతి సేయంగఁ దవిలి భావింప నెందుఁ
దగిన దేవాదిదేవుఁ డాతండు సూవె
భక్తిముక్తుల పేక్షించు భక్తులకును. 67

ఉ. వాసన లేనిపూవు రసవర్ణన లేనికవిత్వరేఖ య
భ్యాసము లేనివిద్య జలజాప్తుఁడు లేనిదినంబు చంద్రికో
ల్లాసము లేనిరాత్రి కమలస్థితి లేనికొలంకు చూవె కై
లాసనివాసు నాత్మఁ దలంపని మూఢులజన్మ మారయన్. 68

గీ. చూడఁదగ దే వివేకించి సుజనులకును
జంద్రరేఖావతంసుని చరణయుగళి
యెంతచక్కనిదో రమాకాంతుఁ డంత
వాఁడు నందును దనకన్ను వైచె మున్ను. 69

గీ. శైవు లగువారు చెప్పినజాడయందు
నడువనేరదు మూఢుల గడుసుబుద్ధి
వానపై వానగురిసిన నాను నొక్క
సహజకాఠిన్య ముడిగి పాషాణకులము. 70

సీ. శివపదాంభోరుహ ప్రవిమలోదకపాన
సిద్ధి నాలుకచవిఁ జెలఁగ దేని
శంభుదాసాంగ్రైక సంస్పర్శనంబున
నెమ్మేను పులకల నిలువ దేని
త్రిపురదానవ వైరిదివ్యలింగస్ఫూర్తి
కన్నులారఁగఁ జూడఁ గలుగ దేని
దర్పకధ్వంసి యాదల నిడ్డపూవుల
తావిపై నాసిక దవుల దేని

గీ. కాలకంధరు సత్కథా కర్ణనంబు
కర్ణపుటవీథి నందంద కదియ దేని
వానిజన్మంబు జన్మమే వానిబ్రతుకు
బ్రతుకె పారదూరుఁ డగువాఁడు పశువు దెలియ. 71

క. శివలింగదర్శనంబును
శివపూజా వైభవంబు శివసద్గుణ సం
శ్రవణంబును మానవులకు
భవనీరదపటల చటుల పవమానంబుల్. 72

సీ. ఏ వేల్పుపదముల కిందిరావల్లభు
వలకన్ను పూజనావారిజాత
మే వేల్పుకటిసీమ కిభదైత్యనాయకు
బలితంపుఁ జర్మంబు పట్టుచేల
మే వేల్పుతనువున కిక్షుబాణాసను
గరువంపు నెమ్మేను కమ్మబూది
యే వేల్పు కెంజాయ నేపారుజడలకు
విధికపాలశ్రేణి విరులదండ

గీ. యట్టి భువనాధి నాథున కాది దేవు
నకును మానసపుత్త్రుఁడై ప్రకటమహిమ
వెలయు నుద్భటగురుమూర్తి గలఁ డొకండు
సకలభవపాశలుంఠక చతురబుద్ధి. 73

గీ. అతులదుర్మతకరటి పంచాననుండు
నిఖిలశైవాగమ జ్ఞాన సఖ మనీషుఁ
డాశ్రితేప్సితదానదివ్యద్రుమంబు
నైనయుద్భటుచరిత నెయ్యమున వినుఁడు. 74

వ. మహాత్ములారా! ఇది మీయడిగిన ప్రశ్నంబునకు సదుత్తరంబై యుండు నీచరిత్రంబు భవలతాలవిత్రంబు, నిశ్శ్రేయసక్షేత్రంబును నై వెలయు నని యక్కథకుండు కథాకథనోన్ముఖుండై మహర్షుల కిట్లనియె. 75

విలసదుదారనాగకుల విశ్రుత మాశ్రితసర్వమంగళం
బలఘుగణేశ్వరంబు హరిదంబరసంకలితంబునున్ మహో
జ్జ్వలము మృగాంకశేఖరము సాంద్రసితద్యుతి భాసురంబు నై
పొలుపు వహించు తారగిరి భూతపతిం దనభర్తఁ బోలుచున్. 76

వాలికకన్నులున్ వలుదవక్షువచన్నులుఁ దీయమోవులున్
నీలవురంగులం దెగడ నేర్చినకొప్పులు నిండుచందురుం
బోలిన ముద్దుమోములును బుత్తడిబొమ్మల గెల్చువ్యానిక్కిం
జాలినమేనులున్ గలుగు సాధ్యసుమధ్యలు పొల్తు రగ్గిరిన్. 77

సమములు గానిపాదములజాడలు వామపదంబు చొప్పనం
దమరినక్రొత్తలత్తుకలయంకములుం గలత న్నగేంద్రకూ
టములు ప్రియంబునం గని కడంక నుతింతురు సిద్ధదంపతుల్
ప్రమథవిభుండు శాంకరియుఁ బాయక యొక్కట నున్నచందముల్.

కిన్నరకామినుల్ పసిఁడికిన్నర లంది యభిన్నరీతులన్
దిన్నని పాటఁ గూర్చి జగతీధర కార్ముకపాణిఁ బాడఁగా
మిన్నక యాలకింపుచు నమేయగతిం బులకించియున్న రే
ఖ న్నగ మొప్పు వజ్రకలికాకలితాఖల సానుభాగ మై. 79

చిగురుజొంపంబుల నిగుడినకెంజాయ
రుచిరజటాచ్ఛటారోచి గాఁగ
కలయంగఁ గప్పినకమ్మవుప్పొడిదుమ్ము
పొలుపొందు భసితంపుఁబూఁత గాఁగ
పోలుచుఁ బూఁదేనెఁ గ్రోలురోలంబబా
లిక లందితాక్షమాలికలు గాఁగ
తఱచుకొమ్మలవెంటఁ దగిలి ప్రాఁకిన నవ్య
లత లహిభూషణతతులు గాఁగ

గీ. ఇసుక చల్లిన రాలక పసరుడాలు
నాకు దళసరిహస్తి చర్మాంబరముగ
నలరి సాక్షాత్కరించినహరునిఁ బోలి
పాదుకొనియుండు నక్కొండఁ బాదపములు. 80

సీ. వరయోగశక్తి శంకరు మనఃపద్మంబు
పైఁ జేర్చి మోదించు పాశుపతులు
హరసమారాధనాయత్తులై సందడి
గా విహారము సల్పు దేవముఖ్యు
లఖిలదర్శనములయందు నిందుధరుండె
పరతత్త్వ మని చూచు పరమమునులు
నిటలలోచనుని తొల్లిటి విజయాంకంబు
లమరఁ బాడుచు నాడు ప్రమథవరులు

గీ. పావడంబులు గెల్చి ప్రాభవము దాల్చి
భవుని సారూప్యమున నుండు భక్తజనులఁ
గలిగి జగదేకకల్యాణ కరవిభూతి
లక్షణంబుల మించుఁ గైలాసశిఖరి. 81

చ. గుహగణమాతృకావళులు కుంజరవక్త్రుఁడు భృంగియున్ మహా
మహిమయుతుండు నందియు సమంచితభక్తిసమృద్ధిఁ గొల్వ న
య్యహివలయుండు శంభుఁడు హిమాద్రిసుతారమణుండు తద్గిరిన్
రహి వహియించియుండు సురరాజముఖామరపూజితాంఘ్రియై.

క. చిగురులఁ గ్రొవ్విరిగుత్తుల
నగజాధిపుఁ బూజసేయ నరుదెంచె ననన్
దగి యొక్కకాలమున నా
జగతీధరవనములన్ వసంతము దోఁచెన్ 83

సీ. భవుఁ గొల్చువారలపాతకంబులరీతి
రమణఁ గారాకులు రాలెఁ దరులఁ
భార్వతీక్షతిమీఁదఁ బ్రాఙ్ఞుల కనురాగ
మనుబోలె నిగురెత్తె భూరుహములు
నీశానభక్తులయిండ్ల సంపదలీలఁ
గలయంగ ననుచుట గలిగెఁ జెట్ల
శశిమౌళిదాసుల సంకల్పములభంగి
ఫలియించె సందంద పాదపములు

గీ. సకలపాదపవికసిత స్వచ్ఛగుచ్ఛ
సాంద్రమకరందరస సమాస్వాద మోదిత
మత్తమధుకర శేగీయమాన మగుచు
మించి మధుమాస మావిర్భవించె నపుడు. 84

క. కుసుమితరక్తాశోక
ప్రసక్తిచేఁ బొలువుమిగులు బంధురగణముల్
కుసుమాయుధ [ప్రేమసరా?]
గ్నిసముత్థిత ధూమవితతికిని బోలికయై. 85

గీ. బాలచంద్రకళాకలాపమునఁ బోల్చి
గిమియఁ గరితోలు నెమ్మనఁ గప్పుకొన్న
హరుని నడకించె మొగ్గల నతికయిల్లి
నీలరుచి మీఱు మునిధారుణీరుహములు. 86

క. కురువిందకమ్మఁదీఁగెలు
సరవిం దము పనఁగి పెనఁగ సహకారంబుల్
గిరివరతనయాలింగిత
హరమూర్తిం దలఁపఁజేసె నామనివేళన్. 87

వ. ఇవ్విధంబునఁ జిగురులకుం జిగియును, గ్రొన్ననలకుం జెన్నును, విరులకు మురిపెమ్మును, బిందెలకు నందమ్మును, గాయలకు సోయగంబును, దోరలకు గౌరవంబును, బండులకు మెండును గలిగించి వలాయిత హేమంతంబుగ వసంతం బయ్యె నయ్యెడ. 88

ఉ. చల్లనిగాడ్పులన్ సొబగు చల్లెడు వెన్నెలఁ బువ్వుఁదావులన్
బల్లవవిభ్రమస్ఫురణఁ బ్రౌఢపికాళికుకాలివల్కులన్
బల్లిదుఁ డైనయట్టిగణభర్త భవానియుఁ దాను వేడ్క వ
ర్ధిల్లఁగ నెల్లచోట విహరింపఁగ నొప్పె సఖీపరీతుఁడై. 89

సీ. కలకంఠకులకుహూకారాంతరము లైన
మావిమోకలజాడ మరలి మరలి
సొలయు నెత్తావులు చోడుముట్టెడు పువ్వుఁ
బొదరిండ్ల నెలవులఁ బొదలి పొదలి
అలిబాలికామనోహరఝంక్రియలఁ బొల్చు
దీర్ఘికాతటములఁ దిరిగి తిరిగి
మకరందపంకిలమంజుమార్గంబుల
నీడల నీడల కేఁగి యేఁగి

గీ. చంద్రికాధౌతనిర్మల చంద్రకాంత
నిచితనవపుష్పశయ్యల నిలిచి నిలిచి
కలికిబాగునఁ బొదలలోఁ గలసి తిరిగి
రటుల దంపతు లావనాభ్యంతరమున. 90

క. విరులం బుప్పొడి రేఁపుచుఁ
దరఁగలు గదలించి కొలఁకు తండంబులలోఁ
దిరుగుచు మందసమీరణ
మరయుచు మురిపెమునఁ దిరిగె నభవునిమీఁదన్. 91

సీ. కమల కర్ణికలు బంగారంపుదుద్దుల
మురువు నూపఁగఁ గర్ణములఁ ఘటించి
పొగడఁ జోటగుకమ్మ పొగడపూవులచీరఁ
గమనీయముగఁ గూర్చి కటి సమర్చి
సింధువారశ్రేణి సీమంతవీథికి
సొబగుముత్యాలచేర్చుక్కఁ జేసి
పొలుపొందుపూఁదేనెఁ బోసి మేదించిన
పొన్నక్రొవ్విరుల పుప్పొడి యలంది

గీ. కలయ నవతంపు మెఱుఁగులు దొలుకరించు
చంపకావలి పతకంబుసరణిఁ జూపి
శంకరుఁడు పార్వతికి నిట్లు సలిపి వేడ్క
శంబరారాతిమదిలోనిశంక యుడిపె. 92

ఉ. అల్లన మావికొమ్మచిగురాకు నిజాంచితచంచుధారచేఁ
జిల్లులు పుచ్చి తద్రసవిశేషము నాలుక సోఁకఁ జొక్కుచున్
ద్రుళ్లుపికంబుఁ జూడు మని ధూర్జటి చూపినఁ జూచి పార్వతీ
హల్లకగంధి వంచె వదనాబ్జము కన్నుల నవ్వు దేరఁగాన్. 93

సీ. తరుణశశాంకశేఖరమరాళమునకు
సారగంభీరకాసార మగుచు
కైలాసగిరినాథకలకంఠభర్తకుఁ
గోమరారు లేమావికొమ్మ యగుచు
సురలోకవాహినీధరషట్పదమునకుఁ
బ్రాతరుద్బుద్ధకంజాత మగుచు
రాజరాజప్రియరాజకీరమునకు
మానితపంజరస్థాన మగుచు

గీ. సురగవల్లభహార మయూరమునకుఁ
జెన్ను మిన్నంటిన [illegible]ధరశిఖర మగుచు

లలితసౌభాగ్యలక్షణలక్షితాంగి
యద్రినందన వొల్చె విహారవేళ. 94

క. అలకాంతకలితముఖ యగు
కులకాంతయుఁ దానుఁ గూడి గోపతిగమనుం
డలకాంతక కలధౌతా
చలకాంతస్థలులఁ గ్రీడ సలుపుచు నుండెన్. 95

వ. ఇట్లు సాక్షాత్కరించిన పంచశరు సామ్రాజ్యలక్ష్మియుంబోలెఁ బ్రేక్షణీయ యగు దాక్షాయణిం గూడి క్రీడాపరాయణుండై నారాయణసఖుం డఖండితానంద కందళిత హృదయారవిందుండై యుండు నవసరంబున, 96

సీ. తేటవెన్నెలమించుఁ దెలిచిరా జనిపించు
నకలంకహారవల్లికలతోడ
తేవఁ గాంతుల వెల్లుగా వసంతము చల్లు
కటకాంగద కిరీటకములతోడ
తివుట సత్తావుల దిక్కుగుతావుల
నలమి వాసించుమాల్యములతోడ
ప్రకటితంబుగఁ జూపులకు విస్మయముఁ జూపు
రమణీయ చిత్రవస్త్రములతోడ

గీ. ప్రమదసల్లాప కోలాహలములతోడఁ
గాంతు లొలుకంగఁ దోడసిరాఁ జెంతరాలు
పుష్పాదులతోడ గంధర్వముఖ్యు లటకు
నురువిమానంబు లెక్కి వచ్చిరి ప్రియమున, 97

ఉ. పాశ్చ్యము గాని నేమమునఁ బోఁడిమికిం దము యుద్భ్వ ధాతము
న్నిచ్చినతద్వరస్ఫురణ నచ్చటఁ గోరఁ గోరి యింత లేక క
న్నిచ్చకు వచ్చినట్టుల చరించెడువారలు గాన వారు వా
రచ్చటఁ గేలికై నిలిచి రాజ్యవిమానము లౌరి డగ్గుచున్. 98

క. ఇది రజతాచల మిందున్
మదనారి వసించు విబుధమాసిత మని నె
మ్మదిఁ దలఁపక గంధర్వులు
తదద్రిపై విడిసి రథికదర్పం బెసఁగన్. 99

క. గంధర్వులు మోహనమృదు
గాంధర్వము గలుగు పుష్పగంధులతో గ
ర్వాంధత నీప్సితమతి కలి
బంధురులై తన్నగేంద్రపాదస్థలులన్. 100

సీ. కాంచీకలాపంబు కటిమండలముమీఁద
నొక్కింత సడలినఁ జక్క నిలిపి
వలుదపాలిండ్లఁ గేవల జాటి వెలిగొన్న
యాణిముత్తెములపై రనువుపఱిచి
కలికిచెక్కులమీఁదఁ దొలఁకరించిన ఘర్మ
జలకణంబులఁ గొంతు లొలుకఁ దుడిచి
రాలువుష్పొడి ధూసరము లైన చూర్ణాల
కంబులు కొనగోళ్ళఁ గలయ దువ్వి

గీ. అతులపుష్పావచయఘనాయాస ముడుగ
నంకపీఠిక శాంకరి నావరించు
త్రిపురమర్దను పుష్పమంటపసమీప
వసుధ నిలిచిరి గంధర్వవధ్వు లంత. 101

చ. చిలుకలకొల్కు లైన సరసీరుహనేత్రలఁ గూడి వేడుకన్
గొలకొలమంచుఁ దక్షచరకోటులు వ్రాలుడు నందికేశ్వరుం
డలికవిలోచనానుచరుఁ డద్భుతమై దివి నిండఁ బర్వత
త్కలకల మొర్వఁజాలక యఖండితరోషకషాయితాత్ముఁడై. 103

ఉ. భీకరరేఖతోఁ బసిఁడిబెత్తముఁ ద్రిప్పుచు ఘర్మబిందుజా
లాకరమౌ మొగంబు తరుణారుణతేజము లీనఁ గన్నులు
ల్కాకళలన్ జ్వలింపఁ దమకంబున శంకరుపువ్వుటింటి య
వ్వాకిట నిల్చి యిట్లనియె వారలతోఁ ద్వరమాణవాణియై. 103

క. చీకులరె మీర ? లీశుఁడు
లోకేశ్వరుఁ డీవనం (బులో నీశ్వరితో)
నేకాంతంబున నుండఁగ
నీకాంతలు మీరు వచ్చు టిది తగ వగునే. 104

క. అని తము నిరసించిన నం
దినిఁ జీరికిఁ గొనక వారు దిగ్గన మౌర్ఖ్యం
బునఁ బువ్వుఁజప్పరము డా
సిన నవ్విధ మాత్మ నెఱిఁగి శివుఁడు కుపితుఁడై). 105

గీ. వులుఁ గరంబునఁ బూని మీరలు పిశాచ
రూపమున నుండుఁ డని నైవ రూపరేఖ
దప్పి వికటాంగు లైరి గంధర్వనాథు
లెంతవారికిఁ దప్పునే యీశ్వరాజ్ఞ ? 106

క. ఆయందము లాచందము
లాయ(ద్భుతరూపరే)ఖ లామంజు సుధా
ప్రాయోక్తులు మిడివోయెను
గాయజహరు కినుకకతన గంధర్వులకున్. 107

క కోఅకును బోవం బడిక
ల్లులుక వయిం బడినకరణి నొకవనికై రా
నులుమునిపిడుగై వారి(కిఁ
గటకంఠునిచేత) నీచగతి వాటిల్లెన్. 108

గీ. చంప నలిగియు నొక్కింత చలము మాని
విషమనయనుండు పులి నాకి విడిచినట్లు
చావుతోఁడుత జోడైన చటులఘోర
కష్టరూపంబు వారికిఁ గలుగఁజేయు. 109

సీ. ఎఱసంజ కెంజాయ నెక్కసక్కెంబాడు
చికిచికివల్ల వెండ్రుకలవారు
గమకంబులగు గచ్చకాయలఁ దలఁపించు
క్రూరంబు లగుమిట్టగ్రుడ్లవారు
ముడిబొమ్మలును బెద్దమిడిగ్రుడ్లు వెడఁ గోర
దాడలు గల్గువక్త్రములవారు
పెనుబీరసరములు పెనఁగి పైఁ బ్రాకుటఁ
గనుపట్టుపొట్ట పొంకములవారు
గీ. కుఱుచలగు హస్తపాదముల్ గుదియఁ బొడిచి
నట్లు బలసిన మెడలతో నరయ నూచ
లైనయూరులతో వికటాంగు లైన
వారు నై రిట్లు గంధర్వవరులు పెలుచ. 110

చ. పెదవుల నెత్తు రుండియును బేడులువారు బరళ్ళ మేనులన్
గదిశి పిశంగరోమములు గ్రమ్ముకొనన్ నిశితోగ్రదంష్ట్రలన్
జెదరినవిస్ఫులింగములు చిందఱవందఱ గాఁగ రూపముల్
మదనవిరోధి శాపమున మార్పడియెన్ ఖచరేంద్ర పంక్తికిన్. 111

మ. చటులోదగ్రతరాట్టహాసములుఁ గేశచ్ఛన్నఘోరాస్యముల్
కుటిలక్రూరవిలోచనంబులు మెఱుంగుల్ గ్రాయుపూత్కారముల్
పటుభీమోద్భట దంతపీడనము లస్పష్టాంగసంధుల్ మహా
ఘటపీనోన్నత కుక్షిభస్త్రికలు వేగం దాల్చి రాఖేచరుల్. 112

వ. మఱియు భల్లూకవల్లభుల నుల్లసంబాడెడు నల్లజుంజులు మేనులును, దప్తారకూట చ్ఛాయాదాయాదంబు లగుపిశంగాంగంబులును, మంకెన క్రొవ్విరుల బింకంబు హుంకరించు కెంపు సంపాదించు పాడవుగల యొడళ్ళును గలిగి కిలకిలభాషణంబులుం, గహకహట్టహాసంబులును, ధళధళద్దంష్ట్రాంకురంబులును, ధగద్ధగ త్ప్రేక్షణంబులుం గనుపట్ట నెక్కడ యసృక్పానం బెక్కడ మాంసభక్షణం బెక్కడ మేదోలేపనం బెక్కడ కపాలధారణం బనుచుఁ గోరిక లీరికలెత్తఁ జిత్తంబులు మత్తిల్లి సందడింపుచుఁ గ్రందుకొను పిశాచబృందంబులఁ జూచి డెందంబునం గొందలం బంది తదధినాథుం డగు చిత్రరథుండు. 113

సీ. కలికినీలపురంగుఁ దులకించుకచములు
వల్లవెండ్రుక లైన బ్రమసి బ్రమసి
నిండుజవ్వనముచే గండుమీఱినమేను
విశలభావం బైన వెఱచి వెఱచి
కమనీయ మణిహారకటకకంఠిక లెల్ల
నాంత్రబంధము లైన నలికి యలికి
యెల్లదిక్కులఁ దావి చల్లుగందపుఁబూఁత
మెదడుచందం బైన బెదరి బెదరి

గీ. కటిపటము వచ్చితోలైనఁ గలఁగి కలఁగి
యవ్విధం బెల్ల హరుచేత యగుట దెలిసి
యభవునకు మ్రొక్కి లేచి యిట్లనియె భక్తి
భయము లోనగూడ నూపిరి పట్టి యపుడు. 114

ఉ. ఓపరమప్రభావ! పురుహూతముఖామరవంద్య! మేము నీ
పాపలవంటివారము; కృపాపరతంత్రత దక్కి యక్కటా
మాపయి ని ట్లనుగ్రహము మానుటయే మఱి యింతమాత్రలోఁ
గోపము మానుమయ్య! యిఁక గోపతికేతన! దైత్యశాసనా!

సీ. తలఁప వైతివె కాలఁ దాఁచి పై నుమిసిన
యెఱుకమాలినయట్టి యెఱుకువాని
ధృతిఁ జిత్తమున మానితివె టాలుగొని యువ్వ
సాంఖ్యతోండఁడు సేయుసాహసంబు
చింతింపవైతివె చేవ వింటను బెట్టు
గొన్న కుంతీదేవి కొడుకుఁగుజ్జు
ఊహింపవైతివె యుగ్రధాటీచల
చ్ఛేరమక్షితిపతి చేతిగాసి

గీ. అకట నీబంటుబంటుల మైనమమ్ము
నొక్కతప్పును సైరింప కఱక ఘోర
శాపదావానలంబున సగముచావు
చంపితివి చాలు నిఁకఁ బ్రోవు చంద్రజూట. 116

చ. నెఱయఁగ లోకపూజ్యుఁ డగు నీచెలికానిఁ గుబేరుఁ గొల్చి మే
ముఱక వికారభావమున నొందుట నీకుఁ గొఱంత గాన యి
ట్లెఱుఁగక మందెమేలమున నే మొనరించినతప్పు గాచి యం
దఱఁ గరుణారసాబ్ధిఁ బరితాపము మానఁగఁ దేల్చు శంకరా. 117

గీ. మృత్యుదేవత యోర్వదు మిహిరతనయుఁ
డోర్వఁ డిభదైత్యనాయకుఁ డోర్వఁ డెందుఁ
ద్రిపురదానవు లోర్వరు తీవ్ర మయిన
నీదుకినుకకు నే మెంత నీలకంఠ! 118

క. కలుషించి తేల తృణక
ల్పుల మగుమామీఁదఁ గరుణ వోనాడి! కటా!
బలుదెగఁ గొని బ్రహ్మాస్త్రం
బిలఁ బిచ్చుకమీఁదఁ బూని యేయఁగఁ దగునే? 119

వ. అని యనేక ప్రకారంబుల సకరుణంబుగాఁ బ్రార్థింపుచుఁ బ్రణతుం
డైన గంధర్వాధ్యక్షుమీఁదం గృపాకటాక్ష వీక్షణామృతంబు
వొలయ దాక్షాయణీవల్లభుం డిట్లనియె 120

క. ఓహో వగ యుడుగుఁడు మీ
సాహసమున నింతపుట్టె శాపావధి కే
మూహించి తెరువుఁ జెప్పెద
మీహైన్యముఁ గొంత యోర్వుఁడీ ధైర్యమునన్. 121

సీ. అనిన నార్యావర్త మను దేశమున లోక
మానిత వైభవస్థాన మగుచు
నమరు రెండవ కాశియై వల్లకీనామ
మునఁ గల్గి యొకమహాపురము దాని
రుద్రభూమిఁ జేర్వ రుద్ధార్కశశిమండ
లం బగు నొక్క వటంబు వొల్చు
నావృక్షమున నీవు సానుచరుండవై
ధృతి నుండు మొకనూఱు దివ్యసమలు

గీ. అంత హాయనములు గొన్ని యరుగువిదవ
రాజకులరత్నమై ముంజభోజుఁ డనఁగ
రాజు జనియించు నుద్భటారాధ్యశిష్యుఁ
డై మదంశంబు గొని యందు నతులమహిమ. 122

క. నాయంశంబునఁ గలిగెడి
యాయవనీపతికిఁ గూర్మి నాచార్యకమున్
జేయు స్మన్మానసుతుఁ
డై యుద్భట గురువరేణ్యుఁ డధికప్రీతిన్. 123

ఉ. ఆగురుమూర్తి కాలగతి నందుడుఁ దత్తనుధూమయుక్తిచే
వేగ భవన్మహావికృతవేషము లన్నియు మాని పూర్వకే

ఖాగరిమంబుఁ దాల్చుటయు కాదు మదీయగణాధినాథతా
యోగము గల్గి నాకడన యుండెద రేఁగుఁడు భూతధాత్రికిన్. 124

సీ. శివలింగధారణాంచితమూర్తు లగువార
లష్టాంగయోగజ్ఞు లైనవార
లరసి న న్నఖిలంబునందుఁ గన్గొనువార
లాప్త పంచాక్షరు లైనవార
లెడసిన మద్ధర్మ మీడేర్చి మనువార
లంతర్విరోధుల నడంచువార
లసమతాపత్రయం బార్పఁ జాలినవార
లేన దైవం బని యెఱుఁగువార

గీ. లర్హ వర్తనములఁ గూడి యలరువార
లెవ్వ రిల నుందురు వార లెల్ల మీకు
దుర్లభులు గాన వారల ద్రోవఁ బోకుఁ
డన్యజనములఁ గారింపుఁ డరుగుఁ డీరు. 125

క. శివశోణితపానాదిక
మవు కుత్సిత భోగ మెల్ల నతులసుధా పా
నవిశేషము నకు నవతుగ
భువి మత్కృపచేతఁ గలుగుఁ బొం డిఁక వేగన్. 126

వ. "ప్రారబ్ధ కర్మాణాం భోగాదేవక్షయ" యనువాక్యం బనుభ
వింపక తెగదు కావున నిందునకుం గొందలం బంద వలవదు. కాల
క్షేపంబు సేయక మదుపదిష్టంబగు మార్గంబున శాపావధిం గాంచి
మదీయ సాలోక్యంబున నుండెదరు. పొం డని కుండలి మండ
లేశ్వర కుండలుండు కొండరాచూలితో నంతర్ధానంబు నొందెఁ
బిశాచబృందంబులు నమ్మహాదేవు నాదరంబునం గొంత సంతా
పంబు వాసెఁ దదనంతరంబ. 127

మ. భవకోపోద్ధత శాపఘోరవదనభ్రాంతంబులై ఖేచర
ప్రవరాంభోధర బృందముల్ కహకహాప్రస్ఫీతగర్జామహా
రవముల్ దిక్కులఁ బిక్కటిల్ల నటఁ జేరన్వచ్చెఁ గాత్యాయనీ
ధవనిర్దిష్టవటావనీరుహ నగోత్తాలాగ్రవాసార్థమై. 128

మత్త. ఆవనస్పతియాకుఁ దండమునందు నూడలు మొత్తమై
జీవురంచు నభోగ్రవీథులఁ జిమ్మచీఁకటిఁ గప్పుడున్
ద్రోవగానక తత్తఱింపుచుఁ దోయజాప్తతురంగముల్
పోవు నవ్వలఁ ద్రోచి యంకియుఁ బూని నూతుఁ డదల్చినన్. 129

క. ఆయుగము బహుళతర శా
ఖాయత చాలనము కలిమి నవని భరింపన్
జేయోడు దిశాకరులకుఁ
జే యిచ్చువిధంబుఁ దోఁపఁ జెలువు వహించున్. 130

గీ. ఇట్లు దిశలెల్లఁ దానయై యెసక మెసఁగు
నమ్మహీరుహవరము డాయంగ వచ్చెఁ
దీఁగెతెంపుగ రజతాద్రి దిక్కునందు
నుండి ఖేచరమిథునంబు లొక్క మొగిని. 131

క. తొల్లిటి పుణ్యానుభవము
చెల్లిన దివినుండి మహికి జిరజిరమనుచున్
ద్రెళ్లెడి పురుషుల కైవడి
నల్లాసం బేది శాఖ కొరగిరి ఖచరుల్. 132

సీ. రా రక్తలోచన! రమ్ము ఘంటాకర్ణ!
రా వ్యాఘ్రనఖ! యిందు రమ్ము వికట
రా సరీసృపరోమ! రా స్థూలనాసిక
రమ్ము కుంభశిరస్క! రా వృకాస్య!

రమ్ము విద్యుజ్జిహ్వ రమ్మాంత్రమేఖల
రా మహోదర ! వేగ రా మృతాసి
రా వజ్రదంష్ట్రి రా రా విస్ఫులింగాక్ష
రా బాలఘాతుక ! రా విరూప !

గీ. రమ్ము కుంభాండ ! రమ్ము నిర్ఘాతఘోష
రమ్ము సుప్తఘ్న ! రమ్ము కర్కశ శిరోజ
యనుచు బహువిధనామంబు లమర నిలిచి
రావటంబున ఖేచరు లావటముగ. 133

మ. అలకాచైత్రరథాంతికస్థిత మణివ్యాకీర్ణ కేళీనగం
బులపైఁ బూవుల చప్పరంబులకడన్ బుష్పాళ్ళతో నైనవే
దులఁ గూర్చుండి మిటారికత్తె లగునింతు ల్వాడ మోదించువా
రలకా యీదురవస్థ ? దైవగతిఁ దీర్పన్ శక్యమే యేరికిన్ ? 134

సీ. వాసవద్రుమమున వడసిననురఁ గ్రోలు
కడఁక నెత్తురు లానుకతన మఱచి
వరఁగుసాంబ్రాణి ధూపంబు వాసన మెచ్చు
టలు శవధూమంబు వొలయ మఱచి
హరిచందనముఁ జాల నలఁది శేవఁ జరించు
పోడిమి మెదడు పైఁ బూసి మఱచి
వీణానినాదంబు వీనుల నాలించు
పని భూత కహకహధ్వనుల మఱచి

గీ. హరసఖోపవనాశోక తరులమురువుఁ
జూడఁగోరుట చితివహ్నిఁ జూచి మఱచి
వాలువర్గము గాఁగ నవ్వాటముఁ జేరి
ఖచరు లొకకొన్ని సమములు గడపి రందు. 135

మ. వడఁతుల్ దారు నదృశ్యులై నడికిరే ల్వా[1]రాడి గంధర్వులె
క్కడ రుద్రాక్షయు భూతియుం దొఱఁగుమూర్ఖవ్రాతముల్ గల్గున
క్కడికిం బోయి తదీయబాలకుల జోక న్వారు వే పోయి పె
న్బడుముల్ గైకొని తృప్తిఁ జెందుదురు దౌర్భాగ్యంబె
యోగ్యంబుగన్. 136

సీ. తలలపైఁ బచ్చపూసలు కండతిండియు
భీషణదగ్ధాస్థిభూషణములు
శూలాగ్రనరకంఠశోణితాస్వాదంబు
బిలసంస్థశిశుశిరఃపలలసేవ
నవ్యకంకాళదండములు చేపట్టుట
యురక నల్గడఁ జిచ్చు లుమియుటయును
బలితంపుఁ బ్రేవుల మొలనూలి చేఁతయుఁ
గిలకిలయును బొబ్బనులివురవణి
గీ. కొరవిమసిబొట్టు పురి యలకోఱలందు
నింగలం బిడి రాజించు టెబ్బ్రగుడ్లు
మిడుఁగుఱులు గ్రమ్మఁ ద్రిప్పుచుఁ బుడమి మింట
బ్రమరివాఱుటయును బిశాచముల కొదవె. 137

గీ. చిత్రసౌభాగ్యశాలియై చిత్రరథ స
మాఖ్య నలకాపురములోన సౌఖ్యలబ్ధిఁ
దనరు గంధర్వపతి వజ్రదంష్ట్రుఁ డనఁగ
వటముపై నుండె భూతభావము భజించి. 138

క. ఆ మట్టియ యలకాపురి
గా మది నూహించి ఖచరగణము లోఁగి నిజ
స్వామి యగు వజ్రదంష్ట్రుఁడు
దాము ను వర్తించు నివ్విధమున శివాజ్ఞన్. 139

1. చాడి. పా. అం.

క. చెల్లుబడి వజ్రదంష్ట్రుఁడు
ప్రల్లదమున సకలభూతబలముల కెల్లన్
వల్లభుఁడై తన కిల్లా
కెల్లగఁ జెల్లింపుచుండె హేలాగతులన్. 140

గీ. ఓలి నెనిమిదిదిశల కొక్కొక్కదిశకు
నలువురును నల్వురును గాఁగనలఘు బలుఁ
దలవరుల ముప్పదిరువుర నెలవుకొలిపి
ధరఁ బిశాచాధిపత్య మాతఁడు వహించె. 141

శా. త్రాట న్నీట విషంబునన్ శిఖ నిజప్రాణంబులన్ బాసి వ
మ్మాటన్ ఘోరపిశాచరూపమున హైన్యంబొందు త న్మర్త్యసం
ఘాటం[1]బందునఁ గొల్వుపట్టుటకునై కైకొల్వునానాదిశా
[2]పాటివ్యాప్తనిజాజ్ఞుఁడై చెడనికేవన్ వజ్రదంష్ట్రిం డొగిన్.

వ. మఱియు నతం డాతపతాపంబున జీవితంబు వోవిడిచియు, నిర్ఘాత
ఘాతంబున మృతి వడసియు, సింహశార్దూల కుంభీనస వృశ్చి
కాదులచేత నీలిగియు, జిహ్వోత్పాటనంబున జీవితోత్పాటనంబు
సేసియు, సానువులం దేనియుఁ బ్రాణంబు లుజ్జగించియుఁ
గాంతా నిమిత్తంబున నంతంబుఁ గనియును, నిరశనత్వంబున
బంచత్వంబు నొందియు, శూలంబునం గూలి కాలవశతఁ
బొందియు, వెండియు నానావిధదుర్మరణంబులను దుష్కర్మంబు
లను బట్టువడియు, పుట్టగతిలేక భూత ప్రేత పిశాచ రూపంబులం
జావలంబునం గ్రుమ్మరు నమ్మనుజులం గలపికొని వర్తించి
వర్తించి. 143

చ. కొలిచిన యప్పిశాచములఁ గూరిమి నిట్లను వజ్రదంష్ట్రిఁ డీ
రలు భయ మింక మానుఁడు ధరాస్థలిఁ బుట్ట గలందు భూరిని

---

1. ఖంవ, 2. వాట. పా. అం.

ర్మలయశుఁ డుద్భటుండు గురుమండల కుండల కుండలుండుఁ ద
న్మలహరమూర్తి కారణమునన్ గతి మీఁకును మాకుఁ గల్గెడిన్.

క. [అనివలికి వజ్రదంష్ట్రుఁడు
మనమున నెలకొన్న భీతి మలుగఁగ నోదా
ర్చెను మట్టినీడ నాశా
జనక వచనరచన నా పిశాచగణములన్.] (144-ఏ)

సీ. వెఱవనివారల వెఱపించి వనిగొని
కొలిచినవారిపైఁ గూర్మి చూపి
శివచిహ్నదూరుల చిత్తంబు లగలించి
కలహించువారిసీమలు హరించి
యధినాథునాజ్ఞ దిగంతరంబుల నించి
తగులునంతర్విరోధంబు లుడిపి
తరతమభావంబు లరసి జీవిత మిచ్చి
నిజమండలము పెంచు నేర్పుఁ గాంచి

ఆ. దానభేదసామదండంబు లనఁ గల్గు
చతురుపాయవిధులజాడఁ దెలిసి
సరిపిశాచలోక సామ్రాజ్య మొదవించి
వజ్రదంష్ట్రుమంత్రి వజ్రముఖుఁడు. 145

సీ. కొలువుండు నొకవేళఁ గుణపశిల్పోపల
కీలితోన్నత కేలి శైలశిఖల
విహరించు నొకవేళఁ గహకహధ్వనులతో
దడము లొక్కటఁ గొల్వ నడికిరేల
వినుఁ బ్రేమ నొకవేళ వీనుల కింపైన
కూశ్మాండగాయక కులముపాట

దండెత్తు నొకవేళ దర్పితబేతాళ
మండలంబులమీఁదఁ జండదాడిఁ

గీ. బనుచు నొకవేళఁ బతువులు తనకుఁ దిరుగఁ
బడినవారలసంపద నొడిచికొనఁగ
భూనభోంతరసంచరద్భూతలోక
దండనోదగ్రుఁడగు వజ్రదంష్ట్రిఁ డెలమి 146

గీ. సకలభూతాధినాథుఁడై జగతిమించు
విజయమునఁ గ్రాలు తద్భూతవిభునిఁ జేరి
బ్రహ్మరాక్షసు లత్యంత భయముతోడ
రమణఁ దీవింతు రార్ద్రాక్షతములు చల్లి 147

క. ఈ చందంబున ఖచరపి
శాచనిశాచరము లిష్టసంచారములన్
నీచగతిఁ బైకొను వసు
ధాచక్రమునందుఁ గలయఁ దత్కాలమునన్. 148

సీ. శ్రీకంధరాచలోర్జిత సముజ్జ్వలకూట
సంకాశవిధుకాంత సౌధకులము
శాతమన్యవశిలా శకలదామజధామ
కల్పిత [1]కారండ కారభరము
చంద్రశాలా శరచ్చంద్ర బింబాననా
తారహారీ భవత్తారకంబు
వితతగవాక్ష నిర్గత నవాగరుధూప
సౌరభవాసితాశాముఖంబు

గీ. విమలపరిఘాజలాంతర వికచకుముద
కమలకల్హార కింజల్క కలితలలిత

1. గాఢాంధ. పా. అం.

గంధవహాధూత రతిఖేద కాముకంబు
గోపురోపమ మగుపల్లకీపురంబు. 149

సీ. శ్రీసముల్లాసంబు చెలఁగు నాయందును
దనయందె కల దనఁ దగదు సుమ్ము
సంతతార్యాసక్తి సాగు నాయందును
దనయందె కల దనఁ దగదు సుమ్ము
వృషలాలనఖ్యాతి వెలయు నాయందును
దనయందె కల దనఁ దగదు సుమ్ము
రాజ[1]భూషణకేళి ప్రబలు నాయందును
దనయందె కల దనఁ దగదు సుమ్ము

గీ. తాన సేనానిగలవాఁడు గాని యేను
గా ననఁగఁబోల దమితసేనాని యేను
ననుచు నప్పురి హరుపై నహంకరించు
హర్మ్య కేతనకింకిణీ కారవముల. 150

మ. వలదింద్రోపల ఖండదీధితులశేవల్ కంఠహాలాహలం
బులు సున్నంబులు భూతి వెల్లవడగల్ మూర్ధస్థిత స్వర్ధునీ
జలపూరంబులు లోనఁ గ్రుమ్మరుసతుల్ సాఁబాలు మైఁగొన్నయా
యలరుంబోఁడులయొప్పునై తగుఁ బురిన్ హర్మ్యేశ్వరశ్రేణికిన్.

ఉ. కేతువు నీట ముంచి తమకించి ధనుర్లత మళ్ళఁబెట్టి వి
ఖ్యాతబలంబుఁ జెట్టులను గట్టి గుణంబునఁ గల్గువత్తముల్
వే[2] తెరలించి యంవగమి వేశుకమూలకుఁ ద్రోచి యమ్మనో
జాతుఁడు తత్పురిం గలుగు శైవులపైఁ జన లోఁగు నెంతయున్.

గీ. అతిమనోహర గుణవిశాలాక్షి యగుచు
నిత్య శివసంవిధానసంస్తుత్య యగుచు

---

1. పోషణ. 2. తరలించి. పా. అం.

సమరవాహినిగంటిదియు నై తలంప
నమ్మహాపురి శ్రీకాళి యనఁగ వెలయు. 153

సీ. కడఁగి దీవించి యక్షతలు పైఁ జల్లి వ
ట్టిన ప్రాఁకు లిగురుపట్టింతు రనఁగఁ
ప్రతిఘటించిన బ్రహ్మపట్టంబుఁ దిగఁద్రోచి
యేకపూరిపై సృష్టియునుతురనఁగఁ
ప్రౌఢవాదక్రీడ ఫణిలోకపతినైనఁ
బొ[1] త్తిఁ గన్నులు గప్పివుత్తు రనఁగఁ
త్రినయనుఁడే దైవ మని రహస్యస్థితి
నిగమంబులకుఁ దెల్ప నేర్తు రనఁగ

గీ. సఫల వాక్సిద్ధి బ్రహ్మవర్చససమృద్ధి
శబ్దపరిశుద్ధి శివదత్త శాంతబుద్ధి
తార తముఁ బోలఁదగుఁ గాక తత్పురంబు
బ్రాహ్మణులఁ బోల వ్యాససంభవునివశమె. 154

ఉ. ఆడినమాట బొంకని మహామహు లర్థికి సంగరార్థికిన్
మాడలు వేల్పువీటఁ గలమాడుగులుం గనిపించు నేర్పరుల్
క్రోడపకచ్ఛ పేంద్రకులగోత్రవిభుల్ జయవెట్ట ధారుణిన్
గ్రీడలపోలెఁ దాల్చు కృతకృత్యులు రాజకుమారు లప్పురిన్. 155

గీ. ధనసమృద్ధుల ధననాథు తాత లనఁగ
వర్తకంబునఁ గీర్తిప్రవర్తు లనఁగ
నమృతలాభంబు లోభంబు నపనయించి
వీటఁ బొగడొందఁగలరు కిరాతపతులు. 156

శా. చూడాభూషణరత్నమై వెలయుచున్ శ్రుత్యుత్తమాంగంబులన్
జూడంగాఁ దగువిష్ణుపాదమునకున్ నూనుల్బలోద్భాసితుల్

1. బత్తి. ప్రా... [illegible]

తోడంబుట్టువు లభ్రగంగకు మఱందుల్ పాలమున్నీటికిన్
బ్రోడల్ కీర్తి ధనార్జనంబునఁ బురిన్ బొల్పారుశూద్రోత్తముల్,

మ. పవిలీలన్ బహుధారలన్ మురియుచున్ బద్మాత్మచందంబునన్
భువనస్తుత్యసుదర్శనోదయముచేఁ బొల్పొందుచున్ వార్ధి రే
ఖవలద్వాహినిచొచ్చు నేర్పుఁ గొనుచున్ గర్వంబుఁ గాంచున్ బురిన్
బవనాఖ్యేయజవంబులైన హయముల్ భవ్యప్రచారంబులై, 158

ఉ. రాజగృహంబులట్లు బహురాజితకక్ష్యల మించి వాహినీ
రాజియుఁ బోలెఁ బద్మనికరంబులఁ బెంపు వహించి విశ్వధా
త్రీజనవంద్య విప్రులగతిన్ మహనీయపదక్రమంబులన్
దేజముఁ గాంచు నప్పురి సుదీర్ఘబలాఢ్య కరిప్రకాండముల్, 159

గీ. చక్రసంపత్తి వాహినీసమితిఁ బోలి
ప్రథిత యగుయుక్తిఁ గా విభ్రమముఁ దాల్చి
యతిమాలానదాసక్తి యతుల మీఱి
నగరమునఁ జూడ నొప్పు నున్నత రథములు, 160

ఉ. మింతురు సత్త్వసంపద సమీరకుమారకుమారముఖ్యులన్
నింతురు కీర్తి నల్గడల నిల్కడఁ బొంది రణాగ్రవీథులన్
గాంతురు వీరధర్మ మతిగర్వితపర్వత వజ్రపాణులై
సంతత మానుషోదయ విచారులు శూరులు తత్పురంబునన్, 161

సీ. ఇవి కావు నీలంబు లివి కావు తుమ్మెద
లవియుఁగా వివి కుటిలాలకంబు
లిందుని బింబంబు లివి గావు నెత్తమ్ము
లవియుఁ గా వివి మోహనాననంబు
లిభకుంభపాళిక లివి గావు జక్కవ
లవియుఁగా వివి మెఱుఁగారు చన్ను

లించువిత్తునిదొన లివికావు కాహాళ
లవియుఁగా వివి జంఘు లరసిచూడ

గీ. ననుచు జనములు సంశయం బధిగమింప
ముదముకతమున విడివడ్డ మదనురాణి
ముద్దురాచిల్క బోదల మురువు చూపి
భామినులు మింతు రమ్మహాపట్టణమున. 162

చ. సిరులకుఁ బుట్టినిల్లు వరసీమ నిరంతర భోగసిద్ధికిన్
శరణము ధర్మనిర్వృతికి జాడ మహార్థ విహారలీలకున్
బరిసర మాగమంబులకుఁ బంషితవంక్తికి నిల్వనీడ త
త్పురము తదీశ్వరుం డమరుఁ బుణ్యుఁడు శ్రీప్రమథేశ్వరుం డిలన్.

ఉ. ఆయతబాహువుల్ వెడఁదయై కనుపట్టు భుజాంతరంబునున్
గాయజుఁ గ్రేణిసేయు నవకంబగు చక్కఁదనంబు గల్గు ల
క్ష్మీస్మయుతమూర్తియుం జనులచిత్తములం గరఁగింప నొప్పు నా
గాయుతసత్త్వశాలి తుహినాంశుకులోద్భవుఁ డాతఁ డున్నతిన్.164

చ. కువలయరక్షకుండు బుధకోటికిఁ బ్రాణవదంబు పార్వతీ
ధవునకుఁ బువ్వుదండ యమృతంబుల పెన్నిధి దుగ్ధవార్ధి సం
భవుఁ డిటువంటిరాజు కులభర్తగఁ దేజముగన్న యన్నృప
ప్రవరునిఁ బ్రస్తుతింప నహిరాజునకైనఁ దరంబె యిమ్మహిన్.165

సీ. చపలతరేంద్రి యాశ్వముల శంకరపాద
కమలంబు లను సాహిణములఁ గట్టి
తాపత్రయాభీల దావానలస్ఫూర్తి
విలసిత విజ్ఞానదృష్టి నడఁచి
యకలంకకీర్తి చంద్రికల లోకాలోక
గుహాలకుఁ దెలివి నూల్కొనఁగఁ జేసి

చటుల ప్రతాపాంకుశము శత్రురాజన్య
కరిశిరస్స్థలులపై నిరవుకొలిపి

గీ. వలికి బొంకక గుణముల వెలితిగాక
నడక సడలక యడిగిన గడుసువడక
యన్యాయాచార మెడలక యాదిశైవ
లక్షణంబుల నాధరాధ్యక్షుఁ డమరు. 166

మ. తన జిహ్వాంచలరంగమధ్యమున విద్యానర్తకీరత్న మిం
పున నర్తింపఁ గరాంబుజంబున మరుద్భూజంబు చూపట్టఁ జూ
పునఁ జింతామణి విశ్రమింప వినయంబున్ విక్రమంబున్ జగ
ద్వినుతౌదార్యము బాహువీర్యమును జెందెన్ రాజు రాజత్ప్రభన్.

చ. భరత భగీరథాంగ గయ భార్గవరామ యయాతిముఖ్య భూ
వరచరితానుపాలన మవశ్యము తెల్లమిగాఁగ భూవ్రజం
గురుభుజశక్తికల్మి ననుకూలముగా జనకుండువోలె సు
స్థిరముగ నేలు నైదువదిసేయఁ డతండు రణాగ్రవీథులన్. 168

ఉ. కానిక రాజధర్మ మని గైకొను లోభమువూని కాదు శి
క్షానియమంబునన్ రిపులఁ గాంచు విరోధముఁ దాల్చి కాదు రా
జ్యానుసమానముద్రకు బలావలి నేలు భయంబుఁ బొంది కా
దానరనాథ చంద్రుఁడు మహాద్భుత మాతని వర్తనం బిలన్. 169

సీ. కలికాయుధుఁడు స్వాతిఁ గురియించు వానలు
పైరులు ముక్కారుపంటఁ బండు
పురుషాయుషమ్మును బూర్ణమై గరివోదు
నడవడి చక్కనై నడచుఁ బ్రజకు
ధర్మంబు నాల్గుపాదంబుల వర్తించుఁ
గలుషంబునకు నెడ గలుగ దింత

ధరమీఁద గనులు రత్నంబు[1]లుధరియించు
రవళి ధేనువులు చ న్నవిసి పితుకు

గీ. నామయవ్యాప్తి యొక్కింతయైన లేమి
జిజ్జుమని చీఁద రెవ్వారు చిత్రకలన
సోమ వంశాబ్ధి పరిపూర్ణ సోముఁ డయిన
యా నృపాగ్రణి సేయు రాజ్యంబునందు. 170

గీ. చూచు శుద్ధాత్మవీథిలో సోమధరునిఁ
గాంచు శరణన్న మాత్రలోఁ గడిఁదివగఱఁ
ద్రోచుఁ గలిదోష మెచ్చట దొరలకుండఁ
బ్రోచు నారాజు జయవెట్ట భూమిప్రజల. 171

మ. అలకైలాసమునందు హేమమయ కూటాగ్రంబులన్ రత్న ని
ర్మలపీఠంబుల నిల్చి పార్శ్వములఁ బ్రేమన్ వల్లభుల్ తోడుగాఁ
గలరాగంబుగ మేళవించి కడు వేడ్కన్ సిద్ధకాంతామణుల్
శిల లెల్లన్ గరఁగంగఁ బాడుదురు సంశీలించి తత్కీర్తులన్. 172

సీ. కట్టింపఁ డేలకో కటి ని రింగులువాఱ
మెఱుఁగుటొల్లి యగాఁగ మొకముతోలు
సవరింపఁ డేలకో శంఖతుల్యగ్రీవ
వదనంబు నూలుగాఁ బాఁవఁజేని
నెలకొల్పఁ డేలకో నిటలభాగమునఁ గా
శ్మీరబిందువుగాఁగఁ జిట్లుఁగన్ను
ఘటియింపఁ డేలకో కలికిచుక్కలరాజుఁ
దలమీఁద మల్లికాకళిక గాఁగ

గీ. నలఁదఁ డేలకొ నెమ్మేన నంగరాగ
విలసనము చూప వలపుల వెల్లవూఁత

1. లఫలియించు. పా. తు.

యఖిల లక్షణ రేఖల నరసిచూడ
నాదిరుద్రుండు గాఁడె యీ యవనివిభుఁడు. 173

క. రుద్రాక్షఖచిత భూషా
ముద్రాంగుఁడు శివగుణోక్తి ముఖరిత ముఖుఁ డు
న్నిద్రభసితాంగ రాగుఁడు
కద్రూసుతకటక విభుఁడు ఘనుఁ డతఁ డలరున్. 174

ఉ. పూర్వభవంబునన్ హరునిపూజకుఁ బత్త్రి దే హుటాహుటిన్
బర్వతకోటులం దిరుగఁ బ్రస్తరఘాతము చేత నెత్తురుల్
పర్వఁటఁజేసి యన్నృపతి పాదపయోజము లప్డు సర్వదృ
క్పర్వము లయ్యె నమ్రనరపాల కిరీటమణీ మరీచులన్. 175

సీ. తిలయుతాక్షతల దూర్వలఁ దుమ్మిపువ్వులఁ
బిల్వదళంబుల బిసరుహములఁ
గలువల బొండుమల్లెల నాగకేసరం
బుల దవనంబునఁ దులసి మాచి
పత్త్రిఁ జేమంతి బంతి నారగ్వధం
బులఁ గాంచనంబులఁ బొన్నవిరుల
మరువంపుననలఁ గన్నెరులఁ బలాశ ప్ర
సవముల జాజులఁ జంపకముల

గీ. సాంద్ర ఘనసారమయ గంధసారచర్చ
ధూపముల దీపముల ఫలాపూపపాయ
సాదులను దుష్టి గావించు నతఁడు మంత్ర
పూత జలధౌత మూర్తికి భూతపతికి. 176

సీ. అంత్యజుండును విరూపాక్షుఁ గాఁడనువానిఁ
జూచును బొడవుర్వుఁ జూచినట్లు

వసిబాలకుఁడు వేడ్కఁ భాషణమ్ములఁ గూడఁ
బెట్టు నీశ్వరుగుడి గట్ట ననుచు
నతిదరిద్రుండు శైవారాధనమునకు
బాదపెట్టు ప్రాణంబుఁ గుదువపెట్టి
అఖిలదూషకుఁడైన నాహార మొల్లఁడు
భసితంబు నొసలిపైఁ బ్రామికాని

గీ. గొల్లవాఁడును శివకథాగోష్ఠిఁ గొంత
ప్రొద్దుపుచ్చును గడుభక్తిఁ బొలములోన
సకలశివభక్త మకుటాగ్ర జాతిరత్న
మతఁడు పాలించుధారుణియందు నెల్ల. 177

సీ. ముగ్ధచంద్ర కిరీటుమూర్తి వీక్షింపని
ఖలుని వీక్షింపఁడు కన్ను విచ్చి
వృషభేంద్ర వాహను విమలచారిత్రంబు
వలుకనిజడుతోడఁ బలుకఁ డర్థి
హరునర్చనావేళ నంటఁగాననినీచు
నంటఁడు కల గాంచునవసరమునఁ
బురవైరి మానసాంభోజకర్ణికఁ గూర్పఁ
దలఁపని కష్టాత్ముఁ దలఁపఁ గోరఁ

గీ. డంబికానాథు నగరికి నరుగనట్టి
భాగ్యహీనుల భవనంబువజ్జ నరుగఁ
డఖిలశైవరహస్య సిద్ధాంతవేది
వరమనిర్మల గుణవార్ధి పార్థివుండు. 178

చ. జడధులు మేరగాఁ గల రసావలయంబు నిజాంసపీఠిపై
నిడి ప్రమథేశ్వరుండు ప్రమథేశ్వరతుల్యుఁడు వృద్ధిఁబొందుచోఁ
బుడిసెఁడునీళ్ళఁ బూన నొకపువ్వు నెఱుంగని పాడుగుళ్ళలో
మృదులతఁ గన్గెఁ గుంకుమవిమిశ్రితనీరము రత్నహారముల్. 179

సీ. క్రోధాదిరిపుల మార్కొన లోనఁ దలపోయుఁ
దలపోయుఁ బ్రభుశక్తి బలము వెలిని
అష్టాంగ యోగవిద్యల లోనఁ దలపోయుఁ
దలపోయు సత్కీర్తి చెలువు వెలిని
మనసు శంకరుఁ గూర్చి మన లోనఁ దలపోయుఁ
దలపోయు ధరఁ బేరునిలుప వెలిని
చపలేంద్రియముల శిక్షకులోనఁ దలపోయుఁ
దలపోయు ఖలులఁ బోఁదఱుమ వెలిని
గీ. లోనఁ దలపోయు భవములు మానుపూన్కి
వెలిని దలపోయు లోభంబు వీడనాడ
నౌర! సాక్షాత్కరించిన యాదిరుద్రుఁ
డఖిలరాజర్షి మార్తాండుఁ డవ్విభుండు. 180

ఉ. కుండలి సార్వభౌమ కృతకుండలకృత్యు నుమాశశత్రుఁ బ్ర
హ్మాండము లోన గల్గిన చరాచరరాసులయందుఁ బూర్ణుఁడై
యుండ నెఱింగి యానృపతి యొత్తినశత్రుల దుశ్చరిత్రులన్
గండడగించుచున్ గరుణ గైకొని దూఱును రాజధర్మమున్. 181

సీ. చివికిన విధి శిరశ్శ్రేణిఁ దాల్చుట మాని
బెడఁగైన విరిదండ ముడువఁ గోరి
తూలిపోయిన పులితోలుఁ గట్టుట మాని
గట్టి కెంబట్టును గట్టఁగోరి
వేమాఱుఁ బితృవనభూమి నుండుట మాని
నురుసౌధములలోన నుండఁ గోరి
జవముమాలిన జరద్గవము నెక్కుట మాని
హయసమూహము నెక్కి యాడఁ గోరి
గీ. నగముమగరాపు మాని లక్షణసమగ్ర
పుంవపుస్స్ఫూర్తి నిరతంబుఁ బూనఁ గోరి

రాజమూర్తి వహించిన రాజమౌళిఁ
బోలి పొలుపొందె నమ్మహీపాలవరుఁడు. 182

మ. జగదేకస్తవనీయుఁ డానృపతి యీ చందంబునన్ ధాత్రి మె
చ్చఁగఁ బాలింపుచు నున్నకాలమున నక్షుద్రానుకంపాన్వితం
బగు చిత్తంబునఁ జిత్తజారి నిజశాపాయత్తు లౌ ఖేచరేం
ద్రగణాధ్యక్షులఁ బ్రోవఁగాఁ దలఁచె నంతం దత్ప్రసాదంబునన్.

ఉ. కోమలచంద్రరేఖ గలకొప్పును ఫాలవిలోచనంబుఁ బెన్
బాముసరంబుచే నమరు బంధురకంధరముం దలంపులన్
గామవికారముల్ నిలుపుగంధము గల్గి రయోకందు పుట్టె జ్యో
త్స్నామహిమాస్పదంబు లగు సాంద్రవతనప్రభ లుల్లసిల్లఁగాన్. 184

క. అద్భుతముగ నీకై వడి
నుద్భవముం బొంది యున్న యురువుణ్యుని నో
యుద్భట! యిటు రా రమ్మని
సద్భణితులఁ జేరఁ బిలిచె శంభుఁడు గరుణన్. 185

చ. పిలిచిన నుద్భటుండు పురభేదను పాదవరోజ యుగ్మముం
దిలకవిభూతిచే మిగులఁ దీండ్ర వహింపఁగ మ్రొక్కి వల్కు నం
జలియుతుఁడై తదంతిక రసాస్థలి నిల్చి వ నేమి దేవ! యె
వ్వలనికిఁ బోవఁగావలయు వారక నన్బనివంపు నావుడున్. 186

గీ. జలధరధ్వాననిభ మైన యెలుఁగురవళి
తారగిరిసానువునఁ బ్రతిధ్వనులు నూవఁ
బుణ్యచారిత్రు మానసపుత్త్రుఁ జూచి
యర్ధచంద్రకిరీటుఁ డి ట్లనియెఁ బ్రేమ. 187

చ. విను మనఘాత్మ! మున్ ఖచరవీరులు గొందఱు కుంది నాకు పైఁ
వనిక్రియఁ బ్రమ్మి నం గినిసి వల్కితి వారిఁ బిశాచులార! పొం

దని యిటులన్న మాత్ర నె మహాశనిపాతమువోలె వారలం
గొనముని(గించె నావలుకు కుత్సితరూపులుగాఁగఁ జేయుచున్.

క. తలఁచని తలపై యీ క్రియ
నలమినమచ్ఛాపవాక్యహతిఁ బీడితులై
యులికిపడి ఖచరవీరులు
వల నొండొక టిందుఁ గననివా రగుకతనన్. 189

ఉ. కన్నుల బాష్పముల్ దొరఁగఁగా గుమిగూడుకవచ్చి మ్రొక్కి యో
పన్నగరాజభూషణ కృపావరతంత్ర కటాక్ష! మమ్ము నా
పన్నుల ఖిన్నులన్ దెలివివాసినవారలఁ గావు శాంతిసం
పన్నుఁడ వింత కిన్క మదిఁ బర్పితి వంచును నన్ను దూఱుడున్.

క. ఏనును గరుణారసమున
నూనిన డెందంబుతోడ నోడకుఁ డని యీ
దీనుల ధైర్యాధీనులఁ
గా నూఱడఁ బల్కి శాపగతి మరలింపన్. 191

వ. ఒక్క యుపాయాంతరంబుఁ దలపోసి యిట్లంటి. 192

సీ. గంధర్వులార! యాకర్ణింపుఁడీ మత్కృ
తంబుఁ దప్పింపఁ దరంబె యేరి
కది యట్లు నుండె మీయతివినయస్ఫూర్తి
కాత్మ మెచ్చితి దైన్య మవనయింపుఁ
డవని నార్యావర్త మను దేశమున వల్ల
కీసోమవిఖ్యాత మైనపురము
పొలుచుఁ దత్పురరుద్రభూమిచేరువ నొక్క
వట మున్న దందు సంవత్సరములు
గీ. దేవపరిమాణమున నూఱు దీఱఁ ద్రోయుఁ
డంత నామూర్తియగు నుద్భటాహ్వయుండు.

గురువరేణ్యుండు గలుగుఁ దద్గుణవయోధి
కతన మీాయిట్టి దురవస్థ గడచుఁ బొందు. 193

ఉ. నా విని నన్ను పీడ్కొని పునఃపునరానతు లాచరింపుచున్
దేవగణంబు లేఁగె నతిదీనములై వటశాఖ నుండఁగాఁ;
బో వెస నీవు భూస్థలికిఁ బోయి మదీరిత వాక్యపద్ధతిన్
శ్రీవిభవాభిరాములుగఁ జేయుము తత్ఖచరాధినాథులన్. 194

సీ. కెంజాయ జడలపైఁ గీలుకొల్పిన చిన్ని
నెలవంక శీతవెన్నెలలు గాయఁ
గుండలీకృత మహా కుండలీశ్వరు ఫణా
మణికాంతి మోముఁదామర నెలర్ప
విపులవక్షఃపీఠి విధిశిరోన్వితమైన
వనమాలికావల్లి గునిసియాడఁ
గటిసీమఁ గట్టిన కఱకు బెబ్బులితోలు
మెఱుఁగు లాశావీథి గిటికొనంగ

గీ. వలుదశూలంబు డమరువు నలికనేత్ర
మాదియగు చిహ్నములు దాల్చి యలరు నన్నుఁ
బోలి యీలోకమున నుండి పొలుపు గానఁ
గలరు నీదుకతంబున ఖచరులనఘ! 195

మ. సకలాశాముఖముల్ సమగ్రరుచులన్ సంఛన్నముల్ చేసి మి
న్నక లీలాసమమైన యిట్టిబలుమేనన్ ధాత్రి నీ వుండఁగా
దకలంకోదయ యుండితేని జను లత్యంతంబు భీతిల్ల సా
రెకు నిల్వోపరు గాన మానుషవపుశ్శ్రీఁ జెంది పొమ్మిమ్ములన్. 196

క. సంసారయోగివై పర
హింసకు లోనీక వసుధ కేఁగియు జీవో

త్తంసుండ వగుచు దిక్కుల
మూంగల సత్కీర్తిఁ దెలుపుమా గురుముఖ్యా. 197

క. నావచన మార్గమునఁ జని
పావనమతి పూని భూతపరివృఢు లగు త
ద్దేవకుల మాననీయులఁ
బ్రోవుము ప్రమథేశుఁ డేలుపురి వల్లకిలోన్. 198

మ. చతురాశావధికుంభికుంభ విలుఠచ్ఛాత ప్రతాపాంకుశుం
డతఁ డంభోనిధివేష్టితాఖిల మహీయఃక్షోణిఁ బాలింపఁ ద
త్ప్రతివీరప్రమదాకపోలతలముల్ ప్రాపించుఁ గస్తూరికా
యతనానావిధ పత్రభంగముల మారై స్రస్తకేశచ్ఛటల్. 199

గీ. అట్టి ప్రమథేశ్వరుని కూర్మిపట్టి యైన
ముంజ భోజాహ్వయుఁడు రాజకుంజరుండు
నీకుఁ బ్రియశిష్యుఁడై కీర్తి నివ్వటిల్ల
సాధుసాలోక్యలక్ష్మిఁ జెందంగఁ గలఁడు. 200

ఉ. గోపతి నెక్కి మంచుమల కూఁతురితో నిట యున్కి మాని నే
నేపుఁ గాఁపురంబు వసియింపుదు నా ముదిగొండపట్టణం
బో పురుషాగ్రగణ్య భవదుత్తమ వంశజులుం దపోధన
శ్రీవులు నైనధీరులకుఁ బ్రేమపదం బగు ధామ మయ్యెడిన్. 201

సీ. నిఖిల శైవారాధ్య నేతృత్వమహిమచేఁ
బరఁగుచు గురుసార్వభౌము లనఁగ
దుర్మతధ్వంసబంధురు లౌచుఁ బ్రతివాది
జనభయంకర యశస్సాంద్రు లనఁగ
షట్కాల శంభుపూజా పరాయణవృత్తి
జరుపుచు గురురాయశరభు లనఁగఁ

గొలుచువారికి నిష్టఫలదులై నిజశిష్య
బహుళ దారిద్ర్యవిఘాళు లనఁగ
గీ. నన్ను సర్వంబునందుఁ గానంగఁజాలు
ఘనత చేపట్టి వేదమార్గప్రతిష్ఠ
బదిలు లననుండుదు రు భవద్భావివంశ
జాతు లాచార్య ముఖ్యులు చారుచరిత. 202

సీ. ప్రతివాది వేదండ పంచాననంబులు
నిజధర్మపాలన నిపుణమతులు
కలిలోననైన నవ్వులకైన భవి యగు
మాధు నీక్షింపని గాఢయశులు
షట్కాలముల నన్ను శాస్త్రోక్తమార్గంబు
చే సమారాధించు శిష్టమూర్తు
లిది సుఖ మిది దుఃఖ మిది నాయ దిది వాని
దని విభేదంబు సేయనిమహాత్ము
గీ. లొరుల ధనదాతలకు నింతయును మనమున
నచ్చుతలఁ చని నిత్య పుణ్యాభిరాము
లర్థి ముదిగొండ పురవరాధ్యక్షు లగుచు
వెలయఁగల రింక మీవారు విమలచరిత !. 203

గీ. ఖచరవరులను రక్షింపఁ గలుగుఁ గీర్తి !
వలదు తడ వింకఁ జేయ నోయలఘుమూర్తి !
పావనముసేయు పాదసంస్పర్శనమునఁ
గలువయుత మైన వసుమతీతలము నెల్ల. 204

ఆశ్వాసాంతము

శా. ధీవిస్ఫూర్తి పయోజ సంభవ భవానీ [1]సంస్తవోచ్చారణ
ప్రావీణ్య క్షమభావ ! భావభవదూరస్వాంత రాజీవ రా

---

1. ధీన. పా. అం.

జీవాంభోరుహ కుంభ చామర ముఖస్నిగ్ధస్ఫురద్భాగ్య రే
ఖావళ్యంకితపాద ! పాదనఖశోభాస్ఫోటి తోడుప్రభా ! 205

క. విద్వజ్జన చింతామణి !
విద్విట్కుల హృదయ భయద విజయాంక ! ప్రతీ
పద్వీపభూపదత్త జ
గద్వినుత సమస్త వస్తు గర్భిత ధామా ! 206

మాలిని. త్రిపురమథన పాదాధిష్ఠితధ్యాన ! వేదా
ర్థపరిచయ పవిత్రోదగ్ర జిహ్వాగ్ర ! మిత్రో
డుపతినయన శౌర్యాటోప నిర్నిద్ర ధైర్యా
ప్తిపరిచితనిజాంగా ! ధీవరీతాంతరంగా ! 207

గద్యము

ఇది శ్రీమదేలేశ్వర గురువరేణ్య చరణారవింద షట్చరణసకలకళాభరణ
రామనార్యసుపుత్త్రి సుకవిజనమిత్ర కుమారభారతి
బిరుదాభిరామ రామలింగయ ప్రణీతం బైన
శ్రీమ దుద్భటారాధ్య చరిత్రం బను
మహాప్రబంధంబునందు
ప్రథమాశ్వాసము

శ్రీ



శ్రీ

# ఉద్భటారాధ్య చరిత్రము

## ద్వితీయాశ్వాసము



నగజాధిపచరణ
ౕనసుధానుభవలోల ! దర్పవిదూరా !
ు సముదీప్తి ! భాసుర
త్యా ! అన్నమంత్రి దేచామాత్యా ! 1

ర్ణంపుము. 2

పలుకంగఁ వా వినతుఁడై తగ మాఱు వచించి వేడ్క చెం
సది వాఁడు వేగఁ జనుదెంచె ధరిత్రి కదృశ్యమూర్తియై
మున శంకరుండు తను మన్ననఁ జేరఁగఁబిల్చి యవ్వ డా
ఘనవాక్య వైఖరికి డింపనిహర్షము నూలుకొల్పుచున్. 3

ంపార [దువ్వీన ఘనకేశ పాశం]బు
గముకమై యువటుభాగమున [వేల
ాక్షమయ హేమరూషి కుండలకాంతి
నిద్దంపుఁ జెక్కుల ముద్దుగురియ
లించి తాల్చిన జన్నిదంబుల[రేఖ
యుత్తరీ]యస్ఫూర్తిఁ బొత్తుదొడుకఁ
ఘటించిన నీరు [కావి దోవతి] పింజ
కడకొన్న మోఁకాళ్లు కప్పిదూల

గీ. నొసలి భసితంబు ముఖలక్ష్మి బసలుసేయ
రసన తుదయందుఁ బంచాక్షరంబు గ్రాల
[రాజ సత]యును బ్రహ్మవర్చసము గలిగి
యుద్భటుం డీశ్వరాకృతి నుర్వి నిల్చెఁ. 4

క. హరునాజ్ఞఁ జేసి ప్రమథులు
వరవిప్రాకృతులు దాల్చి వర్ణక్రమముల్
పరితశ్రుతిముఖులై వ
చ్చిరి ధర శగ్గురునివజ్జ శిష్యత్వమునన్. 5

సీ. పరమతంబులు పేరువట్టినఁ దెరలించి
శైవాగమంబులు జాడవఱిచి
ఇందు శేఖరతత్త్వ మెఱుఁగక దైవతాం
తరలగ్నులగువారి తెరువు లుడిపి
యెందు శంకరుతీర్థ మెఱఁగు నచ్చటి కేఁగి
మతిమంతులకు మహామహిమ దెలిపి
శాంతుఁడై లోన విశ్వాసంబు గల్గిన
సచ్ఛిష్యునకు మంత్రసరణి చూపి

గీ. స్నానదానాదివిధులఁ బ్రసూనబాణ
దమనునకుఁ దుష్టిగావించు ధన్యమతులఁ
గలసి వర్తించి మఱిపెక్కు గతుల నవనిఁ
బ్రబలి విహరించు నుద్భటారాధ్యవరుఁడు. 6

క. పరుసము సోఁకిన లోహము
వెరవారఁగ హేమమైనవిధమున నా స
ద్గురువరుని మహిమకతమున
వరశుభ సంపన్నులైరి వసుధాజనముల్. 7

సీ. భాస్కరుఁడు చీఁకటుల్ పటాపంచు గాఁగాఁ
గిరణమాలికచేఁ దోలుకరణి మోవ
నమ్మహాభాగుఁ డద్రిజా ప్రాణనాథ
కథల దురితంబు లన్నియు గనుపుగొట్టె. 8

మ. స్ఫురితజ్ఞానవిధాన మాగురుకులాంభోరాశి చంద్రుండు శం
కరుఁడై తాఁ దనుఁ గొల్చువారికి నమోఘశ్రీ విశేషంబులం
దారకంజేయుచు ధాత్రినుండు[నెడ] దోడ్తోఁ గించిదూనంబుగా
హరశాపాబ్దచయంబుఁ ద్రోచిరి కుబేరాప్తుల్ పిశాచాకృతిన్. 9

గీ. ఎన్నఁ డుద్భటుఁ డిలఁ బుట్టు నెన్నఁ డిట్టి
కలుపదుర్దశ దిగఁద్రోయుఁ గరుణ [గలిగి
యని యెవుడ దురి]దురెచూచు నప్పిశాచ
పతులపాటులు గడతేర్ప నతఁడు గలిగె. 10

ఉ. తత్సమయంబునన్ ధవళధామకిరీట పదాబ్జభక్తి సం
పత్సుఖవేది రాజకులమండనుఁ డాప్రమథేశ్వరుండు భూ
భృత్సుతవోలె భద్రములఁ బేర్చి ప్రభావతి నామధేయయా
వత్స నృపాలపుత్త్రి తగువల్లభ గా విలసిల్లె పల్లకిన్. 11

గీ. పద్మినీవల్లభునకును బ్రభయుఁబోలెఁ
గువలయాధీశునకు [నుగల్పవలె నాకు
శుక్షణికి నర్పిభంగి నాక్షోణిపతికి]
నగుచుఁ బొల్చుఁ బ్రభావతీహరిణనేత్ర. 12

మ. అలిపోతంబులు చంద్రలేఖ మరువిండ్లుందంబు ముత్తెంపుఁజి
ప్పలు నూఁబువ్వను శ్రీలు శంఖము లతల్ భద్రేభ రాట్కుంభముల్
జలదావ్యంబు తరంగముల్ సుడి తమస్సారంబు చక్రంబు రం
భలు తూణీరము లబ్జముల్ మదిఁ దలరవం గాంత కాంతాంగముల్.

గీ. అఖిలజగ దేకమోహిని యగుచు [నావి
శాల మీన ప్రతీకాశ] లోలనేత్రి
తనకు నర్ధాంగలక్ష్మిగా ధర్మమార్గ
మునఁ బ్రవర్తించు నమ్మహీభుజుఁడు ప్రీతి. 14

క. ప్రాలేయకిరణముఖి యగు
బాలామణిఁ గూడి ప్రమథపాలాభుఁడు భూ
పాలా[గ్రగణ్యుఁ డాతఁ డ
నాలో]లమనస్కుఁ డయ్యె యౌవనవేళన్. 15

క. కలిమి సురూపముఁ బ్రాయముఁ
గలిగియుఁ గలకంఠిపొందు గలిగియు లోనన్
గలుగంగనీఁడు దుర్మద
మల హాయ [శతశక్తి] నృపకులాగ్రణి యెందున్. 16

చ. పరమపవిత్రయై తగుప్రభావతి తోడుత నిష్టభోగముల్
బొరయుచు నేలనల్లడలు పూని నిజాజ్ఞకు లోనుజేయుచున్
హరుఁ దరుణేందుమౌళి భువనాధిపుఁ భక్తి భజించు నన్నరే
శ్వరునకుఁ గల్గదయ్యె సుతసంపద సంపదకెల్లఁ బ్రోదియై. 17

క. సుతలాభమ్మునకుం దగ
క్షితిపతి చింతించి తనదు సీమంతినితోఁ
జతురత నిట్లను నొకనాఁ
డతుల రహస్యైకగోష్ఠి ననుకూలుండై. 18

ఉ. ఏలితి నేలనల్లడ లహీనబలంబున వైరివీరులన్
దోలితి భూమిభృద్గుహలు దూఱ మనోంబుజకర్ణికాస్థలిన్
గీలనచేసితిన్ వృషభకేతనుపాదము లింతి! యీశుభ
శ్రీలకుఁ దోడు నందనుల జెన్ను గనుంగొను టెంతభాగ్యమో. 19

గా. గలుగ ల్లంచను గాళ్ళయందియలు వల్కం జెక్కులన్ ముద్దికా
యలతళ్కుల్ గరువంపుచూపు నిటలవ్యాకీర్ణ లంబాలకం
బులతో ముద్దులు చిల్కుచుం గలవచఃపూర్ణాస్యుఁడై తప్పట
డ్గులు వెట్టంగలపుత్త్రుఁ డబ్బినొకో నాకు న్నిక లోలేక్షణా. 20

వారణవాజిపధూవసు
వారాత్మక మైనరాజ్య వైభవ మిది దా
నౌరసుఁడు లేనికతమునఁ
జారుముఖి ! యెన్న లేని సస్యము కాదే. 21

పుత్రముఖ వీక్షణంబునఁ బొదలుసుఖము
పూర్ణ(?)తలనిండ నర్థంబు పోసినపుడు
కలుగ దిట్టి విశేషంబుఁ గాంచువార
లెంత భాగ్యంబు చేసినా రిందువదన !. 22

అని చింతింపుచు నున్న ప్రాణవిభు నయ్యబ్జాక్షి వీక్షించి యి
ట్లను రాజన్యకులావతంస ! నగధైర్యా ! యార్యసంస్తుత్య ! నీ
కును జింతాభర మేల యింతవనికై గోరాజకేతుండు దా
మనపాలన్ సురశాఖియై సకలసంప్రాప్తి నూల్కొల్పఁగన్. 23

మిన్నేటితలనీటి మించుకెంజడలపై
నెలవంక బొదివి వెన్నెలలు గొలువ
విపుల హాలాహల విషమషీకృతముద్ర
మృగనాభిరేఖయై మెడఁ దలిర్ప
పవనాశనాధీశ [పదకముద్రుచి] గల్గి
బాహుమధ్యంబునఁ బరిఢవిల్ల
వలుమొగంబుల పొరువలుద పుక్కలపేరు
చుట్టిన చేపోటు ముట్టువెలుఁగ

]

గీ. గంటఁ దిగిచిన గందంపుఁ గమ్మఁదావి
పొలుపు పర్యంత భూజముల బుగులుకొనఁగఁ
గొండరాచూలితో నొక్క-కుత్తుకయిన
వేల్పుఁ గొల్చినఁగల్గు సంకల్పసిద్ధి. 24

సీ. ఎలదోఁటలోపల మొలచుఁ గల్పకములు
నిచ్చలుఁ గనుసన్న నిలుచు సురభి
సిద్ధరసంబు సంసిద్ధమౌ నింటిలో
నణిమాదిసిద్ధులు నాజ్ఞ సేయు
నింటివెచ్చము పెట్టు నిందిరాదేవత
తోడ మాటాడు వాగ్దేవి

దండఁ జింతామణి యుండు ముంగొంగునఁ
బసిఁడి చూపట్టి సంపదలు వెంచు

గీ. (గ్రహము లేకా) దశస్థానగతిఫలంబు
నిచ్చుఁ బ్రాపించుఁ గోరిక యెట్టిదైనఁ
జంద్రికాధాము దేవతా సార్వభౌముఁ
గొలుచు శుద్ధాత్ములకు మహీతల మహేంద్ర ! 25

వ. ... ... వల్లభుఁడు వర్షాపవనస్పర్శనంబునఁ గోరకించిన నీప భూరుహంబునుంబోలె హర్షోత్క-వచనంబునం బులకితతను ఫలకుం డయ్యెఁ బ్రభావతియుం బ్రభాతలక్ష్మియుం బోలె వికసిత ముఖారవిందయయ్యె నిట్లు దంపతులు సంప్రాప్త ... ... సంతానులుగాఁ జెలంగి యన్యోన్య వాక్యా మృతంబుల నితరేతర హృదయంబులు పొదలింపుచుఁ గాశికా విభుం గాద్రవేయ ముద్రికా ముద్రిత కరాంగుళికిసలయుం గిసలయ విభాసిపిశంగ జటాధరు ధరశరాసన విజిత విరోధిపురుం బురుష త్రయరూపు నారాధించు తలంపున జగదేక రమ్యంబగు నవి ముక్త క్షేత్రంబునకుం బోవ సమకట్టి రంత నొక్క-నాఁడు. 26

మ. పరభూపాలుర దైన్యముం నిజబలప్రాచుర్యమున్ నిశ్చయిం
చి రసామండలి ధాన్యముం ధనము లక్షీణంబులై యున్కికిన్
బరితోషంబు వహించి మూలనగరిన్ భవ్యాత్ముఁ లం రక్షణ
స్థిరులం జేసి మహీమహేంద్రుఁడు దలంచెన్ గాశికిం బోవఁగన్.

ఆ. అమ్మహీధరుండు ప్రాణేశ్వరియుఁ దాను
హారిశిల్పమైన యరద మెక్కి
విశ్వనాథుపురికి విజయంబు చేసిరి
పుత్త్రికాంక్ష హృదయ మాత్రపడఁగ. 28

చ శ్రవణపుటాభిరామ మృదురావములన్ విలసిల్లి లోచనో
త్సవకరమైన తేరు జలజాతవిలోచనతోడ నెక్కి భూ
భువనవిభుండు వొల్చె మణిపుష్పక మెక్కి వినోదలీలలన్
దవిలి శచీపురందరులు ధారుణిపై విహరించు కైవడిన్. 29

సీ. కమనీయ కల్లోల కలిత ఘనాంభోధి
కడఁగి వేలాకాంతఁ గౌఁగిలించెఁ
బరిమళంబును శీతభావంబుఁ దలచూప
మందగంధవహంబు మలసె దిశల
అతినిర్మలాకారుఁడై వలిమలజేఁడు
చలువమించు దొలంకుచాయ లీనె
గంధర్వభామినీ గాంధర్వములఁ గూడి
సురపుష్పవృష్టియుఁ గురిసె మింట

గీ. వినుతవిలసన శిఖలచేఁ దనరె వహ్ని
యవని సంపూర్ణసౌభాగ్య మావహించెఁ
గాశికాభర్త గౌరీశుఁ గాలకంఠు
నమ్మహీపతి సేవింప నరుగువేళ. 30

గీ. ఇట్లు మందానిలాది సమిద్ధ భద్ర
సూచకంబుల వీక్షించుచుం బ్రభావ
తికి నతిప్రీతిఁ దెలుపుచు ధీరవృత్తి
నా ధరాధీశుఁ డల్లన నరిగె ముందు. 31

గీ. భూరి కైవల్య లక్ష్మికిఁ బుట్టినిల్లు
పరమ విజ్ఞానసిద్ధికిఁ బట్టుఁగొమ్మ
యైన కౌండిన్య నాశ్రమం బధికభక్తి
నరసె నవ్వాడు రవి నిల్చెఁ జరమశిఖరి. 32

చ. మొదలఁ బురందరాశఁ దగ ముట్టితి రాగముతోడఁ బద్మినిన్
బిదపఁ జమత్కరించితివి వేడ్కఁ గరంబులు సాఁచి యింక నన్
బొదువకు మంచు దూఱుచు నపూర్వదిశాంగన కాలఁదాఁచినన్
దదమితయావకద్రవముఁ దాల్చెను నా నినుఁ డొప్పె రక్తిమన్.

చ. ఉదయమునొందె సానులకు నొద్దికఁ బద్మినిఁ దేర్చి తద్గృహం
బదవదసేసెఁ దత్కువలయప్రభఁ దూలిచె నట్టె వారుణిం
దుదిఁ గనె నంచుఁ దన్ జనులు దూలఁగనాడిన నిందయోర్వకో
గాదగాని పశ్చిమాంబునిధిఁ గ్రుంకె సరోరుహమిత్రుఁ డత్తఱిన్.

సీ. పాటలంబులవన్నె తేట మంకెనలబిం
కము......విద్రుమములసొబగు
పద్మరాగంబులపస ప్రియంగుచ్ఛాయ
కుసుమ మొప్పిదము కుంకుమము చెలువు
లత్తుక చెన్ను పల్లవ సముల్లాసంబు
కాశ్మీరజాంగరాగంబు పూఁత
చక్కఁదనంబు హంసముల చంచుస్ఫూర్తి
పటుపలాశ ద్రుమప్రసవకాంతి

గీ. బింబఫల విభవము చందిరంబుఁ దీవి
యాదిగాఁ గల రక్త (పదా)ర్థసమితి
నలువ కేలికి నొకచోట నలమికూ(ర్చ)
ననఁగఁ జెలువొందె నెఱసంజ యపరదిశను. 35

సీ. అంతటఁ జరమ సంధ్యావేళ జనపతి
యరదంబు డిగ్గి సంధ్యార్హ కృత్య
ములు మనం బలరంగఁ గొలనులోపలఁ దీర్చి
పుణ్యంబులకు జన్మ(భూమి యైన
కౌండిన్య) నాశ్రమక్షమఁ గల్గి కనుపట్టు
బహువిశేషములకుఁ బరమహర్ష
మాత్మఁ బెంపెసలార నా నిజాన్వయగురు
నుటజంబు డాయంగ నుచితవృత్తి

గీ. నిందుబింబాస్యతోఁ గూడ నేఁగి తనదు
రాకఁ దగువారిచే మానిలోకమౌళి
రత్నమున కెఱిఁగింప (నా రాజునకును
సమ్ముఖం బిచ్చె నాతండు సంభ్రమమున. 36

చ. కులపతి పాదపద్మములకున్ సతియున్ బతియున్ బ్రణామముల్
దిలకితభక్తిఁ జేయుడు సుధీమణి యమ్ముని యున్ మనోంబుజం
బలఘుతరప్రమోదమయమై విలసిల్లగ వారిఁ బెక్కురీ
తులఁ దగ గారవించి సిరిఁ దోఁచిన దీవన లిచ్చె మెచ్చుగన్. 37

వ. ఇట్లు కమనీయ ప్రభావతియగు ప్రభావతియును సదారాధిత ప్రమథేశ్వరుండగు ప్రమథేశ్వరుండును మానిమండల మాన్యుం డగు కౌండిన్యు నుచితోపచారంబులం బ్రసన్నుం గావించి, రమ్మ హర్షియు రాజర్షికి నాతిథ్యంబొసంగి యుర్వ్యాసనంబునం గూర్చుండ

నియమించి దర్భపాటిత తలంబగు కరకమలంబున వినయైకసారం
బగు తచ్ఛరీరంబు నివురుచు నిట్లనియె. 38

సీ. హెచ్చువచ్చునె పురోహిత ముఖంబున నీకు
శాస్త్రోక్త నిర్మలాచార సరణి ?
ఆరగింతురె వచ్చి యజ్ఞవేళలఁ గోరి
హవిరన్న కబళంబు లమరవరులు ?
శిరసావహింతురె విరులదండయపోలెఁ
బరమండలంబు భూపాలు రాజ్ఞ ?
పురుషాయుషంబు సంపూర్ణమై వర్తింప
నుండునే నెమ్మది నుర్విజనము ?
గీ. స్వాతితోడుతఁ దగిన వర్షంబు గలదె
పంట పండునె ముక్కారు ? పాపకోటి
భయము దూరంబె ? రసవర్గభరిత మగుచు
దుర్గ సముదాయ మమరునే దురితదూర ! 39

ఉ. మానము గల్గి శౌర్యమహిమస్థితి రూఢికినెక్కి తాల్మిలోఁ
బూని గుణానుకూల్యమునఁబొంది నయమ్మునఁ బెంపు దాల్చి నీ
చే ననయంబుఁ బూజ్యగతిఁ (జెంది పరస్పరవైర) మొంతయున్
మానినవారు లిత్తురె సమగ్రజయోన్నతి నీకు భూవరా. 40

ఉ. కూడక వత్తురే బుధులు ? కోరిన వస్తుల కిచ్చి పంపుదే ?
వేడుకమంత్రలక్షణవివేక[ముపాయ చతుష్టయంబు]తోఁ
గూడఁగనిత్తువే ? మనసు కుత్సితమార్గులఁ బ్రోవ నాత్మలోఁ
జూడక కీర్తియుందుదువె సూరిజనంబులచే మహాబలా !, 41

క. అని పెక్కుభంగు లమ్ముని
జనపతి సేమంబు నడక చందంబును నె

మ్మనమూర నడుగ వినయం
బు నయంబును గదురఁ బల్కు భూపతి యతనిన్. 42

ఉ. యుగ్యము లయ్యె నెవ్వనికి నోలిఁ జతుశ్శ్రుతు లట్టివేలుపున్
భోగ్యధినాథకంకణునిఁ బొందుగఁ గొల్చి ప్రభావసిద్ధికిన్
యోగ్యుఁడవై(న నీకరుణ యుండ నృపాలు)రలోన మిక్కిలిన్
భాగ్యము సేసినాఁడ మఱి ప్రాఁతియె సేమము నాకు నెయ్యెడన్.

చ. సకలము భద్రమయ్యె గుణసాగర ! నాకుఁ గొఱంత లేదు ని
న్నొకపని వేఁడుకోర్కినిట కొయ్యన వచ్చితిఁ బ్రొద్దుపోయె నేఁ
టికి నిది యెంతయేనియుఁ గడిందిప్రయత్నము విన్నవింతు మీ
కకుటిలబుద్ధి రేపకడ నంతయు విస్తర వాక్యపద్ధతిన్. 44

చ. అనవుడు నట్ల యౌ ననుచు నమ్మునిభర్త సభార్యుఁడై (మహీ
శున కుచితంబుగాఁ బ్రియము) నూపుడు భూపతియున్
మహర్షి చూ
పిన యుటజంబులోన ధృతిఁ బెంపు వహింపుచుఁ బల్లవాంకశ
య్యను సుఖనిద్రసేసె విమలైందవరోచులు చెల్వుచూపఁగన్. 45

చ. వలపలనైనచీఁకటి ప్రభావరిహీణత దోఁచుతారలున్
గలఁగువిటీ విటోత్కరముఁ గందినచంద్రుఁడు మూతివిచ్చు తే
కులవిలసిల్లు తామరలు గూళ్ళను మేల్కనుపక్షులున్ రుచుల్
వెలిసిన చెందొవల్ గలిగి (వేకువ దాఁ బొడ) నూపె నంతటన్.

చ. తముఁ గనవాయఁ జేయుటకు దాపురమై చనుదెంచు వేఁడిద
య్యములుదది నెత్తికోలు గన రక్కట భీతిలి రంగజాహవ
క్రమము...యం(చు......హాతి) గాఢతరశ్రమ సుప్తకామినీ
రమణుల నవ్వో దీపనికరంబులు పాండువిభామిషంబునన్. 47

క. వరుస కఠినక్షతిం దిన
కరరథ గంధర్వ వదన గళితం బగు నె

త్తురువోలె సాంధ్యరాగము
సురవరదిశ యందుఁ గళుకు సూపెన్ గలయన్. 48

స్రగ్ధర. అంతన్ గాన్పించె నింద్రాయతనదిశ రథాంగార్తిసంహర్త తీవ్ర
ధ్వాంత స్తంబేరమశ్రీదళనబలవిధాదక్షహర్యక్ష మాశా
కాంతాగ్రైవేయ కాంచీకటకమణి విభాగర్వ నిర్వాహకాంశుం
డంతర్లీనావిపత్సా హతజఠర సరోజాళియై హేళి లీలన్. 49

వ. ఆసమయంబున 50

చ. అమలసరోవరంబున నహర్పతి సన్నిభుఁ డాప్రభావతీ
రమణుఁడు నిత్యకృత్యములు రాగముతోడ నొనర్చి శంకరున్
గమలదళంబులన్ దొవలఁ గల్వల నర్చనచేసెఁ జంద్రికా
విమలమరీచి మత్పులిన వేదికపై శివధర్మ వేదియై. 51

ఉ. రాజనకంబె మున్ను మునిరాజ శిఖామణి మేలుకాంచి గం
గాజల పూరమట్లు లఘుకర్ణ ణమా నొకపుణ్యవాహినీ
రాజిత నీర వేణికఁ దిరంబుగఁ గుంకి కృతాహ్నికృత్యుఁడై
రాజకళాధరుం గుధర రాజసుతావిభుఁ గొల్చె వేడుకన్. 52

సీ. పురహర నిర్మాల్య పుష్పాళి తనమోల
శుభ తపఃఫలసిద్ధిసూచకముగఁ
జేరి యధ్యయనంబు చేయు శిష్యులఘోష
మలఘు గాంభీరాబ్ధియులివుఁ బోల
జలబిందువుల్ దాల్చుజడలు ముక్తాయుక్త
విద్రుమద్రుమ లతాముద్రఁ దెలుప
మానిత స్ఫటికాక్షమాలిక చేఁబడ్డ
హరకథాసారార్థ గరిమ గాఁగ

బ్రహ్మవర్చస మానసఫలకమునను
శైవకళతోడఁ జెలువంబు సవదరింప

శ్రీతరుచ్ఛాయఁ గూర్చున్న వీతరాగుఁ
బుణ్యుఁ గౌండిన్యు దర్శించె భూమివిభుఁడు. 53

అంతఁ బ్రమథేశ్వరుండు సంయమిశిరోవ
తంసమునకును మ్రొక్కి తద్దర్శితాస
నమునఁ గూర్చుండి వినయావనతశరీరుఁ
డగుచు భయభక్తు లాత్మయం దతిశయిల్ల. 54

ఇటులు పవిత్రుఁడైన ధరణీశ్వరుఁ బల్కి మునీంద్రుఁ డంత వి
స్ఫుటమధురాక్షరంబుగ యశోధన! నిన్నటిరాత్రి నన్ను నే
మిటికిఁ దలంపుసేసితివి? మిమ్మొకకోరిక కోరి నాదువ
చ్చుట యని చెప్ప మెట్టిదది శోభనబుద్ధి ఫలింపఁ జేసెదన్. 55

అనుకూల కార్యసిద్ధికి
మనసిజహరుఁ డున్నవాఁడు మనుజేశ్వర! నీ
మనమునఁ గొంకక వచ్చిన
పని చెప్పుము నీ కొనర్తు ఫలసంసిద్ధిన్. 56

నావిని యిట్లు వల్కు మునినాథునితోడఁ బ్రహృష్టచిత్తుఁడై
భూవరచంద్రముండు మునిపుంగవ! రెండవ విశ్వభర్తవై
యీవు మదీయవాంఛితము లెల్ల ఫలింపఁగఁ జేయువానికం
బ్రావగఁ బట్టి వల్కితివి భాగ్యముచేసితిఁ గంటి సౌఖ్యముల్. 57

కలవు సమీరుమీఱు వడి గల్గుహయంబులు భద్రదంతులున్
గలవు రథంబులున్ గలవు కాంచనపూర్ణములైన దుర్గముల్
గలవు విలాసినుల్ గలరు గల్గిన వన్నియు రాజచిహ్నముల్
గలుగదు పుత్త్రలాభ మొకఁడది నాకుఁ బితౄణ
మీఁగఁగన్. 58

నిర్ణీత 'మపుత్త్రస్య గ
తి' ర్నాస్తి యటంచు శ్రుతులు దెలిపినవలు కా

కర్ణింపు నాదుముఖము వి
వర్ణంబై యుండు నెవుడు పరతత్త్వనిధీ ! 59

క. మానుషయత్నము గా దిది
పూనిక యేరీతినైనఁ బోఁసీ ననిసన్
మానివర ! దైవకృత మిఁక
దీనిన్ సాధింపవచ్చు తెఱఁ గెట్టిదయో ! 60

ఉ. అందని(మాని పండ్లకును నఱ్ఱులు సాఁచినయట్టు లిట్లు నే
నందన లబ్ధికై (ప్రతిదినంబును నువ్విళులూరుచున్ హృదా
నందము లేకయుండ నొకనాఁడు విచిత్రముగాఁగ నాకుఁ దోఁ
చెం దివినుండి పల్కొ-(కటి) సిద్ధమునీశ్వర ! శ్రోత్రపేయమై. 61

క. " ఏటికిఁ బుత్త్రిలు లేమికి
మాటికిఁ జింతింప నీకు మనుజేశ్వర ! నీ
వేటిసగ మిందుశేఖరు
వాటంబుగఁ గొల్వఁ బోయి వారాణసిలోన్. 62

ఉ. పొచ్చెముగాదు నాపలుకు పొమ్మిఁకఁ గాశికిఁ బుణ్యరాశి కీ
వచ్చట విశ్వనాథు నగజాధిపు నీక్రియఁ గొల్వ, కొల్చినన్
ముచ్చటదీర నీకు వరముల్ దయసేయు నతండు, శోభనం
బచ్చికమే వృషధ్వజుని నర్చనచేసిన భాగ్యశాలికిన్ ! 63

క. అని బయలాడిన మాటలు
విని మీ కెఱిఁగించి పిదప విశ్వపతిన్ శం
భుని గొల్తు ననుచు వచ్చితి
ననఘా ! నా కెద్ది బుద్ధి ! యానతియీవే. 64

ఉ. అన్వయదేశికుండవు మహాత్ముఁడ వాగమపోష భూమిభృ
ద్ధన్యుఁడ వాత్మవేది పతిదాంతివరుండవు నీవు నాతలం

వు న్వివరంబుగాఁ దెలిసి పొమ్మను కాశికినైన నీవయై
న న్వర మిమ్ము విశ్వవిభు నాతర మే నిను మీఱి కానఁగన్. 65

గీ. పుత్త్రలాభంబుపైఁ గాంక్ష పొదలుకతన
నదియు నొఁగాక యనివింటి నభవాణి
వడుచుఁబని గాదు [సులువైన క]డక గాదు
బయలువందిరి వెట్టంగఁ బరగునయ్య! 66

క. గౌరీశువలనఁ గానీ
సారయుత(భవత్ప్ర)సాదచాతురిఁ గానీ
యేరీతినైన నా కీ
కోరిక సిద్ధింపఁజేయు గుణరత్ననిధీ! 67

క. అని యాచందంబున నం
(దనుకొఱకై కాం)క్ష చేయు ధరణీపతి కో
రినకోర్కి ఫలితమగుతలఁ
పున నిట్లని పలుకు మానిపుంగవుఁ డెలమిన్. 68

క. సంతాన లాభమునకై
చింతాసంతాప మేల క్షితివర! గౌరీ
కాం(తామనోహరుఁడు వర
చిం) తారత్నంబు నీకుఁ జేకుఱియుండన్. 69

శా. ఆవైవాయ సభారతీ విభవ మార్యగ్రాహ్య మర్వాంబుగా
దా విశ్వాసముచేయు మిందున విరూపాక్షుం డుమాభర్త కా
శీ వాసుండు [ప్రసన్నుఁడీ నఖిలముల్ చెల్వొ]వ్వ నిష్టార్థముల్
ప్రావీణ్యంబున దీన సంశయము దాల్పంబోల దుర్వీశ్వరా! 70

క. భవమునకు సత్ఫలంబుగ
భవు నగజా ప్రాణనాథు భజియింపుటకై

యవిముక్త భక్తిసంపద
భువి నవిముక్తంబునకును బోవఁగవలదే ! 71

ఉ. గుబ్బల తేనెకూఁతు చనుగుబ్బల కమ్మజవాది గంధముల్
బొబ్బిలఁ బూయఁజూఁడ[నిల]చూపులుమూఁడగు వేల్పుఁ బెద్దకుం
గిబ్బల రాచతేజి నటికింపుచు [లోకము లేలు సామికి
చ్చ]బ్బిన భక్తి (మొక్కులిడఁ జుబ్బనచూరఁగఁ గల్గు
సౌఖ్యముల్. 72

సీ. గగనగంగోత్తుంగ కల్లోల రేఖయు
మల్లికా దామంబు మౌళి నమర
నునుపారు వెలిచాయ పెనుబాము ముత్యాల
పేరువక్షఃపీఠి బిత్తరింప
(కాలకూట కఠోర కా)ంతి రించోళియు
మృగనాభిముద్రయు మెడఁ దలిర్ప
మెఱుఁగెక్కు మువ్వన్నె మెకము దువ్పటియును
మాంజిష్ఠమును గటి మలసియుండ

గీ. వలుదశూలంబు నుత్ఫుల్ల వనరుహంబు
(హస్తములకు) విలాసంబు నాచరింప
నర్ధనారీశ్వ రాకారుఁడైన విశ్వ
భర్త కాశికాపురి ప్రాణపదము. 73

శా. ఆ గంగాజలసేక మావటుకనాథావాస సంవీక్షణం
బా గంధేభముఖ ప్రసాద (విభవం బా)యన్న పూర్ణార్చనం
బా గంగాధర పాదపంకజ యుగధ్యానానురాగంబు నా
హా! గీర్వాణులకైన ముచ్చటలు సేయంజాలవే భూవరా ! 74

క. అవిముక్తంబులు దక్కిన
యవి ముక్తశరీర జంతుపుంజంబులు ధా

రవిముక్తంబులు సీల్గిన
యవిముక్తము లరసి చూడ నవనీనాథా! 75

సీ. ఒనర నానందకాననము దండనె యుండు
ప్రోడదండనె బన్ను భూతబలము
నమరాపగాజలం బాడఁజూచినధన్యుఁ
డాడఁజూచును లలాటాంబకమున
గజరాజముఖు డుంఠిఁ గన నెవ్వనిం గూడుఁ
గూడు వానికిఁ బాఁపకోరచేదు
చేరి విశ్వేశుఁ బూజించి మించినపేరు
పేరురంబునఁ బన్న పేరుఁ దాల్చు
గీ. మేన మణికర్ణికామృత్స్న మెత్తు ఘనుఁడు
మేన సాయకమున నేయుమింటియాళ్ళ
కాన శ్రీకాశికాపురిఁ గాద్రవేయ
సార్వభౌముండు నుతియింపఁ జాలఁ డధిప! 76

సీ. పేర్చుకెంజడముడి బింజించి నలుదెస
జాహ్నవి సలిలంబు జాలువార
అద్రిజాదత్త నఖాంకంబు నాఁజాలి
గండమండలిఁ జంద్రకళ నటింప
భుజగేంద్ర హారంబుఁ బునుకపేరును వీకఁ
బృథులవక్షః పీఠిఁ బెనఁగొనంగ
తోరంపుఁగటిసీమ దుసికిఱి పసిడిండి
వలువ మాటికిఁ బెళపెళమనంగ
గీ. అన్నపూర్ణా మహాదేవి యంతఁ గంత
వెంటఁ జనుదేరఁ బ్రమథులు వెఱఁగుపడఁగ
విశ్వనాథుండు భవనంబు వెడలివచ్చి
కాశి నీల్గినవరుఁ జేరి కాచుఁ బ్రేమ. 77

మ. అదె గంగాజలరేఖ యల్లదె శశాంకార్ధంబు ఫాలాక్ష మ
ల్లదె శాకోదరహారవల్లి యదె పద్మావత్యభస్మచ్ఛటా
సదలంకారవిశేష మల్లదె మహాశాతత్రిశూలాయుధం
బదె యంచున్ సురలందు ప్రచ్యుత మృతుండై దేహి
దేహాంబునన్. 78

సీ. దర్వీకరంబైన దర్వీకరముఁ జుట్టు
మృగమైనఁ గెంగేల మృగముఁ బట్టు
శార్దూలపతియైన శార్దూలపతిఁ జీఱుఁ
గరియైనఁ గరితోలుఁ గట్టి మీఱు
[జడల మెకంబైన యెడ జడల]నె మోచు
నైదైన వెలిచాయ యెద్దుఁ బూన్చు
బోయవాఁడైనను బోయవానీరాడు
నవియైన గావించు నవినవీడు

గీ. పునుకయైనను విధిఁ గొట్టుఁ బునుకడుల్ల
నెమకయైనను మెడఁదాల్చు నెమకపేరు
(గాశికాపురిఁ బ్రవహిం)చు గగనగంగ
నీటఁ దోఁగిన మాత్రనె నృపవరేణ్య! 79

మ. కకుబంతంబులవెంట గ్రాసమునకై కాలీచవో సారెసా
రెకుఁ గష్టాశఁ జరింపుచున్ ఫలముఁ దూలింపన్ వృథాయాసులై
[వికలత్వస్థితి దాసులై] పరిగళద్విజ్ఞానులై తూలి కా
శికిఁ బోఁగానని వారిజన్మములు వీక్షింపన్ మృతిప్రాయముల్. 80

మ. సుతులంచున్ సతులంచు గాంచనము లంచున్ దేరులంచున్ బురో
హితులంచున్ బొ[డమూపి బుద్బుదములట్లే పోవుక్షర్యమ్ములన్]
సతముల్గా మది నమ్మి మూఢుఁడు దురాశాపాశబద్ధాత్ముఁడై
శితికంఠున్ భజియింప లేఁడహహా! కాశీపుణ్యదేశంబునన్. 81

సీ. పవడంపుఁ బొదరింట బాలహంసముపోలె
జడముడి శశిరేఖ గడలుకొనఁగ
(నాకాశమండలి) నంగారకుఁడుపోలె
నిటలపట్టిక నగ్ని నేత్ర మమర
పలుదళంఖములోనఁ బొలుచునీలముపోలెఁ
గంధరమున మచ్చ గానుపింప
అమృతాంబురాశి నీరానుమేఘముపోలె
నెమ్మేనఁ గరిచర్మ మెమ్మె మీఱ

గీ. వలను మిగిలిన భాగ్యదేవతయుపోలె
శ్రీవిశాలాక్షి చెంగటఁ జెలువుమిగులఁ
గాశికాపురిఁ బట్టంబు గట్టుకొన్న
విశ్వపతిఁ గొల్వ సౌఖ్యంబు శాశ్వతంబు. 82

క. ప్రాయము మేఘచ్ఛాయా
ప్రాయము, విద్యున్ని కాయభంగుర మరయన్
గాయము, కాశికిఁ బోవుట
న్యాయము దేహులకు ధరణినాయక! వింటే!. 83

సీ. పంచేంద్రియస్ఫూర్తి పారుబట్టినఁ గాని
చిత్తంబు నిల్కడ హత్తుకొనదు
చిత్తంబు నిలుకడ హత్తియుండినఁగాని
బుధసంగమమునకు బుద్ధి చొరదు
బుధసంగమంబునఁ బ్రొద్దుఁ ద్రోచినఁగాని
విద్యుక్త మార్గంబు వినఁగఁబడదు
విద్యుక్తమార్గ ప్రవేశ నైపుణిఁ గాని
సత్త్వగుణంబు నిశ్చలము గాదు

గీ. సత్త్వ గుణమునఁ గాని ధూర్జటియె దైవ
మను వివోధంబు సమకూడ దండుఁగాని...

యొండుదెస ముక్తి గనువట్ట దుగ్గుఁ డేలు
నగరికడ నీల్గుమాత్రనె తగులు ముక్తి. 84

సీ. కన్నులారఁగఁ గాశిఁ గననివానిభవంబు
సలిలంబు లేని కాసారమట్లు
కాశి కేఁగఁ బ్రియంబు గలుగకుండినవాని
భావంబు దలపోయఁ బాడుకొంప
కలదు తీర్థము కాశికకుఁ దుల్యమనువాని
కెందుఁ బ్రాయశ్చిత్త మింత లేదు
కాశికాపురమున్కిఁ గడచి యొండొకచోటి
కేఁగు నెవ్వఁడు భాగ్యహీనుఁ డతఁడు

గీ. యాగములు వేయు చేయంగ నైనఫలము
కోటి గోదానముల నొనగూడుఫలము
పెక్కునల్లిండ్లు నిలుపుటఁ బేర్చుఫలము
కాశి నొకపూఁట వసియింపఁ గలుగు నధిప. 85

క. గోపతి గమనునిపురి గిం
గావగలోఁ గ్రుంకువెట్టు నతిపుణ్యులకున్
దాపత్రయం బుడిగి యొక
తావము బాలమున నెపుడుఁ దరలకయుండున్. 86

సీ. అభ్రగంగా ప్రవాహంబు లెన్నియొకాని
(తల ధరియింతు) రందఱును నదులు
పదినూఱు పడగలపాము లెన్నియొకాని
యందఱు నురగేంద్ర హారయుతులు
డాలొందు చంద్రఖండంబు లెన్నియొకాని
యందఱు ధరియింతు (రమృతకరుని
విషరాశిఁ) బుట్టిన విషము లెన్నియొకాని
యంతఱు హాలాహలాంకగళులు

గీ. గంధగజదైత్యు లెందఱో కాని యంద
అతుల కరిచర్మపటధారు లైనవారు
కర్మబంధంబు [స్వప్న భాగముగనైన]
క్రాలు కొనకుండ నిద్రింపఁ జాలుఘనులు, 87

సీ. ప్రతిదినంబును మదభ్రాంతుఁడై సింధువు
పానంబు సేయనీ పైసిమాలి
యోరంతప్రొద్దు నోరుడుపక కొండెంబు
పలుకనీ లేనివి గల్పి కూర్చి)
[యెపుడు దుర్భ] రహింసయే నిత్యకృత్యంబు
గానుండనీ క్రూరకర్మవరత
కాయికంబుగ సదాకాలంబు హేమంబు
లాగించనీ దొంగభాగుతోడ

గీ. కవయనీ యెఱింగియుఁ [గాంత] గానివాని
తోడుకనీ [దుష్ట దానముల్ దొంతరలుగ]
గగనగంగాతరంగ శీకరము సోఁకఁ
బావనుండగుఁ గాశిలోఁ బంచజనుఁడు. 88

క. ఇలఁగలతీర్థము లాడినఁ
గలుగదు హరరూపలబ్ధి గాశికలోనన్
నెల గంగ నాడ నౌదల
నెల (పూఁపధరించు నరుఁడు నిక్కము) వింటే, 89

ఉ. పుట్టువు సర్వదుఃఖముల పుట్టినయిల్లని పుట్టకుండ రా
దిట్టి వివేకికైన నది యెట్లనినన్ దమపూర్వకర్మముల్
కిట్టలు జన్మహేతువులు తీరదు వానిజయింపఁ గర్మవుం
[దెట్టువ నిర్విశేషముగఁ] ద్రెంపఁగ వచ్చును గాశి కేఁగినన్. 90

ఉ. కోకకుఁ గూటికై యొకనిఁ గొల్చి తదీరిత వాక్యపద్ధతిన్
జేకొని యూడిగంపుఁ బని సేయుచుఁ బ్రాయము సత్తుగా మదిం
గై [కొన కీశ్వరున్ దిరిగినన్] కుసుమీకృత శీ[తభాఃకళా
ప్రాకట జూటితో నరుఁడు భాసిలుగంగ మునింగి కాశిలో.] 91

గీ. [తనకుఁబలె స్వచ్ఛమై యొవ్వ తనువొసంగి
తనదు నోర పాయ మల్లెపూదండఁజేసి
వానిసిగ నిడు దేహావసానవేళ
స్నాతపైఁ గాశి గంగ కెంత కనికరము.] 92

గీ. [మూడ దతనికి చావు చావునకె మూడు
మూఁడు జన్మములం దంత్య మూడిపోయి
కనులు రెండున్న వానికిఁ గనులు మూఁడు
వారణాసి గంగాస్నాన కారణమున.] 93

గీ. [కాశిలోఁ బట్టతలవాఁడు గంగమునిఁగి
జడముడి ధరించు దానిపై నవదరించు
ఫణిఫణారత్నరుచి దానిపై వహించు
మొలక జాబిలి జాజిపూ మొగ్గవోలె]. 94

గీ. [ఈభవమ్మున ఫలమున కేమిగాని
రాఁగలభవమ్ము మొదలంట రాచినాఁడు
గంగలో వారణాసి మునుంగువాఁడు]
దొంటి భవమునఁ బుణ్యంబుఁ దొడికినాఁడు. 95

సీ. ఆనందవనమున కరిగెద నని తలం
చినఁ దీర్ఘములకెల్లఁ జనినయట్ల
వారాణసికిఁ బోయివచ్చెద నని వల్క
సకలాగమంబులు చదివినట్ల

(ఇదె కాశిపురిఁ) జేరెదనంచు నొకపదం
బిడ భూమి వలగొనఁ దొడఁగి నట్ల
అవిముక్త మిదె యదె యని డాయఁ జనె నేని
చిరపాపములకడ చేరినట్ల

ఆ. ఆ మహా శ్మశానభూమి[నిఁ గలయంగ
తేఁటిచూచె]నేని తేటతెల్ల
గాఁగ ముక్తికాంతఁ గలయంగఁ జూచుట
యనుచుఁ జాటిచెప్పు మునికులంబు, 96

ఉ. చాఁచెదఁటే పదాంబుజము చక్కఁగఁ గాశికి నేఁగుత్రోవకున్
దోఁచెదఁటే నిలింప [నదిఁ దోఁగఁగఁ బెన్మసనాన] పాపముల్
గ్రాఁచెదఁటే వివేకశిఖకాఁక[ల వాలి]చె మానవుండు తం
పీఁచము లెత్తకుండుదురె పేర్చినకిన్కఁ గృతాంత కింకరుల్, 97

ఉ. ఆడుదు రొండు తీర్థముల నాడినఁ బాపము [నెల్ల నవ్విరా
పాడునొకో!] జను ల్పదము లాడినకాలమునందె బుద్ధిఁబో
నాడక కాశి కేఁగి యమరాపగలోపలఁ జల్లఁగా జలం
బాడుట పుట్టువుల్ విరుగనాడుట ముక్తినిఁ బెండ్లియాడుటల్,98

స్రగ్ధర. ...  ...  స్థిత) మణికళికో దీర్ణ సంపూర్ణ కీర్ణాం
శువిశేష శ్రీవిలాస స్ఫురిత పదసరోజుండు ఖండేందుజూటుం
డవధానం బొప్ప గంగాంబ్వ పహృత కలుషప్రాణికిం గాశిలోనన్
జెవి నోంకారా(క్షరంబున్ గురుకరణిఁ ద)గం జేర్చుఁ
ప్రాణాంతవేళన్, 99

సీ. తడవు కాలమునోలెఁ దల్లి గర్భంబున
నణఁగియుండిన విగ్రహంబు వాయ
జననంబుఁ గాంచి యజ్ఞానంబు చేసైన
స్తన్యపానాది ...

ఒదిగి గ్రాసార్థమై యొకని సేవింపఁ బ్రా
ప్తంబైన మది సంకటంబు వాయ
ఘన పయోమదమునఁ గన్నుఁగానక త్రిమ్మ
రఁగ సంభవిల్లిన రట్టు వాయ
గీ. ఆమయంబులచేనైన యలంత వాయ
కర్మపాశంబు చుట్టిన కట్లు వాయ
చేరి కన్నుల కతిథిఁగాఁ జేయవలయు
నసమలోచను తలపూవు నభ్రగంగ. 100

చ. జ్వరము పయోవగాహమున వర్ధిలు మానఁగ నేర దండు రి
ద్ధరపయి వైద్యులెల్ల వసుధాతలనాయక ! కాశిలోన నం
బరతటి నీజలస్ఫురణఁ బాపమహాజ్వర మాఱుఁ గ్రొత్త శ్రీ
కర హర వైద్యపుంగవ నికామ దయోదయ జృంభణంబునన్. 101

సీ. మెట్టనీ ధరచుట్టు మెట్టకుండినవాఁడ
మృడుని పట్టణవీథి మెట్టఁడేని
ఆడనీ తీర్థంబు లాడకుండినవాఁడ
యభ్రవాహినిఁ దీర్థమాడఁడేని
చూడనీ యఖిలంబుఁ జూడకుండినవాఁడఁ
గాశీస్థితులఁ జూడఁగలుగఁడేని
కొలువనీ వేల్పులఁ గొలువకుండినవాఁడ
గోరాజవాహనుఁ గొలువఁడేని
గీ. చదువనీ వేదముల్ నాల్గు చదువకున్న
వాఁడ శివకథ చదువనివాఁడయేని
వేయు చెప్పంగ నేల పృథ్వీతలేంద్ర !
కాశి కేఁగినఁగాని మోక్షంబు లేదు. 102

ఉ. తేలుచుఁ జొన్నయూకపయిఁ దేనియవోలిన యాజవంజవ
శ్రీలఘుభోగసిద్ధిఁ బడి చిక్కినఁ జిక్కు మహాపదంబుధిం

గూలి నరుండు గాక యొనగూడిన భక్తిని గాశి కేఁగినన్
గాలముఁ ద్రోచి కాలు(నికిఁగాదని) కాలను బొమ్మఁగట్టఁడే. 103

క. ధాత్రీశ! వినుము కాశీ
క్షేత్రంబునఁ జక్రమైన జీవం బఱి త
న్మాత్రేందు చక్రరథము వి
చిత్రంబుగ నెక్కియుండుఁ జెన్నలరారన్. 104

సీ. తక్కినయెడఁ దత్త్వ[దర్శ]నోజ్జ్వలు[డైన
బోద్ధయిందలి] మందబుద్ధిఁ బోలఁ
దొకచోట యోగియై యుండినవాఁ డిందు
భోగియై చరియించు పురుషుఁ బోలఁ
దన్యస్థలమున నధ్యయన తత్పరుఁడైన
వాఁ డిందుఁ జదువనివానిఁ బోలఁ
[డందేని వేదనకల్ల యిచ్చ]ను దారుఁ
డిందు లోభముఁ బూనుహీనుఁ బోలఁ

గీ. దఖిల తీర్థంబు లాడిన యట్టిమేటి
బోలఁ డిందులయ స్నానశీలు నైన
ననుచు సంశయదూరులై యరసి చూచి
నడ[చెదరు పండితుల్ వారణాసి పురి]కి. 105

సీ. అమిత ప్రదక్షిణ క్రమణంబు గమనంబు
మంత్రంబు లాడినమాట లరయ
నాహుతివిధులు నిత్యాన్నపానాదులు
యోగప్రకారంబు భోగమహిమ
అఖిలస్థుఁ డనియిూశు నర ...
... (సకలతీర్థా) స క్తి జలక మాట

వస్తు వరాఙ్ముఖత్వము చాలియొల్లమి
సచ్ఛాస్త్రముల విన్కి జూడ వినుట

గీ. జీవ పరమాత్మ సంపర్క సిద్ధినైన
చొక్కు నిద్రావిహారంబు సోమధరుని
మూర్తిసంవీక్షణము బంధ మోక్షణంబు
కాశిఁ గాఁపురమున్న ప్రాగ్జనుసకైన. 106

మ. ధరణీవల్లభ ! భక్తితోడ నవిముక్త క్షేత్రముం జేరు సు
స్థిర పుణ్యాత్ములు ముక్తిఁ గైకొనుటయే చిత్రంబు మున్నొక్కభూ
సురపుత్రుఁడు (మదాలసుండు...) శూన్యుండు దుర్మార్గ సం
చరణోదగ్రుఁడు గాంచె నందు మృతుఁడై శంభుస్వరూపోన్నతిన్.

మ. అనిశన్ నేత్రసరోజ పత్రములలో నానంద బాష్పంబులన్
దనుసీమన్ బులకాంకురచ్ఛటలు [సంధానించి తాత్పర్యము]
వ్వ నరేంద్రుండు మునీంద్రుఁ బల్కె విను మోభవ్యాత్మ !
నీ విట్లు చె
ప్పిన యానంద వనప్రశంసకతనన్ భేదించితిన్ బాపమున్. 108

గీ. పుత్త్రి సంపత్తిపైఁ గాంక్ష పోరలు నాకుఁ
గలిగెఁ [గాశీ నివాస భాగ్యంబు స్వామి !]
గాఁజూఁపూస నిరీక్షింపఁ గడఁగువాని
కరయ నవపద్మరాగంబు దొరకు నాఁగ. 109

క. వినఁబడియెఁ గాశిమహిమయు
ననిమిష గంగాపయోభ వాధిక్యము శం
భుని కీర్తనంబువిధములుఁ
గనుఁగొంటిన్ బ్రదుకఁ గంటిఁ గౌండిన్యమునీ ! 110

వ. మీర లిప్పుడు చెప్పిన మదాలసుండనువాఁ డెవ్వం డెద్దేశంబు
వాఁ డేపురంబునం గాఁపురంబుండుఁ దద్దుశ్చరిత్రంబు బుత్తెందుఁ

గాఁ గాంచిన తండ్రియుఁ దల్లియు నెవ్వ, రేమి నెవ.బున వాఁడు కులాచారదూరుం డయ్యెఁ గడపట నెట్లు కాశిలోన మేను దొఱంగి గంగాధరు కారుణ్యంబునఁ గృతార్థుఁడయ్యె నీ యర్థం బుఁ దేటతెల్లంబు సేసి నన్నుఁ జరితార్థుఁ జేయవే యనుడుఁ దపోధనాగ్రణి యశోధనాగ్రణిం గూర్చి కూర్చిన నెయ్యంబున నిట్లనియె. 111

మ. ఇలకుం గుంతల పుష్పదామ మన శ్రీ నింపారి సొంపొందు కుం
తల దేశంబున రత్నగర్భపురికిన్ నాథుండు గంభీర ని
శ్చలతేజోనిధి చంద్రకేతుఁ డరివీరా ధూమకేతుండు త
మ్ముల చుట్టంబగు వేల్పు వంగడమునన్ బుట్టెన్ మహీవల్లభా !

ఉ. ఆదిమభిల్లు మంచుమల యల్లుఁ బయోరుహనాభ భల్లుఁ గా
కోదర రాజకుండల సముజ్జ్వలగల్లు భజించి మించునా
భూదయితావతంస మణిప్రోల మహీసురుఁ డొక్కఁ డొప్పు వి
ద్యాది విషద్గుకుండు మహిమాఢ్యుఁడు ధీనిధినామధేయుఁడై. 113

సీ. చతురాగమంబులు సకల శాస్త్రంబులు
నామూలచూడ మూనట్లు తెలిసి
భక్తి సంపదయు నాసక్తియుఁ గల్గిన
శిష్యుల కవియెల్లఁ జెప్ప నేర్చి
యరయ జ్యోతిష్టోమ మాదిగాఁగల సప్త
తంతువు లన్నియుఁ దగ నొనర్చి
వేదాంతవిద్యా వివేకం[బు గూర్చుచు
నల] తులసోమయాజులుగఁ జేసి

గీ. తగినవారికి దానంబు దా నొనర్చి
షట్త్రిపతి గ్రహాశక్తిపై వెలవు గలిగి

బ్రాహ్మణాకృతిఁ జూవట్టు బ్రహ్మావో తె
నవని ధీనిధి ధీనిధియై తలిర్చె. 114

చ. (వ్రతములు చేసి) పెక్కు లుపవాసములున్ మఱిపెక్కు లుప్పిఁడుల్
ధృతి నొనరించి కూర్మిఁ బరదేసులఁ దల్లియపోలెఁ బ్రోచి మా
నితగతి మింటిదయ్యముల నేలకుఁ దెచ్చి కుమారుఁ గాంచెఁ ద
త్సతి[శుభకీర్తి నాఁబఁ]రగుఁజామ పతివ్రత సంతసంబునన్. 115

ఆ. అవనినాథ ! భూసురాగ్రణి తనపుత్త్రి
కుని మదాలసాఖ్యఁ గూర్చెఁ బ్రీతి
నతిమదాలసాత్మఁ డగు నీతఁ డని మీఁదఁ
దలఁపు జనులకెల్లఁ దెలువు (రీతి.) 116

క. [ద్వికమునకు వ]చ్చు బాలకు
నొకవూఁటన పెంచుచుండె నుర్వీసురభీ
తకురంగనేత్ర శుభకీ
ర్తికిఁ దగుశుభకీర్తి మోహదీపిత యగుచున్. 117

వ. ఇట్లు దినదిన ప్రవర్ధమానుం డగు నూనునకు వి ...
దజ్జనకుం డన్నప్రాశన చౌలోపనయనాది కృత్యంబులు యథా
శాస్త్రంబును యథా కాలంబును నగునట్లుగఁ బరికల్పితంబులు
సేయించి వేదాదికంబులగు విద్యావిశేషంబులఁ బాండిత్యంబు
... ధుఁడగు ధరామరకుమారి సుకుమారాంగిఁ
జంద్రవదనం జంద్రకళ యనుదానిం బెండ్లియార్చి సంతసిల్లుచుఁ
దామరతంపరలగు సంపద్విలాసంబునం బెంపువహించి కతిపయ
సంవత్స ... ... మ్మహీబృందారక నందనుండు. 118

సీ. కన్నుకన్నున మాత్తికంబు లుద్ధాలించుఁ
జెఱకు సింగిణి చేతఁ జెప్పకున్న

ద్రొక్కని చోటులు త్రొక్కుచు మిన్నందు
　　　　టెక్కులు గల తేజి నెక్కుకున్నఁ
[తెలగి యిర్నాల్గు] దిక్కులు పువ్వుఁ గట్టించు
　　　　నలుఁగులు పొదిలోన నిలువకున్న
మిసమిస మనుగండు మీను టెక్కెముతోడఁ
　　　　జిగురెల్లి నీడలఁ దగులకున్న

గీ. [మాని యను] మానినీజన మానహరణ
[చాతురీ సార] సౌభాగ్య శంబరారి
యనఁగఁ జూపట్టె భూమిదేవాత్మజుండు
నాలుగంచుల నవయౌవనంబునందు. 119

చ. చతురామ్నాయ విహారవుల్ మఱచె శాస్త్రక్రీడ చాలించె మా
నితపౌరాణిక వాక్యసంశ్రవణమున్ నిర్ధూతముం జేసె శ్రీ
సుతవాత్స్యాయనకూచి మారమతముల్ చూచెన్ గులాచార సం
గతికిన్ దూరముచేసె నెమ్మనము దుష్కర్ముండు పాఱుండొగిన్.

సీ. నెరవెండ్రుకలు దువ్వి నిలువుకొప్పు ఘటించి
　　　　కుసుమదామము మీఁదఁ గుస్తరించి
నుదుట గంధవుఁజుక్క నూల్కొల్పి నీలాల
　　　　పోగంట్లు చెవిదోయిఁ బొందుపఱిచి
తరలమై బంగారు తాయెత్తుగల ముత్తె
　　　　ములపేరు పేరురంబున ధరించి
కటిఁ దాళిగోశాము కడచుంగుదరఁజీర
　　　　పట్టుదట్టీ త్రిండుగట్టి నడుమ
కేల డాఁపలి చిటికెన వ్రేలియందు
నలఁతి పగడాల యుంగర మనువుకొలిపి
గారవంబీని కలికి సింగార మొదవ
నారజంబుగఁ జరియించు నతఁడు మఱియు. 121

l)

ఉ. బోఁడికి మూఁపుపైఁ గరము పొందగఁజేసి కరంబు ప్రోయు నం
బాడిగ లోలి పెట్టి కరపద్మము క్రొవ్విరి చెండు మాటికిన్
వేడుక బారమీటుచు నవీననఖాంక విలాస లక్ష్మితోఁ
గూడినమేను వమ్ముకొనఁ గ్రుమ్మరుచుండు నతండు వీథులన్. 122

శా. త్రాలుం గన్నులనిగ్గు క్రొమ్మెఱుఁగు బింకంబుల్ దువాళింప నీ
లాలోలాలక కాంతి తుమ్మెదలచాయం జాయనం బూర్ణిమా
ప్రాలేయాంశునిఁబోలుముద్దుమొగ మొప్పన్ మారుపల్]దారులం
గేలింబెట్టు మదేభ గామినులతోఁ గ్రీడించువాఁ డిమ్ములన్. 123

గీ. జూద మన్నను మదియందుఁ బాదుకొల్పఁ
బరధనం బన్న నపహరింపంగఁ గోరు
నబ్జముఖి [యన్న నా ధనంబ]ందజేయు
బ్రహ్మవిద్యా విదూరుఁడై బ్రాహ్మణుండు. 124

గీ. గమియఁ బూచిన తంగేటికరణి సకల
భూషణాంచిత గాత్రియై పొలుపు మిగులు
చంద్రకళఁ గూడి సంసార చ[తుర సుఖము
పొందగాంక్షింప] డతఁడు దుర్బుద్ధి యగుట. 125

సీ. మూసిన ముత్తెంబు లౌనరోజాక్షులఁ
గలికి కటారి కత్తెలుగఁ జేసి
కలలోనఁ బరపూరుషులపొం దెఱుంగని
సతుల పాతివ్రత్య సరణిఁ జెఱచి
గరివోని వయసు [మీఁదుకన్యలకు రతి
క్రమదుచి గు]రుకంబు గట్టిపెట్టి
తల్లి కూఁతురు మఱఁదలు నాక చిట్టంటు
వలల నందటి కొక్క-వావి చూపి

గీ. ఆర్య లెఱిఁగినఁ గాదందు రనక విధి ని
షేధముల యందుఁ గలిగినబోధ మెడలి
లజ్జచ[టితంబు గావీథులందుఁ దిరుగు]
పరమ కాముక ముఖ్యుఁడు ధరణిసురుఁడు. 126

సీ. కానక కన్నసంతానంబు గావున
నొంగా దనఁగ నోడు నంబ తనయు
వలదని వారింపఁ బల మెక్క నసుశంకఁ
దా నెఱుంగనియట్ల తండ్రి యుండు
[బరమ పాతివ్రత్య పరిచితాత్మ]యుఁగాన
నిల్లాలు పతిచేత కెదుర పెఱచు
యొక్కడిమే[వెంగడ] మితని దిద్దుద మంచుఁ
గోరి మిత్రులు బుద్ధిఁ గూర్ప రతని

గీ. బంధువు ల్వీని నిర్బంధపఱుప మనకు
నేమికారణ మని చెప్ప రింత యొత్తి
అన్ని కావుల [సముపేక్ష కగ్గమగుచు]
(నంతకం)తకుఁ బరచయ్యె నవనిసురుఁడు. 127

ఉ. అల్లది మేలదయ్యె మఱి యల్లది కానుక యంపె నాకు నే
నొల్లను దాని విత్తమును నొక్కటి మావటి నిన్న వీటిలో
మెల్లన పోవఁ గంటి న[ది మిట్టనుచున్ (బ్రజనవ్వ కొ]న్నఁ దాఁ
బల్లదుఁడై చరించుఁ జెనుపాఱుఁడు మన్మథ గోచరాత్ముఁడై.

సీ. పాటమరించిన వీటివిటుల యల్కలు దీర్చుఁ
బోరించుఁ దమలోన వారసతుల
వలుమాఱుఁ గోడిపుంజుల(ను బోరాడించుఁ)
గామశాస్త్ర ప్రసంగములు చేయు

నడిగించు మగనాండ్ర నర్థంబు వెదచల్లి
కలవారి గృహములు గన్నవెట్టు
సాముసేయును బోటుచందంబు గనుఁగొర్క
కలికిబాగులు మీఱి నిలువు

గీ. సంధ్య వార్వఁడు వేల్వఁడు చర్చసేయఁ
డాగమంబులఁ దీర్థంబులాడఁ డుచిత
తిథుల నుపవాస ముండఁడు తిప్పరాయ
చందములు దక్క భూసుర నందనుండు. 129

క. ఈ చందంబునఁ బరమై
నీచగతిం దిరుగునతని నిఖిల జనంబుల్
ఛీ ఛీ! యనఁ దొడఁగిరి యహ
హా! చెడదే యశము కామియగు మూఢునకున్. 130

ఉ. భవ్యుఁడు తద్గురుండు నరపాల గృహంబున మాన్యుఁడై సుధీ
సేవ్యగతిం దలిర్చుటఁ బ్రసిద్ధుఁడు కావున "బ్రాహ్మణో నహం
తవ్య" యటన్న నీతియు నతంబయి చెల్లుట నద్దురాత్ముఁ బా
పవ్యవసాయఁ జంపుటకుఁ బౌరులు లోగుదు రేమిసేసినన్. 131

సీ. తగవు గాదని చెప్పెఁ దల్లి సద్బుద్ధులు
హేతు దృష్టాంతంబు తేర్పరించి
ధర్మ శాస్త్రముల యంతర్మర్మములు దెల్పి
వలదని వారించెఁ బెలుచఁ దండ్రి
కులమును వాసియుఁ గలవాఁడ వేలన్న
యని చేరి బోధించి రనుఁగు సఖులు
"సరివారు నవ్వఁ బ్రదిమ్మరి వేటి కయ్యెదు
చాలింపు" మనిరి సజ్జనులు పెద్ద

గీ. లిట్లు తగువారు సన్మార్గ మెద్దియైన
వివరముగఁ జేటపఱిచిన విసఁ దతండు
హెచ్చి మూఁడవ పురుషార్థమే యిహంబుఁ
బరము నీఁజాలునది గాఁగఁ బదిలపఱిచి. 132

గీ. పిన్నవయసునఁ గడుఁ బెంచి పెరుఁగనిచ్చి
వంపలేరైరి సుతు వాలు వక్రమైన
దల్లిదండ్రులు మొలకైన తఱినిఁ జెట్టు
వంపఁబడుఁగాక హెచ్చిన వంపనగునె. 133

ఉ. ఆరయఁ బాలవంటికుల మాఱడిఁ బోవఁగనిచ్చి వీటిలో
నారజమై చరించు వసుధామరనందనుఁ డిట్టివారు నె
వ్వారును జేరికిం గొనక [వాడిన పూవునుబోలెఁ] జుల్కఁగా
నీరసవృత్తిఁ జూచి రతినిందుఁడు వీఁడని యేవగింపుచున్. 134

క. కొడుకు దెసఁ గలుగు మచ్చిక
విడిచిరి దలిదండ్రు లాత్మ విసుగుచు నేలా
♦ విడువక యట్టు దినంగా
దొ[డగుడు రే విసము తొలఁగె దొసఁ]గు నరేంద్రా ! 135

వ. ఇవ్విధంబున మదాలసుం డగు మదాలసుండు దన్నుం గాసున
కైనం గొననివారలగుటఁ జుట్టంబులఁ బుట్టినవారలఁ బరిత్యజించి
దేశాంతరంబు వోవం జిం[తించి యొక్కక్కనాడు.] 136

ఉ. ఒక్కటఁ బిక్కటిల్లి యిరులో యన నో యనునడ్కు రేయిఁ బెం
పెక్కిన తెంపునం బురి మహేశ్వరనామముఁ జొచ్చి విస్ఫుర
ద్రుక్కమనీయ రత్నములతోఁటి యనర్ఘ విభూషణావలుల్
వె[క్కన మాచు నిండి తరలింపఁగఁ] బోలనిబెట్టె నట్టనన్. 137

♦ పాఠాంతరము
విడువక [కొ]ట్టు దినంగాఁ
దొ[డఁగుదు రే వానిఁజూడ దొ]సఁగు నరేంద్రా.

క. కాఁగాదు దేవధన మని
లోఁగక లాగించి యడవిలోఁ దెరువునఁ గా
రేఁగులఁ దంగేళ్ళుగ నతఁ
డేఁగెం దనచొప్పు పొరు లెఱుఁగకయుండన్. 138

చ. మునుకొని జన్మభూమి విడిపోయిన పోక నరణ్యసీ]మలోఁ
గనియెను బ్రాహ్మణబ్రువుఁడు కాంచన నిర్మిత కేలిశైలమున్
దినకర చుంబి కేతు మణిదీప్తి విశాలముఁ బూర్ణచంద్రమో
వినిమయ యోగ్యయావత నవీన ముఖాబ్జముఁ గన్య(కుబ్జమున్.)

ఉ. [భూరి విచిత్ర]వస్తువుల పుట్టిన యిల్లగు నమ్మహాపురం
బారయ గూఢమార్గమున నల్లన చొచ్చి ధనాఢ్యు నొక్కచే
హారు వశంబుసేసికొని యాతనిచేతికి సొమ్ము దావఁగాఁ
జేరికయిచ్చి సాత్త్వికుల చిహ్నముతో [నతఁడుండె నిమ్మగన్.]

ఉ. మానితలీల సజ్జనునిమాడ్కి మహీసురుఁ డవ్వురంబులో
మానవవంక్తితోఁ గలసి మచ్చికయై తలలోని నాల్కయై
ధీనిధి యాతఁడే యనఁగఁ దేఁకువఁ దేజము గాంచియుండెఁ బెం
పూనఁగఁ గొన్ని వాసరము ... ... తటన్. 141

క. ప్రాఁబడిన పిదప మరువకు
లోఁబడియుం డిందు వారలోలాత్ములకుం
దాఁ బసిఁడిఁ బంపు విప్రుఁడు
తోఁ బుట్టిన వృత్తిగుణము తొలఁగునె యధిపా! 142

వ. అక్కాలంబున. 143

చ. (అనుపమమైనయ)వ్వురమునం దొకసానికి బిడ్డయై విమో
హనరుచిరాంగి రెండు బదియైన సమంబుల ముద్దులాడి క్రొ
న్నన విలుకాని రాజ్యసుఖ నవ్యసమృద్ధికిఁ బట్టుఁ గొమ్మనై
కనకల తా[భిధాన యొక కన్నియ] చెన్ను వహించె భూవరా.

మ. చదివెం గామకళారహస్యములు శిక్షం గాంచె వీణాదులన్
బదిలంబయ్యె సమస్త నాట్యకలనా పాండిత్య హేలన్ మదిన్
గదియించెన్ గరువంబు జాణతనమున్ గాంభీర్యమున్ సిగ్గునన్
బొదలెన్ బాలిక కేళికాజిత మరుత్పూర్ణేందు బింబాస్యయై. 145

ఉ. సానికులంబులోనఁ గలసానులకెల్ల నవావతంసమై
మానిని మాననీయ గుణమండన కొండిక ప్రాయమొప్పఁగా
సానలఁ దేరినట్టి మరుశస్త్రియుపోలె విటాలి జాలికిం
దే నెఱిఁగెన్ విలాసరస దేవతయై తగ నాఁడునాఁటికిన్. 146

శా. ఆ కాంతామణి యిట్లు కాముక కటాక్షానంద నిర్వాహక
శ్రీకిం గూర్చిన విం(దు) నాఁబరఁగి రాజీవాక్షులుం దాను లిం
గాకారంబున నొప్పు తన్నగర రథ్యావాసు నాగేశ్వరా
ఖ్యాకున్ శంభు భజింప నేఁగె నొకనాఁ డత్యంత లీలాగతిన్. 147

సీ. కుసుమ గర్భంబైన కొప్పు నెత్తావుల
సొబగు దిక్కులఁ బర్వి చోడుముట్టఁ
చపల కటాక్షవీక్షణ విభ్రమంబులు
క్రొమ్మెఱుంగుల తళ్కుఁ గుస్తరింప
మొలక చన్నులమీఁద మొలకలెత్తిన కాంతి
వలిపవయ్యెదఁ బైఁడి వలువ సేయ
అడుగుఁ దమ్ముల తేటబెడఁగు మార్గమునకుఁ
గ్రొత్తలత్తుక చాయ హత్తుకొలుప

గీ. కలికిపలుకులఁ దేనియ లొలుక నలర
గతులు రాయంచ నడవులఁ బ్రతిఘటింప
ప్రాణసంయుక్త దర్పక బాణ మనఁగ
నాతి వెంచేసె శితికంఠునగరి కపుడు. 148

మ. చరణాంభోరుహ హంసకధ్వని నిరాశస్వాంతులం జొక్కఁజే
యు రతిం బోలినమూర్తి విశ్వజనతా హ్లాదంబు హత్తింప న
త్తరుణీరత్నము [వచ్చెఁ బందెమి]డి యంతం దిక్కులం గెల్చి శం
బరవిద్వేషి సమంత్రశక్తి కొన యొప్పున్ గ్రమ్మరం జేరినాన్.

వృథ్వీ. కనత్కనక కుంభసంగతము చారుముక్తావళీ
పినద్ధమణితోరణా [వృత మనల్ప శిల్పాశ్రయం]త
బనింద్ర ! మత్య నుపమాన వాద్యంబు నా
మనోజహరుధామ మమ్మహిళ చేరె హేలాగతిన్. 150

క. మెఱఁకువ మెఱుఁగులు చూపులఁ
గలుషలు వలుకులను వజ్రకళికలు [మేనన్
బులకల వనలు]లు నెలకొన
నలికుంతల యంతఁ గాంచె నలికతలాక్షున్. 151

శా. జ్యోతీరూపము దివ్యలింగము త్రయీచూడామణిన్ లోకవి
ఖ్యాతున్ బాలిక నీలకుంతల సరోజాక్షిస్యల్ వయస్యల్
ప్రీతిన్ గన్నులు మోడ్చుచున్ విలసనశ్రీ యొప్ప నాదేవుపై
గీతంబుల్ సొబగొందఁ బాడె రసము ల్గీల్కొల్పి తానంబులన్.

చ. కల మృదులస్వరంబుగల కంజదళాక్షులఁ గూడి పాడు న
క్కలికి యొ[యారి పాటలకుఁ గామవిరో]ధియు మెచ్చె నాత్మలో
శిలలు గరంగెఁ దర్వులను జేకుఱెఁ బల్లవలక్ష్మి భక్తి వం
తులఁ గలజొమ్మలం గరము దూఁకొనె జీవిత మద్భుతంబుగన్.

ఉ. ఆసమయంబునం [మధుమదాలసుఁడైన]మదాలసుండు లీ
లాసఖులైనవారు కడలన్ బరిహాసకథా ప్రసంగ వి
న్యాసము చూప వచ్చి జలజాననపాట మనంబు రంజిలన్
జేసినఁ బోక నిల్చె గుడిచేరువఁ గేలితురంగశాబమై. 154

చ. నిలిచి (యొకింతసేపు రమణీమణిఁ గాంచి) ముదంబు విస్మయం
బలమి మనంబుతోఁ బెనఁగ నంగమునం బులకాంకురచ్ఛటల్
నెలకొనఁ దోఁచ ఘర్మమును నిండఁగ నన్యములైన చేష్టితం
బుల సడలించి చిత్రకృతమూర్తియొ నాఁ గనుపట్టె నట్టనన్.

శా. (కామాంధుండయి) విప్రసూనుఁడు మహోత్కంఠాతిరేకంబుతోఁ
రామారత్నము పాటవెంబడి నె సంరంభంబుతోఁ జంద్రభృ
ద్ధామం బప్పుడు చొచ్చి కాంచె నచటన్ దారుణ్యలక్ష్మీ (లతా
రామంబున్ నళి) నాక్షి (ప్రేక్షణసుధారాశిన్ రసావల్లభా! 156

ఉ. తారలలోని చంద్రకళ తమ్ములలోని మరాళి మల్లికా
వారములోని గంధఫలి వజ్రువము త్రెవుఁ బేరులోని వి
స్ఫారమణీశ (లాకయన వారల) లోపల నున్నకన్నియన్
గోరి నుతించె భూసురుఁడు గొబ్బునఁ జిత్తము తత్తఱింపఁగన్.

క. సానికుమారిక యగు న
మ్మానినిఁ బ్రియమాని నిశితమన్మథశరముల్
మైనాట నాటఁ జూచె మ
హానందరసాబ్ధి నోలలాడుచు నతఁడున్. 158

సీ. చీఁకటిగొనఁబోలు చికురవల్లరులలోఁ
గనుపట్టుచిమ్మచీఁకటులు వొదవ
జడనుగాఁబోలు నుజ్జ్వలచారువదనేందు
మండలామృతపూరమగ్న మగుచు
ఇఱుకునఁ బడఁబోలు మెఱుగారు పాలిండ్ల
దోయిసందు శరంబు దూరఁబాఱి
అడుగుఁ జేరఁగఁబోలు నత్యంతగంభీర
నాభీసరస్సును నాఁడఁజొచ్చి

గీ. ఊరునితంబంబు వలగొన నరుగఁబోలు
త్రొక్కి జారంగఁబోలు నూరువులవెంటఁ
దిరుగఁగా నేరదయ్యె భూసురకుమారు
చూడ్కి యెలనాఁగ చెలువంబు చూచినపుడు. 159

మ॥ అంతనింతయు నింపుసొంపున నంతకాహితుఁ గొల్చి మేల్
సంతసంబునఁ గూడి తోడి విశాలనేత్రలు దాను ది
గ్దంతి యానము మించుయానము గల్గి యింటికి నేఁగ వి
భ్రాంతి నెంతయుఁ బట్టి ధీనిధిపట్టి యిట్లను భూవరా. 160

ఉ. ఎవ్వతెయొక్కొ యీజలరుహేక్షణ దీనికి నామమెద్దియో
యెవ్వనిపుణ్య(వైభవమొ) యివ్వనితామణిఁ గూడఁగల్గుటన్
బువ్విలుకానిబారిఁ బడి పోవఁడె వారిజగర్భుఁడైనఁ బై
నివ్విధుబింబవక్త్రి)హాసితేందురుచుల్ గరువంబు చూపినన్. 161

చ. స్మరశరవిభ్రమంబు నవచంద్రకళావిభవంబుఁ బుష్ప వ
ల్లరిఁ గల తేట బంగరుసలాకవిశేషము క్రొమ్మెఱుంగు వి
స్ఫురణము నీ మృగాక్షి యయి పొల్పెసలారెడుఁ గాకయున్న నీ
కరణి మదేభగామినులఁ గంటిమె యెచ్చటనైన వింటిమే. 162

క. అనుచున్ మోహవశాంబుధి
మునుఁగుచు మరుఁ డేయుబాణములఁ దూలుచు నొ
చ్చిన విప్రుఁ జూచి తత్సఖుఁ
డనియెన్ బరభావవేది యనువాఁ డంతన్. 163

ఉ. సానిదిగాన యీ (వికచసారసలో)చన పొంద దుర్లభం
బైనదిగా దిదెంతపని యన్నియుఁ జక్కనసేయువాఁడ లోఁ
బూనుము ధైర్యమిట్టియెడఁ బ్రొద్దిక నేఁటికిఁ బోయె నింటికిన్
బో నయమేది పట్టి వెతఁ బొం(దఁగ నేటికి విప్ర) నందనా! 164

చ. అని పరభావవేది వసుధామరనందను నొక్కరీతిచే
మనము మగిడ్చి చంద్రధరుమందిరమున్ వెడలించి యింటికిన్
జను మని యాఱడం బలికి చయ్యనఁ దాను యథేచ్ఛ నేఁగునం
త నవని దేవుఁ డు(జ్జ్వలము దాని హొరంగును)దిందలంచుచున్.

గీ. ఉచితకృత్యంబులన్నియు నుజ్జగించి
మృదులశీతలశయ్యపై మేను వైచి
ప్రబలమన్మథకీశిఖాగ్ని భర్త్స్యమాన
మానసుండయి వలుకు నిమ్మాడ్కి నధిప! 166

ఉ. పాటలగంధి నీకులుకుపాట నడేటికి వింటి విన్న న
ప్పాట మదీయధైర్యగుణపాటన మేల ఘటించె నింక ని
ప్పాటఁ బ్రసూనబాణశిఖఁ బ్రాణము నిల్వగ నెట్లు నేర్తు హృ
త్పాటవ మేది తూలుటయు పాటిలుఁగాక యనేకభంగులన్. 167

గీ. (జలజలోచన యీనాఁడు) చంద్రి(నిశిత),
బహుళ రాఘాతములచేత బ్రదుకు గలిగె
నేని యర్థంబు లీరాని విచ్చియైనఁ,
బొందు గొనుకొందు నె ట్లరవిందనయన, 168

సీ. గుడివెళ్ళకుండంగఁ గుదియించి కొనకొంగు
పట్టి కిర్మ్మలి (ముద్దు వెట్టనైతి)
(ఎదిరి నిలువ)రించి యిచ్చకం బొనరించి
యించుక మాట లాడించ నైతి
చెలిక త్తియలనైనఁ బిలిచి మీ యెలనాఁగ
తెఱఁ గెట్టిదో యని తెలియనైతి
మందయానముతోడ మఱలి యింటికిఁ బోవ
దిగ(దిగ వెంబడిఁ ద)గులనైతి

గీ. అకట యప్పుడు వాతప్పి హ_స్తగత ని
ధాన మూరక పోనాడి మానసమున
వగచుచుండివ( గార్యంబు వచ్చునేల
యసమశరుతూపులకు సగమైతి( గాక!

చ. మతి( బరభావవేది కడుమచ్చికవా(డని నమ్మి మోస పో
యితి నత( డాప్తు(డేని నను నేటికి నే(టికి నింటి కే(గు మీ
వెతవెత మానుమంచు నను వీడ్కొని తా( దనయంత నే(గె( బె
ల్లి తరులబుద్ధిలోన( జరియించు విమూఢున కేటిసౌఖ్యముల్. 17[illegible]

క. తెచ్చినవి_త్తము వృథగా(
బుచ్చక యమ్మచ్చికంటిపొం దిక( గందున్
పెచ్చపడ వారవనితలు
వచ్చుటయే యరుదె యెట్టివానికి నైనన్. 17

ఉ. అంచితలీల నొయ్య( గళ లంటి మనం బలరించి నేర్పుతో(
బంచశరాహవంబునకు( బైకొన(జేయుదు(జొక్కి కించి దా
కుంచితనేత్రకోణ యయి గుబ్బచనుంగవ నాయురంబు( బొం
కించి సుఖించు నొక్క సుదతీతిలకం బొకనా(డు వేడుకన్. 17

ఉ. ఏనొకవేళ గాఢరతి నే_త్తెఱ లోపల దస్సి దూలినన్
మానితచూత్పల్లవ సమానగుణాధరసంభవామృతం
బాన(గ నిచ్చుచుం గలయ నవ్వదియుంగా మది నూలుకొల్పు న
మ్మానవతీలలామ( దగుమచ్చిక నెన్న(డు గారవించెదన్. 17

సీ. కొ్రొ_త్తనీలవురంగు గొదవచేసి చెలంగు
కమనీయకుటిలాలకములతోడ
సంపూర్ణశశితేటచాయు( జా యనుమాట
మొలపించునిద్దంపుమోముతోడ

హేమకుంభవిభూతియెమ్మె డించినరీతి
తోడికెనవచన్నుదోయితోడ
చిగురుటాకులమేలు చిన్నవుచ్చుఁగఁజాలు
మోహనంబగు చిన్నిమోవితోడ

గీ. పులినతలవిభ్రమము వూని గెలుచునన్ని
డాలు దళుకొత్తుజఘనమండలముతోడ
వలనుమిగిలిన భాగ్యదేవతయువోలె
మెలఁగు కలకంఠి నెన్నఁడు గలుతు నౌక్కొ! 174

సీ. వకుళపున్నాగచంపకపాటలావనీ
రుహవాటికలఁ గలవిహరణంబు
కలహంసకులపక్షచలితవీచీఘటా
కులసరోవరముల జలకమాట
అమృతనిష్యందమోహనచంద్రికాధార
మానితహర్మ్యంబులోని యునికి
కమలరాగోపలఘటితనూతన కేలి
శైలకూటములపై వ్రాలుకడఁక

గీ. విరులు సొమ్ములు పూఁత లంబరము లమిత
భక్ష్యభోజ్యాదు లానరినవనుల నెల్ల
నింపు సమకొల్పు తనవల్పునిందువదనఁ
గలసి వర్తింపలేకున్న నిలువు సున్న. 175

ఉ. అను సమయంబునందుఁ గమలాప్తుఁడు లోచనగోచరాత్ముఁడై
వననిధినాథుదిక్కునకు వ్రాలె సమస్త దిశాంతరంబులన్
గనకము పూసినట్టికిరియఁ గానఁగవచ్చెఁ దదంశురక్తిమన్
వనరుహలక్ష్మికైరవవనంబు(లకుం జనె)తోడుతోడుతన్. 176

సీ. ఈషద్వికుంచితాశేషపత్రసరోజ
జఠరనిష్యందపుష్పంధయంబు
నీడదుర్మోన్ముఖనిర్భరజవఖగ
స్పష్టకోలాహలాశ్లిష్టదిశము
భావితారాగణప్రతిమల్లమల్లికా
మోద మోదితమాన వాదికంబు
చక్రవాకస్వాంతసాంద్రశోకానల
సంవర్ధనక్రియాసామిధేని

గీ. కాంతివిస్మేరముఖసరఃకైరవంబు
నీలిమావృతసకలావనీతలంబు
ప్రకటసంధ్యాసమాధిమద్బ్రాహ్మణంబుఁ
జాలఁజూపట్టె పశ్చిమ(సంధ్యయపుడు.) 177

సీ. కాలకాముకుఁడు దిక్కాంతలపైఁ జల్లు
వలుదకప్పురపుఁబల్కులో యనంగఁ
జరమసంధ్యానాట్యచలదీశవటుజటా
గళితగంగాఫేనకణము లనఁగ
నాకాశమండలం బనుమధూకంబునఁ
బుట్టిన నవకంపుఁబూవు లనఁగ
రాజు రాకను నిశారమణి కెఱిగింప
వచ్చు పెంచినవారువంబు లనఁగ

గీ. భావినక్షత్రవల్లభప్రకట బహుళ
భరితసత్కీర్తి చంద్రికాంకురము లనఁగఁ
బరగి జగదేకకళ్యాణ పదవిలాస
కరములై యొప్పెఁ దారకోత్కరము లపుడు. 178

[కెరలు కాముక కాముకీ చిత్తముల]యందుఁ
జిగురుఁగైదువుజోదు (చే)రఁబడియె
మూఁకలుగట్టి యిమ్ముల మృగంబులు ఱేఁత
వచ్చికవట్టులఁ బవ్వళించె
వసుధమీఁదికి మిన్ను వ్రాలెనో యనఁ జెన్ను
దళుకొత్తఁజీఁకటి దట్టమయ్యె
దశదిశాంత[ముల మొత్తము దైన్యభావంబు]
హరిహేతిహాతులయందు విడిసె

జారులకు మోదసంపత్తి చాలకొదవె
చోరసంచారమునకెల్లఁ జోటుగలిగెఁ
జరమపాథోనిధాననిశ్చలతరంగ
సంగమంబున కినమూర్తి జాఱుటయును. 179

కలువలుపొందు తామరలగాము నిశాసతిజీవగఱ్ఱ తా
రలగమికాఁడు వెన్నెలకరాటము చీఁకటివిచ్చుమొగ్గ చ
ల్వలగని చక్రవాకులతలంకు వియోగులపాలిజాలి వే
ల్పులకఅవెల్లఁదీర్చుటకు(బువ్వము)చంద్రుఁడు దోఁచెఁదూర్పునన్.

ప్రమదముతోడ నస్తమితభానునివేషముఁ దాల్చి రాగ వి
భ్రమము నొనగూడఁ జంద్రుఁడు కరంబుల నంటినఁ జల్వఁ దాఁకి మో
కమలిని మోమువంచె నది గన్గొ[ని పక్కునఁదాను] నవ్వెలోఁ
గుముదిని దాన సిగ్గుపడి గొబ్బున వెల్వెలనయ్యె నాతఁడున్. 181

ఉదయరాగవిభూతి పయోజసూతిఁ
బిదప నొదవిన వెన్నెల మదనదహను
మేనఁ దలుకొత్తుకప్పున దానవారిఁ
బోలి చూపట్టె నంత నంభోజవైరి. 182

చ. హరిహరిదంబుజాక్షి నిటలాంచితచందనబిందువో యనన్
గరము దలిర్చెఁ జందురుఁడు కప్పును జూడఁగనొప్పెఁ దత్సర
త్పరిమళలాభలోభపరిపాకవశంవదచిత్తవృత్తియై
తిరముగ (వ్రాలి)యున్న యెలతేఁటియపోలె జగంబు మెచ్చఁగన్.

చ. వలపులరాచవారికిని వశ్యుఁడు చల్లనిమేనివాఁడు క
ల్వలచెలికాఁడు నైన యుడువల్లభజారుఁడు ప్రేమ యామినీ
కులట ముసుంగుగాఁగ నొనగూర్చిన నల్లనిచీర మేఁకిన్
దొలఁగఁగఁ దీసెనాఁ బరగి తూలెఁ దమంబు దిగంతరంబులన్.

మ. ప్రచురధ్వాంతమదేభపాకలము చక్రస్వాంతశోకాగ్నిధా
య్యా చకోరీకులజీవనౌషధము తారానందకందంబు ప
ద్మచరశ్రీభరవశ్యతోహరము కందర్పత్రిలోకీజిగీ
షచరప్రక్రియ వర్వె వెన్నెల నిశాచంద్రాననాహాసమై. 185

సీ. సకలదిక్కాంత లొమ్మిక వసంతముఁ జల్లు
కొనఁ గ్రమ్ము చందనక్షోద మనగ
నాకాశసిద్ధదేహంబునఁ బూసిన
నూతనస్నిగ్ధవిభూతి యనగఁ
రాజు నిశారాజ్యరతి మంగళాభిషే
కంబునఁ దొరుగు గంగాంబు వనఁగ
కాలధీవరుఁ డంధకారమీనంబుల
సంగ్రహింపఁగ వైచుజాల మనఁగ

గీ. కడఁక రేచామ మైనిండఁ గప్పుకొన్న
జిలుఁగుబాళెంపు వలిపంపుఁ జేలయనఁగఁ
దగి చకోరంబులకు నామెతలు ఘటించి
వెలఁది వెన్నెల గలయంగఁ దొలుకరించె. 186

ఇట్లు సకలలోచనానందకరుండగు నిశాకరుండు మృగమదమకర,
పత్త్రాభిరామం బగు సుత్రామదిశాకుశేశయగంధికపోలఫలకంబు
యుం(బోలెనీలరేఖాకలితాంత రాలుండై నభోమండలంబు నలంక
రించికలువలకుంజలువయుఁ, గైరవంబులకు విహారంబును,చకోరంబు
లకు విశారంబును, నిందుకాంతంబులకు నిష్యందంబును, రిక్క
లకుఁ జక్కఁదనంబును,దిక్కులకుఁ జల్లదనంబును బంకజంబులకుశంక
యుఁ బాంథులకు సంధకారంబును,దమంబునకు భ్రమంబును, బాట
చ్చరులకు వెచ్చయుఁ, జక్రవాకంబులకు విక్రియయు నెలకొల్పి
మనన్యదుర్లభంబగు విభా (విభవంబున వెలసి)యుండె నవ్వ
నవ్విప్రుండు విప్రయోగవ్యథాదూయమానమానసుండై వేఁడి
వెన్నెలం బొక్కి యుక్కడలి యొక్కరమణీయస్థలంబునఁ గనక
త్తెం దలంచి యంతర్గతంబునం జింతింపం దొడంగె.) 187

ఓ చెలనాఁగ!) నాకు నిలుపోవనితాపము నూలుకొల్పి నీ
వేయెడ నున్న దానవు ! మదేతదవస్థ హరించి చక్కఁగాఁ
కీయుట నీదుపాలనె వసించుట యించు కెఱుంగవైతి వ
య్యో! యిగురాకుఁబోఁడులు దయోదయ(మింతయు లేనివారలే!

పికరాజి యాశుకము లీశశికాంతులు నీసుధావృథు
వరిపక్వచంద్రికలచల్వము లీయలిపోతఝంకృతుల్
పవదంగజాతశరఘోరనిపాతముఁ గూడి నాకు వ్యా
త్తావముఁ జేయుచుండె నిఁకఁ దాళఁగఁజాలను గావు మోమొదన్,

లగుహాగంధి! నీవదనసన్నిధి పెన్నిధి, నీమనోహరా
ల్యలసకటాక్షవీక్షణవిహారము. హారము. నీసుధామిళ
కలమృదువాక్యవైఖరులగర్వము పర్వము, నీకపోల ని
స్తులకళచల్మి కల్మి, యయ్యితోఁ జెడు నాకిఁక నెన్నిరీతులన్. 190

సీ. మదిరాక్షి! నీముద్దుమాట లాలించిన
పారఁబట్టనె పికస్ఫారరమణి
యెలనాఁగ! నీముఖం బింత చూచినమాత్ర
వెలవెలచేయనే విధువిభూతి
హరిమధ్య! నీవదనానిలంబులు గ్రోలి
కలఁచి తూలించనే కమ్మగాడ్పు
కొమ్మ! నీకమ్మనికెమ్మోవిఁ జుంబించి
చిదిమినైవనె మావిచిగురుటాకు

గీ. మత్తగజయాన! నీ మేను హత్తియుండి
పిలుచ నాకులపఱుపనే యలరుఁదీవ
నీయుపేక్షణ నాకింత నిబిడితాప
మానవలసె వివేకంబు మానవలసె. 191

గీ. అనుచు నసమాశుగాశుగాహతుఁ జేసి
చిత్త మెరియంగ వెన్నెలచిచ్చు సెగలఁ
గ్రాఁగుకిన్నున కజకల్పకల్ప మగుచుఁ
గడచె నా రేయి యంతటఁ బొడిచె నినుఁడు. 192

గీ. దినముఖోచిత కృత్యముల్ దీర్చి యంత
వచ్చి పరభావవేది భావజశరాగ్ని
నవశుఁడై యున్నసఖుఁ జూచి యాత్మ నులికి
యతని మెల్లనఁ దెలిపి యూరార్చి పలికె 193

క. వాలికలగు తెలిగన్నుల
బాలికకై యింత వంత బడలఁగ నేలా?
తూలి కడుపై భవంబుల
కేలికి విఁకఁ గమ్ము నిన్ను నింతిని గూర్తున్. 194

మ. వలుకం బారకుమీ సుధాంశురుచికిన్ భ్రాంతంబు గానీకు మీ
తలఁపు న్మందసమీరణంబునకు వంత న్మాలకుం బోకు మీ
యలరుంబావికి నింక నోధరణిదేవావత్య! నాసత్య మా
కలకంఠిన్ నినుఁ గూర్తు నేర్తు మరలం గాలింతుఁ గామోద్ధతిన్.

చ. అన విని బాష్పధారలు నిజాననచంద్రునియందు మంచు రూ
పునఁ బొడగట్ట భూమిసురపుత్త్రికుఁ డుస్సురుమంచు వెచ్చ నూ
ర్చి నిజసఖున్ మనోభిమతసిద్ధికరున్ ఘనసారశీతలున్
గని కడు దీనుఁడై వలికె గద్గదికావిలకంఠనాళుఁడై. 196

ఉ. కాముని బారిఁ దోచి ననుఁ గామినిఁ గూర్పక వోయి తక్కటా!
యేమనువాఁడ నిన్ను సఖ! యే మనువాఁడ నె? విప్రయోగదుః
ఖామితతీవ్రవేదనల నందు మదేతదవస్థ యొక్కరుం
డేమి యెఱుంగు? విశ్వపతి యీశ్వరుఁ డాత్మవిదుండు దక్కఁగన్.

సీ. కర్ణసూచిక యయ్యెఁ గలకంఠవరకుహూ
కారమహోదారకలకలంబు
సంతాపకర మయ్యెఁ జంద్రాననాకరా
బ్జాలోలతాలవృంతానిలంబు
గ్రీష్మోద్గమం బయ్యెఁ గృతగర్వయామినీ
రమణసుధాపూర్ణవి(మలకాంతి)
విభ్రాంతిపద మయ్యె వికసితప్రసవాస
వామోదవారివిహారకలన

గీ. ఏమి సేయుదు? నాకింక నిందువదన
వదనపద్మావలోకనప్రాప్తి లేమి
వామలోచనఁ గూర్చి నావంకఁ జేర్చి
యిట్టివేత మాన్పి ప్రీతిఁ జేపట్టు సఖుడ! 198

చ. అనవుడు నట్లకాక మన కన్నిటికిన్ శివుఁ డున్నవాఁడు నీ
పని ఫలియించు నింత వెతఁబట్టకు భూసుర యంచు మిత్రు వీ
డ్కొని పరభావవేది యనుకూలములౌ శుభ(సూచకంబులన్)
గని మది నుబ్బుచుం జనియె గ్రక్కునఁ దత్పురి వేశ్యవాటికిన్ 199

వ. ఇట్లు ముందట. 200

మ. శతమన్యుప్రదరాననోపమరాజత్తోరణం బంగనా
కృతగాంధర్వవిశేషగుంభితము లక్ష్మీపుండరీకాక్షప
(ర్వతజాశంకరవాఙ్మ)రాళరథరూపవ్యాప్తచిత్రంబు పో
షితపారావతముఖ్యకేళిఖగమున్ జేటీసమాకీర్ణమున్. 201

చ. విలసనవద్విటీవిటము విస్ఫుటమంగళసంగతంబు ని
ర్మలశశికాంతకుడ్యము చ(మత్కృతిమత్కృతి ధూర్తచేటికా)
తిలకము నైనవారసుదతీగృహ మొక్కఁడు గాంచి నాత్మలో
వలఁ గడు విస్మయంబు గనుపట్ట మదాలసుచుట్ట మయ్యెడన్. 202

క. ఆ మందిరంబు కనకల
తామందిర మగుట నిలిచి తద్దయు...
......దున కభిముఖుఁ
డై మెల్లన నడవఁ దొడఁగె నతఁ డిం పలరన్. 203

గీ. ఏమి సేయుచునున్నవా రింటివారు
వచ్చితిమి మేము చుట్టాల మిచ్చటికిని
ననుచుఁ దరహసితాననుం డగుచుఁ జొచ్చె
నంత నాతండు తద్గృహాభ్యంతరంబు 204

సీ. పగలు రాతిరి సేయఁ బరగంగ రాతిరి
పగలుసేయఁగ గాడ్పుఁ దగిలి పట్ట

నివ్వాళ లొడిఁగట్టి నెఱిసందుగలిగిన
సావడి కొట్టంబు చంకఁ బెట్టి
మున్నీరు దెగనీఁద మన్ను మిన్నును గూర్చు
(మంచును గొలువ ధూమంబు) దివియఁ
గన్నుండఁగా లోనిగనుపావ వెడలింప
బిట్టు శేషాహి వాకట్టు గట్ట

ఊతఁ దైలంబు పుట్టింపఁ జేతిలోన
సకలజగములు నొక్కట సవదరింపఁ
జాలి యేపొద్దు విటులకు జాలి యొసఁగు
కనకలతమాత మాయాప్రకారభూత. 205

పరగఁగ నెల్లవారు విటభల్లిక యంచుఁ దలంప వీటిలోఁ
జిరముగ నెన్నికం గనినచేడియ లంజియతల్లి యిట్లు మం
దిరమునుగూర్చి వచ్చిన సుధీమణినందనమిత్రు గారవం
బరుదుగ నాసనాదుల ముదన్వితుఁగా నొనరించి వెండియున్. 206

పాటలగంధులుఁ దగఁ బరి
పాటిం బాటీరచర్చ పై నెఱి నలఁదన్
జేటిక (తనచే నొసఁగిన
వీటిక) గొని యిచ్చి యతని వినుమని పల్కెన్. 207

మన్నన నామఱందలగు మంజులవాణికిఁ జుట్టమైన చి
ట్టన్నమభట్టునందనుఁడ వల్లుఁడ వారయ వావి నాకు నీ
వెన్నఁడు మాగృహంబునకు నేటికి రావిదె నీకు వింత యే
పిన్నవు గాన కూరుములపెంపుఁ దలంపవుగాక భూసురా! 208

వానకునో పఱవునకో
పూనిక నీరాక వింతపోడమిన్ నాపై

మీ నెనరె యిన్నాళకు నీ
మానసమునఁ గొంతకూర్మి మంచిద యయ్యెన్. 209

చ. తరతర మెన్నిమైన మరదండ్లకు సొమ్ములు పెట్టనోడి లో
భరతినొ యిందు రావు హరువంపున గ్రాసము గల్గియుండు నె
వ్వారిమది వేసరింపము భవజ్జనయిత్రికి నేల భీతి లోఁ
బొరయఁగ బెద్దవారిక్రియఁ బొం దొనరింపుము నీవు మావయీ.

గీ. ఓడగట్టినదూలమై యుండవలయు
మీకు మాకును నెనరైనమిత్రభావ
మింటికిన్ వచ్చుచుం బోవు చుంట మేలు
నీకు మే మెంతవారము నీతి దెలువ. 211

క. చేయం జేయఁగఁ బొం దగు
పాయం బాయంగ నెడలు బాంధవ మెందున్
మీయన్నగారికై వడి
మాయందులఁబొందు నిలుపుమా విప్రవరా! 212

క. నా విని మానసమున మో
దావేశము నివ్వటిల్ల ధ... ...మిత్రుం
డా వెలఁదితోడ నిట్లను
ప్రావీణ్యవిలాససరసఫణితులు చెలఁగన్. 213

క. ఇంటికి వచ్చిన జుట్టము
లింటికి రాకున్నఁ బరులె? యెనసిన యెదలో
నంటిన మచ్చిక గల్గినఁ
గంటం గనుగొంట కేమి? (కమలద)ళాక్షీ! 214

వ. అది యటులుండనిమ్ము కమలానన! నీప్రియపుత్రి జవ్వనం
బొదవి విలాససంపదల నుజ్జ్వలయై విలసిల్లు రేఖ చూ
చెద నని వచ్చితిన్ బిదపఁ జెప్పెద నొక్కరహస్య మన్నియున్
(కొదువ కొంత) లేక సమకూరెదు నీమదిఁ బర్వియుండినన్, 215

క. శాతోదరి నీకూఁతుం
జూతము రప్పింపు మనుఁడు సుదతియుఁ బుత్త్రిన్
దో తెచ్చి యంకపీఠికఁ
జేతోమోదమున నిల్పి చెన్న (లరారన్) 216

సీ. (కలికి) బంగరుబొమ్మ కందర్పబాణంబు
మొలకమెఱుంగు వెన్నెలలనిగ్గు
వగడంపుఁదీఁగె సంపంగిక్రొన్నన చిన్ని
హరిణాంకురేఖ కప్పురమునిరము
జాతిరత్నశలాక సాకారమధులక్ష్మి
(రతనాలజిగితేట) అతనురాణి
పెంచినచిల్క జీవాంచితాలేఖ్యంబు
కస్తూరినిగరంబు కళలకరువు

ననఁగఁ గమనీయమహితమోహనవిలాస
భాసమానాంగి యగుకూఁతుఁ బట్టిచూపి
పలుకు బలుతియ్య మింపులు గులుకునట్లు
(వేడ్కమదివేశ్య)వర భావవేదితోడ.

సీకు నాతోడుసు మ్మవనీసురేంద్రి!
మెచ్చు మిగ్రింగఁదలంచిన మృదునియాన
నిజము చెప్పుము మత్పుత్త్రి నీలవేణి
సవతు వూఁబోఁడి గలదె యిజ్జగమునందు.

ఉ. (చక్క)నివానిఁగా వయసుచాలినవానినిగా ప్రదాతగా
తక్కనివానిఁగా మీటులధర్మ మెఱింగినవానిఁగా సిరిం
బెక్కువవానిఁగా సొబగుఁ బేరును బెంపును గల్గువానిఁగా
నొక్కనిఁ జూడుమీ యరసి యుగ్మలి కన్నెతికంబు విడ్వఁగన్.

ఆ. ఎది(గి పసితనంబు ప్రిదిలిన నా)మైన
తగవు గాదు నిల్పఁ దలిరుఁబోండ్ల
నట్లుగాన దీని కనుకూలుఁడగు నొక్క
విటశిఖావతంసు వెదకు మీవు. 220

శా. నేపాళేంద్రుఁడు మాళవేశ్వరుఁ డవంతిస్వామియున్ మున్నుగా
భూపాలోత్తము (లెందఱేని ధన మింపుం బెం)పు దీపింపఁ దా
రీపద్మానన కిచ్చి పొందు గొనుకో నేమేమొ యంచున్నవా
రావృత్త్వవతు లిచ్చునీవిదెన నా కాకాంక్ష లే దింతయున్. 221

క. మననును మర్మంబు నెఱిం
గినవానికిఁ దగినవానికిని బొందుగ నీ
వననాననఁ జేసెద నే
నని నాయున్నతి తలంతు నవనీదేవా! 222

వ. అనవుడు నిది యతని చెలికానిమనోరథంబునకు ఫలకాలం
బని యమ్మహీదేవుం డావేశ్యమాతకు నిట్లనియె. 223

గీ. మంచిపని సేసితివి నీవు మహీవసుతుల
తోడిజడ్డుకుఁ జొఱకమో తోయజాక్షి!
మనము సంసారులము గాన మనకుఁ దగిన
వారితోడను బొందు భావ్యంబుచేయ. 224

మ. ఒకఁ డున్నాఁడు మదీయబాంధవుఁడు గుణ్యుం డెల్లచోఁ బల్లవుల్
సకలానంగకళారహస్యవిదుఁ డీజాణండ యంచున్ దనున్
బ్రకటింపన్ భవదాత్మజాతకుఁ దగున్ భామా యతం డీను బు
చ్చుకొ సామర్థ్యము గల్గుఁ బేరు నమకూర్చున్ నీకు నైశ్వర్యముల్

చ. అనవుడు నింతి యిట్లనియె నట్టిదయేని ధరానిలింప! నీ
వనినరసజ్ఞుతో సరసిజాననఁ గూర్చుము మాకు వచ్చు వ
స్త్రనములనెల్ల నిచ్చి యుచితజ్ఞత నావుడు నియ్యకోలుమైఁ
జనియె నతండు నెమ్మనము సంతసమొంద వయస్యపాలికిన్. 226

క. చని తనపోయినయంతయు
వినిపింపఁ బ్రమోదవార్ధివీచులలోనన్
మునిఁగి మదాలసుఁ డాలిం
గనమున సఖు గారవించి కడు నగ్గించెన్. 227

సీ. పొసఁగ నీగతి మదాలసుచేతఁ గూర్మి సం
భావితుం డయి వరభావవేది
తదనుమతంబునఁ దవనీయరత్నవ
స్త్రము లాదిగాఁ బదార్థము లసంఖ్య
ములు సానిజననికిఁ దలఁపుకోరికకంటె
నినుమడిగా నిచ్చి కనకరత్న
సంబంధమునుబోలె నరసులు గొనియాడ
ఘటియించెఁ జెలికానిఁ గనకలతను

గీ. కుసుమవల్లరి నలదేటిఁ గూర్చుమలయ
పవనుకైవడి నంత నాబ్రాహ్మణుండు
మన్మథాద్వైతసుఖవార్ధిమజ్జనమునఁ
దోఁగి పరితాపమంతయుఁ దొలఁగఁ జేసె. 228

చ. ఉడుగని కామతంత్రముల నూని మనోజ్ఞము వల్లవింపఁగాఁ
గడఁగి వశావశీభవతికై వడి మత్తమరాళికాతతిం
బుడికెడురాజహంసపతిపోల్కి మదాలసుఁ డమ్మృగాక్షితో
నొడఁబడియుండె సంతతము నొందు తెఱంగుల నుజ్జగింపుచున్. 229

గీ. మాడ లన్నను మాడలు మణివిభూష
ణంబు లన్నను మణిభూషణంబు లెలమి
వలయువస్తువు లెల్లఁ గై వసము సేయు
సానితల్లికి నవ్విప్రసూనుఁ డిట్లు. 230

క. భజనచెడి దానిపొత్తున
భుజియించెను మధువుఁ ద్రావెఁ బొల యంటె వెసన్
ద్యజియించెఁ దగినవడవడి
కుజనుండై ధరణీసురుఁడు కుత్సితబుద్ధిన్. 231

ఉ. పాటలభృంగశోభిమధుపానవశుం డయి చొక్కి మిక్కిలిం
బాటవ మేది భూసురుఁడు పాటలగంధికిఁ జిక్కి కాటికల్
హాటకముల్ మణుల్ గలపదార్థము లన్నియు నప్పగించె నే
(యేటికి మోహవార్ధి వశమే) తరియింపఁగ నెట్టివారికిన్ ! 232

సీ. పతితునిపొందు పాపము చుట్టు నని రోసి
ప్రాణబంధువు లెల్లఁ బాసిచనిరి
యెట్టివిద్యలయందుఁ బట్టిచూడఁగ లేమి
యడుగునే దొరయును బుడుకఁ దర్థ
మింతి(బందుగు లెల్ల నితఁ డప్రాతుం డంచుఁ)
గైకొనరై రొక్కగవ్వకైన
సత్యంబుచాలనిచపలుండు వీఁడంచు
వెచ్చంబు పెట్టంగ వెఱచె బచ్చు

గీ. వలపు గలిగియు జనయిత్రివలన వెఱచి
కనకలత దక్క మాఱుమొగంబు వెట్టి
నీ తెఱంగునఁ జెడెఁగాని (యింతపుణ్య
కర్మసం)స్కార మతనికిఁ గలుగదయ్యె. 233

సీ. మును మ్రుచ్చిలించి తెచ్చినయర్థ మంతయు
నప్రస్తుతము వెచ్చమైనకతన
మనము నిల్పక పోయి మగువపొత్తునఁ దిన్నఁ
గని తన్ను జనులు గైకొననికతన
(తనకష్టసుఖములఁ గను)చుట్ట మెవ్వఁడు
మానుగ నెచ్చోట లేనికతన
నున్నతభోగంబు లన్నాళ్లుఁ గల్గి బి
ట్టొకసారె నవియెల్ల నుడుగుకతన

గీ. ప్రాణపదమైన యెలనాఁగఁ బాయుకతన
తొంటితేజంబు నుఱవేది (దుఃఖి యగుచుఁ)
బురములోవల వసియింప వెరవుమాలి
యరిగె నెందైన నాబ్రాహ్మణాధముండు. 234

క. ఈచందంబునఁ జని యా
నీచాత్ముఁ డొక్కచోట నిలిచి మనములోఁ
జూచును విత్తార్జన మె
ట్లుచేయుటో యేమిభంగి నగునో యనుచున్. 235

చ. వసమరి విత్తహీనుఁడగువాఁడును బ్రాణము లేనివాఁడు ధా
త్రి సమముగాఁగ నెన్నుదురు ధీనిధు లట్లగు గాన నాకు నె
క్కసముగ విత్తమేకరణిఁ గల్గెడిఁ బ్రాణమువోలె దాన నా
వసముగఁ జేయనొక్క ప్రియభామిని రూపమనోజకామినిన్.

గీ. కనక మార్జింతు నెన్నిమార్గముల నైనఁ
గనక మార్జించుకొని కొందుఁ గాకలతను
గనకలతఁ గూడ నీమాఱు గలిగనేని
వేయు నేటికి త్రిజగతీవిభుఁడఁ గానె. 237

శా. ఆవింధ్యాచలపార్శ్వపట్టణము లత్యంతంబు నానాధన
శ్రీవాసంబుల నాఁగ విందుము జనశ్రేణుల్ ప్రశంసింప నే
నే వేగం జని తద్ధరాస్థలము పృథ్వీపాలకాగారముల్
ప్రావీణ్యంబునఁ గన్నపెట్టి సకలార్థవ్రాతముల్ దెచ్చెదన్. 238

క. కడియును గత్తియు నాచే
పడి యుండినయేని పద్మభవునిల్లైనన్
వడిఁ జొచ్చి కన్నమున వెస
వెడలింపన మినుకమండ వేదండంబున్. 239

క. అని కృతనిశ్చయుఁ డగుచుఁ
జనియెఁ గహనంబు త్రోవ సాహసవృత్తిన్
మనమునఁ గొంకక దక్షిణ
మునకై ధనకాంక్ష దన్ను మునుకొని తివియన్. 240

చ. నెనరగు నింతితోఁ బెరసి నీడ మెఱుంగున నున్న వాఁడు గా
వున నడవంగలేక తనువుం గలచెయ్యాలు దూలఁ జిక్కి విం
ధ్యనగసమీపకాననమునందుఁ బథిశ్రమ మోర్వ డింపఁ ద
త్కనకలతావిటుండు వెడగాడ్పు రవిప్రభఁ గూడి వీవఁగన్. 241

క. వడదాఁకి దప్పిగొని యా
చెడుపాఱుఁడు పెదవు లెండఁ జెదరి పదంబుల్
వడవడ వడఁకఁగ వింధ్యపు
నడు తెరువునఁ బడియె నొక్కనగపతినీడన్. 242

శా. ఆవేళం ధరణీసురుం డొకఁడు విద్యాపాలుఁ డన్వాఁడు వి
ద్యావాణీవిభుఁ డొక్కభూమిపతిచేతన్ నిష్కముల్ రత్నముల్
దేవగ్రాహ్యములైన వస్త్రములు తృప్తిన్ దానరూపంబుగా
నేవం గైకొని వచ్చెఁ బాలుఁ దనపట్టిం గూడి యాత్రోత్సుకన్.

గీ. దైవయత్నంబుచే ధరాదేవుఁ డతఁడుఁ
దానుఁ దనయుండు వడదాఁకి తాపమొంది
యమ్మదాలసు వసియించునట్టి చెట్టు
నీడ కేతెంచె నొక్కింత నిలుచుకొఱకు. 244

క. ఆచెట్టునీడ నవ్వడు
చూచె మహీదేవవరుఁడు క్షోణీశయనున్
వాచావిహీనముఖు గళ
గోచర(జీవున్ విబో)ధకుంఠితు నతనిన్. 245

వ. చూచి వీఁ డెవ్వఁడొక్కో! అగమ్యంబగు నీమార్గంబున కేమి
నెపంబున వచ్చిన వాఁడో వీని కేమియైన నొక్కో! తెలియు
దముగాక యని చేరంజని యరసి యతని వడ(దాఁకినవాని)గాఁ
వివేకంబున నిశ్చయించి కృపాళుండై విద్యాపాలుండు. 246

చ. తనకరదీప్తిలోని హిమధామసుధావిమలంబులైన తీ
య్యనిసలిలంబు లొయ్యనఁ బ్రియంబునఁ బాణిసరోరుహంబునన్
[గొని చిలికించి యంగము]ల గోముఖమండలి మున్నుగాఁగ నా
తనికి నతండు గొంత పరితాపభరం బెడలించె నందునన్. 247

ఆ. ఇట్లు నేద దేఱి హీనస్వరంబున
నతని కనియె నమ్మదాలసాఖ్యుఁ
డనఘ! కొంత మాను నారాటము [కడింది
దప్పిఁ దీర్చిగొంతు]దగులు వాపు. 248

చ. అని విని సంభ్రమంబున దయాకరమూర్తి మహీసురుండునుం
దనమది హెచ్చరింప మును దత్తనపుం దడవంగఁ గొన్ని ని
ల్చినసలిలంబులన్ రసనఁ జిల్కుచుఁ గుత్తుక డెక్కు (సంతసం
తన నరిచేసికొంచును యథాస్థితి నూనఁగఁ జేసెఁ బ్రాణమున్.

ఆ. అట్లు సేదదేటి యుల్లన చేగాలు
గదలనిచ్చి వదనకమల మెత్తి
కనులు విచ్చి చూచి గ్రక్కున లేచి కూ
ర్చుండి మాటలాడుచుండ నంత 250

సీ. తెలిసి యంత్రట ధరిత్రీదేవకులశావ
కుండు)విద్యాపాలుఁడండ వినతి
చేతఁ బ్రీతునిఁ జేసి చేదోయి మొగుడించి
వినయావనమ్రుఁడై యనియె నతని
ననఘాత్మ! నీకతంబున నిప్పటికి బ్రాణ
మున నుండ గంటి నీమూర్తి చూచి
సకలాంగకంబులు చల్లనయ్యెను నాకు
(నిజవృత్త మెఱిఁగింతు) నీవు వినుము

జాతివిప్రుండ వాదంబుచేత నోడి
సిగ్గువడి శాస్త్రపాఠంబు సేయఁ గోరి
పోవుచున్నాఁడ నెటకైనఁ బోయి పోయి
అగ్గిదాఁకితి నిచ్చోట నైతి నిట్లు. 251

నామదిఁ దోఁచుచున్నయది నాయన! నీవు దలంప సర్వ వి
ద్యామయమూర్తి వంచు ధృతి దప్పక నీపదపద్మయుగ్మమున్
బ్రేమ భజించి శాస్త్రములు పెక్కువతోఁ బఠియించి ప్రోడనై
భూమిజనైక వంద్యగతిఁ బొల్చెద నిల్చెదఁ గీర్తిసంపదన్, 252

గీ. కాఁపురము నాకుఁ గడుఁబెద్ద కంచియంత
ఇల్లు శ్రీధాన్యకటకమై హెచ్చు మిత్రు
లరయఁ దలవెండ్రుకలయంద అచ్చికంబు
లేదు గ్రాసంబునందు నో వేదమూర్తి. 253

వ. అనిన విని యట్లకాక నీవు మాకుం గుమారునిమాఱు నీ కెవ్వి
ధంబున నుండవలయు నవ్విధంబున మాతోడం గలసి వర్తింపు
మని ప్రహర్షలోలుండై విద్యాపాలుండు నాళీకబాంధవుం డస్త
శైలశిఖరం బరుగుడుఁ దడయక సంధ్యాదికృతంబు లవంధ్యప్రకా
రంబున నొనరించి యథోచితంబుగఁ దృణాస్తరణంబగు ధరణి
శయనంబునం బవ్వడించి నిద్రించుసమయంబున. 254

గీ. ఆ కృతఘ్నుండు బ్రాహ్మణునందుఁ జాల
ధనము గలుగుట వీక్షించి తత్తఱించి
అది సమస్తంబు మ్రుచ్చిల నాత్మఁ దలఁచి
ప్రబలసంతమసార్ధరాత్రంబునందు. 255

మ. తనుఁ జాకుండఁగఁ బ్రోచినాఁ డనక వృద్ధబ్రాహ్మణుం బిన్నవాఁ
డని కొం కింతయు లేక తత్తనయునిన్ బ్రాణంబులం బిట్టు వా
పి నయం బింతయు లేక చేరి వెరజెం బేలైనతద్విత్తమున్
ధనకాంక్షాపరుఁడైన వానికి నిషేధం బేల చూపట్టెడిన్. 256

గీ. వెతకఁబోయినతీఁగ వేవేగఁ గాలఁ
జుట్టికొనినట్లు కోరినయట్టియర్థ
మిట్లు దొరకిన సంతుష్టహృదయుఁ డగుచు
గనకలత కెత్తునని నిరాఘాటగతిని. 257

క. ఆవేళఁ గదలిచనఁగా
దైవగతిం దెరువు దప్పఁ దనపురిత్రోవన్
బోవిడిచి కాశినగరికి
నైవచ్చె నతండు గొన్ని యహములు పోవన్. 258

సీ. ఏపీడు విలసిల్లు శ్రీవిశ్వనాథ జూ
టపినద్ధముగ్ధేందు విపులకాంతి
జెన్నొందు నేపురం బన్నపూర్ణాఘన
స్తనభారకాశ్మీర సౌరభముల
వెలయు నేనగరంబు విబుధకల్లోలినీ
కల్లోలహల్లీసకముల కలిమి
నేపట్టణం బొప్పు హేలామయుఁడు డుంఠి
విఘ్నేశదానాంబువిభవలబ్ధిఁ

గీ బెరిమ జూపట్టు నేపుటభేదనంబు
హృద్యకైవల్యలక్ష్మికి నిక్క యగుచు
నట్టి యవిక్తమునకు దినావసాన
సమయమునఁ జేరె వాఁ డదృష్టంబుకతన. 259

ఉ. ఆ దురితాత్ముఁ డిట్లు మదనాంతకు పట్టణ మల్లఁ జొచ్చి బె
ల్లిదయు వానయుం దమము నేడ్తెఱఁ గూడి జనావరోధముం
బ్రోదిగఁ జేయఁగాఁ గడచి పోవ వసంబటి ప్రాలుమాలి స
ర్పోదరమైనరొక్క[పొద నొక్కఁడు]చొచ్చి శ్రమాకులాత్ముఁడై

క. నిద్దురకుఁ గన్ను మోడ్చుచు
నుద్దవిడిం దెక్కియున్న యుగ్రోరగ ము
ద్యద్దహనజ్వాలావళి
నద్దినకోటులకు నతని నాప్తునిఁ జేసెన్. 261

మ. పవనాహారవిషాగ్నిదగ్ధుఁ డయి తాపం బందుచున్నట్టి భూ
దివిజుం జేరి హరుండు విశ్వవిభుఁ డద్రిస్వామికన్యాధవుం
డవధానంబున దక్షిణశ్రవణ మొయ్యన్ దారకబ్రహ్మ వి
ద్యవిశేషప్రతిభోపదిష్టముగఁ జేయం బూనుకాలంబునన్. 262

మ. అరుణాక్షుల్ గురుకుక్షులు న్వికటదంష్ట్రాభీలవక్త్రాంతరుల్
శరదాభుల్ కరవాలహస్తులు ఖరచ్ఛాయోర్ధ్వకేశచ్ఛటుల్
భరితాహంకృతు లంతకానుచరు లాపాపాత్ముఁ బాశు న్మహో
ద్ధురవేగంబునఁ బట్టి తేరఁ జని రెంతో వంతము ల్పల్కుచున్.

గీ. ఒకనిఁ బట్టంగఁ బదుగు రిట్లొత్తిపోయి
యమ్మదాలసు కడ నున్న యంతకారి
డేరకొని చూచి వచ్చిన తెరువు పట్టి
రంతకునికింకరులు భయభ్రాంతు లగుచు. 264

చ. తమవని కాకపోవుటకతంబున నవ్వాడు విక్లబాస్యులై
యముఁ గని తద్భటుల్ వడిఁ బ్రయత్నవిఘాతముఁ దెల్పి చెప్పుడున్
శమమతి కాలుఁడుం గినిసి సైరిభరాజము నెక్కి బ్రాహ్మణా
ధముఁ గొని తేరఁగా నరిగె దట్టపుఁగింకరసేన గొల్వఁగన్. 265

మ. అలికాక్షుండు మహానుభావుఁడు త్రిలోకారాధ్యుఁ డిట్లీలతా
నలదుష్టాత్ము ననుగ్రహించు నిది దా నాశ్చర్య మూహింప విం
తలు పుట్టెన్ మఱి తత్ప్రవర్తనలకున్ దాఁ గూర్చునే యుగ్రుఁ డ
ట్టుల దీనం జెడు నెల్లధర్మములు చోటుం దప్పి త్యక్తంబులై. 266

క. అని సందేహింపుచుఁ దాఁ
జని కాశికలోనఁ గాంచె శమనుం డసమా
క్షుని సరిగద్దియఁ గూర్చుం
డిన భూసురపుత్త్రి నతులనిర్మలగాత్రిన్. 267

గీ. చూచి (ప్రాసుగ వీనులఁ)జూచుతొడవు
వేల్పునకు ప్రొక్కి యొకవంక వినయనమ్ర
దేహుఁడై నిల్చె నమ్మహాదేవు నాజ్ఞ
శిరముపైఁ జేర్చి తలవంచి తరణిసుతుఁడు, 268

గీ. ఒదిగి యత్యంతదీనుఁడై యడఁగి మడఁగి
సిగ్గువడియున్న జము నిరీక్షించి మున్నె
యతని రాకకుఁ గారణం బాత్మఁ గాంచి
యమ్మహాదేవుఁ డీక్రియ ననియె నగుచు,

ఉ. వచ్చితి వేల? దండధర! వచ్చియు మూసినమాత్రమట్లు మో
మిచ్చి యొకింతయుం బలుక వేమి? మనంబున శంకఁ దక్కి వా
క్రుచ్చుము నావుడున్ హరునకున్ వెస నంజలి యాచరించుచున్
వెచ్చన యూర్చి యిట్లనియె వెల్లదనంబున నాకృతాంతుఁడున్.

ఉ. ఏమని విన్నవింతుఁ బరమేశ్వర! విశ్వజనాంతరాత్మవై
భ్రామకవృత్తి జంతువులఁ బట్టి వినోదముపోలెఁ ద్రిప్పుచున్
భూమిగుణప్రభావమునఁ బొల్చిన మేటివి నీవు మన్మన
స్తామరసంబు వందురువిధంబును గానవి దేమి చిత్రమో. 271

మ. విధురేఖావిలసత్కపర్ద! వినుమీ విప్రుండు దుష్టాత్ముఁడై
విధికిం బాసి నిషేధముం దవిలి వేవే లుగ్రపాపంబులన్
బుధులెల్లన్ హసియింపఁ జేసి పిదపన్ బొందెన్ భవద్రూప మీ
యధికారం బిఁక నాకు నేమిటికి ధర్మాధర్మముల్ లేనిచోన్. 272

సీ. మొదల బ్రాహ్మణకర్మములవట్టు వదలించి
జారుఁడై కులటలఁ జంకఁ బెట్టి
తల్లిదండ్రులమాట తలమీఱి వర్తించి
కైదువ ధరియించి జూదమాడి

చోరుఁడై శంకరుసొమ్ములు దొంగిలి
హత్తి వారాంగనపొత్తు దొడఁగి
గంజాయి భక్షించి కలు ద్రావి నంజుఁడు
నమలి కృతఘ్నుఁడై నట్టడవిని

గీ, శాంతు వేదాంతవిద్యావిచారనిపుణు
నిరపరాధు మహీసురవరుని నతని
పుత్త్రుఁ డనిఁ జంపి తుది నిన్నుఁ బొలినాఁడు
వీఁడు నేనేమి యనువాఁడ విశ్వనాథ! 273

ఉ, కూరలు గూర్లఁగాఁ గుడిచి కోరిక లీరిక లెత్తనీక కాం
తారములోఁ దపంబు లతిదారుణభంగి నొనర్చువారికిన్
జేర వశంబుగాని నినుఁ జేరి శుభాకృతిఁ దాల్చియున్నవాఁ
డేరికి నంతరానిఖలుఁ డీతఁడు చోద్యము ప్రోవు శంకరా! 274

క, ఇఁక నేల ధర్మసంగతి
యిఁక నేల! పరోపకారహేలావిభవం
బిఁక నేల విధినిషేధము
లిఁక నేల వివేకమాత్మ నెఱుఁగు తలంపుల్. 275

క, పలసినలాగులు గుహిమ్మరి
బలహీనుల వెఱవులేక పరిమార్చి తుదిన్
జలవంబు లేనినిన్నున్
గలయుట వనిగాదె తలఁపఁగా దేహులకున్. 276

ఉ, తొల్లియు శ్వేతుఁ గాచితివి తుచ్ఛుఁడు వీఁడని చూడ కాత్మ లో
భిల్లుదయారసంబు గలప్రేమ దగం గని బ్రహ్మఘాతుకున్
గల్లరి నిన్నుఁ బొల్చుకొని కల్మషదూరుఁగఁ జేసి తద్విజా
వల్లభ! యొల్ల నీవిషమవర్తనమైన నిజాధికారమున్. 277

ఉ. నావిని మోముపైఁ జిఱుతనవ్వుదలిర్పఁ గృతాంతుఁ బల్కె న
ద్దేవుఁ డభంగురామృతవిధేయములౌ పలుకుల్ చెలంగఁగా
నీ విఁక భానుపుత్త్రి! మది నిల్పకు మీతమకంబు నీ మహీ
దేవుఁడు నేన తా నగుట తెల్లముగా వివరించి చెప్పెదన్. 278

శా. లోకు ల్గాదనుచుండఁగా నవనిలో లోలాత్ములన్ విప్రులన్
బాకానాథగవాదులన్ గెడపనీ వట్టండు[పాపంబు నా
లీకాప్తప్రియ]పుత్త్రి! మానవుఁడు మల్లీలానివాసార్హమౌ
నీకాశీనగరంబునం దెగినచో హెచ్చున్ నసూం బోలుచున్. 279

సీ. పౌరుషంబు కొంతపడుట మేననె కాని
కలుగదు వానివంగడమునందు
నెద్దుచందం బెల్ల నెక్కరింతనె కాని
తగులదు వానివర్తనమునందు
రెండునాలుకలాట పెండారమునఁగాని
హత్తదు వానివాక్యములయందు
[కడిఁది బండతనంబు]నిడువుడెంకెనె కాని
వరగదు వానిప్రాభవంబునందు.

గీ. భంగపోవుట తలపూవుపైనె కాని
నాటుకొన దింత వానిమానసమునందు
నెవ్వఁడేఁ గాశికాపురి కేఁగుదెంచి
బొంది దిగఁద్రోయు భాగ్యంబుఁ బొందెనేని. 280

గీ. [ఉర్వి కా]శీస్థితుఁడు పుణ్యుం డటన్న
పాపకర్ముండు సుకృతంబుపాలఁ బోవు
కాశి కేఁగినఁ బాపంబు గడవ దన్న
పుణ్యమూర్తియు దురితంబుపొంతఁ బోవు. 281

గీ. తేఁటిము క్కంటఁ బువ్వులతదీయరూవ
మొందుగతి సిద్ధరసమున నూని యినుము
కాంచనం బైనకై వడిఁ గాశి నీల్గి
పాపకర్ముండు దనుఁ బోలు భానుతనయ. 282

క. ఈపుణ్యక్షేత్రంబున
నేపుణ్యుఁడు జడత వాయనిడి మల్లింగ
స్థాపనముచేయు నాతఁడు
ప్రాపించును బొందివారఁబట్టక ముక్తిన్. 283

మ. కడు నగ్రాహ్యములైన యొండుమతముల్ ఖండించి యీకాశి నే
ర్పడరన్ నన్నుఁ బ్రతిష్ఠసేయుఖలుఁడున్ బ్రాణంబులం బాయ కే
జడలంగట్టు శశాంకపోతము శిరస్సర్వాహినీపోతమున్
మెడలం జుట్టు భుజంగహారముఁ బ్రభానిర్ధూతనీహారమున్. 284

గీ. ఇనజ! కైవల్యలక్ష్మికి మనికి యగుచు
వెలయు నిందుల మన్మూర్తి నిలిపి సుమ్ము
వృత్రవధసంభవంబైన విమమకలుష
భరము దిగఁద్రోచె దేవతాభర్త మున్ను. 285

క. వరపుణ్యజలజదివసే
శ్వరమగు నిట నన్ను నిలిపి చంద్రుఁడు మును త
ద్గురుకాంతా సంగమభవ
దురితం బెడలించి కీర్తిఁ దొడికెఁ గృతాంతా!. 286

గీ. ఒనర లింగప్రతిష్ఠ చేనొండె మేను
విడిచిపెట్టుట చేనొండెఁ దొడుకవచ్చు
నిమ్మహాక్షేత్రమున ముక్తి యెట్టిపాప
కర్మునకునైన నిక్కంబు కడమ లేదు. 287

ఉ. కావున సర్వకల్మషవికారనిబర్హణ మైనయివ్వారిన్
జీవము నుజ్జగించిన విశిష్టుఁడు గావున దుష్టుఁడయ్యు భూ
దేవుఁ డితండు నేన యయి తేజముఁ గాంచెన కాశి తక్కినన్
దావకదండఘాతములు దవ్వొనె పీనికి భానునందనా! 288

ఉ. నీవు మదాజ్ఞ మాళివయి నిల్పి యథాస్థితి నుండు మంచు న
ద్దైవతసార్వభౌముఁడు ముదంబునఁ గాలుని వీడుకొల్పి భూ
దేవునిఁ గాచి విశ్వము నుతింప నిరంతరభక్తరక్షణ
శ్రీ వెలయంగ నుండె సురసిద్ధవరాసురపూజితాంఘ్రియై. 289

సీ. కావున శ్రీకాశిమహాత్మ్యముఁ గోని
యాడ నెంతటివాని కలవియగునె
నీవు నాకాశవాణీమార్గమున విశ్వ
పతి నవిముక్తేశు భక్తవరదు
సేవింపు నీకోర్కె సిద్ధించుఁ దడయక
యంచు దీవించి పొమ్మనిన నృపతి
కౌండిన్యముని పాదకమలంబులకు (నెల)
నాఁగయుఁ దాను వినమ్రుఁ డగుచుఁ

గీ. గాంచనస్యందనం బెక్కి కతిపయాను
చరులు దనుఁ గొల్వ వేడ్క నక్షణమ గదలి
సరవిఁ బొడకటుననుకూలశకునములకుఁ
గరము హర్షించి విశ్వేశుపురికి నరిగె. 290

సీ. ...నరదంబుఁ జేర్చ నొక్కపురంబు
నందు నుండఁగఁ జేసి యాక్షణంబ
వరభాగ్యవతి ప్రభావతి ప్రేమఁ దనమేని
నీడకైవడి వెంటఁ గూడి నడువఁ

గై వల్యాలక్ష్మికిఁగంఠహారంబైన
విశ్వేశునగరంబు వెసఁ బ్రశస్త
మగు సన్మహార్తంబుసందుఁ బ్రవేశించి
జహ్నుకన్నియలోన జలకమాడి

గీ. యర్హ్యకృత్యంబు లొనరించి యతులహేమ
దానముల భూనిలింపులఁ దనిపి పూత
చిత్తుఁడై ధరణీకాంతుఁ డుత్తముండు
గుడికి గమనించె నతిభక్తి గొనలుసాఁగ 291

శా. స్వర్గంగాలహరీపయోహారమశ్చంచద్యశశ్చంద్రికా
వర్గాలంకృతదిగ్వధూవదన దీవ్యత్కొండవీటీమహా
దుర్గాధీశ్వరగోవభూవరకృపాధూర్లబ్ధసామ్రాజ్య స
న్మార్గాధీనమనస్క భూభరణహర్మ్యస్తంభ దేచాగ్రణీ! 292

క. ఆశ్చర్యధుర్యధైర్యా! వి
పశ్చిజ్జనకమలతరుణభాస్కరమూర్తీ!
నిశ్చలమానస! సత్యహ
రిశ్చంద్రనరేంద్ర! మతిసరీనృపవర్యా! 293

పంచచామరము. కలాకలాప! కృష్ణమాంబికాకుమార! ధీరతా!
చలాచలాధినాథతుల్య! సత్ప్రతాపనిర్జితా
నలా ! బలాహశ్రవధానసఖ్యరూపచాతురీ
నలా! హలాయుధేందుసన్నిభాశదిగ్యశోనిధీ! 294

## గద్యము

ఇది శ్రీమదేలేశ్వర గురువరేణ్య చరణారవింద షట్చరణసకలకళాభరణ
రామనాథ్యసుపుత్రి సుకవిజనమిత్ర కుమార భారతి
బిరుదాభిరామ రామలింగయ నామధేయ ప్రణీతం
బైన శ్రీమ దుద్భటారాధ్య చరిత్రం బను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము
శ్రీ



శ్రీ

# ఉద్భటారాధ్య చరిత్రము

## తృతీయాశ్వాసము

క. శ్రీస్తనపాళీశరధివ
దాస్తోకవ్రీదరదళితహరిహయరిపు శం
భుస్తుతిపఠనధురీణ సు
ధీస్తుత్యా! యన్నమంత్రి దేచామాత్యా! 1

వ. విన్నవింపుము. 2

గీ. ఇట్లు కృతకృత్యుఁడై యమ్మహీశ్వరుండు
వృషభకేతనరుద్ధదృగ్వీధి యగుచుఁ
బ్రబలువిశ్వేశ్వరునిమందిరంబు డాసి
యతులపులకాభిరాముఁడై యతివతోడ. 3

శా. స్నిగ్ధాష్టాపదకుంభదీప్తి రవి నాశ్లేషింప శుభ్రాంబుద
స్రిగ్ధావశ్యముఁ గేలిఁబెట్టుశిఖరప్రాంశుచ్ఛటాశోభలన్
దుగ్ధాంభోనిధి దీటుకొల్పఁగ సుధాంధోనాథకోదండస
మృగ్ధామాశ్రియతోరణద్యుతులు నేత్రానందముం జూపఁగన్. 4

సీ. ఉత్తాలతరపతాకోజ్జృంభణంబుల
జలజాప్తహరులమ సులుకఁజేయ
రత్నగవాక్షనిర్యత్ననిర్గన్నకా
గరుధూపము(లుసు) [illegible] బెనువ

నిర్దయస్ఫాలితో న్నిద్రభేరీభూరి
భాంకారముల మిన్ను బధిరితముగ
సేవాసమాగత సిద్ధసీమంతినీ
తనురోచి మెఱుఁగులు తళుకు లొదవ

గీ. సకలశాస్త్రక్రియంబులు చర్చసేయు
నాగమజ్ఞులకలకలం బనువు మిగుల
యోగవిద్యావిలాసప్రయోగపరతఁ
దగుపరివ్రాట్టు లుచితవర్తనలు నూప. 5

శా. ఆకుంబచ్చల మ్రుచ్చిలించుమణికుడ్యస్ఫూర్తి దూర్వాదళ
శ్రీకిం జాలి కురంగశాబకమనఃప్రీతిం బ్రసాదింపఁగాఁ
బ్రాకట్యాంచితసంచరత్కరిముఖప్రత్యగ్రదానాంబుధా
రాకల్లోలితగంధముల్ దశదిశావ్రాతంబు వాసింపఁగాన్. 6

మ. అతఁ డబ్జాతుఁ డతండు దా మఱి సురాధ్యక్షుం డతం డంతకుం
డతఁ డంభోనిధిభర్త యాతఁ డతఁ డాయక్షేశ్వరుం డంబికా
శ్రితవామాంగ! మహేశ! విశ్వపతి! వీరిం జూడు మీ విప్పు డిం
దతిచిత్రేశ హసాద టంచు పనివెంటన్ నంది భాషింపఁగాన్. 7

ఉ. ఎక్కడఁ జూచినం బ్రమథు లెక్కడఁ జూచిన యోగిమండలం
బెక్కడఁ జూచినన్ ఖచరు లెక్కడఁ జూచిన సిద్ధయావతం
బెక్కడఁ జూచినన్ సుకృతు లెక్కడఁ జూచిన మూర్తితోడఁ బెం
పెక్కిన వేదము ల్గలిగి యెల్లసమృద్ధులఁ దేజరిల్లుచున్. 8

క. దీపించు విశ్వపతిగుడి
భూపాలుఁడు చేరి చొచ్చి పొలఁతియుఁ దానుం
జూపులు విలసిల్లఁగఁ ద
ద్గోపతిగమనునకు మ్రొక్కె గురుతరభక్తిన్. 9

వ. లేచి పులకితతనుఫలకుండై యలికతలంబున నంజలిపుటంబు ఘటి
యించి యిట్లనియె. 10

గీ. జయ మహాకాళ! విశ్వేశ! జయ మఘారి!
జయ పురాంతకసాయక! జయ మహేశ!
జయ విరూపాక్ష! ధూర్జటీ! జయ గణేశ!
జయ చతుర్వ్యూహ! జయ చంద్రశకలజూట! 11

క. అలికాక్షుఁ బార్వతీధవుఁ
గలికాలవికారదూరు గణవరు మల్లీ
కలికావర్ణు ధనేశ్వరు
చెలికాని నిన్నుఁగొల్తు శివ! ఫణివలయా! 12

గీ. నీకు మ్రొక్కు లొనర్చెద నీలకంఠ!
కంఠభాగకరీశ్వరదంతిజనక!
జనకముఖయోగిజనగేయ! సరళభావ!
భావజాంతక! హర! యీశ! పంచవదన! 13

సీ. కామాహితుఁడ వయ్యుఁ గరుణతో నెట్లు భ
క్తులపాలిటికిఁ గామదుండ వైతి
వుగ్రలక్షణరేఖ నొందఁజాలియు సర్వ
మంగళాన్వితమూర్తి మనితి వెట్లు
భవరోగవైద్యవిభ్రమముఁ దాల్చియు నెట్లు
మానవితలయేఁకుఁ బూనినాఁడ
వరసిచూడఁగ దిగంబరుఁడ వయ్యును నిరం
తరవిభూతిస్ఫూర్తిఁ దనరి తెట్లు

గీ. తొడరి యింతంత యనరాని పొడవు నయ్యుఁ
గుదురుకొంటివి యేరీతిఁ గొమ్మచంట
నిట్టి నీసొంపు వర్ణింప నెవ్వఁ డోపు!
హరిణలాంఛనజూట! దృశ్యల్లలాట! 14

చ. అని శివుఁ బ్రస్తుతించి వసుధాధిపచంద్రుఁడు సద్గురూపది
ష్టనియమపద్ధతిం దవిలి చామయుఁ దా నుచితస్థలంబు గై
కొని బుధపూజనాదుల నకుత్సితభక్తి నొనర్చి చేసె నం
దనఫలసిద్ధికై తపము తత్పరతన్ జగదద్భుతస్థితిన్, 15

మ. బహిరుద్భాసితశంభుమూర్తిని మనఃపద్మస్థితుం జేసి భూ
మహిళాభర్త జితేంద్రియత్వమును సౌమ్యస్ఫూర్తియుం బూని లో
నహితవ్రాతము దర్పమున్ సడలఁజేయన్ జాలి చేయుం దపం
బు హరిత్పాలురు మానులుం జనులు నుద్భూతాద్భుతుల్గా మదిన్.

గీ. కొన్నినాళ్లు హవిష్యంబు గుడుచుఁ గొన్ని
నాళ్లు ఫలములు దినుఁ గొన్నినాళ్లు త్రావు
నారములు గాడ్పు లారగొన్నినాళ్లు గ్రోలు
నొల్లఁ డెవ్వియు మఱి యంతనుండి నృపుడు. 17

క. పతి యేక్రియ వర్తించును
సతియును వర్తించు నట్ల సన్మార్గమునన్.
బతియట్ల మెలఁగవలదా
పతి దేవతలైన పుణ్యభామల కెల్లన్. 18

సీ. నిశ్శేఘ మగుమింట నిర్గమించిననీరు
ధరణిపరాగంబుఁ బరిహరించుఁ
బరిమళంబును మందభావంబు గలిగిన
గంధవాహము శైత్యగతుల వీచుఁ

బుష్పావచయవేళఁ బోడవులయ్యును గరాం
    బురుహంబునకు నందుఁ దరులు వేగ
నన్యోన్యవైరంబు లడఁచి సత్త్వంబులు
    వాత్సల్య మమరఁ బార్శ్వములఁ దిరుగ

గీ. నార్తవం బగు గుణమెల్ల నవనయించి
మేని కింపైనగతిఁ బర్వ భానురశ్మి
యతిమునీశ్వరుఁడగు నృపాలాగ్రగణ్యుఁ
డతులనిష్ఠఁ దపోలక్ష్మి నందుకొనుఁడు. 19

ఉ. వాడదు మేను నిట్టు లుపవాసము లుండిన ధైర్య మింతయున్
వీడదు పారెకున్ బోడమువిఘ్నములం గని యింద్రియంబులన్
గూడదు నెమ్మనంబు సమకూరిననిష్ఠఁ గురంగపాణిపై
నూడనిభక్తి గల్గి తప మొప్పఁగఁ జేయునృపాల హేళికిన్. 20

క. పరిమితదినములలోపలఁ
జిరకాలతపఃఫలంబు క్షితిపతి గాంచెన్
హరకరుణాసంపన్నుల
కరుదారఁగ నందరానియట్టిది గలదే? 21

సీ. మండువేసవినాఁడు మార్తాండుఁ గనుఁగొంచు
    మండునగ్నులు చుట్టు మెండుకొనఁగ
బలువానకాలంబు చలన మింతయు లేక
    పద్మాసనస్థుఁడై బయట నిలుచుఁ
దుస్తరంబైన శీతుం గందువము గంఠ
    దఘ్ననీరంబులఁ దవిలి యరలు(?)
హరుఁడు శీఘ్రమునఁ బ్రత్యక్షంబు గామిని
    శంకింపఁ, డాత్మ నిస్తంద్రుఁడగుట

గీ. పూర్వభోగంబుఁ దలపోసి పొరయఁ డింత
చాపలము మానివరదృష్టసరణియంద
నడుచుఁ, దక్కినతుచ్ఛంపునడక యందఁ
డీశ్వరాసక్తుఁడగు ప్రమథేశ్వరుండు. 22

క, శివరక్షకలిమి ధరణీ
ధవుఁ డుగ్రతపంబు సేయఁ దత్తేజముచే
రవిదీప్తి గుంటుపడియెన్
బవనంబులవీక నడలెఁ బ్రభ చెడె నగ్నుల్. 23

ఉ. చెంగనిభక్తిచేఁ గొదువసేయక ఘోరతపంబు నల్పురా
జుం గరుణింపఁగాఁ దలఁచె సోముఁడు విశ్వవిభుండు కాశికా
రంగమహానటుండు గుణరాజితుఁ డట్టిద కాదె చూడఁగా
జంగమకల్పభూజము భుజంగమహారుఁడు కొల్చువారికిన్. 24

సీ. చిఱుతవెన్నెలగాయు చిన్నిచుక్కలరాజు
తలవాఁకకును నావపొలుపు నిలువ
మెడకప్పమించు గ్రమ్మిన చేతిపై జింక
దూర్వాదళభ్రాంతిఁ దొంగలింపఁ
బొడవైన తెలిమేనిపూఁతదావులఁ దావుఁ
దరలి ఫాలాక్షంబు దమకపడఁగఁ
గటిసీమ ద్రిండుగా గట్టినచేలకుఁ
గాక యెక్కిన గిబ్బ కడలుఁ ద్రొక్కఁ

గీ. బాఁవసొమ్ములు నలుమోము పాలుకాడ
మూఁడుమోముల పెనుపోటుముట్టుఁ దాల్చి
పూనికయుఁ గల్గి కనుపట్టె భూతభర్త
పరమకారుణ్యమున మహీపాలుమ్రోల. 25

క. సురగరుడయక్షవిద్యా
ధరకిన్నరవరులు బలసి తహతహతోడన్
హరుఁ గొలిచి వచ్చి రంభో
ధరరవములఁ దెగడు నుతివిధాధ్వను లమరన్. 26

ఉ. లోపలఁ దోఁచుచున్న యతిలోకుఁడు విశ్వవిభుండు ముందటన్
రూపముఁ దాల్చి నిల్చిన సరోరుహవైరికులాబ్ధిచంద్రుఁ డ
బ్జాపతి దండరూపమున భోరున మ్రొక్కి సముద్ధితాంగుఁడై
యాపురుషత్రయాత్ము మదనాంతకుఁ బ్రస్తుతిసేయు నీక్రియన్. 27

దండకము. శ్రీమన్మహాదేవ! దేవస్రవంతీపయోధౌతసుస్నిగ్ధరుగ్ధారి
చంచజ్జటాబృంద! బృందారకేంద్రాది సాంద్రోరుకోటీరకోటీ
తటీరత్ననిర్యత్న నిర్యన్మరీచిచ్ఛటాటోపకిర్మీరితాంఘ్రిద్వయా!
అద్వయంబైన నీయొప్పు హృత్పద్మపీఠిన్ వితర్కించి దుస్తర్క
బంధంబులం ద్రుంచి ప్రజ్ఞారసముల్లాసముల్గ్రాల విజ్ఞానసిద్ధిం బ్రసి
ద్ధాత్ములై యుండఁగా లేక యేకాలమున్ జీకులై త్రవ్వుచున్
దుర్వివేకుల్ ఖిలాచారసంచారులై చేరలేరెన్నఁడున్ నిన్ను
నున్నిద్రచిద్రూపరూపాతిగా! నాగకేయూర! మాయూరపింఛచ్ఛ
విస్ఫూర్తిపాటచ్చరోచ్ఛూన నానాదిగంతౌఘజంఘాల నీరంధ్ర
ధూమంబులన్ గిలికీలాకరాళోజ్జ్వలల్లోలసారా లఘుజ్వాలలం
బేర్చి కోలాహలోదగ్రమై క్రాలుహాలాహలంబున్ జగద్భీతితోఁ
గూడఁ గొంకూడి వే క్రీడయుంబోలెఁ గేల న్వడిం బట్టి
బిట్టెత్తి చిత్తంబు మత్తిల్ల నుత్తుంగహర్షంబునన్ గ్రమ్మ
భక్షించి లోకంబు రక్షించి యక్షీణతేజంబునం బొల్చు
సద్రక్షకున్ నిన్ను నెన్నన్ దరంబా ధరం బాపరేణాంత యత్యం
తధీశాలికిన్ శూలపాణీ! గణాధ్యక్ష! దక్షుండు మాత్సర్య
దీక్షాత్ముఁడై క్రొవ్వి వీక్షాపవిత్రైకమాత్రావధూతాంతకు

న్నిన్నుఁ గన్నాని రప్పింప కుప్పింగి దర్పించి క్రించుందనం
బొందుచున్ మందభాగ్యోదయత్వంబునన్ బన్ని జన్నంబు
సేయంగ నంగీకృతోద్యోగియై యున్న మిన్నంది కందర్ప
దుర్వారదోర్గర్వ సర్వస్వసంహారవిద్యాసముద్యక్త నేత్రంబుతోఁ
జిత్రచిత్రోన్నతిం బొల్చి పెల్చన్ జగత్కంపవిశ్రేణిమై తూలు
నుద్యజ్జటాశ్రేణితో నేణభృత్ఖండమల్లీప్రసూనోల్లసద్గండ భాగం
బుతో భోగపట్టాంచలలోదంచదుద్దండ మాణిక్యరేఖామయూ
ఖావళీకీర్ణ నిర్నిద్రచక్షుశ్శ్రవోహారపుంజంబుతోఁ గంజగర్భాండ
గర్భప్రభేదక్రియాభీమభూమాది దిక్సామజోద్దామశుండాభచండో
జ్జ్వలన్మండలాగ్రాది దీప్తాయుధస్తోమ సమ్మోహితారాతిదృగ్వ్యూ
హబాహాసహస్రంబుతో దుస్సహంబై మహోత్సాహమై సాహ
సాధిష్ఠితంబైన శ్రీవీరభద్రాకృతిం దాల్చి సన్మానముం గన్న ని
న్నెంతవాఁడైన నింతంతనంజాలునే కాలకంఠా! నృకంఠీరవో
ద్రేకవిద్రావణామర్త్యవిద్విట్ఛిరఃపద్మపూజావిరాజత్పదాంభోజ!
యంభోజసంభూతమూర్ధంబు భిక్షాటనప్రక్రియాపాత్రిగా గోత్ర
భృత్తూ్కరకంకాళముం దాళమై యెవ్వ చేముట్టుగా దిట్ట
యాశీవిషాధీశుఁ డంఘ్రిస్థలిన్ గండపెండేరరాజంబుగాఁ దేజ
ముల్ గ్రమ్మ శార్దూలవృందోలు పైఁ జాలఁగాఁ గ్రాల ఫాలాస్థి
హారంబు తోరంపుగ్రీవన్ మహాహారముఖ్యంబుగా విశ్వచక్షు
ర్భయాపాదియా నాశ్మశానంబు ధామంబుగాఁ జేసి యెవ్వారికిం
దేరిచూడంగరానట్టి దట్టంపు రూపంబుఁ బ్రాపించియున్ ముక్త
దుస్సంగుఁడై భక్తియుక్తాంగుఁడై కొల్చుధీశాలికిన్ సౌమ్య
విస్ఫూర్తివర్తింతు వార్తార్తిహారీ! పురారీ! విరూపాక్ష!
వక్షోజచక్రంబులన్ జారు నేత్రాసితాబ్జంబులన్ వక్త్రపద్మంబునం
గుంతలోత్తాలశైవాలజాలంబునన్ బాహువల్లీమృణాళంబులన్
బంధురోష్ఠాచ్ఛ బంధూకపుష్పచ్ఛటన్ మందహాసామృతస్యంద

డిండీరసారంబునన్ నిమ్ననాభీసుభావర్తగర్తంబునన్ గోమలోచ్చైర్వళిచ్ఛేదవీచీసముల్లాస సౌభాగ్యయోగంబునన్ నిత్యలక్ష్మీనివాసోన్నతం బస్ఫురత్త్రైకతాభ్యున్నతిం బాదకూర్మస్థితిన్ బేర్మిమత్తిల్లు నీహార శైలాత్మజాతాసరోజాకరంబున్ మహాకేళిహంసంబవై లోరిరంసాగతుల్ గ్రాలఁ గ్రీడించుపోడిం బ్రసూనేషుకోట్యర్బుదామంద సౌందర్యధుర్యున్నినుం గొల్చుపుణ్యుల్ వివశ్చిద్వరేణ్యుల్ గదా చూడఁ జూడాంచలనూతనీహారధామా! సుధాధామ! రామాకుచాభ్యంతరంబెట్లు నీ కుక్కిపట్టయ్యెనే నీకుఁగట్టన్మదేభేంద్రచర్మంబె? శర్మప్రదా! నిర్మలాత్మా! భవా! నీమహత్త్వంబు నిర్ణీతముంజేయ గీర్నాథుఁడుం జాలునే? నేత్రకర్ణేశతల్పాశుగా! భక్తకల్పా! సుధావిస్ఫురజ్జల్ప! ఆద్యం బచింత్యం బభేద్యం బసాధ్యం బబాధ్యం బనూనం బహీనం బనంతంబునై యొప్పు మత్పుణ్యపాకంబునం జేసి యాలోకసాధ్యంబుగాఁ దోఁచె వాచంయమిధ్యేయమూర్తీ! కృపాధార కీర్తీ! నమస్తే నమస్తే నమస్తే. 28

చ, అని తనుఁ బ్రస్తుతించుమనుజాధిపు మెచ్చి యుమాకళత్రుఁ డి
ట్లనియె ధరాధినాథ వినుమా యనుమానము మాని నీవు కో
రినవర మెద్దియైన వివరించి రయంబున నిత్తు సత్తుగా
నను నలరించుభక్తులు గనం దగరే తమచింతితార్థముల్. 29

మ, అనినం బ్రాంజలియై నృపాలుఁడు దయాయత్తున్మహాదేవుఁ బ
ల్కు నుమానాథ! గిరీశ! చంద్రధర! నాకన్ సద్వరం బిచ్చితే
ని నిరాఘాటతరప్రతాపుని హిమానీశుభ్రకీర్తిప్రియుం
జనతారక్షణదక్షు నిమ్ము తనయున్ సత్యాకరున్ శ్రీకరున్. 30

క. అనియనుడు శివుఁడు నీమన
మునఁ గలకోరిక ఫలించు భూవర! కో నీ
వనితకు నిమ్మని కల్పక
జనితంబగుఫల మొకండు జనపతి కొసఁగెన్. 31

చ. ఒసఁగినఁ దత్ఫలంబు మనుజోద్వహుఁ డాదర మొప్ప నంది తె
క్కసమగుభక్తి మ్రొక్కెఁ గఱకంఠునకున్ సతితోడ నంత న
య్యసమవిలోచనుండును సురాసురయక్షసమన్వితంబుగా
విసవిస నక్షిపద్ధతికి విందగుచందము మాని నయ్యెడన్. 32

మ. హరదత్తంబగు కల్పవృక్షఫల మార్యస్తుత్య! విశ్వంభరే
శ్వరుకాంతామణి ప్రాణవల్లభు నిజజ్ఞానంగతిన్ నేమ మొ
ప్ప రుచిన్ లోఁగొనియెన్ సదాశివు మనఃపద్మంబునం జేర్చి శ్రీ
కరమై యొప్పుదినంబునన్ దనయుకాంక్షాయుక్తి మత్తిల్లుచున్,

వ. ఇట్లు సఫలమనోరథుండై యమ్మహారథుఁడు నిజనగరోన్ముఖుండై యొక్కనాఁడు. 34

సీ. భక్తవత్సల! విశ్వభర్త! శంకర! నాదు
కోర్కి యీడేర్పుమీ కొంకులేక
అన్నపూర్ణాదేవి! యంబ! సైకతనితం
బిని! నన్ను రక్షించుమీ ప్రియమున
డుంఠివిఘ్నేశ! యుత్కంఠ నున్ముఖవృత్తి
నొందుమీ నను బ్రోచునోరిమ గలిగి
యఖిలలోకనమస్య! యాకాశగంగ! ని
ర్మలమూర్తి! యొసఁగుమీ మహిమ నాకు

గీ. రమ్యమతులార! యో పరివ్రాట్టులార!
యొరిమ సంకల్పసిద్ధి చేయుండు మిమ్ముఁ
గొలిచి యిన్నాళ్లు చల్లగా నిలిచినాఁడ
నరుగుచున్నాఁడ మీయాజ్ఞ నాత్మపురికి 35

గీ. అనుచు నాబాలగోపాల మవనిభర్త
యరుగు కాశికలో నున్నయందఱికిని
బెద్దపిన్నతరంబునఁ బేరుగ్రుచ్చి
చెప్పి గమనించెఁ దానేలు సీమఁగుఱిచి. 36

సీ. నలినాక్షితోఁ గాంచనస్యందనం బెక్కి
పెంపెక్కు భూజంభభేదనుండు
వారణరథహయవర భటాత్మకమైన
బలము పార్శ్వంబుల బలసి కొలువఁ
గౌండిన్యమునిలోకమండలాధిపునకుఁ
దనదువృత్తాంతంబుఁ దగినయట్లు
తేటతెల్లఁగ జెప్పి దీవించి యమ్మహా
మహుఁడు పొమ్మన సంభ్రమమునఁ గదలి

గీ. చని మనోహరరత్న కాంచనవిచిత్ర
బహుపతాకాభిరామంబుఁ బటువినోద
పూరితము నైన తనపురంబునకు వచ్చి
మరల వహియించె గహ్వరి గురుభుజమున. 37

ఉ. సాగరసప్తకీవృతరసాసరసీరుహలోచనం గృపా
సాగరుఁ డాసుధాంశుకులచంద్రుఁడు క్రమ్మఱ నేలుచుండె నా
శాగజదంతకాంతముల సాటికు నాత్మవిశుద్ధకీర్తి నా
నాగతులన్ విలాసవశనాట్యము చూపుచునుండ సంతటన్. 38

క. గిరిజావల్లభకరుణా
పరిణామసమగ్ర యగుచుఁ బతిదేవత భూ
వరురాణి గర్భవైభవ
పరిశీలిత యయ్యె సకలబంధులు నలరన్.

మ. పలుకంబారెఁ గపోలపాళికలు పైపైఁ దోఁచె జాడ్యంబు చ
న్నులఁ బొంకంబు ఘటిల్లె సోగలకన్నుల్ వెల్ల కాఁ జొచ్చె ను
గ్గులు విచ్చెన్ వళిభంగముల్ సరులపైఁగోర్కుల్ తమింబాసె
గ్గలమై చిట్టుము లుట్టగాఁ బొడఁగె రాకాచంద్రబింబాస్యకున్. 4

మ. కలగాంచుం డమరుత్రిశూలధరుఁడై కన్పట్టుబాలుండు పా
త్తుల నున్నాఁడని యాలకించు బయలం దోతెంచు గంధర్వ గీ
తులు కైలాసవసుంధరాస్థలమునందున్ గొల్వ గూర్చుండఁగాఁ
దలఁచుం బాలిక చంద్రశేఖర కళాదర్పస్ఫురద్గర్భయై. 4

మ. సరి నంభోనిధివేష్టితాఖిలధరాచక్రాభిరక్షావిధా
చరణుం బుత్త్రకుఁ గానఁగాఁగల సరోజాతాస్యకుం దోఁచు ని
ర్భరతన్ జిత్తమునందు శత్రువనితాఫాలస్థలీ కుంకుమో
త్కరముద్రాహరణ ప్రవీణఖరఖడ్గప్రాప్తిపైఁ గోరికల్. 4

చ. పలుచనిసొమ్ములున్ వెలుకఁబారుముఖాబ్జముఁ గ్రమ్మునూర్పులున్
దొలకుల నిండుకుక్షియును దుమ్మెదబోదలతోడి తమ్మి మొ
గ్గల నగునీలచూచుకయుగంబునఁ బొల్చుపయోధరంబు ల
త్యలసకటాక్షము ల్గలిగి యంగన చూపలరించు భర్తకున్. 4

సీ. అమృతాంశుకులవనాయత వసంతాగమం
బరివీరజ యగర్వహారణముద్ర
నిఖిలబంధుసరోజనీరజాప్తమరీచి
శాంభవతేజఃప్రచారవీధి

ఆహిరాజభారనిగ్రహము క్తికారణం
బాశాధిపతి నిజాశావృతంబు
ప్రియసఖీవీక్షణోచ్ఛ్రయనసంపల్లక్ష్మి
వల్లభేప్సితలతావల్లవంబు

గీ. వనఁగఁ జూపట్టి పొదలె నొయ్యన దినంబు
దినమునకు వృద్ధిఁ బొందుచు గొనబు మిగిలి
సాధుసంస్కారసంపత్తి సంస్కృతంబు,
వనితగర్భంబు సౌభాగ్యవర్ధకంబు. 44

ఉ. ఐదు శుభగ్రహంబు లరుణాంశుని గూడుక యుచ్చగంబులై
ప్రోది వహింప సొంపుగల పుణ్యదినంబున రాజరాణి శా
తోదరి గాంచెఁ బుత్త్రి నతులోర్జితదీధితిమిత్రు విక్రమ
శ్రీదితిజారిమూర్తి ప్రభుశక్తిసమాశ్రితభానుకైవడిన్. 45

వ. అంత. 46

సీ. వినుతపావనజలంబున మజ్జనము చేసి
కమనీయశుద్ధవస్త్రములు గట్టి
మౌహూర్తికులచేత మార్తాండముఖశుభ
గ్రహముల యనవద్యగతులు దెలిసి
తరతమభావంబుఁ బరికించి పుడమివే
ల్పులకు సువర్ణంబు భూరి వెట్టి
పంజరంబుల నున్నపక్షుల బందీల
హస్తుల విడిపించి యర్హాభంగి

గీ. వినుతదానంబు లొనరించి యనుఁగుఁజెలుల
యట్ల నట్టింటఁ బగవారి నాదరించి
నగరదైవతముల నర్చనాసమృద్ధిఁ
దనిపె సుతజన్మదినమున ధరణివిభుఁడు. 47

ఉ, సంచితపుణ్యశాలి నృపచంద్రకళాభరణుండు దా విశే
షించియు శేషహారునకుఁ జిత్రమణీకృతతోరణంబులున్
గాంచనదీపపాళికలు గ్రామములున్ బహువస్త్రపేటికల్
చంచలనేత్రలన్ దనయుజన్మదినంబున నిచ్చె వేడుకన్.

సీ, ఘుమఘుమనురుము సంఘటితమహా నూతన
మణి వహించువిదూరమహివిధమునఁ
చిఱుతప్రాయముతోడి శీతాంశువుని సొంపు
దళుకొత్తునవరదిక్తటి తెఱఁగునఁ
గొదమరాయంచ సమ్మదమున విహరించు
చెలువంబుఁ దలమోచుకొలనికరణి
నవకమై తళుకొత్తు ననకుట్మలంబుచే
వఱలుమోహనకల్పవల్లివగిది

గీ, భాసురోంకారమును గూడి ప్రజ్వరిల్లు
విపులపంచాక్షరీమంత్రవిద్యరీతి
భర్గకళ పూని దీపించుబాలుఁ బొదివి
కూర్మి దనరారె నృపురాణి కువలయాక్షి.

చ, జగతి నరిష్టముల్ దలగఁ జాలి భుజాభుజగాధినాథుపై
నిగుడువఁ గల్గుపుణ్యగుణ నిర్మలమూర్తి కరిష్ట మింతయుఁ
దగులునె పాయుఁగా కనువిధంబున వీడె నరిష్టసంగమం
బగణితభాగ్యలక్షణ విహారికి భూపతిముద్దుపట్టికిన్.

మ, పురుడుం బుణ్యముఁ దీర్చి శంకరపదాంభోజాతభృంగంబు భూ
వరచూడామణి వల్లకీపతి నభోవాణీవశస్వాంతుఁడై
సురధాత్రీసురులం భజించి పిదపన్ సూనున్ బ్రభాభాను వే
దరపం బొప్పఁగ ముంజభోజుఁ డని యత్యంతం బెట్టెఁ బే రున్నతి

శా. గీర్వాణాహతమర్దలధ్వనులు గల్గెన్ సర్వదిగ్వీధి గం
ధర్వీగానము తానమానములతోఁ దారస్థితిం దోఁచె స
త్పార్వద్యోతము నిర్మలంబగుచుఁ గాయం జొచ్చెఁ బాథోధియం
తర్వైశ్వానరతాపముల్ వదలెఁ దన్నామోక్తికాలంబునన్. 52

సీ. ఆపాదమస్తకం బంగసంధుల వెంట
దుసికిల నూనియ దోఁగ నంటి
ప్రత్యగ్రబింబికావత్రిచుంబితముగాఁ
బలుచగా నెమ్మేన నలుగు వెట్టి
గాజుఁగొప్పెరలలోఁ గమ్మనీకున నూరు
తలములపైఁ జేర్చి జలకమార్చి
శివరక్ష యంచు మచ్చిక జలంబులు గొన్ని
చులుకమాత్ర మొగంబుచుట్టుఁ ద్రిప్పి

గీ. యొయ్యనొయ్యనఁ దడియొత్తి యుగ్గుచూపి
తిరుగఁ దలయంటి చనుబాల దెలివిగొలిపి
నేత్రముల నంజనము నించి నిద్రవోవం,
బాడుఁ బొత్తుల సవరించి బాలు ధాత్రి, 53

శా. నీలస్తంభవిజృంభితోజ్జ్వలహిమానీశుభ్రసౌధంబులో
నాలోలంబగు తొట్టిమంచమున నొయ్యం జేర్చి జోకొట్టి యు
య్యాలో జొంపల యంచు నూఁపుదురు శుద్ధాంతాబ్జపత్రాక్షు లా
బాలుం బాలశశాంకశేఖరకృపాసారీణు గారామునన్. 54

చ. తగినవిభుండు గల్గె నని ధారుణి హర్షము నొందెఁ గల్వపూ
మొగడలవిందువంగడము ముందటికిన్ మొనసాఁగె తేనికిన్
బెగడుపితౄణభావమునఁ బేర్చుట మానెఁ గృపావిలాసవ
న్నిగమహాయప్రభావగుణనిశ్చితుఁడై నృపసూతి యొప్పుటన్. 55

ఉ. ఉగ్గననిట్లువల్కు విమలోష్ఠపుటంబులు విచ్చి సారెకుం
బుగ్గననవ్వు రెప్పకవ పొందఁగఁజేయక చూచు దిక్కులన్
డగ్గఱి జోలవాడెడువడంతులపాటలు నాలకించు న
య్యగ్గుణశాలి యైనమనుజాగ్రణిపుత్త్రుఁడు బాల్యసంపదన్. 56

మ. జడలై తూలెడు పుట్టు వెండ్రుకల్ రత్నావలికాబంధముల్
మెడ శార్దూలనఖంబు ముద్రికలచే మేకొన్నహస్తాంగుళుల్
కడుఁ జూపట్టిన మద్దికాయలును గల్గల్లంచుఁ బాదంబులన్
నడువం బల్కెడుగజ్జెలుం గలిగి కన్పట్టున్ గుమారుం డిలన్. 57

సీ. అలికపట్టికమీఁద నతులముక్తాఫల
శ్రీకరంబగు రావిరేక మెఱయఁ
బాలబుగ్గలకాంతి మేలంబులాడుచు
మద్దికాయలతళ్కు ముద్దుగురియ
మణిబంధములయందు మట్టసంబగు చేఁతఁ
గనుపట్టుహస్తకంకణము లమర
సిగ్గెఱుఁగని కటిసీమ నడ్డిగలు గ్రు
చ్చిన గట్టియగు కాంచి జిగిదొలంక

గీ. తొక్కుఁబల్కుల నమృతంబు పిక్కటిల్ల
మురిపమంతయు లావణ్యగరిమ గాఁగ
నడ్గులకు మద్గులొత్తంగ నల్లనడుచుఁ
బడుచునవకంబు మీఱినపాయమునను. 58

సీ. ఇంతవైభవ మొద్ది హిమశైలనందనా
ప్రమథనాథులు గన్న కొమరుసామి
కిమ్మహాసౌభాగ్య మొద్ది పులోమజా
హరిహయు ల్గన్నజయంతమూర్తి

కీపాటిసిరి యెద్ది యిందిరామధుకైట
భారులు గన్నపుష్పాయుధునకు
నీలాగుగారవం బెద్ది కౌసల్యాద
శరథేశ్వరులు గన్నఖరవిరోధి

గీ. కిట్టిగోమున నున్నవపెట్టు దేవ
కియును వసుదేవుఁడును గన్న కేలిమనుజ
విగ్రహుండగు త్రైలోక్యవిభున కనఁగఁ
బెరుఁగఁబుత్త్రిందు జనమనఃప్రియ మెలర్ప. 59

గీ. అరఁటివండన నడుగెత్తు ననఘమూర్తి
చెఱకుఁగోలకుఁ జేసాఁచుఁ జన్నితండ్రి
యనుచు శుద్ధాంతకామినీజనులు చెలఁగి
నడపు దిద్దంగ నడుచు భూనాథసుతుఁడు. 60

గీ. నడుచుధర్మంబు పుడమిపై నడుప వేని
తొలుకుఁబలుకు విరోధులబలము లొలుకఁ
బ్రోది నేనికకొమ్మున దాదికొమ్మ
నన్నివివర్ధిల్లెఁ బ్రమథేశ్వరునిసుతుండు. 61

గీ. జలధరమునకు సురధనుర్విలసనంబు
కుంభిరాజంబునకు మదోజ్జృంభణంబు
చంద్రునకు శారదారంభసౌష్ఠవంబుఁ
బోలె జవ్వన మారాజపుత్త్రిఁ బొదివె. 62

సీ. మాంసలాంసద్వయీమహిమ ముక్కంటినం
దనమూఁపురమునకు ననుఁ గనంగ
దిగిభశుండాదండదీర్ఘహస్తంబులు,
భూమిజయస్తంభములొ యనంగ

శాస్త్రదృష్టికృతార్థచారులోచనములు
సిరికిఁ బద్మంపుటోవరులో యనఁగ
సాలమానమున నుత్తాలోజ్జ్వలంబైన
రూపు పౌరుషములతోఁ బ్రవసంగ

గీ. క్షత్త్రధర్మంబు దాన సాక్షాత్కరించి
యుజ్జ్వలాకారసంపద నొందె ననఁగ
సర్వజనతావిలోచనపర్వ మయ్యె
రాకుమారుండు యౌవనారంభవేళ. 63

సీ. లబ్ధవర్ణశ్రీవోలంకారరేఖయై
భాసిల్లు నాడిన భాషణంబు
హరిణలాంఛనజూటచరణాంబుజములకు
రోలంబపాళియై వ్రాలు మనసు
హరిదంతకరిదంతపరిఘాతరములకు
బలు వెడితోడవులై వెలయుఁ గీర్తి
దర్పితాహితరాజదావానలమునకు
ఘనవర్షధారయౌ ఖడ్గధార

గీ. ప్రచురయాచకలోచనోత్పలములకును
విమలచంద్రాతపంబగు వితరణంబు
గండుమీఱుచు నారాజగంధకరటి
భాగ్యసౌభాగ్యవైభవోద్భాసి యగుట. 64

చ. చదువక వేదశాస్త్రములు సమ్మద మొప్పఁగఁ జేసె సాముసం
గదియఁగ హెచ్చి వచ్చె నసికార్ముకచర్మముఖాస్త్రకౌశలం
బొదవె నొకవ్వడున్ దడవకుండినఁ గానకళావిలాసముం
గొదువ యొకింత లేక ఫణికుండలువంపున రాజసూతికిన్. 65

సీ. ఎట్టి పల్కులనైన నింతశంకరకథా
సౌరభం బుండిన సమ్మతించు
నేచందముననైనఁ గాచి చక్కనఁజేయు
శితికంఠుధర్మంబు కుతిలపడినఁ
బసుబిడ్డనికినైనఁబట్టి తత్త్వముఁ దెల్పి
హరుఁడె దైవంబని తెరవు ద్రొక్క
నీశుభక్తుఁడు శౌరి యీరాని దడిగినఁ
ద్రోయు కిచ్చును తృణప్రాయముగను

గీ. వారినిధిఁ దోఁచు బుద్బుదప్రాయమట్లు
త్రిజగములు భర్గతేజోబ్ధిఁ దేల నెఱుఁగు ?
గర్భశైవుండు కలిదోషగర్వహరణ
భూరిసత్కీర్తి శ్రీముంజభోజమూర్తి. 66

శా. మత్తారాతినృపాలకంధరలు దుర్గింపం బుట్టి క్రొన్నెత్తురున్
హత్తన్ జిప్పిలు చెమ్మఁగ్రమ్ము నసిధారాధ్వంబులే పెట్టి యు
ద్వృత్తిన్ వచ్చును జిక్కువారక సమిద్వీథిం జయశ్రీతదా
యత్తత్వంబు వహించి చిత్రఘటనావ్యాపారపారీణయై. 67

సీ. తడవిండ్లవగ మాని తడవిండ్లవగ వూని
మందోదయుండయ్యె మగధభర్త
పదమంచు నడవంగఁ బదమంచు లవియంగ
గును కభ్యసించు నాకురువిభుండు
అలము లెత్తుటడించి యలము లొప్పఁగఁబొంచి
వనవాటుకటు నేఁగె వత్సరాజు
కలను సేయుచలంబు కలను లేక బలంబు
నెఱిఁదప్పి దిటదప్పె నిషధనాథుఁ

గీ. దహహ! ఫాలాక్షశూలధారాగ్రశాత
ముఖమహోఖడ్గవల్లరీసఖభుజాహి
సార్వభౌముండు ధైర్యసువర్ణశాద్రి
రాజకంఠీరవుఁడు ముంజభోజు కలిమి.

శా. మెట్టం డెన్నఁడు నగ్రధాటి రణకుంభివ్యగ్రభాగంబులన్
బట్టం డెన్నఁడుఁ గేలఁ జావలతటిత్ప్రక్రూరబాణంబుతో
ముట్టం డెన్నఁడు మండలాగ్రము జయాంభోరాశి భూభర్త ద
వెట్టిం గొట్టము చేయుచుండుదురు నిర్వీర్యాత్ములై శాత్రవుల్.

గీ. స్ఫటికశిలయందుఁ గలయంగఁ బ్రతిఫలించు
దాసనపుఁబూవు కెంజాయ తళుకువోలెఁ
దండ్రిగుణసారవిస్ఫూర్తి తనయునందు
నాఁడునాఁటికిఁ బర్వికొనంగవచ్చు. 7

చ. భసితముఁ బాముబేరములుఁ బచ్చికరీశ్వరవృత్తి వేఁడి బ
ల్విసముఁ గరోటిపాత్రికయు వృద్ధతరంబగు నుక్షరాజమున్
నొసలివిలోచనంబు విడనూకి శుభోజ్జ్వలలక్షణంబులన్
బస నటియించు శంకరుని భాతి మనోహరమూర్తి ఫాల్గుణున్. 7

సీ. పరమపావనమనఃపంకేరుహమునకు
హారగాఢ పరిమళవ్యాప్తి గాఁగఁ
గమనీయసత్కీర్తికల్పవల్లికి సర్వ
విభుఁడు పెన్నాఁకటి పేరు గాఁగ
మానితనిజభుజామందారశాఖకు
దానోదకము పూవుఁదేనె గాఁగఁ
బ్రణుతనానానూత్నగుణరత్నముల కీశ
భక్తవర్ణములు నిక్కపట్లు గాఁగ

గీ. మండలాగ్రవలమునకు మత్తవైరి
గేహినీబాష్పధారలాజ్యాహుతులుగ
వసుమతీశ్వరకోటీరవజ్రకలిక
రాజనందనుఁ డొప్పు హేరాళముగను. 72

శా. ఆరాజన్యకులావతంసము భుజాయత్తాసికాలాహిచేఁ
గ్రూరారాతులప్రాణవాయుభరముల్ గ్రోలించుచో నక్క త
న్నారీలోచనపద్మపత్త్రపుటలలోనం బల్విషం బిట్టిచి
ప్రారంభం బతడందెకాళ మతి యొండైనం (గవం) బోలునే. 73

గీ. జలజవదనలు మీనలోచనలు చక్ర
వాకవక్షోరుహలు నైనవసుమతీశ
కన్యకాసింధువులు ప్రేమ గడలుకొనఁగఁ
జెట్టవట్టిరి లక్షణశ్రేష్ఠు నతని. 74

చ. వినయమునన్ వివేకమున విక్రమసంపద సాధులక్షణం
బునఁ గొద యింత లేక ఫణిభూషణు సత్కృప గల్గి విశ్వభూ
జనమతిపాత్రు నింపలర సాగరకాంచికి నాథుఁ జేసెఁ ద
జ్జనకుఁడు శైలదంతి కిటి సర్పవిభుల్ ప్రమదంబు నొందఁగాన్. 75

క. ప్రాయమునఁ గొంచెమయినన్
న్యాయము భుజశక్తి నరవరార్యుఁడు మిగులన్
గాయు దవానలకీలా
ప్రాయప్రబలప్రతాపబహుళాతపముల్. 76

గీ. ముదియువటభూజమందున మూలబలము
వదిలముగ నూడ లొయ్యవ గదియురీతి
జరఠనృపుఁ బాసి తత్పుత్త్రుఁ దరుణుఁ బొదవె
మూకప్రావయి యందంద మట్టి కొలువ. 77

క. తల్లిగల ప్రజలకై వడి
బల్లిదుఁడగు నతనిబాహుబలమున ధరలో
నెల్లజనులు మోదించిరి
చల్లనయై రామరాజ్యసౌఖ్యముఁ గనుచున్. 78

క. నరవరుఁ డేల "శతాయుః
పురుష" యనెడు వేదవాక్యముఁ బ్రజ బ్రదుకున్
ధరఁ గొండ్రవేయఁ బండున్
దొరఁగున్ వర్షంబు సావితో నెయ్యెడలన్. 79

క. హృత్పృథమేచక యయ్యును
దత్పార్థివుఖడ్గయష్టి ధవళయశశ్శ్రీ
నుత్పాదించున్ బ్రథిత రి
పూత్పలగంధిస్మితంబు నొగిలె నసుక్రియన్. 80

క. హరుఁడు జగంబుల నుండఁగ
హరునందు జగంబు లుండ నాత్మ నెఱిఁగి భా
సురవిజ్ఞానాంబుధి భూ
పురందరుఁడొ యనఁగ ముంజభోజుఁడు వెలయున్. 81

క. నుతమగుణశాలి యగుతన
సుతునందు ధరిత్రి నిలిపి సొబగొందుట హృ
ద్గతిఁ గనుఁగొని ప్రమథేశ్వరుఁ
డతివయుఁ దాఁ గాశికకును నరిగెడు నెడలన్. 82

క. భవసంభవసౌఖ్యంబుల
చవు లొల్లక కుబుస మూడ్చునర్పము పోలెన్
దవు లూడిచి ప్రమథేశుఁడు
సద్వినయసుతుఁ బల్కె నిట్టిచందము తోడన్. 83

చ. చదివితి నాల్గువేదములు శాస్త్రము లాఱుఁ దదన్యవిద్యలున్
సదభిమతోక్తదక్షిణల జన్నము లన్నియు నాచరించితిన్
దుది నిను గూర్మి బంధుజనతోయజనూర్యునిఁగంటిఁబుత్త్రిఁగాఁ
గొదువ యొకింత లేక కనుఁగొంటి నిహంబునఁ గల్గుసౌఖ్యముల్.

గీ. చాలఁ దనిసితి నిందుల సౌఖ్యలబ్ధి
గరిమతోఁ గాలు కే లాడుకాలముననె
విశ్వపతి నీశుఁ గాశికావిభు భజించి
యుల్లమున నున్న యుడు కాఱి యుండవలయు. 85

గీ. శైశవంబునఁ జదువును జవ్వనమున
భోగసక్తియు వార్ధకమున మునీంద్ర
వృత్తి నిలుచుటయును మీఁద విపులయోగ
కలనమై ద్రోచుటయు మనకులమునడక. 86

ఉ. కావున నేను గాశిఁ గఱకంఠు భజించి సమస్తపాపి
ద్రావణజాహ్నవీసలిలధారలఁ దోఁగెదఁ బుట్టువుం దిగం
ద్రావుటకై మదుద్యమము దప్పదు నిక్కము మామకాజ్ఞ నీ
భూవలయంబు తోంటినృపపుంగవులట్లుఁ బ్రోవు నందనా!. 87

క. దొరకు నిరంతరపుణ్యము
పరోపకారమునఁ, గరము పాపము వచ్చున్
బరపీడనంబుచే నని
పరువడి పయశాస్త్రవిదులు పలికిరి వత్సా!. 88

క. కావున పరోపకారమె
వేవిధములఁ జేయుబుద్ధి విడువకు పాపై
కావాసము పరపీడన
మా పీడుము తప్పిసక్తి యార్యసుతాత్యా! 89

మ. నయకావ్యున్ మతిగీష్పతిన్ బ్రబలసేనాపోమసేనాని న
వ్యయగాంభీర్యపయోనిధాను శుచితావ్యాసక్తి గాంగేయు స
త్యయమప్రోద్భవు ధైర్యహేమగిరి సంధాజామదగ్న్యుం దమో
దయరాముస్ సచివాగ్రణిన్ బెనుపు తత్కార్యసంసిద్ధికిన్.

గీ. గోపకుం డావునల్లనఁ గుస్తరించి
యొయ్యనొయ్యన దుగ్ధంబు లొడుచుకరణిఁ
బ్రజలచిత్తంబు గందనివగిడి నడచి
ధర్మవర్తనమునఁ గాంచు ధనము లనఘ!

గీ. ఎంతయపరాధ మంతయు నెగ్గుసేయు
విధివిధం బెట్టులట్లనె వేల్పు లగ్ని
ఫలము చేకొను సందాఁక బట్టివట్టి
వని విసర్జింపఁ గార్యసంశావ్యబుద్ధి

వ. అని ప్రమథేశ్వరుం డనేక ప్రకారంబులఁ దనకుమారునికి
విద్యాప్రకారం బెఱింగించి తనయుద్యోగంబునకుఁ బరితపి
నతని నుచితవచనంబుల నూఱడం బలికి ధర్మపత్నితో
ముక్తంబునకు నవిముక్త ప్రయత్నంబునం జనియె నంత.

ఉ. తండ్రి విరక్తుఁడై మునిమతంబునఁ గాశికిఁ జన్నపిమ్మటన్
దండ్రియుఁ దల్లియుం గురుఁడు దాతయు దైవమునై మహీంద్ర
దీంద్రవహింపఁ బ్రోచు నరదేవశిఖామణి వైరిమండలం
బాండ్రను బిడ్డలన్ విడిచి యద్రిమహాగృహముల్ భజింపగా!

ఉ. ఆదిమశైవలక్షణ సమాచరణాత్ముఁడు ముంజభోజభూ
మీదయితుండు వారిధులు మేరగ మధ్యమలోక మేలుచున్
సాదులఁ బేదలన్ విభవసాంద్రులఁ జేయుచు నుండి యొక్క
డా దివిపన్నదీమకుటు నాత్మఁ దలంచుచుఁ బల్కె నీక్రియన్.

క. ఈకాంతలు నీతనయులు
నీకాంచనరాసు లెల్ల నెన్నఁడు ధ్రువముల్
గాకుండు టెఱిఁగి బుధులకుఁ
గాకోదరరాజహారుఁ గని మనవలదే! 96

క. చదివియు వివేక మెఱుఁగక
మదమున హరికథలు చదువ మఱచినమూఢున్
గుదియింపవె యమకింకర
పదభిదురకఠోరఘోరపాతములు తుదిన్. 97

క. శ్రీకంధర పదజలజా
లోకనవిముఖాత్ములైన లోకుల మొగ మా
లోకించిన ప్రాజ్ఞుల కా
లోకింపఁగవలదె లోకలోచనమూర్తిన్. 98

క. అని తోఁచుచున్నయది నా
మనమున నట్లయ్యు మమత మానదు సుతదా
రనికాయంబులమీఁదట
మునుకొని మున్నట్టికర్మములు సేసితినో. 99

క. ఈ విషయానుభవంబులు
పోవిడుమని తెలిపి చెప్పి పురహరుఁ గొలువన్
ద్రోవ కనుపించుపుణ్యుని
దేవుఁగాఁ జూతు నొక్క ధీమార్గమునన్ 100

క. సద్గురునాథ కటాక్షస
ముద్గత కారుణ్య లాభమునఁ గాక తగన్
హృద్గోచర మెట్లగు దివి
షద్గంగాధరుపదాంబుజద్వయి నాకున్. 101

క. అహికంకణుపాదాంభో
రుహములు గనువాఁడ సద్గురునికృపకతనన్
వహియింపఁగ నోపని దు
స్సహసంసృతి యిదియు నొక్కసౌఖ్యము గాదే! 10

గీ. అరసి యెంతటి వారికి నందరాని
నీలలోహిత పదమహానిధిఁ గనంగఁ
దత్త్వవిదుఁడైన దేశికోత్తమునసదయ
మగు కటాక్షాంచలంబు దివ్యాంజనంబు, 10

గీ. చేవ సంసారభవసుఖక్షితిజములకు,
నావ కలుషాంబునిధి తారణంబునకును,
ద్రోవ దుర్లభతరము ముక్తిదుర్గమునకు
శ్రీమదారాధ్యపాదరాజీవసేవ, 10

ఉ. కాయము శారదాంబుదనికాయముపోలెఁ దలంప నధ్రువం
బాయువు భిన్నకుంభగత మైనజల గతిన్ వసించు నీ
ప్రాయము సత్తనా దగగు పంచమ (!) వాసరభోగ్య మింక స
కాయజవైరిఁ జేరుటయె కర్జము నాకు గురూక్తిపద్ధతిన్ 10

క. ముక్కంటిమూర్తి యిదియని
నిక్కంబుగఁ దెలిపి చూపనేర్చుగురుఁడు నా
కెక్కడఁ గలిగెడి దైవమ!
అక్కట నాప్రార్థనంబు నాలింపఁగదే! 10

గీ. అనువిచారంబుతోడ నన్యములు నెవ్వి
యును సమీక్షింప నొల్లక మనసుతోనఁ
దగినదేశికు వరయు నద్ధరణినాథుఁ
డొక్కరే యిట్లు కలగాంచె నక్కజముగ, 10

గీ. అక్షమాలావిభూషితుం డరుణజటుఁడు
సాంద్రభసితాంగరాగుండు శైవుఁ డొకఁడు
తెరువుఁ జూపంగ నరిగి భూవరుఁడు నడిచె
ఖండపరశునిజనగరంబు వెండికొండ. 108

వ. ఇట్లఖిలజగన్మండనంబగు నక్కొండల జేని నధిరోహణంబుచేసి
తదీయంబులగు బహువిశేషంబులకుఁ బ్రతోషంబుఁ బొషింపుచుఁ
దోఁచి చని యథోచితప్రకారంబున నందికేశ్వరానుగ్రహంబు
వడసి జ్యోతిర్మయంబగు చేతోజదమను దివ్యభవనంబునఁ జొచ్చి
సప్తకక్ష్యాంతరంబులు గడచి యగ్రభాగంబున. 109

క. ఖరకరహిమకరవైశ్వా
నరదీప్తుల ధిక్కరించి నానాదిశలన్
బొరిఁబొరిఁ బొదివెసి యొక భీ
కర తేజము గాంచి ధరణికాంతుం డంతన్. 110

గీ. అధికతర సంభ్రమంబున నంగకములఁ
బులకజాలంబు చెమటయు నెలకొనంగఁ
బొగడ దగ్గఱిలోఁగి యుర్వ్యాధివరుఁడు
చిత్రరూపంబువోలె నిశ్చేష్టుఁ డయ్యె.

గీ. ఇట్లు నివ్వెఱగందియు నెట్టకేల
కు నరనాథుఁ డచల భక్తిధనుఁడు గాఁగ
సమ్మహోదార తేజంబు నక్షిమార్గ
మునకుఁ గోచరముగఁ జేసి యనుపదంబ. 112

నొక్కో యనుచు శంకరుండు నాపాలం గృపాలుం డగునొ
యనుచు ననేకప్రకారంబుల మనోరథపరంపరాపరతంత్రుం
యుండె, నక్కాలంబున నొక్కనాఁడు ముక్కంటి యాన
దలమోచి 12

సీ. పుట్టెనే గురుభర్త భువనాద్భుతముగాఁగ
నాగేంద్రహారుమానసమువలన
నుండెనే యాచార్యమండలేశ్వరుఁడు భూ
మండనంబగు మతిగొండయందుఁ
గట్టెనే దేశికాగ్రణిచేతఁ గంకణం
బలఖేచరులదైన్య మపనయింపఁ
గాంచెనే యారాధ్యపంచాననుం డన్య
మతవిభేదక్రియాచతురబుద్ధి

గీ. గరిమ నెలకొల్పె నేమయ్యగారి తేఁడు
తరలకుండఁగ ధర శైవధర్మవృత్తి
యట్టి శ్రీయుద్భటస్వామి యరుగుదెంచె
రాజకుంజరుఁడగు ముంజభోజుఁ గుఱిచి. 1

మ. భసితోద్ధూళితదేహకాంతులు శరత్ప్రాలేయభానుప్రభం
బరచేయన్ బహుశైవలక్షణముల్ భాసిల్లుట న్మూర్తిశాం
తిసముల్లాసము వాఁ దలిర్చ యట ధాత్రీనాథునాస్థానరం
గసమీపంబున నిల్చె నుద్భటుఁడు శ్రీకంఠావతారాకారుఁడై. 1

క. చటులుఁ డా నురకభువిం
బుట్టినక్రియఁ దేజరిల్లుపుణ్యుని గురురా
ట్పట్టాభిషిక్తుఁ గన్నుల
పుట్టువునకు ఫలముగాఁగ భూపతి గాంచెన్, 1

గీ. పాయకుండినవాఁడొ ప్రాగ్భవమునందు
నలపురారాతి తెలిపినఁదెలిసినాఁడొ
అట్లు వచ్చిన గురుమూర్తి నతఁడ యుద్భ
టాహ్వాయుఁడు గాఁగఁ దలఁచె నయ్యవనివిభుఁడు. 126

మ. మన మానందరసాప్లుతైకకలనన్ మత్తిల్లఁ గంఠీరవా
సనముం బూర్వనగంబుడిగ్గు రవితేజం డిగ్గి పాపౌఘ మ
ర్దనమున్ దద్గురుసార్వభౌమునిపదద్వంద్వంబుఁ గోటీరర
త్ననికాయోల్లలదంశుమంజరులచేతన్ గప్పె రాజమ్మ్రులన్. 127

గీ. ప్రణతుఁడై యిట్లు మాంపాహి పాహి పాహి
యనుచుఁ బులకాంచితాంగుఁడై వలుకనృపతి
లేవ నియమించి యా గురులింగమూర్తి
పెట్టె శిఁరక్షయంచు సంప్రీతి భూతి. 128

క. అహితాంతకుఁడగు ధరణీ
మహిళారమణుఁడు శంభుమానసవృత్తిన్
విహితసపర్యారచనా
ప్రహృష్టుఁ గావించె వినయభాసురుఁ డగుచున్. 129

సీ. శరదిందుచంద్రికాచారుప్రభాలబ్ధి
యఖిలదిక్కులు నిండి యమరువాని
నిత్యప్రసాదమానితదేహసంపత్తి
మించి చూపరుల బొంకించువాని
అతిశాంతనిజకటాక్షాంచలసామగ్రి
తలఁపులోపలి శుద్ధిఁ దెలుపువాని
అమృతధారార్ద్రవాక్యశ్రేణిఁ బశువుల
నైనఁ దజ్ఞులఁ జేయఁ బూనువాని

గీ. పాపపుంజంబు వికిరింప నోపువానిఁ
బుణ్యములపుట్టిసి ల్లనఁ బొల్చువాని
సకలశైవాగమార్థలక్షణధురీణు
నలఘువిజ్ఞాను సద్భటుఁ బలికె నృపుఁడు. 130

క. వింటి నటమున్న యీము
క్కంటికృప నిన్ను నేఁడు కౌతుక మొదవన్
గంటి భవాంబుధి గుల్ఫము
బంటి సుమీ నాకు నింకఁ బరతత్త్వనిధీ! 131

శా. ఆదిబ్రహ్మకపాలభూషణుఁ ద్రిమూర్త్యాత్మున్ శివున్ వహ్నిచం
ద్రాదిత్యానిలభూమరుత్పథపయోయజ్వస్వరూపున్ జిదా
మోదున్ శంభు భజించి యోగిజనతాముఖ్యుండవై యున్ననీ
పాదాబ్జంబులు గంటిఁ బాశములచేఁ బట్బాడి శైవాగ్రణీ! 132

క. అజతుల్యాహారమహత్త్వము
నిజముగఁ దెలియంగనోపునేర్పును గనఁదిన్
గుజగుజయగు నాచిత్తం
బు జనస్తుత! బుద్ధి చెప్పి బ్రోవవె నన్నున్. 133

క. అఖిలాత్మవేది వింద్రియ
సుఖదూరుఁడ వాదిశైవచూడామణి వు
న్ముఖమంత్రఫలుఁడ వాగమ
సఖబుద్ధివి దేవ! నీవు సామాన్యుఁడవే? 134

ఉ. ఏమితపంబు చేసి పరమేశ్వరు నేకిరియఁ గొల్చినాఁడనో
యే మునువంటిపుట్టువున నిట్టిగురూత్తము నిన్నుఁ గంటి మ
త్కామిత మబ్బెఁ బాపములు గ్రిందిఠి ముక్తి కురంగలోచనా
కోమలదృగ్విలాసములు గొల్లలు పట్టుదు నింకమీఁదటన్. 135

క. శివలింగము ధరియింపని
యవివేకికి నిహముఁ బరము నంద దనుచు వే
దవిదులు చెప్పఁగ విని విని
తపులుదుఁ జింతాభరంబు తత్త్వార్థనిధీ ! 136

వ. కావున లింగధారణపరికారంబును గురుశిష్యవర్తనంబును శివా
ర్చనావిధానంబును సవిశేషంబుగాఁ జెప్పి నన్నుఁ గృతార్థుఁ
జేయవే యనుచుఁ బునఃబునఃప్రణామంబులు గావించు నృప
సార్వభౌమునకు గురుసార్వభౌముం డిట్లనియె. 137

క. క్షితివర ! నీయత్నము మె
చ్చితి మల్ల తలంపు వలయు శ్రీకంఠునిపైఁ
గృతపుణ్యుఁడ వీవు మహా
మతిగణ్యుఁడ వీశుభక్తి మరగినకతనన్. 138

క. ఈ యంగన లీ యాత్మజు
లీ యర్థము లీ దళంబు లిన్నియును దృణ
ప్రాయములు సేసి మదిలో
నాయిందూత్తంసు నిలిపి తద్భుత మధిపా ! 139

ఉ. భూరిసువర్ణపుష్పములఁ బూజ యొనర్చినవాఁడ వీవు కా
మారి మురారిబాణుఁ ద్రిపురారి మఖారి గజారిఁ బాపసం
హారి ననేకజన్మముల నట్టివిధం బొనగూడకుండినన్
వారిజనూతికైనఁ గనవచ్చునె శంకరభక్తి భూవరా ! 140

సీ. హరున కర్పింపనియన్నంబుఁ గుడుచుట
కుచ్చితోచ్చిష్టంబుఁ గుడిచినట్లు
భవుని కర్పింపనిపానీయ మానుట
మానక యాసవం బానినట్లు

శివున కర్పింపనిపువ్వుదావి గ్రోలుట
　　కుణపధూపం బోలిఁ గ్రోలినట్లు
శంభుభక్తుఁడు గానిజడబుద్ధి నంటుట
　　గెంటక చండాలు నంటినట్లు

గీ. పశుపతికిఁ గానిపుణ్యంబు పట్టుటయును
బాపములు సేయుయత్నంబు పట్టినట్లు
లనుచుఁ బ్రాజ్ఞులు విజ్ఞాన మతిశయిల్ల
నన్ని తెఱఁగులఁ బూజింతు రష్టమూర్తి. 141

క. ఉత్తమకులజుండై గుణ
వత్తముఁడై వేదశాస్త్రవరశబ్దార్థా
యత్తమతినిజముగల లో
కోత్తముఁ గురుఁ జేరవలయు నుర్వీనాథా! 142

క. శ్రద్ధాభక్తిసమృద్ధిఁ బ్రి
సిద్ధుండై చెప్పినట్ల చేయుచు నెందుఁ
గ్రుద్ధుండుగాక శాంతియు
సిద్ధాంతము సేయువాఁడు శిష్యతకుఁ దగుఁ. 143

క. శివదీక్షలేక మోక్షముఁ
దవులఁడు జనుఁ డెంతవాఁడుఁ దనయంతనె య
ట్లవుఁగాన భక్తిగలిగిన
భవదూరుఁడు లింగదీక్ష భజియింపఁ దగున్. 144

సీ. ధరణీశ! విను లింగధారణంబునకును
　　వివరింతుఁ గాలంబు విశదఫణితిఁ
గడుయోగ్యములు శరత్కాలవైశాఖముల్
　　జ్యేష్ఠఫాల్గునమార్గశీర్షసంజ్ఞ

తంబులు నెలలు మధ్యమములు మాఘంబు
నాషాఢమాసంబు నగుఁ గనిష్ఠ
ములు చైత్రమును బుష్యమును భాద్రపదమును
శ్రావణంబును నవరంబు లయ్యె

నుత్తమంబగు సూర్యచంద్రోపరాగ
కాలముల నిందిరంబగు కాలమైన
ధవళపక్షంబు బహుళపక్షవళమైనఁ
బంచమియు గ్రాహ్యములు సుమ్ము భవునిఁ బూన. 145

చవితి నవమిని షష్ఠి నష్టమిని బున్న
మను జతుర్దశి దీక్షకు ననువు గాదు
కడమతిథు లుత్తమములు శంకరు భజింప
నింక నక్షత్రయోగ్యత నేర్పరింతు. 146

మంచిది రోహిణి మఖ లెస్సయదియుత్త
మము పునర్వసువు పుష్య మగుహితంబు
మృగశీర్షమును గ్రాహ్య మగు హస్త విస్తృత
ప్రథితంబు సుమ్మనూరాధ యుత్త
రోత్తరాఫల్గును లుత్తరాషాఢయు
శాస్త్రోక్తములు సాధుసమ్మతములు
రేవతి ముఖ్యంబు భావింప మూలయు
వర్జ్యంబు హరదీక్ష కవనినాథ !

రాసులందునఁ జరమైనరాశి విడిచి
మానితంబగు నచలితంబైనయదియు
గురుబుధోదయకాలంబు లురగహార
ధారణమునకుఁ దగుఁ బాపదూరగతుల. 147

చ. ధరణిప! ఇట్లు దోషరహితంబగు కాలమునందు సంబికే
శ్వరు ధరియించువృష్యుఁడు రసాస్థలిఁ జేతఁడుబంటి ద్రొల్చి పెం
పరయఁగఁ బూర్వపాంసువున నాసుషిరాస్యముఁ బూడ్చియందుపై
నిరువుగ నొక్క వేది రచియింపఁదగున్ నలుమూల లేర్పడన్.

క. ఆయరుఁగుమీఁద వాఁకి
ళ్లాయతముగ నాలు గమర నతిరమ్యముగాఁ
జేయందగు శృంగారా
ధేయంబగు మంటపంబు ధీరవిచారా! 149

క. విలసితగోమయజలముల
నలికిన తన్మంటపమున నైదగువర్ణం
బుల బియ్యము చేస్థండిల
మలవఱపఁగవలయు సుజ్వలాలంక్రియతోన్. 150

గీ. మహితపుష్పోపచారసామగ్రిచేత
నిగ్గుదేరెడి ముత్యాలముగ్గుచేత
ధూపదీపాక్షతాదిబహూపచార
రచనచే నొప్పనందు సంరంభ మెసఁగ. 151

ఆ. కనకకృతములొండెఁ గాక వెండివియొండెఁ
గాక రాగివొండెఁ గాక మృణ్మ
యంబులొండెఁ గల్గినవి పంచకలశంబు
లమరమూర్తి నిలుపనగు నరేంద్ర! 152

చ. అలఘునవాంశుకావృతములై తగుతత్కలశంబు లన్నిటిం
గొలఁదునఁ జెర్వునం గలయుకుత్సితతోయములందు వేళకుం
గలయువి మంత్రపూర్వకముగాఁ గొని నిండఁగఁ బోసి వాటిలో
పల మణు లెవ్వియైన నిడిపై నవతంతుగవాక్షముద్రికల్. 153

క. నవరించి చూతపల్లవ
నవదూర్వాంకురకనత్కనక నాగదళా
ది విశేషభద్రవస్తువు
లవిరళముగ నిలుపవలయు నందులలోనన్. 154

వ. ఇట్లు తీర్థాంబుపూరితంబుగాఁ దత్సమంచితకలశపంచకంబున “ఓ మాపస్సర్వ” యను వేదమంత్రం బావహించి సకలమంత్ర సారంబును మునిజనమనఃకమలకర్ణికా పుష్పంధయంబు నగుపంచాక్షరంబున్ముఖంబు గావించి యీశానతత్పురుషాఘోర వామదేవసద్యోజాతంబు లనంబరఁగు వామదేవువదనంబులకు నలంకరణంబులై యైదును నాలుగు నెనిమిదియుఁ బదమూఁడు నెనిమిదియు ననఁ గలుగుసంఖ్యం బ్రఖ్యాతంబులై విశిష్టంబులగునయ్యష్టాత్రింశత్కళాసంస్మరణంబు సేయుచుఁ బూర్వోక్తంబగు తండులస్థండిలంబున నుత్తరాభిముఖుండై గురూత్తముండు కృతహోముండును, స్వస్తిక ప్రశస్తుండును, విభూతిపట్టసురుండును నగుశిష్యునకు నంగన్యాసకరన్యాసంబు లాచరించి త్రివారంబు తత్కలశవారి నతనియుత్తమాంగంబు ప్రోక్షించి యాక్షణంబ, 155

సీ. ఆపంచకలశంబులందు నొక్కటి శివ
కుంభంబుగాఁ బూని కోరి తీర్థ
సలిలధారలు చల్లి తోలఁచి గంధాక్షతం
బులచేతఁ బూజించి నలుదెఱఁగుల
నాల్గుకుండలు నించి నడిమికుంభంబున
క్షీరంబు పోసి ప్రాచీస్థితంబు
దక్షిణస్థితము నుత్తరసంస్థితంబును
బశ్చిమస్థితమునై పరగువాని

గీ. త్రోను బెరుఁగును నెయ్యిని దేనియయును
బంచదారయుఁ గ్రమమునఁ బాదుకొల్పి
హెచ్చి యష్టాంగధూపంబు లిచ్చి శంఖ
కాహళాదికముల మ్రోఁతగడలుకొనఁగ, 156

వ. స్వస్తికవిస్తృతంబగు కూర్మాసనంబు నిర్మించి ప్రాణప్రతిష్ఠాగరిష్ఠం
బులగు మంత్రంబులు తంత్రపూర్వకముగా నుపన్యసించుచు
శంఖముద్రాముద్రితకరాంబుజుండై తచ్ఛిష్యు నుద్దేశించి "ఆవయో
స్సిద్ధిర" స్త్వనుచుఁ దన్మస్తంబు హస్తంబునం గుస్తరింపుచు
"నయమ్మే హస్తో భగవా" ననువేదమంత్రంబుతోడ నీరంధ్ర
తేజోవిరాజితంబును అశేషపాశత్రుటనాకర్తృణిమూర్తియును,
విజ్ఞానప్రజ్ఞాప్రదర్శనదీపాంకురంబును, గంధపుష్పాద్యుపచారపూజి
తంబును హృద్యనైవేద్య ప్రహృష్టంబునగు జ్యోతిర్లింగంబును
"నకదాచిద్వియోజయే" త్తనుచుఁ బుష్పాంజలిపూర్వకంబుగా
వినయైకధురీణుండగు నతనికి నగ్గురుండు ప్రాణలింగంబు చేయ
వలయు నిది లింగధారణప్రకారంబు. 157

క. అన విని హర్షాశ్రులు కనుఁ
గొనలం దళుకొత్త రాజు గురురాజునకున్
బునరభివాదనములు ధృతి
నొనరిచి యిట్లనియె వినయయుతమానసుఁడై. 158

చ. తెలిపితి లింగధారణవిధిన్ గురువల్లభ! గుర్వనుజ్ఞకున్
దొలఁగక శిష్యుఁ డెల్లపుడు ధూర్జటిలింగము నెట్టికావులన్
నెలకొనఁ జేయఁగావలయు నీమది నగ్గణించి యాదరం
బొలయఁగఁ జెప్ప వేయనుడు నుద్భటుఁడున్ నృపుఁబల్కునీక్రియన్,

పాక్కిలందునైన భుజమధ్యమునైనఁ
గేలుదమ్మినైన మౌళినైనఁ
గంఠసీమనైనఁ గఱకంఠు ధరియింపఁ
దగు నృపాల! నాభిదిగువఁ దక్క. 160

నావుడుఁ దద్గురుమణితో
భూవిభుఁ డిట్లనియె భోగిభూషణ యమృత
ప్లావిత యగునీవచన
(శ్రీ) వీనులఁబొరసెఁ గంటిఁ జిరసౌఖ్యంబుల్. 161

భక్తులగువారియెడఁ గల్పపాదపంబు
పాదవుగనియున్న నిన్నొక్కటియడుగ వెఱప
భసితరుద్రాక్షధారణప్రాప్తమైన
పుణ్య మెయ్యది వివరించి ప్రోవు మనుడు. 162

సర్వావస్థయందును
సర్వేశుని లింగమూర్తి సౌభాగ్యకళా
నిర్వాహకు ధరియించిన
సర్వజ్ఞుల కిందు నందు సౌఖ్యము దొరకున్. 163

హరకంఠముఖులు సంయములును మనువులు
నెలకొల్పి రీశాను గళమునందు
బ్రహ్మవిష్ణుసురేశపావకాదులు దాల్చి
రుత్తమాంగంబుల నూర్ధ్వరేతు
నక్షపాద-శిలాద-హరదత్తముఖ్యులు
వహించిరి నుదుళ్ళ వామదేవు
శక్తులు నందికేశప్రభృత్యాత్మవే
దులు పూని రురముల నలికనయను

ఆ. కొమరుసామి భృంగి కుంజరాస్యుఁడు మొద
లైన భక్తవరులు హరు ధరించి
రధికభక్తియుక్తి నాత్మీయకరపద్మ
పుటములందు భూమి భువననాథ! 164

ఉ. అన్నప్రపుతోడ నిట్లనియె నాగమతత్త్వవిదుండు దేశికుం
డెన్నఁడు నేర్చినాఁడవు మహీవర! శైవరహస్యముల్ గనన్
మొన్నఁటివాఁడ వింతియ విమూఢుల కీ సమయంబు దుర్లభం
బెన్న మహావివేకనిధి వీవు కృతార్థుఁడ వెన్నిరీతులన్. 165

గీ. కపిలయును గృష్ణవర్ణయుఁ గంబునిభయు
ధూమ్రయును జాతపల్లవతామ్రరుచియు
నైనగోవులు గడివెట్ట నంది తెచ్చి
భూతి చేయంగవలయుఁ బ్రభూతవహ్ని. 166

సీ. సంతతైశ్వర్యముల్ సమకూర్చుటకుఁ దాన
హేతువై యునికి విభూతి యనఁగఁ
గవిసి పాతకములఁ గదిసి మెసఁగఁ జాలి
ప్రఖ్యాతి గలుగుట భస్మ మనఁగ
శరదిందుచంద్రికాసారకాంతులు మీఱి
భాసనంబొందుట భసిత మనఁగ
శాకినీఢాకినీ సర్పాదిభయము చే
రఁగనీక రక్షించు రక్ష యనఁగ

గీ. నాపదనెల్ల క్షరణంబు నందఁజేయఁ
జాలుమహిమఁ బ్రకాశించి క్షార మనఁగ
భూది యామ్నాయపంచకంబునఁ దలిర్చు
ఫాలలోచనఫాలనేపథ్యకలన. 167

వ. వెండియుఁ గపిలకృష్ణధవళరక్తధూమ్రవర్ణంబులఁ దగు పూర్వోక్త ధేనువులు నందయు సుభద్రయు సురభియు సుమనయు సుశీలయు ననఁబరగు వీనిగర్భంబుల నావిర్భవించి విఖ్యాతయగుట విభూతి భూతనాథుండు సద్యోజాతంబున వహియించుట విభూతి యనియును, వామదేవంబున ధరియించుట భసితం బనియును, నఘోరంబున ధరియించుట భస్మంబనియు నా, దత్పురుషంబున నవధరించుట క్షారంబనియును నీశానంబున వెలకొలుపుట రక్షయనియును బేర్కొనీయమై వర్తిల్లుచు మోక్షలక్ష్మీదరహాసితసుధానిష్యందంబు నానందం బగు వినుము. 168

సీ. కైకొనఁదగు సర్వకాలంబుల విభూతి
నైమిత్తికములఁ బూసంగవలయు
భసితంబు రక్ష దాల్పఁగ యోగ్య మాయాయి
యర్హకృత్యంబులయందు భస్మ
మనువగుఁ బూయఁ బ్రాయశ్చిత్తముల మోక్ష
విధుల సంభావ్యమై వెలయుఁ క్షార
మిది భూతినిర్ణయం బిఁక విను రుద్రాక్ష
మహిమ వర్ణింతు నిర్మలగుణాఢ్య !

గీ. అలికనయనుండు మున్ను సురారిపురము
ఘోరదృష్టికిరాఁ జూచుచుండ నతని
నయనముల రాలు బాష్పసంతతులు ధరణి
వ్రాలి రుద్రాక్షములుగాఁగఁ బ్రబలె నధిప ! 169

సీ. శిఖ నొక్కటియు మూఁడు శిరమున ముప్పది
యాఱు మస్తమునఁ జుట్టునందుఁ గంఠ
పీఠి ముప్పదిరెండుఁ బృథులవక్షోవీథి
నేఁబది పదునొండు నేను బాహు

శాఖల వడ్వ్యయసంఖ్యలఁ జేతుల
నొండొండు నాఱాఱు నొండు చెవుల
నవతియుం బదియును నాల్గు రెండులు నుప
వీతమాత్రంబున విధిసముక్త

గీ. మార్గమున రుద్రమణులు ధీమంతులైన
వారలకుఁ దాల్పవలయు భూవలయనాథ
యెన్ని దాల్చినఁ దత్ఫలం బెన్నఁ దరమె?
ధాత కైన చక్షుశ్శ్రవోనేత కైన. 170

చ. తలఁచినఁ గన్న విన్నఁ గరతామరసంబుల నంటినం దనూ
ఫలకమునందఁ దాల్చిన నభంగుర ముక్తికురంగలోచనా
చలదలస ప్రసాదిత లసద్వలమాన కటాక్షవీక్షణం
బుఁ బరితుష్టిఁ జేయు మదిఁ బూరుషు రుద్రమణుల్ నృపాగ్రణీ

క. అనవిని చరితార్థుండై జననాథుఁడు
గురుకులాశని నుద్భటు న
ర్చన దనియించి దీక్షకు ననుకూలుం
డగుచునుండె నక్కాలమునన్. 172

చ. కుసుమితకాశ మంబుధరగోపనదూరనభస్సకాశ ము
ల్లసితమరాళి సస్యఫలలాభ విజృంభిత పామరాళి శ్రీ
విసృమరసారసంబు హృతవిభ్రమ సింధురసారసంబునై
యసదృశలీలఁ బొల్చె శరదాగమ మాగమనార్హ మార్గమై. 173

గీ. కలువపూఁగోల యలదేఁటి కలికినారి
నెనయు పుండ్రేక్షుధనువుతో నెక్కుద్రోచి
దర్పకుండేచి విరహచిత్తములు గలఁచి
గారవెట్టుచునుండుఁ దత్కాలమునను. 174

గీ. తొల్లి కలఁగిన కొలఁకు నెల్లఁ దేర్చి
తనరు కుంభజునన్నతి ధార్తరాష్ట్రి
వినుతమై యొప్పెఁ గుంభజవిలసనంబు
ధార్తరాష్ట్రులచేఁ బ్రస్తుతంబుగాదె. 176

చ. కలువలకమ్మదావి నొడికంబుగఁ గైకొని పద్మకాననం
బులకడ గుంపుగట్టి కనుమోడ్చిన యంచలఱెక్క మొత్తముల్
జలితములయ్యెఁ గావునఁ బ్రచారముఁ జూపి పరిభ్రమించి రా
త్రుల శరదాగమంబున మరుచ్ఛిఖివుల్ విధురశ్మిదోఁగుచున్.

క. కురిసెన్ గరిమద మంచులు
మొరసెన్ రాజనము దొండముకు వడియె వే
విరిసెం జలదంబులు దివి నెరసెన్
యామినులఁ జంద్రనిర్మల రోచుల్. 177

గీ. హెచ్చి పగరలమీఁద దండెత్తు నృపుల
సైన్యహయముల ఖురరజశ్చయము దమకుఁ
బ్రాణవిభుఁడైన వారాశి నరుఁగఁజేయఁ
గాంచి చిక్కనగతి నదుల్ కార్శ్యమొందె. 178

చ. మెఱుఁగులు దీటుకొల్పు చనుమిట్టలఁ గమ్మజవాదితావులన్
బిఱిఁదికిఁ ద్రోయువారసల బేసిసమీల హసించుకన్నులన్
వఱలు కృషీవలాత్మజ లవారణఁ బాడుదు రిందువంశజుల్
చెఱకును రాజనంబుఁ గల చేలకడన్ శరదాగమంబునన్. 179

గీ. సకలజనులకు లోచనోత్సవము సేయఁ
జాలుతత్కాలమున రాజచంద్రమూర్తి
ముంజభోజుండు శివలింగమును ధరింప
యత్నమొనరించె నుద్భటునను మతమున. 180

శా. పాటింపందగు నాదువిన్నపము హృత్పద్మంబులం జాహ్నవీ
జూటుం దాల్చెద శుద్ధపంచము మహీశు శ్వేగ మీ రర్వచ్చి నా
చోటన్ సత్కృప సేయఁగావలయు నంచున్ విశ్వవిశ్వంభరన్
జాటంబంపె నతండు గాలకులచే శైవోత్తమశ్రేణికిన్. 1

ఉ. ఆనృపువిన్నపంబు హృదయంబుల మిక్కిలిఁ బూని ప్రాప్తపం
చాననసన్నిభుల్ శమదమాఢ్యులు దేశికపుంగవుల్ దృఢ
జ్ఞానులు నేఁయీనివిచారములన్ జనుదెంచి రాత్మతే
జోనిహాతంబులై నొంగి సూర్యమరీచులు విన్నవోవఁగాన్. 18

ఉ. మిక్కిలికన్ను చేత నొకమేటిత్రిశూలము పాఁపసొమ్ములున్
జక్కిరవింటిజోడుమయిసానను రాచినచందనంబు మే
నిక్కువగాఁగ నుండ నొకయింతియుఁ గల్గిన వేల్పు దామనై
యొక్కమునీయమూర్తులు ప్రియంబున వల్లకి కేఁగి రయ్యెడన్. 18

క. ఈయందమ్ముల వచ్చిన
యాయయ్యలపదసరోరుహములు గడిగి భూ
నాయకుఁడు పూజచేసె ము
దాయత్తస్వాంతుఁ డగుచు నంచితభక్తిన్. 18

గీ. ఇట్లు భయభక్తు లమర నిధీరితార్చ
నములఁ దము సంతసిలఁ జేయునలిన వైరి
కులశిఖాప్రియ ధేనునికొండుకు సకల
దేశికులు దీవనలఁ బ్రస్తుతింతు రిట్లు 18

సీ. సింధుబల్లహురీతి శ్రీపతిపండితు
మఱియాద భూపదమాచి దేవు
నట్లు మహాకాళువమవ్వున నల్లక
ల్కదబ్రహ్మ దేవఁ గక్కయవిధమున

శూలదబ్రహ్మయ్య చొప్పన బిబ్బబా
చనలీల వీరనాచాంకుపోల్కి
కదిరి రెమ్మయగార్కి కై వడిఁ దెలుఁగేశు
మహణయ్యచందాన మాచిరాజు

గీ. శరణి మాళిగమారయ్యగతిఁ దెలుంగు
జొమ్మనార్యునివడువున సురియచౌడు
వగిది బసవేశ్వరునిమాడ్కి భక్తియుక్తి
శంభుఁ బూజించి బ్రదుకు రాజన్యచంద్ర! 186

గీ. అనుచు దీవించి భూపాలు నాదరించి
మహిమ నిల కేఁగి రగ్గురుమండలేశు
లమ్మహీభర్త తమ కిచ్చు నమితవస్తు
సముదయమునకు మదిఁ బ్రహర్షంబు నిండ. 187

క. అంతట సాగరకాంచీ
కాంతుఁడు శ్రీకంఠుఁ బూనఁ గల్యాణవిధా
క్రాంతమగుదినము చనుదే
నెంతయు హర్షించి పురి సమిద్ధవిభూతిన్. 188

వ. అలంకరించుటకు ఫణిహారులచేతం జాటంబంచిన. 189

క. కట్టిరి మణితోరణములు
పెట్టిరి ముత్యాలముగ్గు పృథులధ్వజముల్
చుట్టిరి సౌధంబులఁ ద
త్పట్టణమునఁ బౌరులెల్లఁ దమతమయిండ్లన్. 190

క. ఆ వేళ బహుళశృంగా
రావాసములై చెలంగె నద్భుతభూతిం
దేవాలయములు సద్గురు
దేవాలయములును భక్తిదేవాలయముల్. 191

సీ. ఆపుణ్యదివసంబునందుఁ బ్రభావతీ
సంభవుం డవితథారంభుఁ డగుచుఁ
గమనీయతీర్థోదకములఁ దానంబాడి
వెన్నెలనూరుఁగుల విన్నఁబుచ్చు
రమణీయశుభ్రవస్త్రములు మెచ్చుగఁ గట్టి
భసితాక్షమాలికోద్భాసి యగుచు
నసమాక్షుప్రతివచ్చు నతులమూర్తుల శైవ
లాంఛనధరుల నల్లన భజించి

గీ. శంభులింగంబులకుఁ బ్రపూజలు ఘటించి
తనగురూత్తంసుచేఁ బ్రసాదంబు వడసి
యరిగె బహుతూర్యరవము లంబరము వొదువ
భగ్నదీక్షకుఁ డగుమంటపంబు గుఱిచి. 192

వ. అట్లు చనిచని యాఖండలకోదండదండంబునం దొరఁగుప్రభామండలంబు గండడంచునగణితతోరణంబులవలనను శాతమన్యవశిలాశకలకీలితంబులై యకాలతమోజాలంబు విశాలంబుగాఁ గలిగించు నలఘువలభులవలనను, మధ్యందినమార్తాండ మండలంబుం గోడగించివిజృంభించు శాతకుంభకుంభంబులవలనను, నాశావకాశంబులు వాసించు కాలాగరుధూపమాలికలవలనను, వలనుమిగిలి విశుద్ధకామధ్వజాంచల గండూషితసుధాంధస్సింధువయోభరంబును, జతుర్ద్వారభాసురంబును, జతురశ్రవిస్తృతవేదికంబును,

సమస్తప్రశస్తతీర్థోదకపరిపూరితకలశపంచకంబును, గాంతాకరార్పితకర్పూరనీరాజనాదివిరాజితంబును, గమ్రామ్రపల్లవప్రముఖనిఖిలభద్రపదార్థసార్థప్రేక్షణీయంబును నగు దీక్షామంటపంబుఁ బ్రవేశించి యథాకాలంబును యథాశాస్త్రంబును నగునట్లు విభూతిపట్టహోమాదికృత్యంబులు గుర్వనుజ్ఞ నఖర్వభక్తి నొనరించి వినిద్రాస్వాంతుండై ధరణీకాంతుండు మహితమంత్రధారాసారంబుఁ గర్ణపుటీకుటుంబిగా నాకాంక్షించు నవసరంబున, 193

క. సాక్షాదలికాక్షుం డగు
నక్షయపుణ్యాత్ముఁడైన యగ్గురునాథుం
డక్షుద్రమంత్రవిద్యా
రక్షితుఁ జేయం దలంచి రాజోత్తంసున్, 194

సీ. వామాంకవిన్యస్త వామేతరకరాంబు
జయు నవరక్తోత్పలయుతవామ
హస్తయు...నగు తనప్రియకాంత
మెఱుఁగారు పాలిండ్లమీఁదిచాయ
డాకేలు తామెడ (?) మైకొల్పి చొక్కుచుఁ
బరశువు మృగమును వరము నితర
శయముల ధరియించి సాంద్రసర్వాకల్ప
భాసమానాంగుఁడై పరిఢవిల్లి

గీ. లలితనూత్నార్కరణాంశులు తొలుకరించు
మేనఁ బుష్పాస్త్రవిలసనోన్మేష మమర
పారిపద్మాసనాసీనుఁడైన పార్వ
తీశుఁ బ్రాసాదపంచాక్షరీశుఁ బొగడి, 195

చ. పరశువు ఖడ్గమున్ నిశితబాణము శూలము దక్షిణస్ఫుర
త్కరములపైఁ దనర్ప హితఖండన ఖేటధనుష్కపాలమున్
బరువడి వామహస్తములపైఁ జెలఁగన్ నలువారు మేను భీ
కరవదనంబుఁ ద్ర్యక్షములు గాంచనవర్ణజటల్ తలిర్పఁగాన్.

చ. కరయుగళంబునన్ భుజయుగంబునఁ గర్ణయుగంబునం బదాం
బురుహయుగంబునం గటిని బొల్చుగళంబునఁ బార్శ్వసీమలన్
శిరమునఁ గుక్షి నాల్గువది జిహ్వఁ గరాబ్జములన్ వహించు
ధరితు నఘోరమూర్తి మహభర్త నఘాంతకుఁ బ్రస్తుతింపు

వ. వెండియుఁ దక్షిణ శివమంత్రంబులం గల సారంబుఁ బరిగ్రహి
గురుండు శిష్యునకు నుపదేశించిన.

చ. ఒనర నిశావసానసమయోదిత భాస్కరునందు నుండి చ
య్యన దిగి దీప్తి పుల్లజలజాంతరముం దగఁ జొచ్చునట్లు పు
ణ్యనిధి యనంగ నొప్పు గురునాథుమొగంబున నుండి మంత్ర
ద్య నృపుమొగంబుఁ జొచ్చె విమలాకృతి నగ్నికణావధాతమై.

క. గురుమంత్రవిద్యచే నృపు
కరస్థలాధీనకాలకంధరలింగో
దరముఁ బ్రవేశించె మనో
హరమగు నొకదివ్యతేజ మద్భుతభంగిన్. 2

వ. ఇట్లు కృతలింగధారణుండై ధరణీరమణుం డజగవబాణాసనపూ
వరాయణుండై. 2

క. త్రిణయన! భక్తసులభ! స
త్వనిలింపాత్మక! దయావివర్ధన! నాపై
ననురాగం బొదవఁగ జ
య్యన నీలింగంబునందు హత్తుము వేడ్కన్. 20

క. అలఘరణీ ధరకరవర
నిలయ! మహైశ్వర్యధుర్య! నిటలాక్ష! విని
ర్మల దేహా! పార్వతీప్రియ!
నెలకొను మీ యాసనమున నెయ్యము తోడన్. 203

క. గానప్రియ విష్ణుకళ
త్రా! నిరుపమ! నిత్య! రాజరాజసఖ! హరా!
సూనాశుగహర! గైకొను
భానుశశాంకాగ్ని నేత్ర! పాద్యము దీనిన్. 204

క. మధుమథన దృగర్పితపద
విధిశీర్ష సరోజభేదవిధిచణహస్తా!
విధుకాంతివర్ణ! శివ! జగ
దధినాథ! పరిగ్రహింపు మర్ఘ్యము దీనిన్. 205

క. అణిమాదిగుణాన్విత! భవ!
ఫణివల్లభహార! దివిజభర్తృనమస్యా!
గణనాథ! నీలలోహిత!
ప్రణుతాచమనీయకంబుఁ బాటింపు దయన్. 206

క. తుహినగిరి దుహితృపాణి
గ్రహణప్రీతాత్మ! భూతగణవృతరాజీ
వహితశతకోటి తేజో
మహిత! మదిం బొదలు విహితమజ్జనలబ్ధిన్. 207

క. అజ్ఞానతిమిర భాస్కర!
విజ్ఞానవిలాసజనక! విశ్వేశ్వర! స
ర్వజ్ఞ! నిజభక్తవత్సల!
ప్రజ్ఞాధిక! కొమ్ము వస్త్రరాజము దీనిన్. 208

క. విపరీత విశ్రుత ఫణివర!
ఉపనిషదర్థస్వరూప! యోగిజనధ్యే
యపద! సువర్ణకృతం బగు
నుపవీతముఁ దాల్పు మిదె సముజ్జ్వలమూర్తీ! 209

క. జన్మజరామృత్యురహిత!
చిన్మయ! లోకేశ! యీశ! శీతాంశుకళా
భృన్మకుట! గంధ మిదె ప్రేమ
మ న్మను మన్నించి కొనుము మఖవిధ్వంసీ! 210

క. పవనశిఖితరణి శశిజల
సవనకృదాకాశ భూమిసంభృతమూర్తీ
భవభూధరభిదుర! సదా
శివ! యీయక్షతలమీఁదఁ జిత్తం బిడవే. 211

క. పంచానన! రుచిధిక్కృత
పంచానన! విజిత! దేవపతి సంస్తుత్యా!
పంచాననావతర! హర!
పంచప్రేతేశ! పువ్వు లుంచెదఁ గొనుమీ! 212

క. శ్రీకంఠ! దివ్యవైభవ!
ప్రాకట...మనూత్తరనివేశరతా!
లోకాధీశ్వర! సురసిం
ధ్వాకల్ప! ప్రధూప మిది ప్రియంబునఁ గొనవే! 213

క. పాపహర! దేవదేవ! వి
రూపాక్ష! కృపాకటాక్ష! రుద్ర! మహేశా!
తాపత్రయ సంహారక!
దీపము లర్పింతు దయ మదిం గనుఁగొనుమీ! 214

దండధరమథన! కుండలి
కుండల! దివిషన్మహీధ్రకోదండ! సుధీ
మండల నీరజవనమా
ర్తాండా! నైవేద్య మిదె ముదంబునఁ గొనవే. 215

లంబోదరజనక! బుధా
లంబ! విరూపాక్ష! మోక్షలక్ష్మీప్రద! చ
ర్మాంబర! యంబరకుంతల!
తాంబూలము మీకు నర్పితంబగు మాచేన్. 216

అక్షీణపుణ్య! సవనా
ధ్యక్ష! మహోక్షేంద్రవాహ! ధరణీరథ! ప
ద్మాక్షాశుగ! నేఁ జేయు ప్ర
దక్షిణములు చిత్తగింపు దయ నిగమహయా! 217

శ్రీకంధర! మునివల్లభ!
మాకాంతవనీవసంత! మలహర! రమణీ
యాకార! నమోవాక్యము
చేకొను నే నీకొనర్తుఁ జిరతరభక్తిన్. 218

అని షోడశోపచారము
ల నిటలనేత్రుని భజించి లాలితపుణ్యాం
బునిధి యగుముంజభోజుఁడు
గనుఁగొనియెన్ దత్క్షణంబు కల్యాణంబుల్. 219

జితపాశదేశికోత్తమ
కృతదీక్షుం డగుట నిట్లు కృతకృత్యుండై
క్షితివల్లభుండు రెండవ
శితికంఠుఁడు పోలె నఖిలసేవితుఁ డయ్యెన్. 220

గీ. ఉక్తదక్షిణ నారాధ్యు భక్తిఁ దలఁచి
సకలజంగమగురురాజశైవసముద
యముల సర్వాసపర్యల నలరఁజేసి
నిత్యసౌభాగ్యమయమూర్తి నెగడె నృపుఁడు. 22

ఉ. మానితమూర్తి భూపతి యుమావతి నీగతిఁ బ్రాణలింగముం
గా నొనరించి పుణ్యములకందువఁ గాంచి దయార్ద్రచిత్తుఁడై
మానవలోకముం బెనుచు మంజులకీర్తులఁ మిన్నుముట్ట వి
ద్యానిధి నుద్భటుం గురుకులాగ్రణి రాజ్యధురీణుఁ జేయుచున్.

క. పులు దుది విధాత యాదిగఁ
గలవిశ్వము నందుఁ గాలకంఠుఁడు గౌరీ
లలనామనోహరుని మదిఁ
దెలిసి యతం డేలు వసుమతీవలయంబున్. 223

సీ. భూరివివేకంబు పుట్టినప్పుడె పుట్టెఁ
గాకున్న నొరులకుఁ గలదె యిట్లు
బుధపోష కేలియుఁ బుట్టినప్పుడె పుట్టెఁ
గాకున్న నొరులకుఁ గలదె యిట్లు
పుణ్యంబుఁ దెలివియుఁ బుట్టినప్పుడె పుట్టెఁ
గాకున్న నొరులకుఁ గలదె యిట్లు
భూతదయాప్తియుఁ బుట్టినప్పుడె పుట్టెఁ
గాకున్న నొరులకుఁ గలదె యిట్లు

గీ. బుద్ధియును బుట్టినప్పుడే పుట్టె నెనరుఁ
న్న నొరులకుఁ గలదె యిట్టు
ంబుఁ దనుఁ గొనియాడుచుండ
తిఁ బ్రాభవముఁ దాల్చె. 224

శా. కామక్రోధములం ద్యజించి మమతన్ ఖండించి శైవాగమ
ప్రామాణ్యంబు పరిగ్రహించి ధరణీ భక్తాళిసంరక్షణన్
సామర్థ్యంబున యోగివర్తనమునన్ సంపూర్ణవిజ్ఞానసం
ధామాస్యస్థితి మించె భూపతి సమస్తంబున్ మదిన్ మెచ్చఁగాన్.

మ. అరిసంహారము శైవనిర్ణయకథావ్యాసక్తియున్ సద్గుణ
స్ఫురదత్యద్భుతధర్మసంగతియు నేప్రొద్దున్ వెలిన్ లోన ని
ర్భరతన్ బెంపువహింప రాజసమున్ భాసిల్లు నావల్లకీ
పుర మింపొందఁగ ముంజభోజుఁడు బుధాంభోజాతహంసాకృతిన్.

క. నలినీపత్రము నంటని
సలిలకణంబట్ల తగులు చాలించి ధరా
స్థలి నిట్లు పోచుహిమకర
కులసంభవుఁడైన రాజగురుఁ డీకరణిన్. 227

క. సుక్షేత్రంబునఁ బదనున
నిక్షిప్తంబైనవిత్తు నెఱి నీయెడ నా
యక్షీణమంత్రవిద్య మ
హాక్షణకరలీలఁ బొదలె నవనీశ్వరుఁడున్. 228

వ. ఇట్టి శిష్యునిం జూచి గురుం డిట్లనియె. 229

చ. సమసుఖమోదియై వినయసంగతుఁడై శుచితాభిరాముఁడై
యమరిన నీ తెఱంగు సుగుణాఢ్యవశం బగు మాదృశేరితా
ర్థామనువు మీఁదనుం బ్రబలినట్టి తెఱంగును గూర్చు నారికే
ళమునకుఁ బోసినట్టి సలిలంబు విధంబున భూపురందరా. 230

సీ. సమపక్షపాతనిశ్చలభక్తియుక్తి ధ
ర్మార్థకామంబుల నాదరించి

దుష్టనిగ్రహమును శిష్టరక్షణమును
నిత్యకృత్యములుగా నిర్వహించి
సత్కీర్తిచందనాదిసారవిదూరభోగంబు
లొలసి యెల్లమిగాఁగ నొందఁ జాలి
అపరిమ త్తత్వంబు నంది బాహ్యాభ్యంత
రముల శాత్రవులగర్వం బడంచి

గీ. జలధివలయితవసుమతీస్థలము నొక్క-
పురముఁ బ్రోచు తెఱంగునఁ బ్రోవ నేర్చ
యెవ్వ నినుఁ బోల నేర్చు నే యొక్క-రుండు
భూరిరుచిరాజ! శ్రీముంజభోజరాజ!

క. నీవంటిశిష్యుకతమున
నావంటిగురుండు నిత్యానవ్యయశశ్రీ
శ్రీవంటియఘువయోనిధి
నావంటినకరణిఁ గడుచు నరనాథమణీ! 2

క. శిష్యుఁడు పాపము చేసిన
దూష్యస్థితి గురునిఁ జెందుఁ దొరవుఁడీఁకన్
శిష్యుఁడు పుణ్యము సేయ న
దూష్యస్థితి గురునిఁజెందుఁ దొరవుఁడీఁకన్. 2

వ. కావున శిష్యుని పుణ్యపాపంబులు గురునితలయవియ క
యుత్తమశిష్యుఁడు గలుగుట గురునిభాగ్యంబ శిష్యుం డనుత్తమ
డగుట గురునిదౌర్భాగ్యంబ యని వేదవిదులు చెప్పుదు రీ
సచ్ఛిష్యుండ వగుటంజేసి మాకదృష్టంబయ్యె నదియునుంగాక,

ఉ. ఏలరె! మున్ను భూపతుల లనేకులు రామయయాతిముఖ్యు లీ
నేలయు నీవు బ్రోచునది నేలయు యిట్టియశంబు నిట్టియు
త్తాలతరప్రభావమును దన్నృపు లొందిరె నీక్రియన్ మహీ
పాలలలామ! నీకయినభాగ్యము వర్ణనసేయ శక్యమే! 235

శా. నీవున్ శేరమభూనరాదులగతిన్ నేత్రత్రయోద్భాసిలో
కావాసుం గరిచర్మవాసు భువనైకారాధ్యు నిమ్మేనితో
సేవావృత్తిఁ బ్రసన్నుఁ జేసి దిశలన్ శ్రీపూర్ణసత్కీర్తి పు
ణ్యావేశంబున నిల్పఁగాఁ గలవు తథ్యం బిందువంశాగ్రణీ. 236

చ. అనుడుఁ గృతప్రణాముఁ డయి యగ్గురు నిట్లని పల్కె ముంజభో
జనృపతి యిట్లనం దగునె శైవగురూత్తమ! నీకృపారసం
బునఁ దగఁ జెట్టుగట్టు ననువొందుట చిత్రమె మంగళంబు లె
ల్లను సుకృతాధిపుం గొలుచులాభము గల్గినఁ గీర్తిగల్గదే! 237

ఆ. వెలఁగి వృత్తినిర్విశేషంబుగా నన్ను
బ్రోచు నీ ప్రభావమునన కాదె
ఇట్టి వైభవంబు నిట్టిసౌభాగ్యంబు
దొరకె నాకు నిఖలగురువరేణ్య. 238

ఉ. వారక వ్రేలు నాకి యువవాసఫలం బెడలించునట్లు ని
స్సారములైన యిజ్జగతిసౌఖ్యములన్ మది దూరవ్యయమొంది వి
స్తారియఘంబు దూరమని శంకవహించియు మీయనుజ్ఞకుం
దారక పూనినాఁడ వసుధాభరమున్ గురుచంద్రశేఖరా! 239

ఉ. సేవకలోకముం బొదలజేయుటకై చరకల్పభూరుహ
శ్రీవహియించు నీపదముఁ జేరినవాఁడఁ గృతార్థుఁ జేసి సం
భావనఁ బ్రోవు నన్ను భవబంధముపైఁ దగు లూడ్చి నావుడున్
భూవరుఁ గ్రమ్మఱంబలుకు భూసుతుఁ డుద్భటమూర్తియాక్రియన్.

గీ. అన్న! విశ్వాస మొనరించు మస్మదీయ
వాక్యమున సంశయము మాని వసుధఁ బెద్ద
కాల మభిరక్షణము చేసి కడు భజింపఁ
గలవు కైలాసనాథు శ్రీకంఠు నభవు 241

వ. అని యుద్భటారాధ్యుండు ప్రియశిష్యుండగు ప్రభావతీ తనయు వైరాగ్యంబునకుఁ బరిహారంబు గఱపి రాజయోగిలక్షణంబులం బ్రేక్షణీయుండ వగు మని నియమింపుడు నవ్వాడమితేఁడును "గురో రాజ్ఞాం నలంఘయేత్" త్తను న్యాయంబున నజేయ భుజాభుజగాధినాథుమై ధరావరారోహ విశేషమింపం జేసి ప్రజావనసమర్థుం డయ్యె. నిట్లు,

సీ. ఇందుశేఖరముచే నేమూర్తిదీపించు
నామూర్తి దానయై యతిశయిల్లి
ఇభచర్మపటమున నేమూర్తి గొమరారు
నామూర్తి దానయై హారువు చూపి
యిల రథంబుగఁ బన్ని యేమూర్తి జయుమొందు
నామూర్తి దానయై యనువు మిగిలి
యిక్షుధనుర్మూర్తి నేమూర్తి పైఁబూయు
నామూర్తి దానయై యంయము గల్గి

గీ. యున్నయుద్భటగురునాథునుగ్రకలుష
కరటికంఠీరవస్వామిచరణ యుగళి
తనకు నిహావరఫలసిద్ధిజనని గాఁగ
భూమిఁ బాలించు శ్రీముంజభోజమూర్తి. 243

క. వరహృదయకమల కర్ణిక
గురుచరణద్వయము నిలిపి కువలయరక్షా

చరణమునఁ బొడలుఁ బ్రమథే
శ్వరతనయుఁడు మంజభోజజనపభుఁ డెలమిన్. 244

క. చరలింగమూర్తియగు నా
గురుదేవుని సింహపీఠిఁ గోరిక నిడి త
చ్చరణాంభోరుహములకును
బరిచర్య యొనర్చు నవనిపతి యనుదినమున్. 245

ఉ. అంత మనంబులోనఁ బ్రియమారఁ దలంచు మహాత్ముఁ డుద్భటుం
డంతకవైరి తన్బిలిచి యాత్మఁ గఠోరతరోక్తి కుపులై
చింతఁ గలంగు ఖేచరులఁ జేర్పు మదాకృతి నంచుఁ దొల్లి య
త్యంతదయార్ద్రచిత్తుఁడయి యాగతి నాడినమాట లీక్రియన్. 245

మ. నిలిచెం ధారుణి శైవధర్మము సమున్మేషంబుతో దుర్మతం
బులు బౌద్ధాగమముఖ్యముల్ సడలె శ్రీపూర్ణాత్ముఁడై శంభువ
జ్జలజాతద్వయభృంగ మీతఁ డన నోజన్ మంజభోజక్షమా
లలనాధీశుఁడు నామశిష్యుఁ డయి యుల్లాసంబు నొందెంధృతిన్.

క. మఱియుం దక్కిన పనులరమర
యొకింతయును లేక మలహరు నాజ్ఞన్
నెఱిఫలియించె ధరాస్థలి
నుఱక వసింపంగ నాకు నుచితం బగునే? 248

మ. వలదా యింక లలాటనేత్రపటుతీవ్రక్రూరశాపానలా
ర్చులచేఁ బ్రేలుచు నానిమిత్తమున దూరాపంబులం బాయఁగాఁ
గల మంచుం గడుఁ గాంక్షలన్ బొదలు తద్గంధర్వులన్ బ్రోవ వా
రలు న్దొలిన్ సమయాబ్దముల్ గడపి రోర్వంజాలి నీచత్వమున్.

చ. అని కృతనిశ్చయుం డగుచు నగ్గురుకుంజరుఁ డొక్కనాఁడు పా
వనసలిలంబులం దడిసి వచ్చి విశుద్ధతరస్థలంబునం
దనుపమభస్మరుద్రమణు లాదిగఁ గల్గిన శైవచిహ్నముల్
మన మలరంగఁ దాల్చి పురమర్దనలింగముఁ బ్రాణలింగమున్.

శా. హస్తాబ్జంబున సంగ్రహించి వరపద్మాసీనుఁడై జాతవే
దస్తారాధిపభానుభానువులకున్ దానైక్యుఁడై యొప్పు త
న్నిస్తంద్రోజ్జ్వలమూర్తిపై విషయముల్ నెక్కొల్పి యోగంబున
మస్తోద్భేదము చేసి జీవితము సంబంధంబుఁ ద్రోచెన్ వెసన్. 25

గీ. అమహాయోగి బ్రహ్మరంధ్రాంతరంబు
వెడలె శతకోటిరవిదీప్తివిలసనంబు
గలుగు తేజం బొకండు తత్కరతలేశ
లింగమును గూడి హరుఁ బొందె లీల నెగసి. 252

క. జితభవబంధనులగు త
త్సుతు లధికులు శాస్త్రసరణితోఁ దత్తనువున్
చతురత శైవజ్ఞానా
హుతిగా భావించి రంత యోగ్యప్రాజ్ఞుల్. 253

ఉ. అమ్మహనీయమూర్తితనువందలిధూమము సర్వదిక్కులన్
గ్రమ్ముచు మీఁద రాలు నమరద్రుమనిర్గతపుష్పవృష్టి గం
ధమ్ములతావి గెల్చి పటధామవిహారుల నప్పిశాచబృం
దమ్ములఁ గప్పె నీలజలదప్రతిపక్షమహాస్సహాయమై. 254

గీ. సిద్ధరసమున వేధించు నెనఁటిలోహ
దళము లసమసువర్ణత్వకలన వెలుఁగు
నట్లు ఖేచరు లుద్భటుసంగధూమ
సంగమునఁ జేసి శంభువేషములు గనిరి. 255

సీ. బాలప్రవాళరుక్పాటచ్చరంబులౌ
జడల సైంధవకళల్ బెడఁగుకొనఁగ
బంధురపరిణద్ధకంధరాంతరములఁ
బసిమిఁ దేరెడి చేఁదువిసము లమర
ఘనకవాటాభవక్షఃపీఠికలమీఁద
నెరకొన్న పెనుపాఁపసరులు బెరయ
శరదభ్రవిభ్రమాకరవిగ్రహంబులఁ
గంతుభస్మాంగరాగములు గ్రమ్మ

గీ. వఱలుడాకాళ్ళయందు వైవస్వత ప్ర
తాపసంక్షోభకరబిరుదప్రకీర్ణ
ముద్ర లింపొందఁ దద్రుద్రమూర్తిఁ దాల్చి
నిలిచె గంధర్వపతి వెండిరుచులు వెలఁగి, 256

గీ. ఆ గురుం డిట్లు దేవరయందు నైన
రాత్రి గంధర్వపతి చిత్రరథుఁడు వచ్చె
తెలివితోడుత నెందైన దిరుగ నట క్రి
తంబు చని వేమఱలి పటెందద్రింబు డాయ. 257

క. కాయలురాల్చిన మావిడి
సోయగమున నిట్లు మిత్రశూన్యం బగుచున్
దూయనితద్భ్వాజముఁ గని
హాయనుచున్ గుండె పగిలి యతివిహ్వాలుఁడై. 258

మ. పిలుచుం జుట్టుల బంటులన్ సుభటులన్ బేర్కొచ్చి యందంద లోఁ
గలుఁగుం దూఱ విధాత నన్నుఁ గరుణం గావంగ రావే సురా
చలకోదండ! యటంచు బ్రమొక్కుఁబొరలున్ సర్వాంసహన్ గన్నుఁగో
నల నశ్రుల్ జడిచూప బిట్టొరలు గంధర్వేశ్వరుం డెంతయున్.

ఉ. మోఁచితి నుగ్రశాపభరమున్ గతదివ్యసమంబు లన్నియున్
జూచితి నష్టభోగములు చూచినవారలు నవ్వ నుద్భట
శ్రీచరణాంగధూమములు చెందుట గానమి యీనునంతకున్
గాచి వృకాలి కిచ్చిన ప్రతీకారము దోఁచె మదీయసిద్ధికిన్.

క. తమతలఁచిన యత్నంబులు
సమకూరుచు నుండు నెపుడు సత్కర్ములకున్
దమతలఁచిన యత్నంబులు
సమకూరవు దుష్టకర్మసంఛన్నులకున్. 2

క. నమ్మితి శంకరు వాక్యము
నెమ్మనమునఁ బడ్డపాటు నిష్ఫలమయి నా
కుమ్మలికంబు ఘటించెఁ బ్రి
యమ్మగునే నన్ను నేఁప నబ్జజ ! నీకున్.

వ. అని యనేకప్రకారంబుల వితథమనోరథుండై చిత్రరథుం డాక్రం
నంబు సేయ నయ్యర్ధరాత్రంబునందు గురువియోగవ్యథాదోదూఁ
మానమానసుండై యుమ్మలింపుచుఁ గ్రమ్ము వేదనల నవగ
నిద్రిండగు ముంజభోజనరేంద్రుం డయ్యాక్రోశం బాకర్ణిం
సంచలించి యిది యేమివరి దేవసంబోక్కా ! ఇప్పితృవనభూ
నుండి యుడుగక విడువని వేలంబై యతివేలంబగుచు సముద
ఘోషంబునుం బోలె భీషణంబగుచు వీతెంచుచున్నయది దీ
నరయుదముగాక యని కాలభైరవంబగు కరాళకరవాలంబు కేల
గీలించి శైలశృంగంబు డిగ్గుసింగంపుఁగొదమయుం బో
హర్మ్యంబు డిగ్గనుఱికి పిఱికిదనంబు వోఁదఱిమి తత్కృపా
ప్రభావటలంబులం దమస్సముదయంబు విరియింపుచు నొక్క
రుండ యొక్కుదళు కొత్త నిర్నిద్రవేగంబున రుద్రభూమి డాయ
జని తద్రోదనంబునకు నాదికారణంబగు నిశాచరు నుదారప్రభ

వాతిశయంబునంజేసి కనుంగొనంజాలి యతని నుద్దేశించి
యిట్లనియె. 263

ఉ. ఎవ్వఁడ వీవు ధైర్యమఱి యేడ్చెద విచ్చట నెద్ది కారణం
బెవ్వఁడు నిన్ను నిష్కృపత నింత్రటఁచుచేసెను నేఁటిదాఁక నే
నెవ్వని నిట్లు దుర్దశల కిక్కగఁ గన్గొనఁ జెప్పుమన్న వాఁ
డవ్విభుతోడ నిట్లనియె నల్లన గద్గదకంఠనాళుఁడై. 264

క. ఏమని చెప్పుదుఁ జెప్పిన
నేమి యొనర్పంగఁజాలు దీవిధి భువన
స్వామి యగునట్టి యీశ్వరు
చే మును నియమింపఁబడియెఁ జిరపుణ్యనిధీ. 265

క. ఏ పుణ్యసాధ్వి కడుపున
నో పురుషవతంస పుట్టి వొందితి నాహా
త్తావంబు పాపె నీవలు
కాపాదిత నవసుధారసావిష్కృతియై. 266

చ. అనఘవిచార ! నాదు తెఱఁ గంతయుఁ జెప్పెద నీదు పేరు పెం
పును వివరింపు నా కనుడు భూవరుఁ డిట్లను కుంజభోజుఁ డన్
జనపతి నేను విశ్వబుధసంఘనుతంబగు నిష్వరంబు నా
యునికి దగన్ మదీయగురుఁ డుద్భటుఁ డారయ భూతపుంగవా.

వ. ఏను గురువియోగంబునంజేసి గాసిల్లి వినుగుచు నిర్నిద్రదుఃఖంబున
నిద్రలేక యేకతంబ యొక్క హర్మ్యస్థలంబున మేను వైచియుండు
నవసరంబున నీ యాక్రందనం బమందం బగుచు వినంబడిన దీని
నరయుదముగాక యని సరయంబుగా వచ్చితిఁ బొచ్చెంబుగాదు
నీ తెఱం గెఱింగింపు మనుడు నయ్యంబరచరుండు హార్దాడంబ

రంబులు మనంబునఁ బెనగొనఁ ససంభ్రమంబుగాఁ బఱతెంచి
కృతవందనుండై భూపురందరున కిట్లనియె. 268

క. జనవర! మును వారువలనఁ
వినియుండుదు నీప్రశస్తి వినుటకు ఫలమై
కనుఁగవకుం దోఁచితి వికఁ
గనుఁగొంటిని శాపమోక్షకల్యాణంబుఁ. 269

సీ. వినవయ్య! భూప నావృత్తాంతమెల్ల గం
ధర్వ నాథుండఁ జిత్రరథు తనంగఁ
బరగినవాఁడ ము న్బరమేశ్వరున కొక్క-
నెపమున ద్రోహినై కుపితుఁడైన
యద్దేవుకినుకఁ జయ్యనఁ బిశాచాకృతి
జేరితి నాతోడివారు నేను
జేరి తత్కృపకల్మి శ్రీయుద్భటారాధ్య
గురు తనుధూమంబు వొరయునాఁడె

గీ. శాపమోక్షంబు గాంచునిశ్చయము వడసి
యావటంబున నుండితి నిన్నినాళ్లు
కర్మమునఁ జేసి యివుడు వర్గంబువారు
ముక్తు లయిచన నా కిట్లు మోసమయ్యె. 170

ఉ. ఆ గురుసార్వభౌమునకు బ్రాణము ప్రాణమ వైన నిన్ను హృ
ద్రాగముతోడఁ గంటి వసుధావర! నెవ్వగ లెల్ల బాసె నీ
వేగతినైన నాకయిన యీదురవస్థఁ దొలంగఁజేయు గు
ర్వాగమదర్శితంబయిన యాత్రజనావన వైభవంబునఁ. 271

మ. మదనధ్వంసి మనంబునం బొడమి సామర్థ్యంబుచే సాధు స
మ్మదలక్ష్మిం బొదలించి విశ్వజనతామాన్యస్థితిఁ మించి దు

ర్మదవాదిద్విపసింహమైన భవదారాధ్యుండు నాకై నతు
చ్ఛదళం దీర్ప నుపేక్షఁ జేసె నకటా! సర్వజ్ఞుఁ డై యుండియున్.

గీ. అది నుద్భటమూర్తి కామారిచేత
నేను మొదలైన ఖచరులనెల్ల శాప
ముక్తులుగఁ జేయుదని తల మోచి వచ్చి
నన్నుపేక్షించె నేఁడిట్టు నరవరేణ్య. 278

చ. ఎఱుఁగనివాఁడు గాఁడు నిఖిలేంగితవేది భవద్గురుండు తా
మఱచెనొ కాక యేను వటమందిరసీమఁ దొలంగి దిక్కులన్
గుఱిచి బుభుక్షనై చనుట కొంత దలంపక వేగిరించి యే
త్తెఱ శివునందు నయ్యె జగతీవర! యేమనవచ్చు నాయెడన్.

చ. కలుషవిదూర! యేనొకటిఁ గంటి మనంబున మత్ప్రిచారమున్
దెలియనివాఁడు గాఁడు భవదీయగురుండు మదీయదుర్దశా
కలనఁ దొలంగఁజేయగలకార్యము నీతల మోవ నుండి కీ
ర్తులఁ బొదలించుపొంటె ననుఁ బ్రోవక మానె విముక్తిలబ్ధిచేన్.

సీ. శరణాగతత్రాణసంరక్షణంబుచే
వచ్చు పుణ్యంబు కైవసము సేయు
దుఃఖాతురత్వంబు దొడికిన నోనాఁడు
డామాటఁజేయు దృఢప్రతిజ్ఞఁ
దగుటకు సకలభూతాళి ప్రభూత హ
ర్షంబున నచ్చెరువడుచునుండఁ
బ్రబ్బిన పేరబ్బురంబున మజ్జారె!
బళిబళి యనుగడుపార వేగఁ

గీ. గిన్నరులు పన్నగులు సిద్ధఖేచరులును
బోల విద్యాధరులు గూడి పొగడువలుకు
లురుతరంబయ్యె దిక్కులు నొరసి మించి
చూచుజనులకు నానందశోభ చెంద. 276

వ. ఇట్లు మంథానమహీధర మథ్యమానసుధావయోధిధ్వానంబు విడంబింప సమ్మోహి మహేంద్రుండు గంధర్వరక్షణార్థంబై ప్రాణా బంధంబుతోడ నవంధ్యగంధాధురంధరత్వంబు సంబంధింపఁజేసి గురుచరణస్మరణపారీణుండై కరాళకరవాలంబుఁ గేలఁ గీలించి శశాంక శేఖరుం గుఱించి. 277

శా. ఓకందర్పవిరోధి! యోపురహరా! యోహస్తిచర్మాంబరా!
యోకాంతాశ్రితదేహ! యోశశిధరా! యోపద్మగర్భార్చితా!
యోశక్రాసురవారి! యోహరిహరా! యోమేరుబాణాసనా!
ఆకర్ణింపుము నాదువిన్నపము దేవా! వామదేవా! శివా! 278

సీ. కారణంబులు నీవ కార్యజాలము నీవ
భావజ్ఞుఁడవు నీవ భావ మీవ
జనకుండవును నీవ జన్యవస్తువు నీవ
ప్రాపకుండవు నీవ ప్రాప్య మీవ
ఆధారమును నీవ యాధేయమును నీవ
భోక్తవ్యమును నీవ భోక్త వీవ
రక్షకుండవు నీవ రక్షణీయము నీవ
హార్యంబు నీవ సంహర్త వీవ.

గీ. పూజకుఁడ వీవ పూజ్యంపుఁబోడవు నీవ
వాచకుఁడ వీవ తలపోయ వాచ్య మీవ
జ్ఞానమును నీవ చూడంగ జ్ఞాని వీవ
నిటలలోచన! సకలంబు నీవ నీవ. 279

మ. వదనాంభోజము లోచనత్రితయభాస్వల్లీలతోఁ గూడఁ భ
ద్రదళాక్షీమణి యోర్తు మేనఁ దిరమై మత్తిల్లఁగన్ రూప నం
పద సొంపొందియు రూపదూరపరతన్ భాసిల్లుచున్నట్టి ని
న్నిదమిత్థంబని ప్రస్తుతింప వశమే? యీశాన! యెవ్వారికిన్. 280

సీ. నీయంద పొడముచు నీయంద పొదలుచు
నీయంద విలయించు నిఖిలజగము
సకలచరాచరాసక్తుండ వగు దీవు
రత్నంబులోని సూత్రమునుబోలె
రజ్జువునందు సర్పభ్రాంతి పొడకట్టు
కైవడిఁ బ్రకృతి నీపై వసించు
ననవద్య మచ్యుత మాద్య మాద్యంతవి
రహితమై వెలుఁగొందు మహిమ నీవ

గీ. విష్ణుఁ డన రుద్రుఁ డనఁగ వాగ్విభుఁ డనంగఁ
దగిన నామాంతరంబులు దాల్చి నీవు
భ్రమము సమకూర్తు వెలుఁగని ప్రాకృతులకు
నీ మహత్త్వంబు చిత్రంబు నీలకంఠ! 281

చ. పనివడి మున్ను ఖేచరులపాటులు మాన్పఁ గుఱించి శేవతోఁ
గనుఁగొనినాఁడ వుద్భటు జగన్నుతమూర్తి యతండు పూనుని
ప్పని గొద యయ్యెనేని పురభంజన యేమియనంగవచ్చు నీ
యనుపమసత్ప్రభావ మకటా! వికటాచరణంబు చూపదే? 282

మ. అనుచున్ ఖేచరరక్షణార్థ మతిధైర్యస్ఫూర్తి చేపట్టి ప
ట్టిన తెంపున్ విడకున్నరాజునకుఁ గంఠేకాలుఁ డిష్టంబు నీ
ననుకూలస్థితితోడ రాఁ దొడఁగెఁ దారాగంబుపైనుండి గొ
బ్బున నుమాధవవల్లనై కవిచలద్భోగీంద్రహారాళియై. 283

మ. నవరత్నద్యుతిపుంజపింజరితనానాదిగ్వితానంబు సి
ద్ధవధూగానవిశేషగుంభితమ ( బో)ద్యత్కింకిణీకారవం
బు విచిత్రాంశుకకేతనంబు నగుచున్ బాల్పొందుసుస్నిగ్ధహే
మవిమానంబున వచ్చె నుద్భటుఁడు కామద్వేషిపార్శ్వంబునన్.

మ. హరువెంటం జనుదెంచి రత్తఱి విమానారూఢులై సిద్ధకి
న్నరగంధర్వసువర్వచారణమహానాగాధినాథుల్ మనో
హరచామీకరభూషణప్రతతితో నాలోలహారాళితో
నురుకాశ్మీరరసాంగహారములతో నుద్దామహర్షంబుతోన్. 285

వ. వెండియు నక్కాండంబునం దక్కినయక్షరక్షఃకులవరేణ్యులు ననూనతపస్సారశరణ్యులగు కుంభనికుంభకుంభోదరనందికేశ్వర భృంగిరిటిప్రభృతిపారిషదపుంగవులును నింద్రాణ్యాదిమాతృకలును నింద్రాదిదిక్పాలకులును వామదేవాదితత్త్వజ్ఞులును గరుడాద్యండజమండలేశ్వరులును బ్రహ్మాది ప్రధానదైవతంబులును నద్దేవతాసార్వభౌముపిఱుంద నమందానందకందళితహృదయారవిందులై చనుదేర సరభసకరాస్ఫాలితభూరిభేరీగభీరభాంకారంబులును రంభాదిత్రిదశపురంధ్రీమంథరకళ్యాణగాన కళాకోలాహలంబును నమరతరువరిగళితసుమనస్సముదయసంభూతసాంద్రమధురసాస్వాదమదాంధపుష్పంధయఝుంకారంబులును దుంబురునారద ప్రముఖముఖనిర్గతనిరర్గళ జయజయశబ్దసంస్తవంబులును దిక్కులం బిక్కటిల్ల మహోత్సాహంబునం బ్రత్యక్షంబైన యుమావాహనుకుం బ్రదక్షిణప్రణామంబు లక్షీణభక్తి నొనర్చి ధరాధ్యక్షుండు కరకమల పుటఘటనాపాటవంబు నిటలంబు నలంకరింప నంకురితపులకాంకురుండై యుదారస్వరంబున నిట్లనియె. 286

రగడ, శ్రీకంధర ! గంధేభముఖజనక
శీతాంశుకళాశోభిజటాభర
కాకోదరవల్లభహారలతా
కలిత ! సుధీజనపద్మదివాకర !

నిటలచటులశిఖినేత్ర మహోల్కా
నిర్ధూతాంతక ! నమదాఖండల
పటుకరుణారసభరితకటాక్షని
పాతకృతార్థీకృతబుధమండల !

శ్రీమత్కైలాస మహీధరవర
శిఖరస్థలవిహరణ పారాయణ !
చామీకరభూమీధర బాణా
సన ! శిలీముఖనారాయణ !

త్రిపురపురంధ్రీజన ఫాలాంచల
తిలకమృగమదహరణశరచ్ఛట !
కపటద్వీపరాడ్ద్వీపికులాధిప
కర్కశచర్మపటీవృతకటితట !

హృతభవపాశ మహాముని సేవా
హేవాకసమంచితపదనీరజ
కృత ! దురహంకృతిదక్షాధ్వరదళ
గీర్వాణశ్రీఘటపాటనపటు

భుజగీకృతయువతి మహాసీమంతసరణి
సురుచిరసీమాధ్వన్యలసద్గుణ !
చటులహిమాచలజామాతృత్వప
కంపితబుద్ధిసమూర్జితసుగుణ

మిసమిసమను బలువిసము సెకలకును
మెసవఁగై కొనఁ గుత్తుక ధరియించితి
నొసల నెసఁగుశిఖియసమున మసరుమ
నోభవు మెత్తనిమే నిఱియించితి
బలువగు పరశువు పరుషముఖంబునఁ
బరశుమహాసురవరు విదళించితి
జలధరపటలము చెలువము గిరికొను
సామజపతిదర్పం బెడలించితి
పార మెఱుంగక కవిసినమృత్యువు
పాల నలుగుచుఁ గపాలము సించితి
వారిమగంటిమి నెదురుజలంధరు
వాలుఁగొని కడిమి యుడుగక త్రుంచితి
వారినిధులు సరి నేకార్ణవమై
వోడియచూపిన పటుమైతివి భళి
దారువిపినముని చపలాత్ముల చి
త్తములు గలంచుట కావట మైతివి
హరివాణీరమణులు నిన్నరయ న
హంకారము చూపిన మిన్నందితి
అరుణజటామండల మధ్యమున ను
రావగ నెలకొనఁ గడుఁ జెన్నొందితి
బహుకాలము తప మొనరించిన ధన
పతి చెలికారము నుపకృతి చేసితి
మిహిపదమగు సొబగున గనిసిన క్రతు
మృగమును బలుదెగకొని పడనేసితి
ధూర్జటి మొగంబులఁ గనుపట్టిన ఫిజ

యోధిపునిఁ గుమారకుఁగాఁ గాంచితి
వాఱుదళంబుల మంత్రకుసుమమున
నలిరాజము క్రియ లలిఁ గ్రీడించితి
వాఁడనంబెన్నకుఁగాఁ దత్కాంతవ
యోధరమున నోహోయని పలికితి
నడుఁబ్రియమున బాణాసురుమోసలఁ
గాచుటకును నిరవధికృప చిలికితి
బలువిలు గొని నిబ్బరముగ మోఁదిన
బలమర్దననందనుఁ జేపట్టితి
దళదళమను ముమ్మొలుకుల మెఱుఁగులు
దట్టపుఱుచుశూలము చేపట్టితి
నవముక్తాఫలవర్ణంబున గగ
నము మోచిన నందెన బల్లించితి
అవితథమై సర్వధూరావంబగు
నయ్యాశ్వరశబ్దముఁ జెల్లించితి
సకలచరాచర సృష్టి స్థితిలయ
సంధానము నీపాలిదమై తను
నకలంక మమేయ మనుత్తమమగు
నాపరతత్త్వ విభూతియు నీదగు
నిను నింతంతని గురుతింపఁగ నా
నీరజభవముఖ్యులు నేర రనఁగ
ఘనభవపాశ నిబద్ధులు మాదృ
గ్జను లర్హింతురె నీమహిమఁ గనఁగ
భక్తజనావన పరతంత్రత చే
పట్టుము నన్ను గుణత్రయ భాస్వర!
భక్తిముక్తి ఫలదాయక శంకర!
భూతేశ్వర! యైశ్వర్య వికస్వర! 287

క. ఈ చందంబునఁ బొగడు మ
హీచక్రాధీశుమీఁద నీశ్వరుఁడు కృపా
గోచరకటాక్షపాత
ప్రాచుర్యం బొదవఁ బలుకు బలుమృదుఫణితిన్. 288

క. మెచ్చితి నిను ముమ్మాటికి
నిచ్చెద వర మెద్దియైన నీ వడుగుము శ్రీ
మచ్చరిత యనుఁడు భూవరుఁ
డచ్చంద్రకిరీటుఁ బలుకఁ బ్రాంజలి యగుచున్. 289

చ. కరుణ యొకింత చిత్తమునఁ గల్గిన మేటివి నీవు పార్వతీ
శ్వర! తరుణేందుశేఖర! దివస్పతిముఖ్యనిలింపమౌళి ని
ర్జరతరుపుష్పనిర్గత వరాగవిరాజిత పాదపద్మ! ఖే
చరవిభు నీతనిన్ మనుపు శాపము వాయ ననుగ్రహింపవే. 290

క. నీయందు నుద్భవించిన
యాయుద్భటగురుని పూన్కి యీడేర్చుటకై
శ్రీయుతుఁ జేయు మితని వా
లాయమ్ముగఁ దరుణహరిణలాంఛనమకుటా! 291

మ. అనుచున్ వేదశిఖావతంసమను నయ్యద్రీంద్రజాజానిప
ద్వనజాతద్వితయంబుపై నృపుఁడు గంధర్వేశ్వరుం బెట్టి భో
జన దండాకృతి దోఁప శంభుఁడును గారుణ్యంబుతో లెమ్ము రె
మ్మని తత్ఖేచరుమౌళిఁ జేర్చె వరదానాసక్తమున్ హస్తమున్.

ఉ. ఆ నిఖిలాధినాథుశుభహస్తము మస్తము మోఁచినంతఁ దే
జోనిధియై మణీమయ విశుద్ధసువర్ణకిరీటహారియై
మానితహార గుచ్ఛరుచిమండలమండితుఁడై వియచ్చరుం
డానినవేడ్కతోడఁ బ్రమథాకృతిఁ దాల్చె విచిత్రసంపదన్. 293

గీ. రాజగురుభక్తికిని భక్తరాజిపాల
శంకరుఁడు గోరికంది వశంవదాత్ముఁ
డగుటను సర్వభూతంబు లౌర యనుచు
నద్భుతావేశ మొదవంగ నభినుతించె. 294

సీ. అంతట నిఖిలజ్ఞుఁ డగువిరూపాక్షుఁ డ
త్యనుపమభక్తి సమగ్రుఁ డైన
క్షితిపతి గురుభక్తికిని జిత్తశుద్ధికి
నావ్రతపాలన స్ఫురణకార్త
రక్షణశక్తికిఁ బ్రముదితస్వాంతుఁడై
వలుకు నవ్విభు మహీపాలచంద్ర
వినుము నీయనవద్యవృత్తంబునకు మోద
మందితిఁ బటుశక్తి నుర్వి నింకఁ

గీ. గొన్ని సమములు పాలించి కూర్మి నెంచి
దిశల నిర్మలసత్కీర్తిఁ దెలివి నించి
నాదుసాలోక్యలక్ష్మి పొందంగఁగలవు
పొమ్ము మది సంశయము మాని పురమునకును. 295

వ. అనునవసరంబున హర్షోత్కర్షంబుననద్భుతప్రాభవుండగునుద్భటుం
డనుకంపాసంపదభిరామస్వాంతుండై కృతవందనుండగు నమ్మహీ
కాంతు నశీనాశీర్వాదంబుల నాదరించె తక్కిన సురకిన్నరగరు
డోరగాదులునాదరంబుననతనిం బ్రశంసించిరి చిత్రరథుండునుపసుం
ధరాశక్రు వర్ణింపుచుఁ గుంభనికుంభప్రభృతులగు ప్రమథులం
గూడి నర్తించె. నంతశాంతకుండు నంతర్ధానంబు. సేసె నిట్లు చరి
తార్థుఁడగు ముంజభోజుండు నిజనగరంబుఁ బ్రవేశించె నంత.

ఉ. నీతియుఁ బెంపు సొంపు నతినిర్మలకీర్తియుఁ దేజమున్ మహా
ఖ్యాతియు వృద్ధిఁబొంద జతురంబుధివేష్టిత భూస్థలంబు నే
కాతపవారణంబుగఁ బ్రియంబున నేలుచునుండె వైభవో
పేతుఁడు ముంజభోజుఁడు మహేంద్రుఁడు నాకముఁ బ్రోచుకైవడిన్

వ. అనవుడు నమ్మహర్షులు హర్షంబున నారోమహర్షణి కిట్లనిరి. 298

ఉ. అంచితపుణ్య! లక్ష్మికిరవై తగునుద్భటమూర్తి నిత్యని
ర్వంచితభద్రకీర్తి నఘవారణ! వింటిమి ముక్తికామినీ
చంచలదృగ్విలాసముల సౌఖ్యము గంటిమి పూర్ణశేముషీ
కాంచనగర్భ! నీవలన గాఢతరాఘతమంబుఁ ద్రోచుచున్. 299

వ. మున్నుద్భటారాధ్యులకు సంతానంబు గలదని తన్నిర్యాణ
కాలంబునం గొంత వివరించితి. నమ్మహావంశంబు వర్ధిల్లు తెఱం
గెఱింగించి మమ్ముఁ గృతార్థులం జేయవే యనుడు నతం
డమ్మహర్షుల కిట్లనియె. 300

మ. వినుఁడీ మామక దేశికోత్తముఁడు సద్విద్యావిమర్శాత్మకుం
డనఘుం డాఢ్యుఁడు సర్వశాస్త్రవిదుఁడౌ వ్యాసుండు నానందముం
దనరన్ నన్నుఁ గృతార్థుఁ జేయఁగను నిత్యం బీశ్వరధ్యాన పూ
జనముం దత్సుతభక్తబాంధవకథాసద్గోష్ఠి బంధించినన్. 301

మ. పరమానందరసాబ్ధిఁ దేలి కరుణాపారీణ నా కిష్టమా
హరుభక్తావనుసత్కథాశ్రవణ మాజ్ఞాపించి జన్మాంబుధిన్
దరణంబొందఁగఁ జేయవే యనిన నాధన్యుండు నే తత్కథన్
వరదుండై వినఁ బల్కె మున్నటుల నే వర్ణింతు మీ కిప్పుడున్.

శా. ఆ గంధర్వులశాపకారణము చే నార్యాకళత్రుండు త
త్త్యాగంబున్ వరమిచ్చి వారికిని నాత్మాబ్జోద్భవుం గూర్చి తా
రాగంబందునఁ బల్కె నుద్భట త్రిలోకారాధ్య! నీ విప్పుడు
ద్వేగం జొప్పఁగ మర్త్యదేశికగుణావిష్టుండ వౌ డొప్పగున్.

ఉ. భూనుతమైన కాశి యనుపుణ్యమహానగరంబునందునన్
నేనును విశ్వనాథుఁ డన నిల్చితి మద్హృదయాబ్జకర్ణికన్
మానుషరూపివై విబుధమానవకోటులు విస్తృతాత్ములై
నీనిజదివ్యదీప్తిఁ గని నివ్వెరగందుచు నుందు రందఱున్. 304

వ. అట్లు గావున. 305

శా. మాయంశంబున నుద్భవించి చతురామ్నాయాగమార్గాంతర
స్థాయిప్రస్ఫుట వీరశైవవిధిసిద్ధాంతంబు నల్దిక్కులన్
న్యాయం బొప్పఁగఁ జేసి మానవహృదానందంబుగా శిష్యులు
చ్ఛాయం బొందఁ గటాక్షదీక్షలను సంరక్షించు భద్రాత్మకా!

శా. నీవంశం బభివృద్ధిఁబొందు జగతిన్ నీరేజసంతాన స
ద్భావం బొప్ప ననేకు లార్యు లతులప్రఖ్యాతకీర్తుల్ మహా
శైవస్థాపిత వేదశాస్త్రవిదులై శాసింతు రారాధ్యతన్
శివన్ లోకములందు నాదుకృప రెట్టింపంగ వా రందఱున్. 307

క. కావున మదాజ్ఞఁ గైకొని
భావింప నయోనిజననపద్ధతి దెలుపన్
గావింపుము గంధర్వులఁ
బ్రోవఁగ శైవాగ్నిధూమమును నైక్యమునన్. 308

గీ. అనిన నాఁగాశయుని శివునాజ్ఞ[జేసి
నా]కు సాహాయ్యుఁడవు కమ్ము నన్నియెడల
ననిన నట్లని వర మీయ నంత విశ్వ
నాథు ఘుస్మజలంబున నవతరించె. 309

ఉ. అంతట వేదవేదు లగువార్యు లురస్థితలింగ పీఠికా
భ్యంతర హేమనూత్నఘుటనం[చన]భితబ్రహ్మతేజమున్
కంతుకతాంగసౌష్టవము గర్భగృహస్థిత దివ్యరూపమున్
వింతగఁ జూచి చూచి మది విస్మయ మొందుచుఁ జిత్రరూపులై.

క. ఈ మహిమ యెట్టిదో మన
కామితముం గూర్చఁ దలఁచి కాశీపతి దాఁ
బ్రేమన్ బ్రత్యక్షుండై
పామరులను బ్రోవఁ గురుని భావముఁ దాల్చెన్. 311

మ. అనుచున్ మానసముత్తోడ విశ్వపతి నాత్మాబ్జంబునం జేర్చి నం
తనఁ గన్నొద్దు ఘటిల్ల[వారలకు నా ధ్యానంబుమై]తోఁచ ని
ట్లనియెన్ మామకహంశు నుద్భటు సమాఖ్యారాధ్యశబ్దంబు చూ
చిన తద్బ్రహ్మముఖోద్భవోత్తమము చే విఖ్యాతిఁజెందెన్ భువిన్.

ఉ. శంక యొకింత లేక ద్విజసంఘము లెల్లెడఁ గూడి పాపముల్
నింక పడక్షరీమనువు నీమముతో నుపదేశ మొంది వ
త్పంకజపూజలన్ దనిపి పావనమై తగుకన్యకాది భ
వ్యంకరదానముల్ ఒసఁగి వర్ధిలుఁ డీగురుమూర్తి దీవనన్. 313

క. అని కాశీవిశ్వేశ్వరుఁ
డనుపమమృదుమధురఫణితి నాడిన మోదం
బున మేలుకాంచి యుద్భటుఁ
గని తచ్చరణముల వ్రాలి కాంతు నుతించిర్. 314

శా. ఆ వార్తల్ విని రాజమంత్రిసచివవ్యాపారముఖ్యుల్ ప్రభుల్
శైవోద్ధారునిఁ గోటిమన్మథసమశ్రావ్యాంగునిన్ ఉద్భటున్
సేవించీశ్వరమంత్రదీక్షల శుభశ్రీ లొంది గ్రామాలయ
ప్రావీణ్యంబగు దానముల్ ఒసఁగ నారాధ్యప్రభున్ వర్ధిలెన్.

ఉ. ఉత్తరశైవదీక్షల గురూత్తముఁ డుద్భటుఁ డీడిద్విజాళియుం
దుత్తము లిష్టలింగు లని నూత్నులు చెప్పియు లింగధారణల్
మత్తికలందుఁ గొందఱకుఁ గూర్పఁగ రాజులు మంత్రివర్గముల్
చిత్తములుం జిగుర్పఁగను శిష్యులునై గురుపూజ చేయఁగాన్.

చ. గురుచరలింగపూజ లొనగూర్పఁగ నుద్భటు కంతఁ గంతు సం
హారుఁడు ప్రసన్నరూపమున నన్నియుఁ దానయి నిత్యనీమముల్
జరుపఁగ వచ్చి తత్క్రియను సాంగముగా నొనరింపఁ జేసి యీ
కరణి నదృశ్యుఁడై మెలఁగఁగా మహిమాన్వితుఁడయ్యె నుర్వరన్

గీ. తద్బుధులలో సుబుద్ధి యన్ ధరణిసురుఁడు
సుగుణమణిగుణ సౌభాగ్య సుందరి యను
పేరుగలిగిన కూతురఁ బెండ్లి చేసె
నుద్భటారాధ్యునకు నీశ్వరుండు దెలుప. 318

వ. అట్లు గావున. 319

శా. శ్రీకంఠాపరమూర్తి దుర్మతలతాశ్రేణీలవిత్రంబు ను
శ్లోకున్ సంతత తత్త్వదర్శనపరున్ శుద్ధాత్ము నాచార్య చూ
డాకల్పంబు వినమ్రకల్పకము వేదాంతార్థనేతృత్వ ల
క్ష్మీకంజాసను సాంద్రభక్తిఁ గొలుతున్ శ్రీయుద్భటారాధ్యులన్.

మ. జనియించెన్ హరుమానసంబునఁ బిశాచత్వంబు మాన్పించి ది
వ్యనికాయంబుల శంభుమూర్తిఁ గనఁ జేయంజాలెఁ గైలాసశై
లనివాసంబునఁ గట్టెఁ బట్టము బుధశ్లాఘార్హత న్మీఁదటన్
జననప్రాభవపుణ్యముక్తి కతని శ్శక్యంబె వర్ణింపఁగాన్. 321

సీ. వరశమాకరలబ్ధవర్ణపుంగవులచేఁ
బోలె విజ్ఞానవిస్ఫూర్తిఁ గాంచి
దృఢసత్ప్రభావవత్తీర్థోదకములచేఁ
బోలెఁ బావనవృత్తిఁ బొందఁజాలి
శారదారంభవిస్మేరేందురుచులచేఁ
బోలె నాహ్లాదంబు చాలఁ దాల్చి
చారుప్రభాసాంద్రజాతిరత్నములచేఁ
బోలె నలంక్రియాశ్రీల మెఱసి

గీ. వరలు నిఖిలజగంబు లెవ్వానివిమల
భద్రిగుణములచే నట్టిభాగ్యశాలి
వివిధసేవకసంకల్పదివిజసురభి
యుద్భటస్వామి యద్భుతోద్యోగి వెలయు. 322

సీ. అధ్వనీనులు చతురామ్నాయవీధికి
కాందిశీకులు పరనింద గుఱించి
భారవాహులు పు(ణ్య)పరిపాలకలనచే
దూరదర్శులు తత్త్వసారదృష్టి
కర్మఠు లఖిలసత్కర్మకల్పన గూర్చి
దానశౌండులు పెట్టఁ దగినయెడల
జాగరూకులు శంభుసంపూజనాకేలి
నైష్ఠికు లనవద్యనిష్ఠకలిమి

గీ. సకలదేశికరాజన్యమకుటనూత్న
రత్నకోరకమై బుధారాధ్యుఁడైన
యుద్భటారాధ్యవంశపయోధిఁ బుట్టి
నట్టి గురుచంద్రు లఖిలధర్మార్థవిదులు. 323

వ. ఇట్లఖిలజగజ్జేగీయమానంబగు నమ్మహాభాగువంశం బతిశయ సౌభాగ్యభాగ్యజనకంబై క్రమక్రమంబునఁ బ్రవర్ధమాన ర్వాయన సంవత్సరంబు లతిక్రమించి వివేకంబునకు నాకరంబును, విభవంబునకుఁ బ్రభవంబును, ధర్మంబునకుఁ గూర్మియుఁ, భద్రంబులకు ముద్రియు, బుణ్యంబునకు శరణ్యంబు నై పినాకశరాసనుశాసనంబున నాంగిరసబార్హస్పత్యభారద్వాజగోత్రింబునకుఁ బాత్రింబయ్యె నందు కల్లోలినీవల్లవికునందు హల్లకోల్లాసకరుండగు వేల్పుపొలువున విశాలాక్షీవల్లభుండు . . మల్లికార్జునగురుం డుదయించు నతండు 324

మ. ప్రణమద్భూపకిరీటకోటిఘటితద్రాఘిష్ఠరత్నచ్ఛటా
ఘృణికిమ్మీరితపాదపద్ముఁడు బుధక్షేమంకరుం డింద్ర వా
రణదంతాంచలరంగరంగదురుసారస్ఫారసత్కీర్తి ని
[ర్గణితేశాగ]మతత్త్వపారగుఁడు శ్రీరమ్యుండు సౌమ్యుం డిలన్.

క. ఆ మల్లికార్జునగురు
స్వామికిఁ బోలియగురుండు జనియించి దిశా
సామజకర్ణపుటీతట
చామరలతికాయమానసాంద్రయశుం డై. 326

సీ. శాంకరీదేవికి షణ్ముఖుండునుబోలె
నాపోలినార్యునర్ధాంగలక్ష్మి
యైనశాంకరికి స్వయంభువుగారు జ
నించు భద్రాంబికానేత యగుచు
[నార్తలోక భయాపహర్తయై]శ్రీభవా
నీభర్తయై మహాప్రాభవమున
గల్గువారలకు శంకరదేశికస్వామి
యావిర్భవించు నాయలఘుమతికి

గీ. గౌరమాప్రాణనాథుండు కంబుయశుఁడు
సోమనాథయ్యయాయనసూనుఁ డొప్ప
లింగనారాధ్యుఁ డారాధ్యశేఖవిభుఁడు
మల్లికావల్లభుఁడు కీర్తివల్లభుండు. 327

శా. మానాథప్రవణాత్ముఁ డాత్మవిదుఁ డామ్నాయార్థసారైక పా
వనజిహ్వుఁ చలుఁ డంచితస్మృతికథావ్యాసుండు చార్వాకజై
ననదీవల్లభకుంభసంభవుఁడు జన్మంబొందు మన్మయ్యలిం
గనకున్ మల్లమకుం గుమారుఁడయి గంగాంబామనోభర్తయై.

చ. పర్వతరాజధైర్యుఁ డఘపర్వతపర్వతవైరి సత్ప్రభా
పార్వణశర్వరీశ్వరుఁ డపారకృపా పరతంత్రబుద్ధి సా
పర్వణధేనురత్న తరుభంగదదానగుణాఢ్యుఁ డుర్వరా
పార్వతియైన పార్వతికి భర్త దగు శ్రీమల్లికార్జునుం డిలన్. 329

క. ఆగమవిద్యాత్మక యగు,
నాగమకు న్నాథుఁ డగుచు నానావిధ స
ద్భోగమహేంద్రుఁడు పుట్టు ను,
రాగమహాధైర్యుఁ డార్యుఁడై పతి దానన్. 330

క. ఆజంపతులకుఁ గలిగెడు,
భూజనమందారశాఖి పురహరపూజా
భ్రాజిష్ణుఁడు పుణ్యఫల
శ్రీజన్మస్థలము చంద్రశేఖరుఁ డెలమిన్. 331

మ. గంగామౌళి పదాబ్జభృంగము మరుత్కంఠేశుణావర్తులో
త్తుంగస్నిగ్ధపయోధరద్వయకటీ దోర్యుగ్మలవాటీమ చ
ర్చాంగీకార సమర్థకీర్తినిధి శైవారాధ్యముఖ్యుండు వే
దాంగార్థాత్ముఁడు చంద్రశేఖరుఁడు భవ్యప్రాభవుం డుర్వరన్.

సీ. కువలయోల్లాసంబుఁ గూర్పుట శశియయ్యు
దోషాకరత్వంబు దొడుకఁ డెచట
విపుల వాగ్వృత్తి దర్వీకరేశ్వరుఁ డయ్యు
జిహ్మసంచారంబు సేయఁ డెచట
కమలావివర్ధనోత్కంఠ సూర్యుం డయ్యు
రాజదూరస్థితిఁ గ్రాలఁ డెచట
దివ్యభోగస్ఫూర్తి దేవతావిభుఁ డయ్యు
గోత్రవిభేదంబు (గూర్పఁ డెచట)

గీ. [సర్వసాధకతన్]సురశాఖ యయ్యు
గొయ్యదనమున వర్తింపఁగోరఁ డెచట
నఖిలమంత్రరహస్య సిద్ధాంతవేది
చంద్రశేఖర గురురాజచక్రవర్తి. 333

శా. సాధ్యశ్రీజనగీతకీర్తి పరమైశ్వర్యాద్య విద్వన్నిశా
యధ్యేయోన్నతి చంద్రశేఖర[గురుం డామ్నాయ పారీణులన్
సు ధ్యాస్ఫోటిత జాహ్నవీసు(తు)ల గాంచున్ బుత్రులన్ మన్మనా
రాధ్యారాధ్య సమాఖ్యులిన్ దినమణి ప్రాలేయరుఙ్మిత్రులన్. 334

క. ఇది యుద్భట దేశికమణి
సదభినుతాచార భావినంతతిచందం
బొదవించు నీ [కథాగ్ర్యము
మదన విరోధి దయనిఖిల మంగళసిద్ధుల్. 335

క. సారమతులట్ల కుజనులు
హారిశివస్తోత్రమునకు హర్షింపరకూ
పారములు (వోలె)నూతులు
కైరవహితురాకఁ బొంగఁగా నేర్చునొకో!. 336

వ. కావున మహా[శ్రద్ధాధురీణులు]మహేశ్వరాచారపారీణులు గావున
నపరత్రిపురారియగు నుద్భటారాధ్యులచరితంబు వినుటకుఁ గాంక్ష
చేసితిరి. నేను నానేర్చుచందంబున నుపన్యసించితి. నిందునను
గుణంబు పరిగ్రహించి[యానందించితిరి. "మీకు శుభంబగుఁగాక !
లోకాస్సమస్తాస్సుఖినోభవం"]తని సూతుండు శౌనకాదులకు
మేదురామోదంబు సంపాదితంబుచేసి వారిచేత సంభావితుండై
యథేచ్ఛంబుగం జనియెనని. 337

క. ఈకథఁ జదివిన వ్రాసిన
లోకులు భవబంధములకు లోగక క్రమముల్

[జేకొన నీశా]నమహో
లోకంబున నుండఁగలరు లోకులు మెచ్చన్. 338

మ. అనహంకార నిరంకుశ ప్రతిభ దివ్యస్త్రీల సద్వృత్తుల
స్తనకుంభద్వయగంధసారనవముద్రాకల్పనానల్పశో
భనకీర్తిప్రియ విప్రపూజనపరా భా[స్వద్గిరా యాశ్రితా
వనభా]వా పితృవంశ శంభుపదసేవాసావధానాత్మకా!

క. నటదనమ నేత్రజూటీ
తటతటినీచటుల నినదధరారజితో
ద్భటభేరీభాంకార
స్ఫుటఘటనా యాచకౌఘశోకత్రుటనా! 340

మ. [సారవి]శాల సుధీమణిజాల వచస్తుతసాంద్రకృపా
హారిప్రతాపజితాంబుజబాంధవ, హారహిమోరసుధా[నవనీ]
హారమరాళమహారమణీయమహాస్ఫుటకీర్తిగృహా! కులని
స్తార[విపత్పరితప్త జనావళితా]రక నవ్యసుధానిధీ. 341

గద్యము

ఇది శ్రీమదేలేశ్వర గురువరేణ్య చరణారవింద షట్చరణసకలకళాభరణ
రామనాథ్యనుపుత్త్రి సుకవిజనమిత్ర కుమారభారతి
బిరుదాభిరామ రామలింగ నామధేయ ప్రణీతం
బైన శ్రీమదుద్భటారాధ్య చరిత్రం బను
మహాప్రబంధంబునందు సర్వంబును
తృతీయాశ్వాసము
సంపూర్ణము
శ్రీ



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 135 | 15 | వోపం | వోపఁ |
| 138 | 14 | వెడి | వెండి |
| 141 | 5 | లాహి | లాహి |
| 143 | 13 | పావి | పాపవి |
| 144 | 11 | తరము | తర |
| 〃 | 14 | అగ | లంబుగ |
| 151 | 23 | రాద్ధ్రి | రార్ద్రి |
| 157 | 10 | లిఖి | నిఖి |
| 175 | 5 | క్రయో | త్రయో |
| 182 | 8 | సంగ | సఁగ |
| 192 | 5 | మ్మర్షు | మ్మహర్షు |
| 〃 | 15 | దోష్ఠి | ద్గోష్ఠి |
| 〃 | 25 | విషు | విష్టు |
| 〃 | 1 | దొప్ప | టొప్ప |
| 194 | 8 | పిన | విన |
| 195 | 13 | కల్ప | కల్ప |
| 197 | 21 | శా. మా | మ. మను |



